# సంజీవదేవ్

## రచనల సమీక్ష, విశ్లేషణ, జీవితం.


సంకలనకర్త :

**పారుపల్లి కవికుమార్**

ఎడిటర్ :

**ఎన్. ఇన్నయ్య,**

పి.హెచ్.డి.



ప్రచురణ

**కవికుమార్ పబ్లికేషన్స్**

విశాఖపట్నం

# సంజీవదేవ్

**రచనల సమీక్ష, విశ్లేషణ, జీవితం.**

2,3 మరియు 4 వ టైటిల్ పేజీలు : సంజీవదేవ్ చిత్రాలు

ప్రథమ ముద్రణ · మే, 2003

ప్రతులు 1000

వెల : రూ 120/- $ 20⁰⁰

ప్రతులకు

విశాలాంధ్ర పుస్తక కేంద్రాలు – అన్ని బ్రాంచీలు

అక్షర, పావని ఎస్టేట్స్, రోడ్ నం.2, బంజారా హిల్స్, హైదరాబాద్ – 500 034.

అశోక్ బుక్ సెంటర్, మేరీస్ స్టెల్లా కాలేజీ ఎదురుగా, విజయవాడ – 520 008.

అశోక్ బుక్ సెంటర్, ఆంధోనీస్ చర్చి కాంపౌండ్, జగదాంబ జంక్షన్, విశాఖపట్టణం – 530 002

బుక్ లింక్స్ కార్పొరేషన్, బ్లడ్ బ్యాంక్ ప్రక్కన, నారాయణగుడ, హైదరాబాద్ – 500 029

బుక్ సెంటర్. ద్వారకా నగర్, విశాఖపట్నం – 530 016.

S.V. Rama Rao #9026, SIERRA LANE, PALOS HILLS, IL 60465, USA.
E-mail : siramdasu@hotmail.com

ఫాంట్ డిజైన్ – టైప్ సెట్టింగ్ :

ముద్రిక, హైదరాబాద్ – 500 004.

ప్రచురణ :

**కవికుమార్ పబ్లికేషన్స్**

50–99–12, టి.పి.టి. కాలనీ, నార్త్ ఎక్స్‌టెన్షన్,

సీతమ్మధార, విశాఖపట్టణం – 530 013

ఫోన్ . 0891–2543435

ముద్రణ .

**ప్రింట్ సేషన్**

డి–1, జి–4, శాంతి శిఖర,

సోమాజీగూడ, హైదరాబాద్ – 500 082.

ఫోన్ : 040–2332 1993

# సంజీవదేవ్ గురించి

| | | |
|---|---|---|
| పుట్టుక | : | తుమ్మపూడి గ్రామం, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్.<br>1914 లో (రైతు కుటుంబం) |
| చదువు | : | సమాజం – ప్రకృతినే బడిగా భావించడం |
| పర్యటన | : | హిమాలయాలు (1937)<br>అమెరికా (1992) |
| కుటుంబం | : | సులోచన (భార్య) 1950లో పెళ్ళి<br>మహేంద్ర, జోగేంద్ర (కుమారులు) |
| సన్నిహిత పరిచయం | : | అసిత్ కుమార్ హల్దార్, రాహుల్ సాంకృత్యాయన్, నికలస్ రోరిక్ |
| అభిరుచులు | : | లలిత కళలు, లేఖలు. |
| 1938 నుండి రచనలు | : | Grey and Green<br>Blue Blooms<br>Her life<br>Biosymphony<br>తెగిన జ్ఞాపకాలు, రూపారూపాలు, రసరేఖలు, దీప్తిధార,<br>స్మృతిబింబాలు, సంజీవదేవ్ లేఖలు, గతంలోకి. |
| కాలక్షేపం | : | ఫోటోలు, చిత్రాలు గీయడం, పంపడం, లేఖలు రాయడం. |
| గౌరవం | : | ఆంధ్ర విశ్వవిద్యాలయం డి.లిట్ గౌరవ పట్టా |
| భాషలు | : | తెలుగు, ఇంగ్లీషు, (ఉర్దు, హిందీ, బెంగాలీ, ఫ్రెంచ్) |
| వ్యాసాలు | : | వివిధ పత్రికలలో – ఆంధ్రజ్యోతి, తెలుగు విద్యార్థి, ప్రసారిత,<br>మిసిమి, ఆంధ్రప్రభ... |
| శైలి | : | సరళంగా విషయాన్ని వివరించడం |
| మరణం | : | 1999 |

# ఈ పుస్తకం ...ఎలా, ...ఎందుకు?

అది 1987వ సంవత్సరం. మిత్రుడు ఎ.వి.కె.శాస్త్రి రచించిన 'ధృవ–చంద్రగుప్త' రేడియో నాటక నిర్వహణ బాధ్యతతో ఆకాశవాణి, విశాఖపట్నం కేంద్రంలోని ఎ.బి. ఆనంద్ తో పరిచయం, రికార్డింగ్‌పూర్తయిన తరువాత నాలోని సాహిత్యాభిలాషను గుర్తించిన ఆనంద్‌తన గ్రంథాలయంలోని 'లేఖల్లో సంజీవదేవ్' పుస్తకాన్ని చదవమనిచ్చాడు. అప్పటికి సంజీవదేవ్‌అంటే నాకు తెలియదు. పుస్తకం చదువుతుండగానే సంజీవదేవ్‌తో పరిచయం ఏర్పడింది., లేఖల ద్వారా. పెద్ద చదువులు లేకుండా అంతటి విజ్ఞానాన్ని సంపాదించిన ఆయన వ్యాసాలు, ఉత్తరాలు, చిత్రాలు, ఉపన్యాసాలు ఆశ్చర్యాన్ని కలిగించాయి. మా ఉభయుల మధ్య ఉత్తరాలనంతరం వ్యక్తిగత కలయికలూ జరిగాయి, తుమ్మపూడిలో.

సంజీవదేవ్‌తో నా పరిచయమయ్యేటప్పటికి ఆయన రచనలు ఒకటిరెండు తప్ప ఏవీ మార్కెట్‌లో లేవు. ఆయన పరిచయం చేసిన విశాఖపట్నం హిందూస్తాన్ షిప్‌యార్డ్ మిత్రులు సుంకర చలపతిరావు, బలివాడ కనకారావుల ద్వారా 'దీప్తిధార', 'సంజీవదేవ్ లేఖలు', 'తెగిన జ్ఞాపకాలు', 'స్మృతిబింబాలు', 'గతంలోకి' చదివాక, ఆయన్ను విశాఖపట్నం ఆహ్వానించి ఒక 'అభినందన సంచిక' ప్రచురించాలని నిర్ణయించుకొని కొందరి రచనలను కోరాను. ఈ పుస్తకంలోని చలసాని ప్రసాదరావు రచన 'సంజీవదేవ్ అంటే..!' అభినందన సంచిక కోసం వ్రాసిందేనని గమనించగోర్తాను. ఈ వ్యాసాన్నే చేకూరి రామారావు హైదరాబాదులోని సంజీవదేవ్ మిత్రులకు 14-09-1989 న బిగ్గరగా చదివి వినిపించానని ఆంధ్రజ్యోతి దినపత్రికలోని 'చేరాతలు'లో ఉటంకించారు. తరువాత హైదరాబాదులోని సంజీవదేవ్ మిత్రులైన ఎన్. ఇన్నయ్య, సి. భాస్కరరావు దంపతులు, వి. వెంకటరత్నం, చలసాని ప్రసాదరావు, బి.మోహనరావులను కలిసి, సంజీవదేవ్ రచనలన్నీ సేకరించి, కాపీలు తీయించి, చదివి, 'అభినందన సంచిక'ను పుస్తకంగా మలచదలచిన నా పథకాన్ని చెప్పినప్పుడు అందరూ హర్షించారు, ప్రోత్సహించారు.

ఈ సందర్భంగా ఒక విషయాన్ని ప్రస్తావించటం సమంజసం. సంజీవదేవ్ పుస్తకాలకోసం హైదరాబాదు వెళ్ళిన నేను 'తెలుగు అకాడమి'లోని పాత పత్రికలను సేకరిద్దామని అకాడమి సంచాలకులైన వెలిచాల కొండలరావును కలిశాను. నా చేతిలోని సంజీవదేవ్ పుస్తకాలను చూచి ఆయన 'సంజీవదేవ్ మీకెలా తెలుసు?' అని అడిగారు. పుస్తక రూపకల్పన విషయం తెలుపగా సంతోషించి, వ్యాసాలను త్వరగా సేకరించమనీ, సంజీవదేవ్ రచనలు కొన్నిటిని తెలుగు అకాడమి పుస్తకాలుగా ప్రచురింపదలచిందనీ, వాటితోపాటే సంజీవదేవ్‌పై నేను సేకరింపదలచిన పుస్తకాన్ని కూడా తెలుగు అకాడమి ప్రచురిస్తుందనీ చెప్పారు. సంజీవదేవ్ పుస్తకాలను కాపీలు తీయించి, వివిధ విశ్వవిద్యాలయాల్లోని అధ్యాపకులను, పాత్రికేయులను, రచనల్లో అనుభవజ్ఞులను

ఎంపికచేసి, కలిసి, వ్యాసాలను సేకరించటానికి దాదాపు రెండు సంవత్సరాలు పట్టింది. ఈలోగా సంజీవదేవ్ ముద్రిత రచనల్లోని కొన్ని వ్యాసాలను ఎంపికచేసి తెలుగు అకాడమి రెండు పుస్తకాలుగా ప్రచురించటం, వెలిచాల కొండలరావు పదవీవిరమణచేసి, సుబ్బారెడ్డి కొత్త సంచాలకులుగా చేరి, నా పుస్తకాన్ని పరిశీలనార్థం స్వీకరించి దాదాపు మూడు సంవత్సరాలు గడచినా ప్రచురింపనందున తిరిగి తీసుకొని సంజీవదేవ్ ఫౌండేషన్ తెనాలి కోరికపై ప్రచురణకు పంపాను. అక్కడా అంతే, సంవత్సరాలు గడిచాయి. పుస్తకాన్ని ప్రచురిస్తామని ఫౌండేషన్ తరపున కరపత్రాలు కూడా పంచారు. ప్రచురణ జరగలేదు. అమ్మ అనసూయావతి, తమ్ముడు రమేషు బాబుల ఆర్థిక సహకారంతో స్వంత ప్రచురణ నిర్ణయం జరిగింది.

సాహితీ లోకంలో సంజీవదేవ్‌కు ఒక ప్రత్యేక స్థానం ఉంది. ఆయన ఒక అందాల హరివిల్లు. అంటే ఎన్నో మనోజ్ఞభావాల కలయిక. హరివిల్లులోని రంగులను విశ్లేషించి ఒక్కొక్క రంగు ప్రాముఖ్యాన్ని చెప్పటానికి, ఎక్కువ మంది ప్రయత్నించరు. అట్లే సంజీవదేవ్ యొక్క వ్యక్తిత్వాన్ని సంపూర్ణంగా విశ్లేషించి, వివరించిన ప్రయత్నం ఇతవరకూ జరగలేదు. ఈ పుస్తకం అట్టి లోటును పూర్తి చేస్తుంది. ఇది సాహితీ ప్రియుడి ప్రయత్నమేకాని, సాహితీవేత్తది కాదని మనవి.

ఈ సంకలన నిమిత్తం మొదటి వ్యాసాన్నందిచిన చలసాని ప్రసాదరావు మరో రచన చేయమంటే, 'సేకరణ పూర్తయ్యాక కలవండి, చూద్దాం' అన్నారు. పూర్తయ్యాక వ్రాతప్రతి నంతా ఓ రాత్రి చదివేసి, 'సంజీవదేవ్ గురించి వ్రాయాల్సిందింకేం లేదు, గుడ్ వర్క్' అని కితాబిచ్చిన ఆయన; మరియు 'ఇది మీకు తగనిపని', వద్దంటూ మొదట్నుంచీ వారించినా ఆగని నాప్రయత్నాన్ని రెండుసార్లు 'చేరాతలు'లో చదివి, రచయితలు, ఇతరుల ద్వారా తెలుసుకున్న సంజీవదేవ్, ఈ సంకలనాన్ని ముద్రిత రూపంలో చూడటానికి లేకపోవడం మనకు తీరని లోటే.

ముఖ్యంగా ఈ పుస్తకంలో సంజీవదేవ్ జీవితకాలపు రచనలాధారంగా అంశాలను విభజించి, నిపుణులచేత రచనల్ని సమీక్షించి, విశ్లేషించటం జరిగింది. రచనలు చేసిన వారందరికీ హార్దిక వందనాలు తెలియపరుస్తూ; నా ఈ ప్రయత్నాన్ని ప్రోత్సహిస్తూ, నెలల తరబడి హైదరాబాదులో ఆతిధ్యాన్నందించిన చెల్లాయి ప్రమీల, టెలిఫోన్ బిల్లులను మౌనంగా చెల్లించిన ఆమె భర్త రవి కుమార్, తమ్ముడు రవికిషోర్‌లను మననం చేసుకోవటంతోపాటు నా సాహిత్యాభిలాషకు వెన్నుతట్టే డ్రెడ్జింగ్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా మేనేజ్‌మెంటు తరపున జి.జి. రావుకు ప్రత్యేక కృతజ్ఞతలతో...

సెలవు

మీ

**పారుపల్లి కవికుమార్**

సంకలనకర్త

# విషయ సూచిక

# సంజీవదేవ్ స్వీయ చరిత్ర

- డాక్టర్ అద్దేపల్లి రామమోహనరావు

సాహిత్య ప్రక్రియల్లో ఆత్మకథకి ఉన్న ఆకర్షణ ప్రత్యేకమైనది. ప్రతి మనిషికీ తనలాంటివాడైన మరో మనిషి జీవితానుభవాల్ని తెలుసుకోవాలనే సహజమైన కుతూహలం ఉంటుంది. ఆయా అనుభవాల్లో తనని ఉత్తేజితం చేసిన వాటిని తన చైతన్యంలో కరిగించుకునే అభిలాష కూడా ఉంటుంది. అందుకే పాఠకుడి చైతన్యం మీద చెదరని ముద్రవేసి, పథనిర్దేశం చెయ్యడంలో ఆత్మకథలు అగ్రభాగంలో నిలుస్తై. జీవితంలో కొన్ని ప్రత్యేకమైన అనుభవాలు గాని, స్పందనలు గాని, సంఘర్షణలు గాని పొందిన మహనీయుల ఆత్మకథలు కలిగించే ప్రయోజనం వర్ణనాతీతం. ఆత్మకథలోని అనుభవాలన్నీ పూర్తిగా వాస్తవికతనే ప్రతిబింబిస్తూ ఉంటై. కల్పన గాని, కవిత్వంగాని ఉండే అవకాశంలేదు. అందుకే గుండెపై పడ్డ వాస్తవికతా ముద్ర, జీవితంలో వాస్తవాచరణకే దారితీస్తుంది. అంతేగాక ఆత్మకథలో రచయితే నాయకుడు. పాఠకుడు మొదటినించి చివరదాకా రచయితతోనే ఏకీభావం పొందుతాడు. ఈ ఏకీభావనే అనుభూతుల ముద్రల్ని ప్రగాఢంగా నిలుపుతుంది.

తెలుగులో ఆత్మకథల్ని సీరియస్‌గా తీసుకుని రాసినవాళ్ళు తక్కువ. సృష్టికంత[illegible] శ్రేష్ఠులు కాబట్టి తమ కథని అందరూ చదవాలని రాసేవాళ్ళు ఎక్కువ. అందుకే[illegible] చదవరు. తాను రాసిన ఆత్మకథ వల్ల ఏమేరకైనా ఒక స్పందనని అంది[illegible]తో రాయబడిన ఆత్మకథలు స్వల్పంగానే ఉన్నై. అందులోని ప్రతి అక్షరమూ నిజ[illegible] అనే అగ్ని స్పర్శతో రాసినవాళ్ళు ఇంకా స్వల్పం. తెలుగులో ఆత్మకథ అనగానే మొదటగా [illegible]వలసింది కందుకూరి వీరేశలింగంగారి స్వీయచరిత్ర. వ్యక్తి సమాజంతో పోరాడే ఉత్తేజ[illegible]కలిగిస్తుంది.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి 'అనుభవాలూ జ్ఞాపకాలూ' ఒక అద్భుత రచన. రచయిత ఆత్మ సంఘర్షణనీ ఆ కాలపు వాతావరణాన్నీ, గుండెని కదిలింపజేసే సంఘటనల్నీ చెరిగిపోని ముద్రలుగా వేస్తుంది. చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి 'కథలూ-గాథలూ' ఆనాటి మానవ సంబంధాలకీ, సంస్కృతికీ సజీవ దర్పణం. బుచ్చిబాబు గొప్ప అనుభూతుల్ని అందివ్వడానికి 'ఆంతరంగిక కథనం' రాశాడు. ఆచంట జానకిరామ్, అబ్బూరి వరదరాజేశ్వరరావు, శ్రీశ్రీ మొదలైన వారి స్వీయ గాథలు, సాహితీపరుల సన్నివేశాల చేత, సాహితీపరులకి మాత్రమే ఆస్వాదయోగ్యంగా ఉంటై. విశ్వనాథ, కుందుర్తి – తమ ఆత్మ కథలు సంపూర్ణంగా రాసి ఉంటే చాలా ప్రయోజనాత్మకంగా ఉండేవి. ఉప్పల లక్ష్మణరావుగారి 'బతుకు పుస్తకం' ఆ రోజుల్లోని సామాజిక రాజకీయ వాతావరణాన్ని ప్రతిబింబింపజేస్తూ, ప్రగతి భావనాపరిణామానికి సహకరిస్తుంది.

ఇలా అనేక విధాలైన ప్రయోజనాలతో సాగిపోయే ఆత్మకథా ప్రపంచంలో, సంజీవదేవ్ వెలువరించిన ఆత్మకథకి సంబంధించిన వివిధ విశేషాల్ని అనేక కోణాల్లో సమీక్షించడానికి ఈ వ్యాసం రాయబడుతోంది.

సంజీవదేవ్ ఆత్మకథ మూడు సంపుటాలుగా లభిస్తుంది. మొదటిది 'తెగిన జ్ఞాపకాలు'; రెండోది 'స్మృతి బింబాలు', మూడోది 'గతంలోకి'. 'తెగిన జ్ఞాపకాలు' లో సుమారు నాలుగేళ్ళ పసితనం(1918) నించి, 1951 సంవత్సరం దాకా తన జీవిత సంఘటనలు వివరించబడినై.

'తెగిన జ్ఞాపకాలు' ముందుమాటలో ఇలా అన్నారు సంజీవదేవ్'స్వీయచరిత్రలు మిగతా రచనలకంటే రచయిత జీవితానికి ఎక్కువ నిజమైన ప్రతిబింబాలు. ఐతే కొందరి స్వీయచరిత్రలు జీవితాని కంటే ఎక్కువ తీవ్రమైన రంగుల ప్రతిబింబాలు. మరికొందరివి జీవితానికంటే తక్కువ తీవ్రమైన ప్రతిబింబాలు. మరి 'తెగిన జ్ఞాపకాలు' ఎటువంటి ప్రతిబింబాలు అని ప్రశ్నిస్తే మౌనానికి మించిన మంచి జవాబు మరొకటి కనిపించదు'. అయితే ఆయన ఆత్మకథ చదివిన తర్వాత పాఠకుడికి అనిపించేది, అది ఆయన జీవితానికి సమానమైన ప్రతిబింబం అని. ఎందుకంటే, ఆయన వర్ణించిన సన్నివేశాల్నిగాని, స్పందనల్నిగాని ఎక్కడా అసాధారణంగా రూపుగట్టే ప్రయత్నం చెయ్యలేదు. శైలిని గూడా ప్రత్యేకంగా స్ఫురించేట్టు రాయలేదు. సరిగ్గా జరిగిన సంఘటనకి కేవలం అక్షరరూపం ఇచ్చినట్లు కనిపిస్తుంది. ఉదాహరణకి రైలులో ప్రయాణం చేస్తున్నప్పుడు కాత్యాయని అనే ఆమెతో పరిచయం కలిగింది. అక్కడ ఇలా రాస్తారు.

కాత్యాయనికీ నాకూ మధ్య ఎన్నెన్నో విషయాలను గురించి సంభాషణలు. ఆ కొద్ది కాలంలో ఆమెతో ఎక్కువ సాన్నిహిత్యం ఏర్పడిపోయింది. మళ్ళా కొంచెం సేపటికే ఆమె నుంచి నేనూ, నా నుండి ఆమె విడిబడి పోవలసుంటుంది అనే ఆలోచన వచ్చేసరికి ఏదో

భరించరాని వేదన కలగసాగింది. ఆమె భర్త ఆనంద కపూర్ మా ఉభయుల సంభాషణలు వింటూ నవ్వుతూ కూర్చునేవాడు. ఎప్పుడైనా ఒక్కమాట మాట్లాడేవాడు. ఆయన వంతు వినడం మాత్రమే. తర్వాత స్టేషన్ రాగానే ఆమెను వదిలిపోవాలి. అది బాధాకరం. సంజీవదేవ్ అంటారు. 'కాత్యాయని నాకు అయిష్టమైన వ్యక్తి అయి వున్నట్లయితే ఈ బాధంతా లేకపోను. ఎంతో సంతోషంతో విడిపోయే వాణ్ణి. కాత్యాయని నుండి విడిపోవడంలో ఉండే వియోగ వ్యధ ఆమెకూ నాకూ సమాన పరిమాణంలో ఉండదు. ఆమె తన ప్రియమైన భర్తతో కలిసి నా నుండి విడిపోతుంది. మరి నేను వంటరిగా ఆమె నుంచి విడబడిపోతాను'

రైలు ప్రయాణంలో అనుకోకుండా తారసపడే ఒక స్త్రీ పురుష సంబంధాన్నీ, వియోగాన్నీ – మరో రచయిత ఎంతో అనుభూతిని కలిగించే ఒక కథగా రాయవచ్చు. సంజీవదేవ్ ఆత్మకథలో ఏ ఘట్టమూ గొప్ప అనుభూతినిచ్చేదిగా గానీ, గొప్ప ఉద్వేగాన్నీ ఆవేశాన్నీ ఇచ్చేదిగా గానీ ఉండదు. సాదాసీదా శైలిలో జరిగింది జరిగినట్టుగా చెప్పేధోరణి ఉంటుంది. ఆయన ప్రత్యేక మార్గంగా కనిపిస్తుంది. దీనికి కారణం ఆయన వ్యక్తిత్వంలోనూ, కావాలని పెంపొందించుకున్న ఒక విరక్తి భావంలోనూ ఉండవచ్చు. ఒక వ్యక్తి జీవితంలో జరిగే సన్నివేశాలలో 'ప్రధాన ప్రేరణ' అతని మనస్తత్వమే. సంజీవదేవ్ తీవ్రమైన ఆవేశాలూ, ఊపేసే ఉద్వేగాలూ ప్రధానమైన వ్యక్తి కాదనిపిస్తుంది. పైగా తన జీవితానికి అడుగడుగునా తానే సాక్షిగా ఉండి, ఒక శాంతమైన ప్రవృత్తిని సాధించినట్లు తోస్తుంది. ఇలాంటి తత్వంలో నుండి వచ్చిన సంఘటనలు, ఆలోచనలూ సంజీవదేవ్ ఆత్మ కథకి ఆధార ధారగా స్రవిస్తై. అందమైన చిన్న అలల చేతులూపుతూ సాగిపోతున్న సెలయేరులా ఉంటుంది ఆయన రచన. సెలయేరు – ఆయన దృష్టిలో గొప్ప ఆకర్షణ కలదికూడా. ఆయనంటారు.

'కొన్ని వస్తువులు అన్ని కాలాల్లోనూ అన్ని దేశాల్లోనూ మనోజ్ఞంగా ఉంటాయి. వాటిలో సెలయేరు ప్రధానమైంది. సముద్రానికంటే చిన్నది నది. నది కంటే చిన్నది సెలయేరు. సముద్రాన్ని గురించీ, నదిని గురించీ కూడా కవులు వర్ణించారు కాని సెలయేరును గురించి వర్ణించినంతగా వాటిని గురించి వర్ణించలేదు. సెలయేరుకుండే వేగం, ప్రవాహపు వంపులు, చుట్టుప్రక్కల ఉండే ఇసక, నీటిలో లోతు లేకపోవడం, జలాల స్వచ్ఛతా ఇందుకు ప్రధాన కారణం'. ముందు పదాన్ని తర్వాతి పదమూ, ముందు వాక్యాన్ని తర్వాతి వాక్యమూ, ముందు భావాన్ని తర్వాతి భావమూ ఎడతెగకుండా లాక్కుపోయే శైలీ, వేగం సంజీవదేవ్ రచనలో ఉంది. పదాల పొందిక తనదైన ముద్ర చూపే అనేక వంపులున్నై. చుట్టుప్రక్కల ఉండే అనేక కథలూ భావాలూ మధ్య మధ్యలో వస్తూ ఉంటై. తన ఆత్మకథలో సంజీవదేవ్ లోతైన ఆలోచనల్లోకి వెళ్ళడు. సన్నివేశంలో ఎంత వరకు అవసరమో అంతవరకే భావ వివరణ

ఉంటుంది. జలాల స్వచ్ఛతలాంటిదే ఆయన కథనంలోని నిజాయితీ. ఇలా ఆయనకి ఎంతగానో నచ్చిన సెలయేరు, ఆయన రచనకే ప్రతిరూపంలా ఉంది.

ఏ రచనకైనా 'ఏకసూత్రత' అనేది ఒక గొప్పతనాన్నిస్తుంది. తదుపరి ఏకాగ్రతని నిలుపుతుంది. ఏక సూత్రత లేకుండా గుర్తొచ్చిన సంఘటనలన్నీ రాసుకుపోయే ఆత్మకధా రచయితలుంటారు. కానీ ఏకసూత్రత ఉన్న ఆత్మకధ పాఠకునిపై ఎక్కువ ప్రభావం వెయ్యగలుగుతుంది. సంజీవదేవ్ ముందుగానే ఆలోచించి చేసినా, చెయ్యక పోయినా ఒక ఏకసూత్రత ఆయన ఆత్మకధలో ఉంది. అది ఆయన 'వ్యక్తిత్వ వికాసం'. సంజీవదేవ్ ప్రాథమిక దశలోనే చదువు మానేసినవారు. కానీ పెద్దయిన కొద్దీ అనేక శాస్త్రాలమీద, పైగా పరస్పర సంబంధంలేని శాస్త్రాలమీద అధికారం సంపాదించారు. సృజనాత్మక కళలు సరే, వేదాంతం, మనోవిజ్ఞానం, పరావిజ్ఞానం, భాషాశాస్త్రం ఇలా ఎన్నో విషయాల్లో లోతైన పాండిత్యాన్ని అవగాహన చేసుకున్నారు. ఏ శాస్త్రాల్లోనైనా పాండిత్యం చైతన్య పర్యంతంగా ఏర్పడాలంటే, ఆ వ్యక్తి మనస్సులో ఆ శాస్త్రానికి అనుకూలమైన పెరుగుదల చూపగల చైతన్య లక్షణముండాలి. ఈ విషయాన్ని వివరించడానికి మనస్తత్వ శాస్త్రజ్ఞులున్నా, అనుభవంతో ఈ విషయాన్ని గ్రహించగలం. మనస్సులోని లక్షణాలు కూడా కొన్ని అనువైన ప్రేరకాలు కలిగినప్పుడు వికసించడం ప్రారంభిస్తాయి. సంజీవదేవ్ మనో వికాసానికిక పూర్వరంగం ఆయన రచన నుండి మనం గ్రహించవచ్చు.

ఆయన ఆత్మకథలో మొదటి సంపుటం 'తెగిన జ్ఞాపకాలు' – ప్రారంభ వాక్యాలే గుండె ఝల్లుమనిపించి జాలికలిగిస్తై.

'అప్పుడు నాకు నాలుగో సంవత్సరమని పెద్దైన తరువాత తెలిసింది. అమ్మ చనిపోవడానికై తన తల్లిగారింటికి పయనమవుతుంది ఆ సాయంత్రం'.

అమ్మ మరణానికి గుండెని ఆరని అగ్ని గుండంలాచేసే భయంకర భావం. భారతదేశంలో అందులోను గ్రామాల్లో ఈ భావనకి ఇంకా తీవ్రత ఉంది. ఇలా చేసిన ఆత్మకథా ప్రారంభం ఎంతో గొప్పది.

అమ్మ చనిపోయే వరకు రాసిన కథ హృదయం కదిలించే కథనంతో సాగింది.

తల్లితో ప్రయాణం చేస్తున్నప్పుడు త్రోవలో తన గుండెపై ముద్రవేసిన ప్రకృతి సౌందర్యాన్ని గూర్చి చెప్పారు సంజీవదేవ్.

'సూర్యాస్తమయమౌతూ వేసవి ఆకాశం అంతా ఎర్రబారింది. కాలవ కట్టున కొంత దూరం పోయిన తరువాత కాలవ అవతలి గట్టున లాకుల దగ్గర ఒకే ఒక ఆకులు లేని సీమ తంగేడు (గుల్ మొహర్) చెట్టు నిప్పుల లాంటి పూలను విరబూచి ఉంది. ఎర్రని ఆకాశం పడమటి ప్రక్కన వెలుగుతూంది. ఎర్రని పూల వృక్షం తూర్పు దిశన మండుతోంది. ఆ దృశ్యం నా బాల హృదయం మీద వేసిన ముద్ర నేటికీ కాంతివంతంగా వెలుగుతూనే ఉంది కాని చెరగలేదు'.

అది నాలుగేళ్ళప్పటి అనుభూతి. ప్రకృతి సౌందర్యం మీద, రంగుల మీద గల ఏకాత్మత సంజీవదేవ్ జన్మతోనే జన్మించిందన్నమాట. ఆ ప్రయాణంలోనే శ్రావ్యానందంలోని గాఢత కూడా చెప్పబడింది. ఇలా ముందుగానే రాబోయే వికాసానికి బీజప్రాయంగా రచయిత చెప్పడం ఏకసూత్రతకి దోహదం చేసింది.

'నేను ఇవ్వాళ అమ్మదగ్గిరే పడుకుంటాను' అని ఆయన ఏడిస్తే, ఆవిడ నీరసించడంచేత అస్పష్ట ధోరణితో 'ఇవ్వాళ నా దగ్గర పడుకుంటే రేపటినుండి ఎవరి దగ్గర పడుకొంటావు' అని ఎక్కిఎక్కి ఏడువసాగింది. అంత ప్రేమగల తల్లి మరణమే అతని చైతన్యం మీద ప్రగాఢ ముద్రవేసింది. నాలుగేళ్ళ వయస్సులో తల్లి పోయినప్పుడు అతనికి ఏడుపు రాలేదు. కాని తర్వాత ఆ ముద్ర జీవితాన్ని ప్రభావితం చేసింది. ఈ తత్వానికి కారణం తనే చెప్తోడు. 'ఎవరన్నా ఏడుస్తుంటే నాకు ఏడ్పురాదు. ఎవరూ ఏడవనప్పుడే నాకు ఏడ్పువస్తుంది'. ఈ ఏడ్పు అంతరంగాన్ని చీల్చుకుని వచ్చిన ఏడ్పు. జీవితాన్ని మలుపు తిప్పగల ఏడ్పు.

తర్వాత తనెంతగానో ప్రేమించి, తన తల్లిని ఆమెలో చూసుకుంటున్న చెల్లి కూడా చనిపోయింది. అప్పుడు తన స్థితిని రచయిత ఇలా చెప్పాడు.

'అమ్మలేని ఇల్లు చెల్లి ఉన్నప్పుడు అంతగా శూన్యంగా తట్టలేదు. ఇక అమ్మా చెల్లీ ఉభయులూ లేని ఇల్లు శూన్యంగా తట్టసాగింది'.

బాల్యంలో తనను ప్రేమించేవారు చనిపోయినప్పుడు, అతను చాలా ప్రేమించే స్వభావం కలవాడైతే, తీవ్ర ప్రతిస్పందన (Sensitivity)లు కలవాడైతే, అతని హృదయంలో ఒక ఒంటరితనం గూడుకట్టుకుంటుంది. మనస్సులోపలికి గుంజుకోవడం ప్రారంభిస్తుంది. ఎటువంటి సాహసానికైనా వెనుదియ్యని ఒక మొండితనం ఏర్పడుతుంది. ఇలాంటి లక్షణాలన్నీ సంజీవదేవ్‌కి కలిగినై. జనన మరణాల మీద తీవ్రంగా ఎల్లప్పుడూ ఆలోచించే లక్షణం కూడా ఇక్కడే ప్రారంభమైంది. ఆయన అంటారు. ఏకాంత సేవలో ఒకోసారి ఆనందానికి బదులు విచారం కూడా కలిగేది. ఒకోసారి జననం, జీవనం మరణం మొదలైనవాటిని గూర్చిన ఆలోచనలు

వచ్చేవి. ఒకోసారి ఏదో నిరాశ తేచ్చేది – ఏదో శూన్యంగా అనిపించేది. కొంత కాలానికి ఏకాంత జీవితంలో ప్రతి క్రియ ప్రారంభమైంది. స్నేహితులతో బాగా తిరగడం, ఊళ్ళు తిరిగి రావాలనే కోరిక ప్రబలమైంది. మిత్రులతో వేదాద్రి చూచి రావడం జరిగింది. తిరిగి వచ్చిన తర్వాత మనస్సు బాగా నీరసించిపోయింది. ఈ సందర్భంలో రచయిత చెప్పిన మాటలు, అతనిలోని మార్పుకీ, రాబోయే సంఘటనలకీ మూలమైన మనోవైజ్ఞానిక సత్యాలు. ఆయనిలా అంటారు.

'కొందరు ఇంటి నుండి క్రొత్త తావుకు ప్రయాణమైపోతున్నప్పటి కంటే ఆ వెళ్ళిన తావునుండి ఇంటికి తిరిగి వస్తున్నప్పుడు ఎక్కువ ఉల్లాసంగా ఉంటారు. ఇంటి దగ్గర సుఖంగా ఉండేవాళ్ళూ, ఇంటి దగ్గర ప్రియమైన వ్యక్తులున్న వాళ్ళూ ఇంటిదగ్గర ఏదో ఉజ్వలమైన భవిష్యత్‌ఉన్నదని నమ్మేవాళ్ళు ఇంటికి తిరుగు ప్రయాణంలో ఎక్కువ ఆనందం పొందుతారు. కాని ఇంటి దగ్గర భారంగా తోచేవాళ్ళు, ఇంటి దగ్గర అంతగా ప్రియమైన వ్యక్తులు లేనివాళ్ళు, ఇంటి దగ్గర ఉజ్వలమైన భవిష్యత్ గోచరించనివాళ్ళు మాత్రం ఇంటి నుంచి పయనించేటప్పటి ఆనందాన్ని తిరిగి ఇంటికి పయనించేటప్పుడు పొందరు' తర్వాత దేశమంతా తిరిగి రావాలనే తీవ్రకాంక్షకి ఇక్కడ బీజంపడింది.

అమ్మమ్మగారి ఊరైన కోనాయపాలెం నుంచి తండ్రిగారి ఊరైన తుమ్మపూడి తిరిగి వచ్చిన తర్వాత, అక్కడి స్వేచ్ఛా జీవితం ఇక్కడ బందీ జీవితమైపోయింది. అక్కడ అందరూ తన మాట వినేవారు. ఇక్కడ తనే అందరిమాటా వినాలి. ఈ పరిస్థితి ప్రభావం సంజీవదేవ్ హృదయం మీద పడింది. ఆ మార్పుని తనే ఈ క్రింది విధంగా చెప్తున్నాడు.

'జీవన విధానంలో ఈ మార్పు నా మనోజగత్తు మీద తన ప్రభావాన్ని బలీయంగా వేయసాగింది. బాహ్య జీవితం బంధనాయుతం, అసంతృప్తి పూరితం ఐనప్పుడు ఆంతరిక జీవితం కల్పనామయం ఔతుంది. వాస్తవ వాదం వ్యతిరేకంగా కనిపిస్తుంటే, ఆదర్శవాదంలో అనుకూలత జనిస్తుంది. భౌతిక జగత్తులో అందని ఆనందం భావ జగత్తులో ఆనందం కాసాగుతుంది. ఈ విధంగా నిత్య వ్యవహారిక జీవితంలో లభించని చిత్తశాంతి కల్పనాత్మకమైన భావజగత్తులో లభించసాగింది'.

పరిస్థితుల ప్రభావం తన ప్రధాన భావధోరణిపై కలిగించిన మార్పు చెప్పబడింది. ఇవే పరిస్థితుల్లో మరొకరు సంఘర్షణాపరమైన, ఆందోళనాయుతమైన, ఆవేశవంతమైన మార్పుల్ని పొంది ఉండే అవకాశం ఉంది. కాని ఇక్కడ రచయితలో సహజంగా ఉన్న ఏకాంత మనోమయ జీవన లక్షణం, పరిస్థితుల ప్రభావంచేత పైవిధమైన మార్పుల్ని తెచ్చింది. ఇలాంటి మానసిక

పరిస్థితిలో వారి పెదనాన్నగారైన చినవెంకట కృష్ణయ్యగారు, తన సాంస్కృతిక జీవితంపైన గొప్ప ప్రభావం కలిగించారు. రవీంద్రుడు, అరవిందుడు, జగదీశ్ చంద్రబోసు మొదలైన వారిని గూర్చి, యోగుల గూర్చి, హిమాలయాల గూర్చి చెప్తూ ఉండేవారు.

ఈ దశలోనే ఆయన స్వేచ్ఛా జీవితానికై తహతహ ప్రారంభించింది. నిరంతర ప్రయాణకాంక్ష జనించింది. ఆయన మాటల్లో ఈ కాంక్షలోని తీవ్రత చమత్కారంగా చెప్పబడింది. 'ఎక్కడా దిగిపోకుండా తెంపులేని ప్రయాణం ఎంత హాయిగా ఉంటుందో! జీవితమంతా ఒక ఎడతెంపులేని నిరంతర ప్రయాణమైతే ఎంత ఆనందంగా ఉంటుందో! ఇంటికి తిరిగిరాని నిరంతర ప్రయాణంలో ఆనందమే ఆనందం!'

ఇక్కణ్ణించీ రచయిత జరిపిన ప్రయాణాలూ, చూచిన ప్రకృతీ, మైత్రి చేసిన మహనీయులూ, పఠించిన పుస్తకాలే ఆయన సృజనాత్మక వ్యక్తిత్వ వికాసంలో ప్రధాన పాత్ర వహిస్తై. మద్రాసులో అనిబిసెంటు, జిడ్డు కృష్ణమూర్తులతో పరిచయం, ఆయన జీవన విధానం మీద కూడా మార్పు తెచ్చినై. ఆయన పొందిన ఉత్తేజం ఆయన మాటల్లోనే తెలుస్తుంది.

రాత్రంతా అడయారు జ్ఞాపకాలు. లెడ్‌బీటరు జ్ఞాపకాలు, జినరాజదాస జ్ఞాపకాలు, అనిబిసెంటు జ్ఞాపకాలు, అన్నిటికి మించిన జిడ్డు కృష్ణమూర్తి జ్ఞాపకాలు, నాతోసహా రైలులో ప్రయాణం చేస్తున్నా నన్ను నిద్రపోనివ్వలేదు. ఇంటికి వెళ్ళిన తర్వాత నడపవలసిన జీవన విధానం ఎటువంటిదో తేల్చుకోలేక తల వేడెక్కిపోతోంది.

ఆయన పదునాలుగో ఏటనే రామతీర్థ సాహిత్యంతో పరిచయం ఏర్పడి ఉండటంవల్ల హిమాలయాలు చూడాలనే తీవ్రమైన ఆసక్తి కలిగింది. సంజీవదేవ్ ఆత్మకథలో ఈ హిమాలయ ప్రయాణమూ, అక్కడి అనుభూతులూ ఒక చిరస్మరణీయమైన ఘట్టం. చదివిన ఎవరికైనా హిమాలయాలకి వెళ్ళి రావాలనే ఆసక్తి వెంటనే కలుగుతుంది. ఈ ప్రయాణంలోనే ప్రేమ్‌చంద్ అసిత్ కుమార్ హాల్దార్, రవీంద్రుడు, నికోలస్ రోరిక్ మొదలైన మహనీయులతో స్నేహం కలిగింది. ఈ హిమవత్పర్వత యాత్రలే ఈయనలో చిత్రకళాసక్తినీ, రచనాసక్తినీ ఉన్నత శిఖరాలకి తీసుకు పోయినై. జిడ్డు కృష్ణమూర్తి ఆలోచనలు ఆయన్ని ఆలోచించేటట్లు చేసినై. 'ఆలోచించిన దాన్నంతా అనువదించడం అంత సులభం కాని మాట వాస్తవమే. అందుకని ఆలోచించడాన్నే మానివేయడం ఏ విధంగానూ సమంజసం కాదు' అంటారు. అందువల్ల ఆయన ఆలోచనల మీద జిడ్డు కృష్ణమూర్తి ప్రభావం పడడం కూడా ఈ సమయంలోనే జరిగింది.

ఇలా ఆయనలోని సృజనాత్మకత, ఒక స్థిరమైన ప్రవృత్తినీ, శాంతమైన మనస్థితినీ

ఏర్పరచుకోడానికి తత్వ సంవేదనా, దేశాటనానంతరం పూర్తిగా వికసించింది. తర్వాత ఉపన్యాసాలకి పర్యటనలు చెయ్యడం. మిత్రులతో ఉత్తర పరిచయాలు పెంపొందించుకోవడం చిత్రకళనీ, ఫోటోగ్రఫీని అభివృద్ధి పరచుకోవడం, కవితలూ, వ్యాసాలూ రాయడం మొదలైనవన్నీ అనేక శాఖలుగా వ్యాపించినై. ఆయన ఆత్మకథలోని 'స్మృతిబింబాలు', 'గతంలోకి' సంపుటాలు ఈ వికాసానికి ఫలిత రూపాలే.

ఇలా నాలుగేళ్ళ వయస్సు నుండి, యౌవనం దాకా ఆయన వ్యక్తిత్వ వికాసానికి సంబంధించిన వాతావరణం ఆయన ఆత్మకథలోని ఏక సూత్రంగా చెప్పుకోవచ్చు. అందువల్లనే ఈ ఏకసూత్రం అత్యంత గాఢంగా ఉన్న మొదటి సంపుటం 'తెగిన జ్ఞాపకాలు'లో కలిగిన అనుభూతి తరువాతి సంపుటాల్లో కలగదు. అయితే వాటి ధోరణి తర్వాత వివరించబడుతుంది. తన వ్యక్తిత్వ వికాస విషయంలో తాను నిత్యం మేలుకొని ఉన్నట్లు అడుగడుగునా ఆయన ఆలోచనలు మనకు వ్యక్తపరుస్తూ ఉంటాయి. సంజీవదేవ్ ఆత్మకథ ద్వారా ఆయన మానసిక లక్షణాలు కొన్నిటిని అంచనా వెయ్యవచ్చు. ఆయన చెప్పినట్లే ఈ ఆత్మకథలో వ్యక్తపరచిన దానికంటే గుప్త పరిచిందే ఎక్కువగా ఉంటుంది కాబట్టి, వ్యక్తమైన దాంట్లోనే సువ్యక్తమయ్యే ఆయన మనః ప్రపంచాన్ని విశ్లేషించి చూడ్డానికి అవకాశం ఉంది. అసలు ముఖ్యంగా ఆయన ఆత్మకథలోని ఆకర్షణల్లో ఇది ఒకటి. సహజమైన లక్షణం చేతను, చిన్ననాడు పెరిగిన వాతావరణం చేతనూ, ఆయన పూర్తిగా అంతరంగ జీవి (Introvert), బహిఃప్రపంచ సంవేదనలు ఎంత తీవ్రమైనా, ఆయన అంతరంగ జీవితమే వాటిని పూర్తిగా శాసిస్తుంది. ఆయనొకచోట అంటారు '–మనిషి నివసిస్తున్న ప్రపంచం చాలా పెద్దది. కానీ, మనిషిలో నివసిస్తున్న ప్రపంచం ఇంకా ఎక్కువ పెద్దది'. ఈ ప్రపంచాన్ని బయటికి తేవడానికే ఆయన జీవితమంతా కృషి చెయ్యడం. అందుకే ఆయన రచనలు ఈ కాలానికి అవసరమైన సామాజిక వైరుధ్యాల్ని వ్యక్తం చెయ్యవు. కేవలం మనోజీవులకు మాత్రమే ఉద్దేశించినట్లుంటాయి. వైరుధ్యాల్ని సహించలేని సాత్విక లక్షణం మీద అభిలాష ఆయన చైతన్యాన్ని పూర్తిగా రస జగత్తులోకి నెట్టివేసింది. తర్కాతీతమైన ఆనందానికి వ్యగ్రుణ్ణి చేసింది. అందుకే ప్రకృతి, సంగీతం, సౌందర్యం – ఇలాటివి ఉపాస్య వస్తువులయినై. వైరుధ్యాల్లో జీవించే వారికి ఇలాటి ఆనందం దొరకదా అంటే, తప్పక దొరుకుతుంది. కానీ తీవ్రమైన ఉద్వేగాలకు లోనయ్యే మనస్తత్వం కాదు గనుక, పైగా వేదాంత పరమైన ఒక అనాసక్తతని గూర్చి ఎల్లప్పుడూ ఆలోచించడం చేత, పూర్తిగా వైరుధ్యాలకి దూరమైన రసజగత్తు ఆయనకి నిత్యాన్వేషణ వస్తువై ఉండవచ్చు. అందుకే ఆయన రచనలూ, సందేశమూ, ఈనాటి కల్లోల సమాజానికి పూర్తిగా దూరం కావడం జరిగింది.

ప్రతి నిమిషమూ హృదయాన్ని ఆనందంగానే ఉంచుకోవాలనే తత్వం సంజీవదేవ్‌లో ప్రయత్నపూర్వకంగా కూడా కనిపిస్తుంది. 'బాధకంటే ఆనందాన్నే ఎక్కువ కలగజేసేలాగా శరీరాన్ని తయారు చేసుకొనడం మానవ జీవితపు ప్రథమావసరం మాత్రమే గాక ప్రధానావసరం కూడ' అంటారు. మరో సందర్భంలో ఇలా అంటారు 'ఒక వ్యక్తిని మనసారా గాఢంగా ప్రేమించినప్పుడు ఆ వ్యక్తి చనిపోతే దుఃఖం, విపరీతమైన దుఃఖం కలిగేమాట వాస్తవమే! ఏమి దుఃఖం కలిగితే? దుఃఖం కలిగితే దుఃఖించవచ్చు. తాను ప్రేమించిన వ్యక్తి జీవించి ఉండగా ఆనందం పొందిన ప్రేమ హృదయం, నేడు ఆ వ్యక్తి లేనప్పుడు దుఃఖం అనుభవించడం బాధగా ఎందుకుండాలి? ఆనాడు సంయోగంలో ఆనందాన్ని అనుభవించిన హృదయంతోనే, నేడు వియోగంలో దుఃఖాన్ని మధురంగా అనుభవించగలగాలి. ఆ దుఃఖం కూడా ఆనందంగానే తట్టాలి కానీ బాధగా తట్టకూడదు. ఆనంద బాష్పాలకూ దుఃఖ బాష్పాలకూ భేదం ఉండరాదు'.

పై మాటలు నిత్య ఆనందాన్వేషణకి పరాకాష్ఠ రూపాలు. దుఃఖానికి అతీతమైన స్థితికి వెళ్ళినప్పుడు ఆనందమే మిగలవచ్చుగాని, దుఃఖమే ఆనందం కావడం ఎలా? అనుబంధాల తీవ్రతనిబట్టి దుఃఖమూ, ఆనందమూ ఉంటాయి గాని, పూర్తిగా అనుబంధాల్లేని జీవితం వాంఛనీయమా? రచయిత చేసిన పై ఆలోచన ఆనందాన్వేషణని భయంకరం చేస్తుందనిపిస్తుంది.

మనస్సుని ఆనందంగా ఉంచడానికి నిత్య సాధన చెయ్యడం కూడా ఆయన రచన వల్ల తెలుస్తుంది. ఒక సన్నివేశంలో చాలా బాధ కలిగింది. ఆ తర్వాత ఇలా రాస్తారు. 'సరే, అనివార్య విషయాలలో ధైర్యాన్ని అవలంబించడం, ఆనందాన్ని సృష్టించుకోవడం అభ్యస్తమైనందున మానసాన్ని ఏ మాత్రమూ బాధ చెందనీయక హృదయాన్ని అవ్యక్తానందంతో నింపుకొని ఆ రాత్రి ఆ రైలులోనే నా బెర్తు మీదనే నిద్రించాను'. ఇక్కడ బాధా తీవ్రతలోని స్వల్ప స్థాయి నిర్ణాయకాంశం ఔతోందో, లేక బాధా తీవ్రతని కూడా వెంటనే నిర్మూలింపజెయ్యడం నిర్ణాయకాంశం ఔతుందో చెప్పలేనుగాని, ఈ సాధన మాత్రం అచంచల నిర్ణయానికి ప్రతిరూపం.

సంజీవదేవ్‌లో ఎప్పుడూ ఇద్దరు వ్యక్తులుంటారు. ఒకరు 'సంజీవ', రెండోవారు 'దేవ్'. సంజీవ ప్రతి క్షణం జీవిస్తూ ఉంటారు. 'దేవ్ ప్రతిక్షణం లోపల ప్రకాశిస్తూ ఉంటారు. అంటే ప్రతి క్షణం, ప్రతి సన్నివేశంలో బహిరంగమైన ఘటనల్లో పాల్గొంటూనే, అదే క్షణంలో లోపలి ఆలోచనా ధార కొనసాగుతూ ఉంటుంది. అంటే జరుగుతున్న జీవితానికి సాక్షీభూతంగా ఉన్న ఒక వ్యక్తి లోపలినుండి తొంగిచూస్తూ ఉంటాడు. ఒక సందర్భంలో ఆయన ఇలా అంటారు – 'ఇటువంటి సామాజిక జీవితానికీ, నా వ్యక్తిగత జీవితానికీ ఒక విధమైన సంధి కుదుర్చుకున్నాను. ఇటువంటి మిత్రులతో సరదాగా బహిరంగ జీవితాన్ని గడుపుతున్నప్పుడు కూడా నేను నా

అంతరంగిక జీవితంలో ఒకవైపు జీవిస్తూనే ఉండేవాణ్ణి. ఎటువంటి బహిరంగ జీవిత పరిస్థితిలో కూడా వ్యక్తిగత జీవితం నుంచి వేరయ్యేవాణ్ణి కాదు'.

ఇదే నిత్య అంతర్ముఖుని నిజమైన లక్షణం. సంజీవదేవ్ తన అంతర్ముఖత్వాన్ని తన ఆనంద సిద్ధాంతానికి అనుగుణంగా వినియోగించుకున్నట్లు కనిపిస్తుంది. 'ఈ బయటి ప్రపంచం అంతా కూడా ఆనందం ఇవ్వజాలని సమయంలో నా అంతర్జగత్తులోకి చూచుకొని ఆనందించేవాణ్ణి. అంతర్జగత్తు నన్నెప్పుడూ మోసగించలేదు, ఆనందం ఇవ్వకుండా' అనే మాటల్లో పై సత్యం ధృవపడుతుంది.

వైరుధ్యాల్ని సహించలేని సంజీవదేవ్ మనస్తత్వంలోనించే ఆయన అభిప్రాయాలు కూడా రూపుదిద్దుకుంటూ ఉంటై. ఇది ఒక రాజీ ధోరణికి దారితీస్తుంది. రెండు విరుద్ధమైన విషయాలున్నప్పుడు, రెంటినీ రెండు సందర్భాల్లో అంగీకరించడమో, లేక రెంటిలో సమానమైన విషయాన్ని చూడడమో జరుగుతుంది. ఇటువంటి రాజీ ధోరణి తన ఆలోచనలో ఉన్నట్లు ఆయనే చెప్పుకుంటారు కూడా. ఉదాహరణకి భౌతికవాదమా, ఆధ్యాత్మికవాదమా అన్న ప్రశ్న వచ్చినప్పుడు తాను ఏదో ఒక ధోరణికి నిబద్ధుణ్ణని చెప్పరు.

'ఏ వాదమైనప్పటికీ అది మానవ చైతన్యాన్ని ఊర్ధ్వ ముఖంగా మార్చి మానవ హృదయంలో ఉన్నతమైన ఆనందాన్ని సృష్టించి మానవుణ్ణి మానవుని కంటే పైకి ఎత్తగలిగినప్పుడు, అది ఉత్తమ వాదం. అటువంటి వాదం పేరు ఏ పేరు అయినప్పటికీ పరవాలేదు. భౌతికవాదం అనేది కూడా ఆ విధంగా చేయగలిగినప్పుడు దాన్ని స్వీకరించడానికి కూడా వెనకాడవలసిన అవసరం లేదు. అసలు భౌతిక వాదమంటే చైతన్యపు స్థూలదశ మాత్రమే. ఆధ్యాత్మిక వాదమంటే భౌతికత్వపు సూక్ష్మదశ మాత్రమే. జడ–చేతనాల మధ్య మనం కల్పించే ప్రభేదం అంతగా వాస్తవమైంది కాదు'.

అలాగే కళ కళ కోసమా, సమాజంకోసమా అనే వాదం వస్తే ఇలా అంటారు. 'కళ కళ కొరకే అనడంలో కాని, కళ నైతిక సందేశాన్ని అందించడం కొరకే అనడంలో కాని, కళ ఆధ్యాత్మిక సత్యాన్ని వెలిబుచ్చే నిమిత్తం మాత్రమే అనికాని అనడం కళలోని ఒక పాశ్వాన్ని చూడడం మాత్రమే అవుతుంది. కనుక కళ అనేది వీటి అన్నిటి నిమిత్తం కూడా ఇంకా ఎన్నిటి నిమిత్తమో కూడా' ఇది అరవిందుని అభిప్రాయాలు వివరించేటప్పుడు రాయబడింది. సంజీవదేవ్ అభిప్రాయం కూడా ఇదే.

ఆస్తికత్వం, నాస్తికత్వం ప్రశ్న వచ్చినప్పుడు ఇలా అంటారు. ''తన్ను తాను తెలుసుకునే

నిమిత్తం భగవంతునిలో నమ్మకం ఉన్న ఆస్తికులే అవసరంలేదు. నాస్తికులు కూడా పనికివస్తారు. తన్నుతాను తెలుసుకోవడం అనేదానికి ఆస్తికత్వంతో గానీ, నాస్తికత్వంతో కానీ పనిలేదు. తన్నుతాను తెలసుకోనప్పుడు ఆస్తికుడు నిజమైన ఆస్తికుడు కాడు. నాస్తికుడు నిజమైన నాస్తికుడుకాడు. అసలు నిజానికి ఆస్తికవాదం, నాస్తికవాదం ఈ రెంటి ఆదర్శం కూడా మానవుడు తన్నుతాను తెలసుకోడమే. ఆ ఆదర్శాన్ని విసర్జిస్తే ఇక ఆస్తికవాదంలో 'ఆస్తి'లేదు. నాస్తికవాదంలో 'నాస్తి' లేదు''. సంజీవదేవ్అభిప్రాయాల్లో ఈ సమన్వయవాదం సాధారణంగా కనిపిస్తుంది. సామాజిక లక్ష్యనిర్దేశమూ, సంఘర్షణ తత్వమూ లేకుండా మనస్సులోతుల్లోని ఆనందాన్వేషణ ప్రధానమైనప్పుడు ఇలాంటి సమన్వయవాదం రూపుదిద్దుకుంటుంది. జీవిత సంఘటనలపై గూడా ఈ అభిప్రాయాల ప్రభావం బలంగా ఉంటుంది.

చాలా చిన్ననాటి నుండి సంజీవదేవ్ కి తన జీవితాన్ని ఏవిధంగా తీర్చిదిద్దుకోవాలనే ఒక ప్రణాళిక ఉన్నట్టు కనిపిస్తుంది. ఆవేశాలకు లోను కాకుండా, ఆలోచనల ప్రధానంగా చేసుకుని, ఏ సమయంలో ఎలా జీవితాన్ని నిర్మించుకోవాలో ముందుగానే ఊహించగలరు. తన మనస్తత్వం తనకు బాగా అవగాహన కావడం, జీవితంలో ఉద్వేగాలు ప్రధానం కాకపోవడం ఆయనలోని ఈ శక్తికి కారణం కావచ్చు. చిన్ననాడు ఆయన సాధువుల్ని చూచి వారిపట్ల ఆకర్షితుడైనాడు. వెంటనే ఇలా ఆలోచించారు. 'నేనూ అటువంటి జీవితాన్నే గడపాలి. ఇప్పుడే వారి విధంగా తయారు కావాలా? లేక ఇంకా ముందా? వారు నా అంత చిన్నవారు కాదుగా. అందుకని నేను వారంత పెద్దవాణ్ణి అయినప్పుడు వారి విధానాన్ని అవలంబిస్తాను. అనే నిర్ణయానికి వచ్చిన తర్వాత అప్పటికప్పుడు వారివలె కావాలన్న వాంఛ సమసిపోయింది.'

లోకంలో కొందరు విశిష్ట వ్యక్తులుంటారు. వాళ్ళకి తమను గూర్చిన అంచనా సమగ్రంగా ఉంటుంది. తమకీ లోకానికీ గల సంబంధం గూర్చిన అంచనా సమగ్రంగా ఉంటుంది. తాము పాల్గొనే ప్రతి సన్నివేశంలోనూ సరైన అంచనాలోనే ప్రవర్తిస్తారు. వారి ప్రవర్తనలో అవ్యాప్తి. అతి వ్యాప్తులుండవు. వారికంటే గొప్ప వ్యక్తిత్వం గలవారు, వారికంటే సమగ్ర వ్యక్తిత్వంగలవారు ఉండవచ్చుగాని, వీరిదొక సముచిత వ్యక్తిత్వం (Balanced personality) సంజీవదేవ్ ఈ కోవకి చెందిన వ్యక్తిగా కనిపిస్తారు. తన వివాహ విషయంలో కూడా, అది ఒక సమస్యగా భావించి, ఎన్నోసార్లు వాయిదా వేసి వేసి, చివరికి ఒక నిర్ణయానికి వచ్చి వివాహం చేసుకున్నట్లుగా తెగిన జ్ఞాపకాలులో రాశారు.

'నేను వివాహితుడుగా ఉండడమో లేక అవివాహితుడుగా ఉండడమో ఈ 1950లో తేలిపోవాలని నిర్ణయించాను. ఈ సమస్యను ఇక పొడిగించదలచలేదు. ఈ సుదీర్ఘ సమస్యకు

ఈ సంవత్సరంలో పరిష్కారాన్ని ప్రసాదించాలని దృఢనిర్ణయానికి వచ్చాను. నేను తుమ్మపూడిలో నివసించడమా లేక తుమ్మపూడిని వదలడమా అనేది ఈ సమస్యా పరిష్కారం మీదనే ఆధారపడి ఉంటుంది'.

ఇలా ఆలోచన దారిచూపే వ్యక్తులు సాధారణంగా పొరపాటు చెయ్యరు. ఏది పొరపాటు, ఏది కాదు అనే చర్చనవతలపెట్టి, తాము జీవితంలో తర్వాత వేదనననుభవించే తప్పులు చెయ్యరు. దీన్నే 'స్థిత ప్రజ్ఞత' అనే శీర్షికతో సంజీవదేవ్ రాశారు (ఇక్కడ 'స్థిత ప్రజ్ఞత' వేదాంతులు చెప్పే స్థిత ప్రజ్ఞతకాదు).

'ఒకటి అభ్యాసం చేసుకున్నాను. అనివార్యాలకు నన్ను నేను అనుకూల పరచుకోవడం, కాంక్షలు కార్యరూపం దాల్చనప్పుడు బాధపడడం, మనసును చెడగొట్టుకొనడం మొదలైన మనోదౌర్బల్యాలను దరిచేరనిచ్చేవాణ్ణికాదు. పరిస్థితులను మానవుడు తనకనుకూలంగా చేసుకోవడం అన్నిటికంటే మంచిపని. కానీ ఏవో కారణాల వల్ల అది కుదరనప్పుడు మానవుడే పరిస్థితుల కనుకూలంగా మారాలి. తనకనుకూలంగా పరిస్థితులు మార్చుకోలేక, మారిన పరిస్థితుల కనుకూలంగా తాను మారలేకపోతే మనోవ్యధ తప్పదు' జీవితంలో మహావేశపరులు, తీవ్రకాంక్షలు గలవారు, గాఢమైన స్వభావం గలవారు, ఇలాంటి స్థితప్రజ్ఞత సాధించగలరా అనేది వేరు విషయంగాని, సంజీవదేవ్ సాధన మాత్రం ఆయనకి సత్ఫలితాలనిచ్చిందనే గ్రహించగలం.

సంజీవదేవ్ కి చిన్ననాటి నుండీ ప్రకృతి సౌందర్యం ఒక తీవ్రమైన స్పందన. రంగుల పట్ల ఆకర్షణ, నాదంలోని ఆనందం, పసితనం నుండే వికసించినట్లు గ్రహించవచ్చు. 'తెగిన జ్ఞాపకాలు'లో 'బాల్యము–స్మృతులు' అనే మొదటి భాగంలోనే తన బాల్యానుభూతుల్ని చెప్పారు. దృశ్యానందం, శ్రవ్యానందం ఒకదాన్ని మించి మరొకటి ఆకర్షించడం వర్ణించారు. ఈ సౌందర్యానుభూతి తాను పరిణతుడైన కొద్దీ అనంతంగా వికసించింది. ఈ దృశ్య శ్రవ్య సౌందర్యాన్ని అనుభవించడంలో కూడా తన చేతన ఎల్లప్పుడూ నిండుగా మేలుకుని ఉన్నట్లు వివరిస్తారు. అందుకే సౌందర్యాన్ని ఆనందించడంలో రెండు విధాలుగా వ్యక్తుల్ని విభజించారు. 'కొందరు ఆనందిస్తూ తన్మయులౌతారు. మరికొందరు ఆనందిస్తారే కాని తన్మయులుకారు' అని తన తన్మయత్వాన్ని సూచిస్తారు. ఈ గాఢచేతన అనుభూతి ఆయన 'స్మృతిబింబాలు', 'గతంలోకి' అనే సంపుటాల్లో అనేకచోట్ల అనేక కోణాల్లో దర్శనమిస్తుంది. ఒకచోట తాను వింటున్న రాగంలో ఉన్న తన్మయత్వాన్ని ఈ విధంగా చెప్తారు. 'దాన్ని ఈలతో పాడుతుంటే నామానస చక్షువుల ఎదుటి కొండలమీద మంచు కనబడుతున్నట్టూ, కొండల క్రింది

లోయల్లోగుండా తెల్లని సెలయేళ్ళు ప్రవహిస్తున్నట్టూ, దేవదారులు గాలికి ఊగుతున్నట్టూ ప్రత్యక్షమౌతాయి. దాంతో నాకెంతో ఆనందం, తన్మయతా కలుగుతాయి' ఈలాంటి గాఢచేతనకి మరో విశిష్టమైన సంఘటనని వివరించారు.

'వాసన తట్టినపుడు ఘటన త్వరలో జ్ఞాపకం వస్తుందిగాని ఘటన తట్టినపుడు వాసన జ్ఞాపకం రావడం అంత సులభంకాదు. సరే, నాలో మాత్రం ఈ సూత్రాలకు విరుద్ధంగా ఇప్పటికీ ఆ పుస్తకం వాసన దానంతట అదే తడుతుంది. అది తట్టినప్పుడు ఆ వాసనకు సంబంధించిన పుస్తకమూ, పుస్తకానికి సంబంధించిన చదువూ, చదువుకు సంబంధించిన ఘటనలూ జ్ఞాపకం వస్తుంటాయి.'

సాధారణంగా ఎవరిలో ఈ గాఢచేతన ఎల్లప్పుడూ మేలుకుని ఉంటుందో, వారిలో అసాధారణమైన జ్ఞాపక శక్తి కూడా ఉండడం లోకంలో గమనించగలం. అందులోనూ అనుభూతుల జ్ఞాపకాలు ముఖ్యంగా తలుచుకున్నప్పుడు అనుభవంలోకి వస్తై. ఈ లక్షణాన్ని సంజీవదేవ్ స్వీయచరిత్ర నిండా దర్శించగలం.

సంజీవదేవ్ ఆత్మకథనిబట్టి ఆయన ఎల్లప్పుడూ గంభీరమైన ఆలోచనలతో ఉన్నట్టూ, హాస్యరసం బాగా అరుదుగా ఉన్నట్టూ అనిపిస్తుంది కాని, అక్కడక్కడ ఉదహరించిన కొన్ని ఘట్టాల్లో ఆయనలోని వాక్చమత్కృతి మాత్రమే ఉదాత్తమైన హాస్యానికి ప్రోద్బలకంగా కనిపిస్తుంది. 'గతంలోకి' అనే సంపుటంలో ఒకచోట ఆధునిక సంస్కృతిలో పెంపొందిన 'Thanks' వాడుక గూర్చి చెప్తూ ఇలా వ్యంగ్యంగా రాస్తారు 'ధన్యవాదాలు అనేవి చాలా విచిత్రమైనవి. వ్యయ ప్రయాసలు లేకుండా ఇవ్వదగిన వాటిలో వాటికి మించిన సులభమైనవి మరింకేవీ లేవు. అన్నం పెట్టినందుకు ధన్యవాదాలు. మంచినీ రిచ్చినందుకు ధన్యవాదాలు. మంచిమాట చెప్పినందుకు ధన్యవాదాలు, పోయినందుకు ధన్యవాదాలు, వస్తానని రానందుకు, వెడతానని వెళ్ళనందుకు ధన్యవాదాలు, తుమ్మనందుకు, దగ్గనందుకు అన్నిటికీ ధన్యవాదాలే! ఇది ధన్యవాదాల యుగం' ఇలాగే ఆయన ఆత్మకథలోకి యాదృచ్ఛికంగా మాత్రమే హాస్య ప్రసక్తి వస్తుంది.

'స్మృతిబింబాలు', 'గతంలోకి' అనే రెండవ మూడవ సంపుటాల్లో పరిణత మనస్కుడైన సంజీవదేవ్‌కి సంబంధించిన కళాత్మక చైతన్య జీవితమంతా ప్రతిబింబిస్తుంది. ఉపన్యాసాలు, చిత్రకళా ప్రదర్శనలు, ఫోటోగ్రఫీ, వ్యాస, కవితారచన, లేఖారచన, అనేకమంది సమకాలీన దేశీయ విదేశీయుల కళాకారులతో మైత్రి, పుస్తక పఠనం, మొదలైన విషయాల విశ్వరూపం కనిపిస్తుంది.

లేఖారచన విషయంలో ఆయన ఒక ప్రత్యేక శ్రద్ధనీ, శైలినీ పెంపొందించుకున్నారు. ఈ లేఖారచన వల్ల అనేకమందికి ఆత్మీయుడు కావడం, వారి జీవన మర్మాల్లో ఏకీభావం పొంది సమస్యల పరిష్కారం సూచించడం, కష్టాల్లో ఓదార్చడం మొదలైన మానవీయ ప్రయోజనాల్ని కూడా సాధించగలిగారు. సౌందర్యవాదియైన సంజీవదేవ్ బహిరంగ స్సౌందర్యాలు రెంటికీ సమప్రాధాన్యమిచ్చినట్లు కనిపిస్తుంది.

'మంచి మంచి విదేశీ కవర్లు, ఆ కవర్ల వంటి అందమైన కాగితాలు సేకరించడం, వాటిమీద నా వద్ద ఉన్న చిన్న హెర్మిస్ టైపుయంత్రం మీద సుందరంగా టైపుచేసి వాటిని స్వయంగా పోస్టు చేయడమూ, ఒక సరదాగా ఏర్పడింది. కవర్లు కమనీయంగా ఉండాలి. కవర్లలోని కాగితాలు కమనీయంగా ఉండాలి. కాయితాలమీద అక్షరాలు కమనీయంగా ఉండాలి. అక్షరాలు వ్యక్తపరచే భాష కమనీయంగా ఉండాలి. భాష వ్యక్తపరచే భావాలు కమనీయంగా ఉండాలని అభిలాష... కమనీయం కాని జీవితానికి జీవించే హక్కులేకుండా ఉండాలి!' అంత తీవ్రమైన సౌందర్య కాంక్ష. అందుకే జీవితంలోని, సమాజంలోని అసౌందర్యానికి దూరంగా ఉన్నారు గాని, అసౌందర్య కారణాలతో సంఘర్షణ జరుపలేదు.

ఈ రెండు సంపుటాల్లోనూ, ఎన్నో దేశీయ విదేశీయుల కవితల వివరణా, చిత్రకారుల చిత్రాల వర్ణనా, వైజ్ఞానికమైన అనేక అంశాల పరిశీలనా చెయ్యబడింది. అందుకే వీటిలో వ్యాస భాగాలు ఎక్కువగా కనిపిస్తై. భావుకులకు ఎన్నో విషయాలు పరిచయం చెయ్యబడినై. జపాన్ వారి హైకూ కవితల్ని బహుశ మొదటగా ఆంధ్ర పాఠకులకి ఎక్కువగా పరిచయం చేసింది సంజీవదేవ్ అనుకుంటాను. వాటిలోని కవితా విశేషాల్ని కూడా వివరించారు. ఉదాహరణకి ఒక కవితా, దాని వివరణా కింది విధంగా ఉంటై.

'ఓ పిరికి నత్తా! సహజంగా నీవు దుర్బలురాలవు, అల్పురాలవు, ఫ్యూజీ పర్వత శిఖరానికి నిదానంగా ప్రాకిరా'.

'నత్త నడక ఆలస్యానికి ప్రతీక. గంటకు గజం నడుస్తుందేమో నత్త. అటువంటి నెమ్మదిగా ప్రాకే నత్తను, హీనమైన నత్తను, బలహీనమైన నత్తను, ఫ్యూజీ పర్వత శిఖరాన్ని అందుకొమ్మని పిలవటం హాస్యాస్పదమే! అయినా అసమర్థులు అసమర్థులుగానే ఉండిపోరాదు. సమర్థతగల పనుల్ని అసమర్థులు కూడా నెరవేర్చాలి....' ఇలా ఎన్నో కవితా వివరణలు, చిత్రవివరణలూ, కళానుభూతిని ఉత్తేజితం చేస్తూ ఉంటై.

అయితే, తాను అనేక ప్రదేశాల్లో ఉపన్యాసాలకు వెళ్ళిన వివరాల్ని వర్ణిస్తున్నప్పుడు,

తన ఉపన్యాస ప్రారంభాల్నీ, శ్రోతల ప్రశంసల్నీ, ముగింపునీ, పదే పదే చెప్పడం పాఠకుని సహనాన్ని పరీక్షిస్తుంది. తన వ్యాసాల్లో భాగాల్నీ, ఉత్తరాల్లో ప్రశంసల భాగాల్నీ ఉదహరించడం జరుగుతుంది. ఉదాహరణకి తాను రచించిన 'రసరేఖలు' పై వచ్చిన ఉత్తరాల్ని గూర్చి చెప్పారు.

'రసరేఖలు – చదివిన పాఠకులు ఉత్తరాలు వ్రాయసనారంభించారు. ఆ వ్యాసాల్లో 'హిమాలయాల్లో ఒక రోజు' ఎక్కువ బాగున్నదని ఒకరు వ్రాస్తే, 'రస దృష్టి' బాగున్నదని మరొకరు వ్రాశారు. 'కళామర్మజ్ఞత' బాగుందని ఒకరు వ్రాస్తే 'ప్రపంచభాష ఎస్పరాంటో' బాగున్నదని ఇంకొకరు. 'కథకాదు' బాగుందని ఒకరు రాస్తే 'రూపశ్రీ' బాగుందని మరొకరు. విశేషమేమంటే ఏదీ బాగుండలేదని ఎవరూ వ్రాయలేదు. అన్నీ బాగున్నాయని వ్రాసినవారు మాత్రం కొందరున్నారు'.

ఇలాంటి ఉత్తరాలుగానీ ప్రశంసలు గానీ మంచి రచయితకి సాధారణమైన విషయమే. ఎక్కడైనా వేరొక ప్రయోజనం కోసం ఇలాంటివి ఉదహరిస్తే, పాఠకుని మనస్సు దాన్ని గూర్చి ప్రత్యేకంగా ఆలోచించదుగాని, మళ్ళీ మళ్ళీ చాలాసార్లు వస్తుంటే ఆలోచనకలుగుతుంది. అన్ని స్మృతుల్నీ ఉన్నవి ఉన్నట్లు చెప్పాలనే రచయిత ఉద్దేశాన్ని గ్రహించినప్పటికీ, కొంత 'ఆత్మ ప్రాధాన్య' భావం ఉందనిపిస్తుంది. ఇది అహంకారం ఏమాత్రం కాదు. తనను గూర్చిన స్పృహమాత్రమే అనిపిస్తుంది.

మూడు సంపుటాల్లోనూ, మరీ ముఖ్యంగా, రెండవ మూడవ సంపుటాల్లో సంజీవదేవ్ కళల్ని గూర్చి, జీవితాన్ని గూర్చి, ఆలోచనలు అడుగడుగునా పాఠకుణ్ణి చైతన్యవంతం చేస్తూ ఉంటై. రోడ్డు మీద నడిచేవాడికి దగ్గర దగ్గరలో పూలతోటలు కనిపించినట్లుగా మనస్సుకి విశ్రాంతినిస్తై. మామూలు సంఘటనలు రాస్తున్నప్పుడు, ఏమాత్రం బరువులేకుండా, భాషలోనూ వర్ణనలోనూ వాస్తవికతను ప్రధానం చేసుకున్న సంజీవదేవ్ తన ఆలోచనల్ని చెప్తున్నప్పుడు ఒక ప్రత్యేక శైలిని నిర్మించుకున్నారు. 'ఇది సంజీవదేవ్ శైలి' అని గుర్తించబడడం దాని ప్రత్యేకత. ఒకే పదాన్నీ, ఒకే భావాన్నీ తిప్పి తిప్పి అనేక విధాలుగా వాక్యాన్ని నిర్మించడం, ఒక భావాన్ని చెప్పి, దాన్ని వ్యతిరేకించే భావాన్ని వెంటనే, రెండింటి సమన్వయాన్ని చెప్తూ, మళ్ళీ అలాగే ప్రస్తావిస్తూ పోవడం, అనే లక్షణాలు ఆయన శైలికి స్వీయ ముద్రని సంతరించుకున్నై. ఉదాహరణకి·

'అక్షరం అంటే నశించనిది. సాహిత్యం అక్షరాల రచన కనుక అది అమర రచన. సాహిత్య రచన మౌలికంగాని అనువాదంగానీ, ఆత్మాభివ్యక్తికి మహా సాధనాల్లో మొదటిది. కొందరు రాయడం నిమిత్తం ఒక విషయ వస్తువును ఎన్నుకొంటారు'.

మరికొందరికి ఏదో ఒక విషయ వస్తువు నచ్చినందువల్ల వ్రాయడానికి ఉపయుక్తు లౌతారు. రచయితకు మౌలిక రచనలు చేయడంలో సంతోషం దొరికినట్టే, అనువాదకులకు అనువాదం చేయడంలో సంతోషం దొరుకుతుంది. మౌలిక రచయితకు, తాను రచించే ఒక భాషలో ప్రతిభ ఉంటే చాలు. కాని అనువాదకర్తకు రెండు భాషల్లోనూ ప్రతిభ ఉండాలి'.

ఇలా వైరుధ్యాలతో కూడిన భావాల్ని, సమన్వయంతో కూడిన భావల్నీ ప్రక్క ప్రక్కనే లయబద్ధంగా విశ్లేషిస్తూ పోవడం, చిన్న చిన్న వాక్యాల్ని చమత్కారంగా కొనసాగిస్తూ రాయడం, ఆయన సృష్టించుకున్న ఒక శైలి. అక్కడక్కడ ఇదే శైలి లోతులేని విషయానికి కూడా ప్రయోగించడం చేత గాంభీర్యాన్ని తగ్గించిన తావులు కూడా ఉంట్టై. అంతగా ఇలాంటి శైలిని సొంతం చేసుకున్నారు సంజీవదేవ్.

అసాధారణమైన ఉద్వేగాల్నీ, ఉత్తేజాల్నీ ఎక్కువగా కలిగించకపోవచ్చు; అత్యవసరమైన సందేశాన్నీ, సంఘర్షణలనీ లక్ష్యంగా పెట్టకోకపోవచ్చు; కాని, ఒక అసాధారణమైన ఆలోచనాపరుడు, రసైక జీవి, తన జీవతంలోని ప్రతి సాధారణ సన్నివేశాన్నీ అసాధారణం చెయ్యాలనే అన్వేషణ సంజీవదేవ్ ఆత్మకథలోని బలమైన అంశం. ఇదే ఆయన స్వీయ చరిత్రకి ప్రత్యేకమైన ఆకర్షణ.

(రచయిత – డాక్టర్ అద్దేపల్లి రామమోహనరావు, ఎం.ఎస్.ఎన్. డిగ్రీ కళాశాల, కాకినాడలో తెలుగు శాఖాధిపతిగా పనిచేసి, పదవీ విరమణ చేశారు.)

# సంజీవదేవ్ శాస్త్రీయ ఆలోచన

*– డాక్టర్ మైనేని కేశవ దుర్గాప్రసాద్*

వర్తమాన జగత్తులో మనకు తారసపడే అతికొద్ది మంది బహుముఖ ప్రజ్ఞాశాలురలో సంజీవదేవ్ ఒకరు. ఆయన కవి పండితుడు, బహుభాషాకోవిదుడు, చిత్రకారుడు, ఛాయా చిత్రకారుడు, కళావిమర్శకుడు, దార్శనికుడు, శాస్త్రీయ సమాలోచనాపరుడు, అన్నిటినీ మించి మానవతను జీవితం నిండా నింపుకొన్న 'మనీషి'.

బాల్యంలో తల్లిని పోగొట్టుకున్న ఆయన జీవితం ఒక రకమైన మానసిక అస్థిరతకు లోనయింది. అది ఆయనను పదహారవ ఏటనే హిమాలయాలకు నడిపించింది. ఆయన సంచార జీవితంలో తారసపడిన మహనీయులు, మాననీయులు, సుందర ప్రదేశాలు, విభిన్న భాషలలో వివిధ విషయాలను చర్చించిన గ్రంథాలు, ఆయన వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దాయి. సంజీవదేవ్ జీవనాన్ని, రచనలను స్థూలంగా పరిశీలించితే, జీవితంలో ఆనందాన్ని పండించుకొన్న రసమయ జీవిగా ఆయన మనకు కనబడతారు. ఆయన జీవితం ఒక రమ్య సజీవ గీతిక. అందులోని ఘట్టాలు వెనువెంట కదలిపోయే రసవర్ణ చిత్రాలు.

## డాక్టర్ సంజీవదేవ్ : తత్వం

ఆయన రసమయ జీవనాన్ని నిశితంగా పరికిస్తే ఆయన తత్వం మనకు పూర్తిగా ఆవిష్కరింప బడుతుంది. ఆయన ఆలోచన ఒక పరిణామానికి లోనై, క్రమాన్ని, పరిపూర్ణతను సాధించు కొన్నదనిపిస్తుంది. ప్రకృతి అందాలను, అనంతమైన మధుర రాగాలను, సుమధుర

భావాలను ఆస్వాదించడానికి ఆలవాలమ్మైన ఆయన ప్రకృతి, ఆ తరువాత కాలాలలో 'సత్యాన్వేషణ'కు పూనుకొంది. అది ఆయనకు హేతువు సాయంతో సుందరాన్ని అన్వేషించే నైజాన్ని నేర్పింది.

వసుమతి అనే రచయిత్రికి రాసిన లేఖలో ఆయన ఇలా అంటారు (లేఖల్లో సంజీవదేవ్ పుట 124) ---- రెండోది సృజనాత్మక ధృక్పథం, ఒకటి విశ్లేషణాత్మకం, అంటే విభజించి చూస్తుంది. రెండోది సంశ్లేషణాత్మకం అంటే సమన్వయ పరచి చూస్తుంది. మొదటిది జ్ఞానాన్నిస్తుంది. రెండోది ఆనందాన్నిస్తుంది. ఒక సుందరమ్మైన మానవ ముఖం గోచరిస్తుంది అనుకోండి. దాన్ని వైజ్ఞానిక దృష్టితో పరిశీలిస్తే ఆ ముఖంలో సౌందర్యం ఏమీ తట్టదు. ఎముకలు, మాంసం, రక్తం, క్రొవ్వు, నరాలు వీటి కూడిక మాత్రం అనే తెలుస్తుంది. కాని ఆ ముఖాన్నే రసదృష్టితో తిలకిస్తే, అదో కమనీయ కమలంగా, ఓ చంద్రబింబంగా, ఎంతో ప్రియంగా, ఎంతో ఆకర్షణీయంగా గోచరిస్తుంది. మొదటి దశ నగ్న సత్యాన్ని తెలియజేస్తుంది. రెండో దశ రసమయ సౌందర్యాన్ని తెలుపుతుంది. రెండూ కూడ మానవ జీవితానికి సమానంగా అవసరమే. 'సత్యం' అవసరమే. 'సుందరం' అవసరమే 'సత్యం' 'సుందరం' ఉంటేనే మూడవద్దైన 'శివం' ఉద్భవించేది. సత్యం, శివం, సుందరం ఈ మూడిటి త్రివేణి, సక్రమంగా ప్రవహించితేనే కాని జీవితం పూర్ణంగా వికసించదు. 'సత్యం' అనేది విజ్ఞానాన్ని, శివం అనేది శ్రేయాన్ని, సుందరం అనేది రసానందాన్ని ప్రసాదిస్తుంది. ఈ మూడిటిలో ఏది కొరవడినా జీవితం కుంటుతుంది.

ఐతే జీవితంలో తలెత్తే బాధల్ని రూపుమాపేది ఆనందం కనుక మానవులలో ఆనంద దృష్టి ఎంతో అవసరం. ఆనందం లేని విజ్ఞానమూ, శ్రేయం కూడా అడవి కాచిన వెన్నెల మాత్రమే'. జీవితంలో హేతువు (విజ్ఞానము) ప్రాధాన్యతను సంజీవదేవ్ ఆ తరువాత కాలంలో మరింతగా గుర్తించారు. ఆయన వసుమతిగారికి రాసిన మరొక లేఖలో (లేఖల్లో సంజీవదేవ్ పుట 126) ఇలా అన్నారు – 'ఒక ఇంగ్లీషు పత్రికకు ఒక చిన్ని వ్యాసం 'The Truth' అని హేతువాదం పై ఒక వ్యాసం రాస్తున్నాను. నీకు క్రింద రాసిన ఉత్తరంలో సత్యం, శివం, సుందరంలో, సుందరంకు విలువనిస్తూ రాశాను. అది నా వ్యక్తిగత ఇష్టం. ఇక ఈ వ్యాసంలో వ్యక్తిగత ఇష్టాలను అట్టిపెట్టి, వస్తుగత ఇష్టాలకే విలువ నిచ్చి హేతువాదానికి ప్రాధాన్యత నిచ్చి రాస్తున్నాను. అయినా, నీకు ఉత్తరంలో రాశానుగదూ. సత్యం, శివం, సుందరం మూడు కూడా సమానంగా త్రివేణియై ప్రవహిస్తేనే కాని జీవితం సమగ్రంగా వికసించదని, సత్యం సుందరంల మధ్య డోలాయమాన స్థితిలో ఊగిసలాడిన ఆయన మనసు ఆ తరువాత కాలంలో స్థిరపడి ఆయనకు ఒక విశిష్ట తత్వాన్ని, వ్యక్తిత్వాన్ని కలిగించింది.

ఆయన తపస్విగారికి రాసిన ఒక లేఖలో (లేఖల్లో సంజీవదేవ్ పుట 252-253) ఇలా అంటారు – 'నేను మర్మవాదినా (Mystic) అని అడిగేరు మీరు. లేదు. నేను నాస్తికుణ్ణి కాను. ఆస్తికుణ్ణి కాను. మర్మవాదిని కాను. నాలోని ఊర్ధ్వ చేతనను అందుకునే ఆరోహక పథంలో నేనొక పథికుణ్ణి మాత్రమే. మానవుని అంతర్జగత్తులో దాగి ఉంటాయి. అచేతన (Unconscious), అవచేతన (Subconscious), చేతన (Conscious), ఊర్ధ్వచేతన (Super Conscious), ఊర్ధ్వచేతన అనేది నీడలేని మహా తేజస్సు. విషాదం లేని విశుద్ధానందం, నా ఊర్ధ్వ చేతనకు ఆస్తిక, నాస్తిక, మార్మిక వాదాలతో ఏమీ పనిలేదు. నా ఊర్ధ్వచేతన, హేతువు ఆనందం రెంటినీ కలిగి ఉంటుంది. అది సగం రసమయం, సగం హేతుమయం (Semi aesthetic and Semi rational). ఆయన 'వ్యక్తిత్వం' రసమయతత్వంలో 'సత్యాన్ని' రంగరించుకొని ఒక వినూత్న తత్వంగా భాసిల్లింది. ఇందులో ఆనందంతో పాటు విజ్ఞానముంది. సృజనాత్మకతను వెంటాడే శాస్త్రీయ శోధన ఉంది. భావుకతకు జోడించిన వాస్తవాన్వేషణ ఉంది. ఇలా ఆయన ప్రవృత్తిలో అంతర్లీనమై శాస్త్రీయ ఆలోచనలు ఉన్నాయి.

## శాస్త్రీయ ఆలోచన

డాక్టర్ సంజీవదేవ్ శాస్త్రీయ ఆలోచనలను ఏకరువు పెట్టేముందు అసలు 'శాస్త్రీయ దృక్పథం' అంటే ఏమిటో తెలుసుకోవాలి. శాస్త్రీయ దృక్పథం అంటే ఏ విషయానికైనా అసలు కారణం (హేతువు) తెలుసుకోవడం. ఎందుకు? ఏమిటి? అని ప్రశ్నించి, ఏది జరుగుతుందో, ఏది జరగదో గ్రహించడం. అవాస్తవాలను ఖండించడం, వాస్తవాలను వెలికిదీయడం. శాస్త్ర జ్ఞానం సందేహాలకు తావులేని విధంగా జవాబునివ్వాలి. శాస్త్రీయ ఆలోచనలు కేవలం ప్రకృతికి సంబంధించిన విషయాలుగానే కాక సమాజానికి సంబంధించిన అసలు కారణాలుగాకూడా ఉంటాయి. శాస్త్రీయ ఆలోచనలు, ఈ జగత్తు, సృష్టిలో నిర్మాణానికి మూలాన్ని అన్వేషిస్తాయి. వీటికి సంబంధించిన సమాచారాన్ని విశ్లేషిస్తాయి. విశ్వాంతరాళంలోని నక్షత్ర లోకాల సృష్టి, పరిణామానికి కారణాలు తెలుసుకుంటాయి. వాస్తవాలు విశదీకరిస్తాయి ఇవి భూమిలో జీవ ఆవిర్భావం, పరిణామ ప్రక్రియ, స్థూల లోకాల్లో పనిచేస్తున్న బలాలు, సూక్ష్మలోకాల్లో పనిచేస్తున్న బాలలు ఇంకా మనిషికి ప్రకృతి శక్తులకు, మనిషికి-సమాజానికి గల సంబంధాన్ని విశ్లేషిస్తాయి. ఒక్క వాక్యంలో చెప్పాలంటే ఇంద్రియాల ద్వారా సేకరించిన హేతుబద్ధమైన సమాచారాన్ని విశ్లేషించి దానికి 'శాస్త్రీయ నిబద్ధతను' సమకూర్చడమే శాస్త్రీయ ఆలోచనల ముఖ్య లక్ష్యం.

# సంజీవదేవ్- శాస్త్రీయ ఆలోచన

శాస్త్రీయ విషయాలపట్ల సంజీవదేవ్‌కు ఆసక్తి ఉండటమే కాదు, ఆయన ప్రతి వ్యక్తి జీవితంలో అంతో ఇంతో శాస్త్రీయ పరిజ్ఞానం ఉండాలి అంటారు. ఆయన లక్ష్మిగారికి రాసిన లేఖలో (రేఖా స్రవంతి : పుట 30) ఈ విషయాన్ని ముచ్చటిస్తారు. 'గులాబి చెట్టు గులాబి పూలను మాత్రమే పూస్తుంది. మల్లెపూలను ఎందుకు పూయదు? లేడి, లేడిపిల్లను మాత్రమే ఎందుకు కంటుంది. కుక్కపిల్లను ఎందుకు కనదు?' అని ఎవరైనా ప్రశ్నిస్తే ఆ వ్యక్తిని పిచ్చివాడని భావిస్తాము! కాని వృక్షశాస్త్రజ్ఞునికి తెలుసు గులాబి చెట్టుకు గులాబి పూలు మాత్రమే ఎందుకు పూస్తుందో, జంతు శాస్త్రజ్ఞునికి తెలుసు లేడి, లేడి పిల్లలని మాత్రమే ఎందుకు కంటుందో, అదే విధంగా మనో శాస్త్రవేత్తకు తెలుసు, ఆనందం సుఖాన్ని మాత్రమే ఎందుకు కలిగిస్తుందో. వీటిని విశదీకరించడానికి శాస్త్రజ్ఞానం పూర్తిగా కావాలి. వీటిని తెలుసుకోవడానికి శాస్త్రజ్ఞానం పూర్తిగా కాకపోయినా, కొంతవరకైనా కావాలి.

శాస్త్రీయ పరిజ్ఞానంతో మార్పులు సంతరించుకొని, ఆధునికతను అక్కున చేర్చుకొన్న సాహిత్యం, చిత్రకళ, శిల్పం, సంగీతం పట్ల సంయమనం పాటించాలని, మార్పులను ఆహ్వానించాలని సంజీవదేవ్ భావిస్తారు. మోహనరావుగారితో ఈ విషయాన్ని చర్చిస్తూ ఆయన (లేఖల్లో సంజీవదేవ్ : పుట 232) ఇలా అంటారు – 'రొమాంటిక్ భావాన్ని అభివ్యక్తం చేయజాలని ఆధునిక సాహిత్యాన్ని ఎవరూ నిందించరాదు. జీవితంలో మనము ఆధునిక సౌకర్యాలనన్నింటిని ఉపయోగించుకొంటున్నాము. ఆధునిక జీవితానికి ఎగ్జిస్టెన్షియలిస్టు తత్వానికి, అచేతనకు సంబంధించిన ఆధునిక మనోవిజ్ఞానానికి ప్రతిబింబమే ఆధునిక సాహిత్యము. కనుక, ఆధునిక సాహిత్యం ఎడల గాని, ఆధునిక చిత్రకళ, ఆధునిక శిల్పం, ఆధునిక సంగీతం, ఆధునిక నాట్యం, ఆధునిక వాస్తునిర్మాణం మొదలైన వాటి ఎడల మనకు ప్రతికూల భావం అవసరం లేదు. ఆధునిక విజ్ఞానము (Science) స్థూలత్వాన్నించి సూక్ష్మత్వంలోకి రూపాంతరం పొందుతున్నట్లే, ఆధునిక కళలు కూడా స్థూలత్వాన్నించి సూక్ష్మ తత్వంలోకి రూపాంతరం చెందుతున్నవి. మనం నివసిస్తున్నది పరమాణు యుగంలో, కనుక దీనికి సరిపోవు నవ్య జీవన విధానంతో, నవ్యత, ఆత్మాభివ్యక్తంతో (Self expression) మనం ముందుకు సాగాలి. లేనిచో ప్రవాహానికి ఎదురీదటమే అవుతుంది'. సంజీవదేవ్ అభివ్యక్తం చేసిన ఈ ఆలోచన డార్విన్ ప్రకృతివరణ సిద్ధాంతానికి అనుగుణంగా ఉంది. ప్రకృతిలో వచ్చే మార్పులకు అనుగుణంగా స్పందించే జీవి (Adaptability) ప్రకృతిచే ఎంపిక చేయబడుతుందని (Natural selection) ఆ జీవి ప్రకృతిలో కొనసాగుతుందని (survival) ఆయన చెప్పారు. నవ్యజీవన విధానానికి అనుగుణంగా మారాలన్న సంజీవదేవ్ సూచన, ఈ ప్రకృతివరణ సిద్ధాంత పరిధిలోకే వస్తుంది.

## సంజీవదేవ్: దైవం

ఈ విశ్వానికి మూలం ఎవరు? ఈ జగత్తు ఎలా ఉద్భవించింది? ఈ చరాచర జగత్తు ఎలా పరిణామం చెందింది? అన్నవి మౌలిక ప్రశ్నలుగా కనబడినప్పటికీ, వీటికి జవాబు చెప్పడం క్లిష్టతరమైన పనే! ఆస్తికులు ఈ జగత్తు, ఈ సృష్టి, ఆవిర్భావానికి మూలం 'దైవం' అంటారు. ఈ దైవం విభిన్న రూపాలలో, వివిధ పద్ధతులలో కొలవబడుతుంది. దైవం ఒక 'నమ్మకం' మాత్రమే. అది హేతువుకు అందనిది. శాస్త్రీయంగా సమాధానం చెప్పలేనిది. దైవాన్ని గురించి, దైవ సంబంధిత పూజాక్రతుకాండలను గురించి సంజీవదేవ్‌కు విస్పష్టమైన అభిప్రాయాలున్నాయి.

సంజీవదేవ్ తన పర్యటనలో కాని, ఇతరత్రా కాని ఎక్కడా దైవమందిరాలను దర్శించినట్లు కనబడదు. దైవాంశ సంభూతులమని, మత ప్రతినిధులమని చెప్పుకొన్నవారు ఆయన 'మిత్ర కోటి'లో దర్శనమివ్వరు. అచ్యుతవల్లి గారికి రాసిన లేఖలో ఆయన ఇలా అంటారు (లేఖల్లో సంజీవదేవ్ – పుట · 50) 'ప్రతి మతంలో జ్ఞానకాండ, కర్మకాండ అను రెండు దశల సాధనలుంటవి. నాకు కర్మకాండ నచ్చదు. జ్ఞానకాండ ఇష్టం. ఉపనిషత్ తత్వం నాకు చిరసత్యం. నామ సంకీర్తనలు, భజనలు, దేవాలయ ఉత్సవాలు ఇవన్నీ కొందరికి అవసరం, ఇష్టం కూడా. వీటిని నేను తప్పు అనను. కాని అవి అంతగా అవసరం లేదు. ఇష్టం లేదు'. ఇలా సంజీవదేవ్ దైవం పట్ల మతాలపేరిట జరిగే కర్మకాండల పట్ల చాలా సందర్భాలలో సహేతుకమైన ఆలోచనలు చేశారు. కొన్ని సందర్భాలలో ఆయన తన అభిప్రాయాలను చాలా సూటిగా వ్యక్తీకరించారు.

తన స్వీయ చరిత్రలో ఆయన ఇలా అన్నారు (గతంలోకి : పుట 52) 'మతం, మనిషి మొదలైన వాటిని గురించి కొంత చర్చించుకొన్నాం. నేటి సమాజంలో, ఈ వైజ్ఞానిక యుగంలో, నవభావన స్రవంతి ప్రవహించే ఈ ఇరవయ్యవ శతాబ్దంలో హేతువాదం వికసించడానికి బదులు తిరుపతి భక్తి వికసిస్తున్నందుకు మేము ఉభయులం ఆశ్చర్యపోయాము. సమాజం ముందుకు నడుస్తున్నదా? వెనుకకు నడుస్తున్నదా? అని నిర్ధారించడానికి కూడా వీలులేకుండా ఉన్నది. ముందుకు నడుస్తున్నా ఇటువంటి మూఢత్వం ఉండడానికి వీలు లేదు. పూర్వం ఉపనిషత్తుల కాలంలోకి పోతే, ఆనాటి మతం అనేది, నేటి మతం ఉన్నంత చౌకబారుగా, మూఢత్వంగా హ్రస్వదృష్టితో ఉన్నంతగా లేదు. కనుక నేటి సమాజం ముందుకు పోక పోగా వెనక్కి కూడా పోతున్నట్టు లేదు. ముందు వెనుకకు నడవని ప్రవాహం నిలిచిపోయిన మురికి నీటి మడుగు అవుతుంది'.

మతం పేరిట జరిగే పూజాక్రతువుల పట్ల సంజీవదేవ్ వివిధ సందర్భాలలో తమ

విముఖతను వ్యక్తపరచారు. ఆయన తన సన్నిహితులకు రాసిన లేఖలో (లేఖల్లో సంజీవదేవ్ : పుట 128) ఇలా అన్నారు – 'ఈమధ్య మనింటికి మిత్రుడు వచ్చాడు. స్నానానంతరం తాను పూజ చేసుకొనే నిమిత్తం మన ఇంటి పూజా గృహం ప్రత్యేకంగా ఎక్కడ అని అడిగాడు. నేనన్నాను. మన ఇంటిలో ప్రత్యేకించి పూజ నిమిత్తం వేరే గది ఉండదు. ఇల్లంతా పూజా గృహమే. కనుక మీరు లెట్రిన్‌లో కూర్చుని పూజ చేసుకున్నా ఫరవాలేదు. అదికూడా మనకు సమానమైన పవిత్ర స్థలమే! పూజా స్థలంకాని తావు భూమిపైన కాని, ఆకాశంలో కాని, సాగరాల్లో కానీ ఎక్కడా లేదు. ఈ విశ్వమంతా కూడా ఆ చిరప్రియతమకు పూజాగృహమే' ఆయన కొత్త విషయం తెలుసుకొన్నా నన్నాడు. కృష్ణశాస్త్రిగారు గానం చేసినట్లు 'విశ్వమంతా ప్రాణ విభుని మందిరమయితే... ఇంకా పూజాస్థలం కానిది ఏముంది?'... 'నీవు బహుశ ఆశ్చర్యపోవు అనుకొంటాను. నేను ఇంతవరకు తిరుపతి కొండ ఎక్కలేదు, వెంకటేశుని దర్శించలేదు. నిరుడు వారం రోజులు తిరుపతి విశ్వవిద్యాలయంలో ఉండి కూడా మిత్రులు కొండ మీదకు పోతున్నా కూడా నేను పోలేదు. కొండ మీద ప్రకృతి సుందరంగా ఉంటుందట. దానిని చూడడానికెప్పుడో వెళ్ళాలి. అంతేకాని దేవదర్శనానికి మాత్రం పోను'.

మరొక సందర్భంలో ఆయన ఇలా అన్నారు (లేఖల్లో సంజీవదేవ్: పుట 62), 'లక్ష్మి కూతురు వైదేహి మొన్న ఉత్తరం రాసింది. వారు చేయబోవు కళ్యాణానికి మమ్మందరను రమ్మని ఆహ్వానించింది. నేను జవాబు రాశాను. దేవుడికి పెండ్లి చేసి మానవునిగా మారుస్తున్నారన్నమాట. దేవుడు మానవుడిగా మారటం అంత అవసరమైన పనికాదు. కాని మానవుడు దేవుడిగా మారవలసిన అవసరం ఉన్నది. నేడు కనిపించే మానవులు ఎక్కువగా దానవులే. దానవత్వం నుండి మానవత్వంలోకి, మానవత్వం నుండి దేవత్వంలోకి మారాలి మనిషి'.

మతం పేరిట సాగించే అనాచారాలను మరొక సందర్భంలో సంజీవదేవ్ దుయ్యబట్టారు. తన స్వీయ చరిత్రలో (తెగిన జ్ఞాపకాలు : పుట 82) ఆయన ఇలా చెప్పారు – 'గూడూరు ప్లాట్‌ఫారం మీద స్త్రీలు, పురుషులు చాలామంది బోడితలలవారు కనిపించారు. ఏడుకొండల దైవానికి జుట్టునిచ్చి వస్తున్నారు. దేవుడికి మనుషుల జుట్టుపై ఇంత ప్రీతి ఎందుకా అని ఆశ్చర్యపోయాను!... భర్తలు మరణించిన విధవలకు మాత్రమే హైందవ కుటుంబాలలో జుట్టుతీసే ఆచారం ఉంది. కాని భర్తలున్న వాళ్ళ జుట్టుకూడా ఈ వెంకటేశ్వర స్వామి తీసివేయిస్తున్నాడు'. హేతుబద్ధమైన ఆలోచనలు మనిషి జీవితాన్ని సుఖమయం, జ్యోతిర్మయం చేస్తాయని భావించే సంజీవదేవ్ హేతువాద దృక్పథం ఆలోచన కలిగిస్తుందనీ, అది లేని జీవితం, అంధ జీవితం అవుతుందనీ అంటారు.

## సంజీవదేవ్: మూఢనమ్మకాలు

బాల్యంనుండే సంజీవదేవ్‌ను 'హేతువు' వెన్నంటి ఉంది. ఆయన చిన్నతనంలోనే అనాచారాలపై, మూఢనమ్మకాలపై ధ్వజమెత్తేరు. ఆయనకు 12వ ఏటనే కొన్ని సందేహాలు తలెత్తాయి. (తెగిన జ్ఞాపకాలు . పుట 53) కోనాయపాలెంలో, ఆయన భార్యలుచనిపోయిన భర్తలు పెండ్లి చేసుకోవడం చూశారట. కాని, భర్తలు చనిపోయిన భార్యలు మళ్ళీ పెండ్లి చేసుకోవడం చూడలేదట. ఈ సందేహ నివృత్తి కోసం ఆయన, తన బంధువుని ఆశ్రయించాడు. కొట్లోబాబు అని పిలువబడే ఆయన సంజీవదేవ్‌కు, సహగమనాన్ని గురించి, దానిని రూపుమాపిన రాజారామమోహన రాయ్ గురించి, విధవ వివాహాలను ప్రవేశపెట్టిన ఈశ్వరచంద్ర విద్యాసాగర్ కందుకూరి వీరేశలింగం పంతులుగారి గురించి సవివరంగా తెలిపాడు. ఈ సంస్కరణ వాదాల పట్ల ఆకర్షితుడైన సంజీవదేవ్ తన స్నేహితులతో కలిసి భర్తలేని ఒక ముసలమ్మకు పెండ్లిచేయ పూనుకున్నారట. బాల్యంలోనే ఆయనకు సంస్కరణ వాదాలపట్ల, హేతువాదాలపట్ల ఉన్న అభిలాషను, ఆసక్తిని ఈ సంఘటన ఎత్తిచూపుతుంది.

సంజీవదేవ్ పన్నెండవ ఏటనే పెనుగంచిప్రోలులో జరిగే జాతరకు హాజరయ్యారు. ఆ జాతరలో గ్రామస్తులు తమ గ్రామదేవత తిరుపతమ్మకు కోళ్ళు, మేకలు, గొర్రెలు బలి ఇస్తున్నారు. తెగిన తలల నుండి పారే రక్తం భయంకరంగా ఉంది. ఆ దృశ్యాన్ని చూసిన సంజీవదేవ్ జంతువుల రక్తాన్ని త్రాగే దేవత ఊళ్ళో నేనొక్క ఘడియ కూడా ఉండజాలను బళ్ళు కట్టండి, వెళ్ళిపోదాం అని గోల చేశాడట. తప్పు, దేవతను అలా అనకూడదు అని అక్కడి వాళ్ళు చెప్పినా కూడా వినక 'ప్రాణులను రక్షించే అమ్మవారు నిజమైన అమ్మవారు కాని ప్రాణులను భక్షించేది కూడా అమ్మవారేనా? అమ్మవారు కాదు, రాక్షసి మాత్రమే' అని ఆ ఊరును వదిలిపెట్టారట. (తెగిన జ్ఞాపకాలు, పుట 54), జ్యోతిష్యాలు, హస్తసాముద్రికాల పట్ల సంజీవదేవ్‌కు ఆదరణలేదు. అచ్యుతవల్లిగారికి రాసిన లేఖలో ఈ విషయాన్ని ముచ్చటిస్తూ ఆయన (లేఖల్లో సంజీవదేవ్ పుట 52) ఇలా అంటారు. 'లక్ష్మి అక్క, జ్యోతిశ్శాస్త్రజ్ఞుడిని పరిచయం చేస్తానన్నదా? మనకు ఎందుకు ఆ జ్యోతిష్యాలు? వర్తమాన కాలంలో ఆనందం పొందలేని వాళ్ళకు భవిష్యత్తే సర్వస్వమూ. అలాంటి వాళ్ళకవసరం జ్యోతిష్యాలు, సాముద్రికాలు, వర్తమాన కాలంలో ఆనందం పొందటం నేర్చుకొన్న మనకు అవన్నీ ఎందుకు'.

అశాస్త్రీయమైన విషయాలకు, మూఢనమ్మకాలకు దూరంగా ఉండే సంజీవదేవ్ ప్రకృతి విశ్లేషణ పట్ల అమితమైన ఆసక్తిని ప్రదర్శిస్తారు. ప్రకృతి వైవిధ్యాన్ని, శాస్త్రీయంగా అర్థం చేసుకోవడానికి ఆయన అత్యంత ఆసక్తిని ప్రదర్శిస్తారు. బాల్యంనుండే 'సైన్సు' పట్ల ఆసక్తిని

ప్రదర్శించిన సంజీవదేవ్‌కు జగదీష్ చంద్రబోస్ పట్ల అమితమైన (తెగిన జ్ఞాపకాలు : పుట 67) గౌరవం ఉంది. బోస్ వృక్షాలలోని ప్రాణస్పందన కనుగొన్నాడన్న విషయం సంజీవదేవ్ ను ఆకట్టుకుంది. ఆయన వృక్షశాస్త్రజ్ఞుడు అవ్వాలని, వృక్షాలతో మాట్లాడాలని బాల్యంలో కలలు కనేవారు. దానితో ఆయనకు వృక్షాలపై ఎక్కడలేని ప్రేమ. మొక్కలను, పొలాలను చూస్తే ఎనలేని ఆనందం కలిగేది. చెట్టు నుండి ముఖం కడుక్కొనే పుల్లలు ఎవరన్నా విరుస్తుంటే చెట్టు ఎంత బాధపడుతుందోనని సంజీవదేవ్ ఆవేదన చెందేవారు.

## సంజీవదేవ్- జీవశాస్త్రం

జీవశాస్త్రంలో ప్రకృతి క్రమాన్ని అర్థం చేసుకోవడం కోసం పరిణామాన్ని దృష్టిలో ఉంచుకొని జంతుజాలాన్ని, చెట్లు చేమలను వివిధ స్థాయిలలో వర్గీకరిస్తారు. ఈ వర్గీకరణాన్ని చెప్పే 'సైన్సును' వర్గీకరణ శాస్త్రం (Taxonomy) అంటారు. వర్గీకరణ శాస్త్రం, జంతువుల, వృక్షాల బాహ్యరూపం పై (External Morphology) ఎక్కువ ఆధారపడి ఉంటుంది. అరిస్టాటిల్ నుండి డార్విన్ వరకు అందరూ ప్రకృతిని నిశితంగా పరిశీలించి, వాటిలోని వైవిధ్యాన్ని (Variation) చాటి చెప్పినవారే. వీరిని ప్రకృతి శోధకులు (Naturalists) అంటారు. సంజీవదేవ్‌కు చెట్లను, జంతువులను పరిశీలించడం, వాటి నిర్మాణ విశేషాలను, వైవిధ్యాలను గుర్తించడంలో ఆసక్తి ఉంది. ఆయనకు జీవం, జీవపరిణామం పట్ల ఆసక్తి ఉంది. వీటిని తనదైన ధోరణిలో ఆయన అనేక సందర్భాలలో వివరిస్తారు.

జీవాన్ని (Life) గురించి వివరిస్తూ (Biosymphony : పుట 73) ఆయన జీవం భౌతికతలంపై నిలచి, జీవతలంపై జీవించి, మానసిక తలంపై స్పందిస్తున్నదంటారు. నిరేంద్రియ పదార్థాలు (Minerals) మొక్కలు (Plants), జంతువులు (Animals) వరుసగా పైన పేర్కొన్న మూడు తలాలకు చెందినవని ఆయన భావన. జీవ పరిణామాన్ని విశ్లేషిస్తూ (Biosymphony : పుట 73-75) ఆయన ఇలా అంటారు. 'జంతువులు ఐదు వందల మిలియను సంవత్సరాల క్రితం భూమిపై విలసిల్లాయి. ప్రాథమిక జీవులుగా (Protozoans) సూక్ష్మాతి సూక్ష్మంగా ప్రాదుర్భవించిన ఈ జీవులు, వివిధ జంతుజాలాలకు, మనిషికి పూర్వీకులు! ఈ ఏకకణ జీవుల నుండి జంతువులు ఆవిర్భావం చెందితే ఈ జంతువుల నుండి మానవుడు ఏర్పడ్డాడు. ప్రోటోజోవాలు పరిణామం చెంది వివిధ క్రిముల (Worms) రూపాల ద్వారా 380 మిలియను సంవత్సరాల క్రితం మత్స్య రూపాలను పొందాయి. చేపలు నీళ్ళలో మాత్రమే జీవిస్తాయి. వీటినుండి, ఆతరువాత కాలాలలో సంభవించిన మార్పుల వలన ఉభయచరాలు భూమిపై అవతరించాయి. ఇవి నేలపైన, నీటిపైన జీవించగలవు. వీటికి ఉదాహరణ మండూకాలు. ఆ తరువాతి కాలంలో, 210 మిలియను

సంవత్సరాల క్రితం సరీసృపాలు భూమిపైన ఉదయించాయి. సరీసృపాలకు ఉదాహరణలు పాములు, బల్లులు, మొసళ్ళు, ఈ కాలంలో ప్రోటోజోవన్‌లు అత్యల్ప పరిమాణాన్ని కలిగిన జీవులైతే, డైనోసారులు అని పిలవబడే సరీసృపాలు అత్యంత పెద్దవిగా, పర్వతాకారాన్ని కలిగిన జంతువులుగా ఉండేవి. ఈ డైనోసారులు 65 మిలియను సంవత్సరాల క్రితం మీసోజాయిక్ యుగం (Mesozoic) లో ఉండేవి. ఈ మీసోజాయిక్ యుగంలోనే, టెర్షియరీ కాలంలో టెధిస్‌సముద్రం నుండి హిమాలయాలు ఏర్పడ్డాయి. ఇవి ఉత్తరాన ఉన్న అంగారా భూమిని, దక్షిణాన ఉన్న గోండ్వానా భూమిని వేరు చేశాయి.

సరీసృపాలు తమ సంతానాన్ని 'గుడ్ల' ద్వారా కంటాయి. వీటిలో పిల్లలకు స్తన్యం ద్వారా పాలిచ్చి పోషించే పద్ధతి లేదు. 65 మిలియను సంవత్సరాల క్రితం, టెర్షియరి కాలంలో స్తన్యజీవులు ఏర్పడ్డాయి. ఈ స్తన్యజీవులు సరీసృపాలవలె కాక, తమ సంతానాన్ని గర్భసంచి ద్వారా కంటాయి. పిల్లలకు స్తన్యం ద్వారా పాలిచ్చి పెంచుతాయి. ఈ స్తన్యజీవుల ఆవిర్భావం వలన సరీసృపాలు సమూలంగా అంతరించిపోలేదు. ఒకదాని నుండి మరొకటి ఏర్పడటం అంటే ఒకటి నశించి మరొకటి ఏర్పడడం కాదు. సరీసృపాలు, స్తన్యజీవులు అప్పుడు, ఇప్పుడు కూడా కలిసి సహజీవనం సాగిస్తున్నాయి.

ఆ తరువాతి కాలంలో అంటే మియోసిన్ కాలంలో, 25 మిలియను సంవత్సరాల క్రితం ఏప్‌లు (Apes) ఉద్భవించాయి. వీటిని ఆంథ్రోపాయిడ్ ఏప్ లంటారు. ప్లియోసిన్ (Pleocine) కాలంలో, మూడు మిలియన్‌సంవత్సరాల క్రితం కోతి మానవులు (Submen) ఏర్పడ్డారు. 'చెట్లు జంతువులు' అన్న వ్యాసంలో (కాంతిమయి : పుట 119-127) సంజీవదేవ్ చెట్లకు జంతువులకు మధ్య ఉన్న సారూప్య, వైవిధ్యాలను వివరిస్తారు. జీవశాస్త్రంలో ప్రాధమిక వర్గీకరణ సూత్రాలైన బాహ్యారూప వర్ణన (External Morphology) వైవిధ్యం (Variation) స్వభావం (Ethology) లాటి విషయాలను ఆధారంగా చేసుకొని సాగిన ఈ రచనలలో రసమయ తత్వంలో 'వైజ్ఞానికం' దోబూచులాడుతుంది. జీవ వర్గీకరణ శాస్త్రం పట్ల ఉన్న దృక్పథాన్ని గురించి ఆయన జీవితంలోని ఒక సంఘటన వివరిస్తుంది (తెగిన జ్ఞాపకాలు . పుట 47) సంజీవదేవ్ తన చిన్నతనంలో, కృష్ణానది సమీపంలో, సాయం సమయంలో, వసంత ఋతువులో, మోదుగు చెట్లను చూశారట. ఆకులు రాలిన మోదుగు చెట్లన్ని ఎర్రటి పూలతో, అరణ్యం మంటలతో మండిపోతున్నట్లు అనిపించిందట. ఈ మోదుగ చెట్లను పాఠకులకు బాగా తెలిసే విధంగా పరిచయం చేయాలి. అందుకు సంజీవదేవ్ ముందుగా ఇంగ్లీషులో వాటిని Flame of the Forest అంటారని తెలిపారు. దానితో ఆయన సంతృప్తి చెందినట్లు లేదు! ఆ చెట్టు యొక్క శాస్త్రీయ నామం Butea frontosa అని పేర్కొంటారు. వర్గీకరణ శాస్త్రం విలువ తెలిసిన వారే ఈ విధంగా వృక్షజాతులను పరిచయం

చేస్తారు. తాను చెప్పదలుచుకొన్న దానిని వైజ్ఞానికంగా, ఎదుటివారు అర్థం చేసుకోడానికి ఎలాంటి ఇబ్బంది పడకుండా చెప్పడానికి సంజీవదేవ్ఎంతో తపన పడ్డారనడానికి ఈ విషయాన్ని ఒక ఉదాహరణగా చెప్పవచ్చు. అంతేకాదు. వృక్షజాతుల ఆవిర్భావం, పరిణామం, వాటిలో రకాలను గూర్చి (Biosymphony : పుట 58) సైతం ఆయన తనకు తెలిసిన విషయలను సరళంగా విపులీకరించారు.

జంతుశాస్త్రంలో ప్రత్యేక విభాగంగా రూపొందిన స్వభావ శాస్త్రం (Ethology) ఆయనకు అభిమాన విషయం. జంతువుల స్వభావాలను పరిశీలించడం, వాటిని వైజ్ఞానిక రీతులలో విశ్లేషించడం ఈ శాస్త్ర లక్ష్యం. సంజీవదేవ్ తన పరిసరాలలో, పర్యటనలలో తారసపడే జంతుజాలాన్ని నిశితంగా పరిశీలించారు. వాటి స్వభావాలను విశ్లేషించారు. జూలోని జంతువులను చూడటం ఆయనకు సరదా (తెగిన జ్ఞాపకాలు : పుట 85), కోతులు 'ఉయ్యాల లూగడం, ఒకదాని పేలు మరొకటి చూడడం, గిచ్చడం, గిల్లడం, కొరకడం, మనుషుల వైపు చూచి పళ్ళికిలించడం మొదలైనవన్నీ' పరికించి, ఆ విషయాలను ముచ్చటించడం ఆయనకు సరదా. ఆయన స్వీయ చరిత్రలో మనకు ఇలాంటి విశేషాలు అక్కడక్కడా దర్శనమిస్తాయి.

## సంజీవదేవ్- శరీర నిర్మాణ శాస్త్రం

మానవ శరీరం, మెదడు, వాటి నిర్మాణాలు అవి పనిచేసే తీరుతెన్నుల గురించి సంజీవదేవ్ తన పుస్తకాలలో విశ్లేషించారు (Biosymphony . పుట 75-76), మెదడులో 1200 కోట్ల నాడీ కణాలుంటాయని, ప్రపంచంలో మెదడుకు మించిన సంక్లిష్టమైన, సునిశితమైన, శక్తివంతమైన నిర్మాణం లేదని, అది అనుభూతులు, ఆలోచనలు కోరికలకు మూల స్థావరంగా ఉండటమే కాక, భౌతిక శరీరాన్ని, శరీరంలో జరిగే జీవ రసాయనిక చర్యలను అదుపు చేస్తుందని ఆయన చెబుతారు. మనసు మెదడు అన్న పదాలు ఒకటి కావని, మెదడు 'భౌతిక'మైనదని మనసు 'మానసిక'మైనదని, మెదడు నిర్మాణమైతే అది చేపట్టే కార్యక్రం మనసు అని ఆయన పేర్కొంటారు. మానవ శరీర నిర్మాణం దానిలో వివిధ భాగాల పని తీరుతెన్నులు ఆలోచనకు స్థావరమైన మెదడు దాని వైశిష్ట్యాలను గూర్చిన ప్రాథమిక విజ్ఞానంపై సంజీవదేవ్కు మంచి అవగాహన ఉంది.

## డాక్టర్ సంజీవదేవ్- శిల్పకళ

శిల్పకళకు వాడే పదార్థాలకే కాక శిల్ప నిర్మాణంలో ఉపయోగించే శాస్త్రీయ పద్ధతులపై ఆయనకు అవగాహన ఉంది. 'భారతీయ శిల్ప నిర్మాణానికి 'తాలమానం' అనే నియమం

ప్రధానం. ఇది శిల్పం తలను పెట్టి కొలచి విగ్రహాన్ని నిర్మించే విధానం. మామూలు మనిషి నిర్మాణంలో అష్టతాలమానం ఉపయోగిస్తే, దేవతామూర్తుల నిర్మాణానికి దశతాలమానం ఉపయోగిస్తారు. అంటే ఒక మనిషి తల ఏ కొలతలో ఉంటే, ఆ కొలతకు 8 రెట్లు కలిపి మిగతా శరీర నిర్మాణం అష్టతాలమానం అవుతుంది. 10 రెట్లు కలిపితే దశ తాలమానం అవుతుంది (రూపదర్శిని : పుట 34). గ్రీస్‌లాంటి దేశాలలో శిల్ప నిర్మాణంలో భావ సౌందర్యం కంటే రూపసౌందర్యానికే ప్రాధాన్యతనిచ్చేవారట. అందువల్ల, వారు అనాటమీ పాటించి శిల్ప నిర్మాణం చేసేవారట. కాని ఇతరులు భావ సౌందర్యం అభివ్యక్తపరచటం ప్రధానంగా భావించి అనాటమీని లెక్కచేయక రూపాన్ని విరూప పరచటం ద్వారా భావ సౌందర్యాన్ని సృష్టించేవారు. ఇలా శిల్ప కళారీతులు, వాటి చారిత్రక పరిణామం, సంప్రదాయాలను గూర్చిన సహేతుకమైన వివరణలను సంజీవదేవ్ తన రూపదర్శిని, రసరేఖలు లాటి పుస్తకాలలో పొందుపరచారు.

## డాక్టర్‌సంజీవదేవ్- ఛాయా చిత్రకళ

సంజీవదేవ్‌కు ఛాయా చిత్రకళలో మంచి ప్రవేశముంది. ఆయన ఫోటోలను రమ్యంగా తీయడమే గాక వాటికి సాంకేతికంగా కూడా ఉన్నత స్థాయిలో తీయడానికి యత్నించేవారు. విఖ్యాత ఛాయా చిత్రకారులతో సంజీవదేవ్‌కు పరిచయం ఉంది. ఆయన ఛాయాగ్రహణ కళను (రసరేఖలు : పుట 234) విశ్లేషిస్తూ ఇలా అంటారు 'జరుగుతున్న దృశ్యాలను, పాడుతున్న పాటలకు, ఆడుతున్న నటీనటకులను చిత్రించాలంటే చేతితో రచించే కళకు చాలకుండ ఉండేది. అందువల్లనే కెమేరా అనే యాంత్రిక సాధనమొకటి అస్తిత్వంలోకొచ్చింది'.

ఛాయా చిత్రకళ శైశవ దశనుండి ఈనాటికి ఎలా అభివృద్ధి చెందిందో చెబుతూ సంజీవదేవ్ ఇలా అంటారు 'లెన్స్‌మధ్యలో ఉండే షట్టర్ వేగం సెకండులో 500ల వంతు. ఐతే, లీకా లాంటి మీనియేచర్ కెమేరాలకుండే ఫోకల్ స్పేస్ షట్టర్ వేగం సెకండులో 1000 వంతు. కాంటాక్స్ కెమేరా షట్టర్ వేగం సెకండులో 1250వ వంతు. ఇప్పుడు కొత్తగా వచ్చిన స్వీడన్ దేశపు రిఫ్లెక్స్ కెమేరా 'హెసెల్‌బ్లాడ్ యొక్క షట్టర్ వేగం సెకండులో 1600 వంతు. ఇక, ఈ మధ్య ఫ్రాన్స్‌లో నిర్మితమైన అల్సా పైక్సు అనే మీనియేచర్ కెమేరా షట్టర్ వేగం సెకండులో 2400 వంతు. అంటే ఈ వేగాల ముందు ప్రకృతిలో ఎంత వేగంగా కదిలే వస్తువైనా ఫిలిం మీద కదలకుండా పడుతుందన్నమాట. దీనికితోడు లెన్సుల వేగం కూడా ఎన్నో రెట్లు హెచ్చిపోయింది. నేటి ఫోటోగ్రఫీ ప్రపంచంలో వేగవంతమైన లెన్సును సృష్టించింది జపాన్. వేగవంతమైన 1.4 లెన్సు, కొత్తగా వచ్చిన జపాను వారి మీనియేచర్ కెమేరా 'నికాన్ అనే దానికున్నది'.

సంజీవదేవ్‌కు కెమేరాలను గురించే కాక ఫొటోగ్రఫీ తీయడంలోని మెళకువలను గురించి సైతం బాగా తెలుసు. ఆయన అంటారు 'బొమ్మను తీసేది కెమేరా కాదు. కెమేరా వెనుక ఉండే మనిషి అనడంలో సందేహం లేదు. అందువల్ల యంత్రాన్ని, మనిషి తన అభిరుచి ననుసరించి, సవరించి ఉపయోగించుకోవచ్చు. ఉదాహరణకు 5 అడుగుల దూరంలో ఉన్న ఒక పూలచెట్టును మనం ఫోటో తీయాలనుకుంటాం. ఆ చెట్టు మాత్రమే స్ఫుటంగా బొమ్మలోకొచ్చి దాని వెనుక ఉన్న అనవసరమైన పొదలన్నీ ప్రస్ఫుటంగా లేకుండా ఉంటే బాగుంటుంది. అంటే, ఆచెట్టు వరకే ఫోకస్ చేసి వెనుక భాగాన్ని ఫోకస్‌లో లేకుండా చేయాలి. ఇందుకు లెన్సును 5 అడుగుల మీదకు త్రిప్పి డయాఫ్రంను చిన్న సంఖ్య అంటే ఎక్కువ వెడల్పుగా తెరచి ఉంచితే, ఆ పూలచెట్టు తప్ప మిగతా వెనుక భాగం ఫోకస్‌లో లేకుండాపోయి, ఒక్క పూలచెట్టుకు మాత్రమే ప్రాముఖ్యత వస్తుంది. ఈ పద్ధతినే డిఫరెన్షియల్ ఫోకసింగ్ అంటారు'.

ఫొటోగ్రఫీలో మంచి ప్రవేశమున్న సంజీవదేవ్ ఛాయా చిత్రకళపై గుంటూరు, కాకినాడ లాంటి పట్టణాలలో కెమేరా క్లబ్‌సభ్యుల నుద్దేశించి ప్రసంగించారు. ఆయన హైదరాబాద్‌లో జరిగిన అంతర్జాతీయ ఫొటోగ్రఫీ పోటీలకు జడ్జిగా ఉన్నారు. మిత్రులకు రాసే ఉత్తరాలలో సైతం ఫొటోగ్రఫీకి సంబంధించిన సాంకేతిక విషయాలను ఆయన సుదీర్ఘంగా చర్చించారు.

ప్రసాదరావు గారికి రాసిన ఒక లేఖలో ఆయన ఫొటోగ్రఫీలోని కొన్ని సాంకేతిక విషయాలను చర్చించారు. (లేఖల్లో సంజీవదేవ్ · పుట 183). 'స్వీడన్‌లో శ్రీమతి Anna Marie Gripman అనే నాకో మిత్రురాలు ఉంది. ఆమె జగత్ ప్రసిద్ధి శిశు ఫొటోగ్రాఫర్ ఆమె నాకు పంపిన ఒక శిశు ఫొటోగ్రాఫ్‌ను మీకు బహూకరిస్తున్నాను. ఇందులో అది high key ప్రక్రియ. బహుశ మీకు తెలిసే ఉంటుందేమో, ఫొటోగ్రఫీలో high key, low key అని రెండు పద్ధతుల ప్రక్రియలున్నాయి. మొదటి దానిలో తెలుపు దగ్గరలోని light grey toneకు ప్రాధాన్యం. ఇందులో ఏ కొంచెమో తప్ప నలుపు ఉండదు. పిల్లలను, పువ్వులను మొదలైన ఉల్లాసమైన విషయాలను తీయడంలో ఈ high key ప్రక్రియ వాడతారు. Background కూడా ఇందులో తెలుపులోనో light grey లోనో ఉండాలి. విషయ వస్తువుకూడా అందులో దాదాపు కలిసిపోయేలాగా contrast లేకుండా ఉండాలి. తీయడంలో over expose చేసి enlarging లో under expose చేయాలి. Low key పై దానికి వ్యతిరేకం. ఇందులో నలుపుల ప్రాధాన్యం ఉండాలి. Under expose negitiveను enlargingలో over చేయాలి. గంభీరమైన విషయ వస్తువులకు, వర్షాకాలపు వాతావరణం మొదలైన వాటికి రూపకల్పన నివ్వడానికి ఈ ప్రక్రియ వాడతారు'. డాక్టర్ సంజీవదేవ్ రాసిన పుస్తకాలలో ఆయనకు ఫొటోగ్రఫీ కళపైననే గాక దాని సాంకేతిక పరిజ్ఞానం పైన ఉన్న అపార విజ్ఞానం మనకు అడుగడుగునా ఇలా దర్శనమిస్తుంది.

# డాక్టర్‌సంజీవదేవ్- మనోవిజ్ఞానం

సంజీవదేవ్‌కు అత్యంత అభిమానమైన విషయం మనోవిజ్ఞానం, ఆయన రామారావుగారికి రాసిన ఒక ఉత్తరంలో ఈ విషయాన్నే చర్చిస్తారు. (లేఖల్లో సంజీవదేవ్ : పుట 165) 'సాహిత్యం మీద కన్నా, చిత్రకళ మీదకన్నా, జీవితం, మరణం, మరణానంతరం అనే విషయాలను గురించి నా అభిలాష ఎక్కువ అవుతున్నది. ఇలాంటి పరాతాత్విక విషయాలను గురించి పరిశోధనలు జరపాలని ఉంది. Psychology and Para psychologyని గురించి కొంత కృషి చేస్తున్నాను. ఆ మధ్య ఆంధ్ర విశ్వవిద్యాలయంలో యూనివర్సిటీ గ్రాంట్స్ కమీషన్ జరిపిన Para psychology - man and supermanలోకి నన్ను కూడా ఆహ్వానించగా Para psychology - man and superman అనే ప్రసంగం రాసి చదివాను'.

సంజీవదేవ్ తరచు తన పుస్తకాలలో మనోవిజ్ఞాన విశ్లేషణ కూర్చి మాట్లాడతారు. తన స్వీయ చరిత్రలో (గతంలోకి · పుట 280-81) సంజీవదేవ్ తనకు కారల్ గస్టవ్ యూంగ్ (C G Jung) అనే మనో వైజ్ఞానికుడంటే ఎంతో అభిమానమని చెపుతారు. డాక్టర్ యూంగ్ మనో విశ్లేషణకు సంబంధితమైన సిద్ధాంతాన్ని ఆయన ఇలా వివరిస్తారు. 'సామూహిక అచేతన (Collective unconcious) అనేది డాక్టర్ యూంగ్ సిద్ధాంతాలలో విశిష్టమైనది. సామూహిక అచేతన నుండి వైయక్తిక అచేతన వస్తుంది. వైయక్తిక అచేతన నుండి వైయక్తిక చేతన రూపొందుతుంది. ఈ వైయక్తిక చేతననే 'వ్యక్తిత్వం' 'మానసిక వ్యాధులకు ప్రధాన కారణం లైంగిక అసంతృప్తి అన్న ఫ్రాయిడ్ సిద్ధాంతాన్ని త్రోసిపుచ్చి, అందుకు ప్రధాన కారణం ఆత్మిక అసంతృప్తి అని యూంగ్ బోధించాడు. అయితే ఫ్రాయిడ్ సిద్ధాంతం అసత్యమైంది కాదు, యూంగ్ సిద్ధాంతం అసత్యమైందీ కాదు. ఒక్కొక్క సత్యం ఒక్కొక్క రోగికి వర్తిస్తుంది. రెండు వర్తించే రోగి కూడా ఉంటుంటాడు. అరుదుగా. కొందరిలో లైంగిక అసంతృప్తి మూలంగా మానసిక వ్యాధులు, వాటితో శరీర వ్యాధులు ఉత్పన్నమైతే మరి కొందరిలో ఆత్మిక అసంతృప్తి మూలంగా, అవి ఉత్పన్న మవుతాయి. అయితే లైంగిక అసంతృప్తీ, ఆత్మిక అసంతృప్తీ, ఒకే వ్యక్తిలో ఉండకూడదనేది లేదు. రెండూ కూడా ఒకే వ్యక్తిలో సహజీవనం చేయగలవు. ఫ్రాయిడ్ చెప్పేదేమంటే ఆత్మిక అసంతృప్తి కూడా లైంగిక అసంతృప్తికి ప్రచ్ఛన్న రూపమేనని, అందుకు డాక్టర్ యూంగ్ అంగీకరించడు. అన్నీకూడా ప్రతిబింబాలే అనే ఫ్రాయిడ్ సిద్ధాంతాన్ని డాక్టర్ యూంగ్ అంగీకరించక ఏదీ దేని ప్రతిబింబము కాదు, మానవునిలో దేనికదే స్వీయ అస్తిత్వాన్ని కలిగుంటుంది అంటారు. మానవునిలో లైంగిక ప్రవృత్తి ఎంత బలీయమైందో ఆత్మిక ప్రవృత్తి అంతకంటే బలీయమైంది అంటాడు యూంగ్.

1890లో రష్యన్ వైజ్ఞానికుడు పావ్‌లోవ్ ఒక కుక్కపై సాగించిన పరిశోధనలు అత్యంత గణుతికెక్కాయి. మనోవిజ్ఞాన శాస్త్రంలో ప్రసిద్ధిచెందిన పావ్‌లోవ్ కుక్క పరిశోధనలను, వాట్సన్ ప్రయోగాలను సంజీవదేవ్ ఒక రచన ద్వారా విపులీకరిస్తారు (కాంతిమయి : పుట 266–279). స్వప్నాలు – మనోవిజ్ఞానం అన్న అంశం కూడా సంజీవదేవ్‌కు ఇష్టమైనదే!

## ముగింపు

సంజీవదేవ్ భావ స్రవంతిలోని విజ్ఞాన ధారలే పైన పేర్కొన్న ఘట్టాలు. ఆయన జ్ఞాన కాసారం మథింపుకు వీలుకాదు అన్నంత పెద్దది. అందులోని హేతువును ఆనందాన్నుండి వేరుచేయడం బృహత్ కార్యమే! కాని, ఆ ప్రయత్నంలోనే దర్శించగలం ఆయనలోని ఊర్ధ్వ చేతనను, విశుద్ధానందాన్ని జ్ఞాన తేజస్సును!

(రచయిత – డాక్టర్ మైనేని కేశవ దుర్గాప్రసాద్, జంతుశాస్త్ర విభాగం, నాగార్జున విశ్వవిద్యాలయం, నాగార్జున నగర్, గుంటూరులో జలజీవశాస్త్ర ఆచార్యులు.)

# శిల్ప సిద్ధాంతి సంజీవదేవ్

డా. ఎమ్. శివరామకృష్ణ

"Philosophy of Human Life" అన్న తన వ్యాసంలో డాక్టర్ సంజీవదేవ్ అంటారు.

> The Philosophy of human life lies in man's liberating himself out of what he was not into what he was and what he was and what he would become. The entire human evolution consists of the transformation of Being into becoming. Being is static, becoming is living. Being is a live ember while becoming is a flame. Ember is existence while the flame is life.

ఈ వాక్యాలు ఆయన శిల్ప సిద్ధాంతాన్ని, జీవన సరళిని రెండింటికీ మధ్య అవసరం అయిన సమన్వయ దృష్టిని అర్థం చేసుకోటానికి మౌలిక సూత్రాలు. మానవ జీవిత పరిణామం అంతా చైతన్య పరివర్తనని సాధించే ప్రయత్నం ద్వారానే అర్థవంతం అవుతుందని ఆయన విశ్వాసం. ఈ చైతన్య పరివర్తన సమగ్ర మానవ విలువల ఆవిష్కరణ. నిద్రాణంగా ఉన్న సృజనాత్మకతని చైతన్యవంతం చేసి ఆ చైతన్య శక్తిని జీవిత కోణాలన్నిటిలోకి ప్రసరింపచేసి సమ్యక్ సత్యాన్ని దర్శించటమే జీవిత పరమావధి.

ఈ దృష్టితో పరిశీలిస్తే డాక్టర్ సంజీవదేవ్ ద్రష్ట, కళాకారుడు, రచయిత, శిల్పసిద్ధాంతి, అన్నిటినీ మించి, జీవితాన్ని మలచలేని – మలిచి ఉన్నత చైతన్య స్థితులకు నడిపించలేని – సిద్ధాంతమూ, ప్రక్రియా నిరర్థకాలన్న విశ్వాసం, ఇలా ఎన్నో సృజనాత్మక అంశాల, ప్రక్రియల సమన్వయమూర్తి డాక్టర్ సంజీవదేవ్. అందువల్లనే సృజనాత్మక ప్రతిభతోపాటు విశ్లేషణా వివేక

ప్రజ్ఞ ఆయన చైతన్యంలో, పడుగూ పేకలా పెనవేసుకున్నాయి. అందంగా రాయటం, సహేతుకంగా విమర్శించటం, సృష్టించటం, విశ్లేషణ ద్వారా ఆ సృష్టిని పునః ప్రతిష్టించటం – రెండు కళలూ అవిభాజ్యంగా ఆయనలో కనిపిస్తాయి. 'బాహ్య పరిశీలన' పరిధిని విస్తరించి 'అంతర్వీక్షణి' జ్యోతి ద్వారా ఒక సమ్యక్ దృక్పథాన్ని సాధించి, ఆ దృక్పథాన్ని నిశితంగా వ్యక్తీకరించే అరుదైన ప్రతిభావంతుల్లో ఆయన సరసన కూచోటం కొంతమందికే సాధ్యం. అన్నిటినీ మించి, భావ వ్యక్తీకరణ – శిల్ప సిద్ధాంత చర్చలలో అంతగా విశ్లేషింపబడలేదు అని తోచిన అంశాల పరిశీలన కోసం – భాషని నిశిత ఆలోచనాశయ్య ప్రతిబింబించేలా లొంగదీసుకొని ఎన్నో ధ్వన్యర్థాల ద్వారా శిల్ప సూక్ష్మాల్ని వింగడించటంలో శ్రీ సంజీవదేవ్ ప్రతిభ అపూర్వం. 'వికృత పరిస్తే కాని కొన్ని ప్రకృత సత్యాలు బయటపడవు' అన్నది ఆయన నమ్మకమే కాదు, ఆయన శైలికి, ఆలోచనా సరళికి మౌలిక సూత్రం.

ఈ మౌలిక సూత్రాన్నే కేంద్రంగా చేసుకుంటే శ్రీ సంజీవదేవ్ విమర్శ, సిద్ధాంత విశ్లేషణ మరింత అర్థవంతం అవుతుంది. ఆయన రచనలని, ఈ దృష్టితో ఎంత స్థాలీపులాక న్యాయంగా చూచినా – 'తెగిన జ్ఞాపకాల' నుండి 'రసరేఖలు', 'కాంతిమయి' మొదలైన వాటి దాకా – కొన్ని ప్రగాఢమైన నమ్మకాలు ఆయన విశ్లేషణకి ఆలంబనాలు అని తోచక మానదు. వీటిలో, నా దృష్టిలో కొన్ని అంశాలు ప్రత్యేకించి ప్రస్తావించ తగినవిగా అనిపిస్తాయి. ఒకటి లాంఛన ప్రాయం అయిన విద్యావ్యవస్థ – అది అందించే మిడిమిడి జ్ఞానం – నుండి స్వేచ్ఛ. తన జీవితంలో 'చదువు'కి ఉన్న స్థానాన్ని విశ్లేషిస్తూ ఆయన అంటారు. 'చదువుకోడంలో ఇష్టం తప్పలేదు కాని ఎందుకో బడికి పోవడంలో కొంత అయిష్టం కలగడం ప్రారంభించింది. బడికి పోవాలంటే ఏదో బరువుగా ఉండేది'.

ఈ 'బడి బరువు' వల్ల ఏర్పడ్డ వేదన, బడి ఎగ్గొట్టాలనే సగటు పిల్లవాడి మనస్తత్వం కాదు. తీవ్రమైన తపన, పరిధులకి లొంగని, ఈడుకి మించిన కుతూహలం – వీటివల్ల జనించిన 'బరువు'. అంటే క్రమపద్ధతిలో యాంత్రికంగా నిర్మించబడ్డ విద్యా విధానం, దానిలో ఇమడలేని వ్యక్తికి నిక్షిప్తంగా ఉన్న సృజనాత్మకతని వ్యక్తపరచే అవకాశం కలిగించలేదు. తన మనసు ఈ స్వేచ్ఛ కోసం ఎంతగా తపించిందో చెబుతూ ఆయన బడిని, రైల్వే లైనునీ ప్రతీకలుగా ఎన్నుకొని ఈ విధంగా రాసారు –

> 'బడిని ఆనుకునే మదరాసు వెళ్ళే రైల్వే లైను.వీలున్నపుడల్లా బడి నుంచి రైలు కట్టకు వెళ్ళి రైలు పట్టాలమీద నడిచే వాళ్ళం. రైలు పోతుంటే చూడడంలో

ఒక సంతోషం, డ్రైవరూ, గార్డూ ఎంత అదృష్టవంతులో అనిపించేది. ఎక్కడా దిగకుండా రోజంతా స్వేచ్ఛగా రైలులో ప్రయాణం చేస్తారు. వాళ్ళకేమీ దిగుళ్ళూ, చింతలూ, బరువులూ, బాధలూ ఉండవు అనుకొనేవాణ్ణి. ఎక్కడా దిగిపోకుండా తెంపులేని ప్రయాణం ఎంత హాయిగా ఉంటుందో'.

ఈ 'ప్రయాణం' అన్న ప్రతీకని విస్తృతంగా పరిశీలిస్తూ శ్రీ సంజీవదేవ్ అంటారు –

జీవితమంతా నిరంతర ప్రయాణం అయితే ఎంత ఆనందంగా ఉంటుందో. బడి నుంచి ఇంటికి కాని, ఇంటి నుంచి బడికి కాని పోయే పని ఉండదు. ఇటువంటి నిరంతర ప్రయాణంలో పెద్దల అదుపు ఆజ్ఞలకూ, కోపతాపాలకూ గురి కావలసిన అవసరం ఉండదు. ఇటువంటి నిరంతర ప్రయాణంలో, ఇంటి నుంచి బయటికి పోలేదనే బెంగకానీ, బయటనుంచి తగు సమయానికి ఇంటికి రాలేకపోయామే అనే బాధ ఉండదు. ఇటువంటి నిరంతర ప్రయాణంలో, ఇంటికి తిరిగి రాని ప్రయాణంలో ఆనందమే ఆనందం. ఈ విధమైన ఆలోచనలతో, పగటి కలలతో రైలు పట్టాల మధ్య నిలచి సుదూర దిగంతాల వరకూ, రెండు రైలు పట్టాలు ఒకటిగా కలసి కనుపించేంత వరకూ చూసేవాణ్ణి'.

స్థూలంగా చూస్తే ఇవన్నీ ఒక పసివాడి పగటి కలల అమాయకత్వం నుంచి జనించి, ప్రాజ్ఞత వచ్చిన తర్వాత పునరాలోచన ద్వారా వ్యక్తీకరింపబడిన అందమైన భావాలు అని అనిపిస్తాయి. అయితే ఒక విషయం జ్ఞాపకం ఉంచుకోవాలి. ప్రతిభావంతుడైన ఏ రచయిత, శిల్పి అయినా తను వ్యక్తీకరించే ప్రతీ విషయంలోనూ – ఎంతో సీదాసాదాగా కనిపించే అంశం అయినా – తన ప్రగాఢ నమ్మకాల ఛాయని వ్యక్తం చెయ్యకుండా ఉండడు. ఏ ఒక్క మెతుకు ముట్టుకున్నా అన్నం ప్రకృతి అంతా తెలిసినట్లు, ఏ విషయాన్ని వ్యక్తం చేసినా ఆ వ్యక్తిత్వం మిగతా విషయాలతో అంతర్లీనం అయి ఒక సమగ్ర దృక్పథాన్ని సూచిస్తుంది. ఈ సమ్యక్ దృక్పథంతో పై మాటలన్నీ అన్వయం చేసుకుంటే శ్రీ సంజీవదేవ్ జీవిత, శిల్ప సిద్ధాంత లక్షణాలు దాదాపు అన్నీ నిక్షిప్తంగా, సూత్ర ప్రాయంగా కనిపిస్తాయి.

మొదట – జిజ్ఞాసువుల్ని ఎంతో ఆకట్టుకొనే ఆయన తాత్వికత. 'అంతము లేని ఈ భువనమంతయు ఒక పురాతన పాంథశాల' అన్న దృక్పథం. భవిష్యత్తులో అనుభవానికి వచ్చే జీవితం నిరంతర ప్రయాణం అన్న సత్య సందర్శన. పోతే ఈ జీవిత గమ్యాన్ని ఆదర్శాన్ని స్పష్టంగా, నిర్దుష్టంగా గ్రహించటం. 'బడి నుంచి ఇంటికి, ఇంటి నుంచి బడికి' అనే చర్య

యాంత్రికమ్మైన, నిస్తేజమ్మైన routine కి ప్రతీక అన్న గ్రహింపు. ఏ ఆనందాన్ని సాధించాలన్నా, ఏ సృజనాత్మక ప్రక్రియల్ని లొంగదీసుకోవాలన్నా ఈ యాంత్రిక జీవితపు రొంపి నుంచి స్వేచ్ఛ ద్వారానే సాధ్యం అన్న స్పృహ. 'నిరంతరం' లోనే, అవధులు లేని వస్తువులోనే, దానికి సంబంధించిన అనుభూతి ద్వారానే జీవిత పరమార్థం గ్రహించటం సాధ్యం, దీనికి సమ్యగ్దృష్టి అవసరం అన్న నమ్మకం. అన్నిటినీ మించి, భావ తీవ్రతలకు గురికాకుండా, కోపతాపాలకు లోనుకాకుండా పరమసత్యం యొక్క ఆనందానుభూతిని స్వంతం చేసుకోవాలన్న తీవ్ర ఆకాంక్ష.

ఈ అంశాల్ని దృష్టిలో ఉంచుకుంటే శ్రీ సంజీవదేవ్ శిల్ప సిద్ధాంత సూత్రాలు ప్రస్ఫుటంగా వీటిలో ఇమిడి ఉన్నాయని తోచక మానదు. ఈ సిద్ధాంత సూత్రాలకు కీలకం పైన ఉదహరించిన వాక్యాలలో చివరగా ఆయన ఎంతో అలవోకగా చెప్పిన శిల్ప సిద్ధాంత రహస్యం. ప్రాధమిక ప్రతీకలైన రెండు రైలు పట్టాలూ సృజనాత్మకతని సూచించే రెండు భిన్న ధృవాలు. ఫ్రాయిడ్ చెప్పినట్లు ఒక విధంగా కళ 'పగటి కలల' నుంచే ఉద్దీపన తెచ్చుకుంటుంది. అయితే ఈ పగటి కలలు నిక్షిప్త లోచనాలైన ఆలోచన, భావ, రూప భిన్నతల ద్వారా కళలా మార్పు చెందుతాయి. ఆలోచన ద్వారా సంస్కారం పొంది, భావ వ్యక్తీకరణలో వ్యక్తిత్వపు వాసనలని అధిగమించి, సాధారణీకరణ ద్వారా, కళలు మనల్ని, భౌతిక దృష్టికి విరుద్ధంగా, 'రెండు పట్టాలు కలిసే సుదూర దిగంతాలను' దగ్గరకు, వైయుక్తిక అనుభూతి పరిధిలోకి తీసుకొస్తాయి. అయితే ఇంత ఆలోచనా భరితమ్మైన ధ్వన్యార్థాలు ఉన్నా కళకి మూలం ఆయన అంతర్ దృష్టి భౌతికమ్మైన ఏ అంశాన్ని విస్మరించదు. ఈనాటి భౌతిక శాస్త్రజ్ఞులు చెప్పినట్లు అనుభూతికి వచ్చే ప్రతి విషయాన్ని recycle చేస్తుంది కళ.

శ్రీ సంజీవదేవ్ శిల్ప సిద్ధాంతానికి, శిల్ప సృష్టికి ఆధారం ప్రత్యక్ష జీవితానుభూతి; ఏ అమరికలు లేని నిరంతర శైవావస్థ ద్వారా ఆ అనుభూతిని ఆస్వాదించటం, సొంతం చేసుకోవటం. ఆలోచన ద్వారా ఆ అనుభూతి పగటి కలల రూపాన్ని పొందే నిస్తేజం అవకుండా ఆపి, కాలగతిని అధఃకరించే కళా ప్రక్రియ ద్వారా శాశ్వతత్వాన్ని సాధించటం. ఇది అనుభూతికి శిల్పి ఇచ్చే ప్రక్రియా రూపం. ఈ విధంగా రూపొందిన కళకి పరమార్థం కాలపరిధులు, ప్రకృతి వికృతులు లేని ఆనందాస్వాదన.

అయితే ఒక సందేహం కలగకుండా ఉండదు. ఈ సూత్రాలు ప్రతి సంస్కృతిలోనూ దాదాపు అందరూ నిర్ద్వంద్వంగా అంగీకరించేవే కదా! అందువల్ల డాక్టర్ సంజీవదేవ్ అపూర్వత ఏమిటి? దీనికి సమాధానం జీవిత సరళికి, శిల్ప ప్రకృతికి ఉన్నజటిలమ్మైన సంబంధం. చాలామంది శిల్ప సౌందర్యం సాధిస్తారు కానీ జీవిత శయ్యని సుందరంగా మలచుకోలేరు.

రెండింటికీ పొంతన ఉండదు. జీవితంలో వచ్చే ఆటుపోటుల్ని ఒక కళాఖండంలా, కళాఖండమే జీవితపు దర్పణంలా సమన్వయ సంస్కార దృష్టితో ఒకదాని ద్వారా రెండో విషయాన్ని సుసంపన్నం చేసుకోటం అరుదు. ఎందరో అక్షర శిల్పులు – వరహా కిమ్మతు చేసే వడ్డించిన విస్తరిలా కవిత్వాన్ని సృష్టించే భావుకులు – నిత్యజీవిత విస్తరిని చిందర వందరగా, ఛిన్నాభిన్నంగా చెయ్యటం / చేసుకోటం అంతగా అపూర్వమైన విషయం కాదు.

ఇక్కడే శ్రీ సంజీవదేవ్ విలక్షణత. శిల్ప దృష్టికీ, జీవిత శైలికి, స్థిత ప్రజ్ఞత ఆయన దృష్టిలో మూల సూత్రం. ఈ తాత్వికతని అంతరంగ సూత్రంగా, దైనందిన జీవిత అంతస్సూత్రంగా ఏవిధంగా మలచుకోవాలో/ మలచుకొన్నారో చెపుతూ ఆయన అంటారు – 'అనివార్యాలకు నన్ను నేను అనుకూల పరచుకోటం, – కార్యరూపం దాల్చనపుడు బాధపడటం, మనసును చెడగొట్టుకొనడం మొదలైన దౌర్బల్యాలను దరిజేరనిచ్చేవాణ్ణి కాదు. పరిస్థితులను మానవుడు తనకనుకూలంగా చేసుకోవడం అన్నిటికంటే మంచిపని. కానీ ఏవో కారణాల వల్ల అది కుదరనపుడు మానవుడే పరిస్థితులకనుకూలంగా మారాలి. తన కనుకూలంగా పరిస్థితులు మార్చుకోలేక, మారని పరిస్థితులకనుకూలంగా తాను మారలేకపోతే మనోవ్యథ తప్పదు'.

ఈ విధంగా పరస్పర విరుద్ధతల్ని కళ ద్వారానే కాక జీవితం ద్వారా సమన్వయం చెయ్యటం ఆధునిక తాత్విక దృక్పథానికి ప్రత్యేక లక్షణం.

ఒక అమెరికన్ రచయిత అన్నట్లు 'The temper of modernity is willingness to hold two opposed ideas in the mind and yet retain the ability to function' డాక్టర్ సంజీవదేవ్ మాటల్లో – 'కొన్ని సుఖమైనవి బాధగా తట్టటమూ, బాధగా అయినవి సుఖంగా తట్టటమూ మానవుని పరస్పర విరుద్ధ స్వభావాలలో ఒకటి. అందుకే కాబోలు విషాదాంత నాటకాలను కూడా మనం ఎంతో మక్కువతో ఆనందిస్తాం'. ఈ చిత్రాన్ని మరింత విశ్లేషిస్తూ అంటారు – 'బాధ అనేది హాయి అనేది కూడా వ్యక్తిగత ఇష్టం మీద ఆధారపడి ఉంటుంది. ఇష్టమైన బాధ కూడా హాయిగా తడుతుంది. ఇష్టంలేని హాయి కూడా బాధగా తడుతుంది. ఇష్టమే సుఖం, అయిష్టమే దుఃఖం. అయితే కొన్ని సమయాల్లో అయిష్టాన్ని ఇష్టంగా మార్చుకోకపోతే బాధ తప్పదు'.

'మార్చుకోటం' అనే ఈ క్రియ డాక్టర్ సంజీవదేవ్ దృష్టిలో చాలా ప్రముఖమైనది. ఇది జీవితంలో స్థితప్రజ్ఞత అన్న రూపం దాలిస్తే, కళలలో విభిన్న అనుభవాల సమన్వయం ద్వారా రసానందాన్ని కలిగించే ప్రతిభ అవుతుంది. ఈ ప్రతిభ, ప్రజ్ఞల సమన్వయం అన్న విషయం శ్రీ సంజీవదేవ్ జీవితానికి, శిల్ప సిద్ధాంతాలకి, కళాసృష్టికి ఊపిరి. భిన్న సంస్కృతుల కళా, సాహిత్య, విమర్శనా సంప్రదాయాల్ని అందంగా, అపూర్వంగా, అర్థవంతంగా అన్వయం

చేసుకొని, విశ్వమానవ చైతన్యం వెల్లివిరిసేలా సృష్టి, విమర్శ చెయ్యటం ఆయన వ్యక్తిత్వానికి కొలబద్ద. ఇంకో విధంగా చూస్తే మన యాంత్రిక యుగ జీవిత సరళికి ఈ సమన్వయ దృష్టికి ఉన్న అవినాభావ సంబంధం స్పష్టం అవుతుంది. ఈ సూక్ష్మాన్ని వివరిస్తూ శ్రీ సంజీవదేవ్ అంటారు –

> 'మనం నివసిస్తున్నది యాంత్రిక యుగంలో. స్థూలమైన ఎన్నో భౌతిక ప్రయోజనాలతో నిండి ఉంటాయి మన జీవితాలు. అడుగడుగునా రాజకీయ సమస్యలు, ఆర్థిక విపత్తులు, సామాజిక స్పర్ధలు మనను బాధిస్తూ ఉంటాయి'.

ఈలాటి యాంత్రికమైన జీవితాలు ప్రకృతిలో ఉన్న అంతర్గత సౌందర్య సూత్రాన్ని ఏవిధంగా గ్రహించలేవో వివరిస్తూ –

> 'వీటితో సతమతమవుతున్న జీవితాలకు సూర్యోదయాలు గోచరించవు, సూర్యాస్తమయాలు కనుపించవు. వెన్నెల రాత్రులు ఆకర్షించవు. మనకు తెలియకుండానే ఎన్నో సుందర ఘట్టాలు సాగిపోతుంటాయి. సుందర వస్తువులనో, స్థలాలనో, వ్యక్తులనో ఆనందించటం నేర్చుకుంటే ప్రాపంచిక సమస్యల బరువులు చాలా తేలిక అవుతాయి. కేవలం భౌతిక ప్రయోజన విషయాలకు మాత్రమే విలువనిస్తూ సూక్ష్మమైన సుందరానుభూతులకు దూరమవుతోంటే జీవితాలు ఆందోళనతో క్రుంగిపోతాయి. నిరాశలతో నిండిపోతాయి'.

నిశితమైన ఈ విమర్శ కళాస్వాదన పరమార్థాన్నే కాదు, జీవన శిల్ప నియమాల్ని కూడా తెలియజేస్తుంది. అన్ని కళలలోకీ, అర్థవంతంగా జీవించటం అన్నది ప్రధానమైన కళ. ఈ కళకి డాక్టర్ సంజీవదేవ్ విశ్లేషణ ప్రకారం మూడు శక్తులు మూల సూత్రాలు ఆలోచన, ఇచ్ఛ, అనుభూతి. ఈ 'త్రివేణి సక్రమంగా ప్రవహిస్తేనే మానవుడు సుఖంగా జీవించేది'. ఆలోచనా శక్తిలో అంతర్గతంగా ఉన్న గమ్యం, సూత్రం సత్యం; ఇచ్ఛాశక్తికి గమ్యం శివం; అనుభూతి శక్తికి పరమావధి సుందరం. ఆలోచన, ఇచ్ఛ, అనుభూతి వాటి వాటి పరిధుల్ని అతిక్రమించకుండా, తోడుగా ఏకముఖంగా పరిణమిస్తూ ఉన్నపుడే జీవితానికి – దానికి దర్పణం అయిన కళకి – పరమార్థం లభిస్తుంది.

కళ, జీవితాల ఈ సంగమం శ్రీ సంజీవదేవ్ దృష్టిలో రెండూ స్థూలంగా భిన్నంగా కనిపించినా వాస్తవానికి ఒకే లక్ష్యాన్ని కలిగిన శక్తులు. అయితే వాటి ప్రక్రియలు, పద్ధతులు భిన్నం 'శిల్పి అనుసరణ కాల్పనికం; వైజ్ఞానికుడిది వాస్తవికం. కాని యదార్థం ఏమిటంటే

ఉభయుల్లోని ఎవరి దృక్పథం కూడా అసత్యం కాదు; రెండూ సత్యమే'. ఒకరు లక్ష్యాన్ని 'రెక్కలతో ఎగిరి అందుకుంటారు'. ఇంకోరు 'కాళ్ళతో నడిచి అందుకుంటారు'. అయితే రెండింటి మధ్య – హృదయానికి, బుద్ధికీ, అనుభూతికీ ఆలోచనకూ, ఆవేశానికి హేతువుకూ మధ్య' – 'ఒక విధమైన భావసామ్యం ఉండాలి'. ఒకరికి 'ప్రకృతి లీలా నికేతనం' అయితే, మరొకరికి అది దృశ్య జగత్తు. అంటే జడవాదుల 'వాస్తవ వాదం' అద్వైతుల 'మాయావాదం' రెండూ సమ్యగ్ దర్శనం ఆలంబనం అయిన పూర్ణయోగాన్ని అనుభూతిలోకి తీసుకురావాలి. 'విభిన్నంగా' చూస్తే రెండూ 'అసమగ్ర వాదాలే'.

ఈ అసమగ్రతని అధఃకరించే సూత్రం సరిగా 'చూడటం'. చూడటం అంటే 'కన్ను తెరవటం కాదు'. దీనికి కారణం భౌతికమైన చక్షువు ఒక్కటే 'చూడటానికి' చాలు అన్న అందమైన భ్రమ. 'కన్ను తెరచిన వాళ్ళంతా చూస్తున్నారనటం భ్రమ'. చూడటం అన్నది కేవలం 'బోసిగా', వైశిష్ట్యం లేని, చవీసారం లేని', స్థూల ప్రకృతిని కళ్ళతో గమనించటం. ఉదాహరణకి 'దిసి ఆకాశం'. సరిగా 'చూడలేకపోతే' ఇది 'మన మనస్సుపైన ఒక విధమైన విసుగును, అజ్ఞాన వేదనను కలిగిస్తుంది'. ఈ సరిగా 'చూడటం అన్నది డాక్టర్ సంజీవదేవ్ 'దృశ్య సత్తా' అని వర్ణిస్తూ అంటారు. దృశ్య సత్తా పనిచేయందే కేవలం కంటికి చూసే శక్తి ఉండదు. అదే విధంగా ఏ భౌతిక మాధ్యమికం కూడా స్వయంగా కళా వస్తువు కాగల సామర్ధ్యాన్ని కలిగి ఉండదు. కేవలం కళాకారుని రసదృష్టి అభౌతిక మాధ్యమికం ద్వారా పనిచేసినప్పుడు మాత్రమే అది కళావస్తువుగా రూపొంద గలుగుతుంది. అయితే కన్ను అనే అవయవం లేనిదే కేవలం దృశ్యసత్తా చూడజాలదు అనే సత్యాన్ని కూడా ఎవరూ కాదనలేరు. సక్రమంగా సాగాలంటే సత్తా, అవయవం రెండూ సమంగా పూర్ణత్వాన్ని కలిగుండాలి'. అంటే ప్రకృతిని పరిశీలించినపుడు (ప్రకృతి అంటే మానవ ప్రకృతి కూడా) ఒక దృష్టి క్రమం ద్వారా మన అనుభూతిని వర్గీకరించుకుంటాం. ప్రకృతి ఎలా 'ఉన్నదో', 'కనిపిస్తుందో', 'గోచరిస్తుందో' ఇవన్నీ ఒకే, అభిన్నమైన, ప్రక్రియలు కావు.

ఈ దృష్టి క్రమం ద్వారా కలిగేదే రసాస్వాదన. అంటే ఉపయోగ దృష్టివేరు, రసదృష్టి వేరు. పైగా ఈ రసదృష్టికి స్థూలంగా నైచ్యంగా కనిపించే విషయాల్లోకూడా సౌందర్యాన్ని బహిర్గతం చేసే 'దృశ్యసత్తా' ఆధారం. ఈ సందర్భంగా శ్రీ సంజీవదేవ్ ఇచ్చిన ఉదాహరణ ఎంతో ఔచిత్యం ఉన్నది. కౌశలంతో కూడుకున్న ఏ పని అయినా కళ అని అది 'ఎంత హీనమైన పని అయినా అందులో కౌశలం కనిపిస్తే అది కళయే అవుతుంది'. అని అంటూ ఆయన

ఈ విధంగా అంటారు:

శూద్రక మహాకవి రచించిన మృచ్ఛకటిక నాటకంలో శర్విలకుడు అనే చోరుడు చారుదత్తునింటి గోడకు కన్నం వేసి సంపదను దోచుకుపోతాడు. తెల్లవారి చారుదత్తుడు ఆ కన్నాన్ని చూచి సంపద పోయినందుకు దిగులుపడక ఆగోడలోని కన్నపు కౌశలాన్ని చూచి మెచ్చుకుంటూ ఆనందిస్తాడు.

ఈ దృష్టితో కళకి కళకాని దానికి భేదం చెపుతూ –

ఇక్కడే భేదిస్తుంది కళ కానిదాన్నుంచి కళ, ఇక్కడే వేరవుతుంది ఉపయోగ దృష్టి నుంచి రసదృష్టి. చారుదత్తుని దృష్టి తనకు జరిగిన నష్టంమీద కాక కన్నంలో గోచరించే సౌందర్యం మీద నిలిచి ఉన్నది. నష్టలాభాలు ఉపయోగ జీవితానికి సంబంధించినట్టివి. సౌందర్యం రసజీవితానికి సంబంధించినట్టిది.

ఉపయోగ దృష్టి, రసదృష్టి ఈ విధంగా భిన్నంగా కనిపించినా ప్రకృతి మాత్రం 'రంగుల రూపాలూ, రూపాల రంగులూ' చూడకలిగిన వారికి నిత్యం చూపిస్తూనే ఉంటుంది. ఈ విషయాన్ని విశదీకరిస్తూ డాక్టర్ సంజీవదేవ్ అంటారు.

'చూడగలిగిన వారికి దృశ్య జగత్తులో ఎటు చూచినా రంగుల రూపాలు, రూపాల రంగులూ దీపాలవలె వెలుగుతూ గోచరిస్తాయి. నిలువుగా ఉన్న రూపాలు, అడ్డంగా ఉన్న రూపాలు, మూలగా ఉన్న రూపాలు, చతుష్కోణి రూపాలు, వలయాకృతి రూపాలు, సరళ రూపాలు, వక్ర రూపాలు, మిశ్రమ రూపాలు, ఈవిధంగా ఎన్నో ప్రకృత రూపాలు, వికృత రూపాలు ఎన్నో గోచరిస్తాయి'.

'వికృత రూపాలు' వాస్తవానికి వికృతం కావు. అవి సృజనాత్మకతకి ఇంధనాలు. వాటిని సౌమ్య రూపాల ఆవిష్కరణకి ఆలంబనం కింద రూపొందించుకోలేకపోతే మిగిలేది డాక్టర్ సంజీవదేవ్ దృష్టిలో 'వేదన' మాత్రమే. అయితే ఈ 'వేదన' ఎన్నో విధాలుగా మానవుని అనుభూతిలోకి వస్తుంది.

కొన్ని విధాలైన వేదనలు మనిషికి పిచ్చి ఎక్కిస్తాయి. ఇంకొన్ని విధాలైన వేదనలు మనిషిలోని సృజనాత్మక ప్రతిభకు పదును కలిగిస్తాయి. జడత్వాన్ని కోసేస్తుంది వేదన. నీరసత్వాన్ని కాల్చివేస్తుంది వేదన. కాని కొందరి విషాయల్లో ఇందుకు విరుద్ధంగా

కూడా జరుగుతుంటుంది. వీరిలో జడత్వాన్ని వృద్ధి పరుస్తుంది వేదన. నీరసత్వాన్ని అధికం చేస్తుంది వేదన.

సృజనాత్మకతని ప్రజ్వలింపచేసే ఈ వేదన ద్వారా ఏర్పడ్డ కళాకృతి యొక్క 'చరమలక్ష్యం' ఏమిటి అన్న ప్రశ్నకి శ్రీ సంజీవదేవ్ ఇచ్చే సమాధానం కూడా ఈ 'వేదన' పైనే ఆధారపడి ఉంది. ఈ సమాధానం ఒక చిత్రమైన విభజన ప్రాతిపదిక కలిగి ఉంది. ఆయన దృష్టిలో 'వేదన' రెండు విధాలు/రకాలు. ఒకటి 'అజ్ఞాన' వేదన ఇది మనలో నిద్రాణంగా ఉన్న రసమయ జగత్తుని, ప్రకృతిని సరైన దృక్పథంలో అర్థం చేసుకోకపోవటం – అంతర్గతంగాఉన్న సౌందర్య సూత్రాన్ని ఆవిష్కరించుకోలేక పోవటం – వీటి ద్వారా కలిగే 'వేదన'. రెండోది 'అజ్ఞాత వేదన' ఇది స్రష్ట తన కళాఖండాన్ని 'తను మాత్రమే కాక ఇతర్లు కూడా చూచి ఆనందించాలని', అలాటి పని జరగపోవటం వల్ల కలిగే వేదన.

అయితే ఈ విషయంలో కొన్ని మెళకువలు అవసరం. ప్రత్యేకించి ఈ వైజ్ఞానిక యుగంలో లలిత కళల స్థానం, వాటిని విశ్లేషించే విమర్శకులు ఎన్నో ముఖ్యమైన విషయాలను దృష్టిలో ఉంచుకోవాలి. డాక్టర్ సంజీవదేవ్ అంటారు – 'ఈ యుగంలో రసానుభూతి కంటే తర్కబుద్ధికే తావెక్కువ. సౌందర్యానికంటే ఉపయోగానికే విలువెక్కువ'. దీనివల్ల లలిత కళలు నిర్వహించ వలసిన పాత్ర చాలా ముఖ్యమైనది. అవి కేవలం యాంత్రిక జీవిత నైరాస్యాన్ని తాత్కాలికంగా మరచిపోగలిగేలా చేసే 'మందులు' కారాదు. 'లలిత కళలు జీవితంలో ఏ కొన్ని ఘడియలలోనే అనుభవించే ఒక నిషాలా ఉంటే లాభం లేదు. లలిత కళలు జీవితంలో ఓ భాగమై జీవితపు ప్రతి చిన్న నీడనీ ప్రదీప్త పరచాలి'. క్లుప్తంగా 'యంత్ర యుగంలో కళాతంత్రం కనుక లేకపోతే మానవుడొక నిర్జీవ యంత్రంగా తయారైపోతాడు'.

'కళ చరమ లక్ష్యం నీతిని గానీ, అవినీతిని గాని ప్రచారం చెయ్యటం కాదు. వ్యక్తులకు కొంతరసానందాన్ని అందించటం మాత్రమే' అని శ్రీ సంజీవదేవ్ అన్నా దీని పాక్షిక సత్యం గానే తీసుకోవాలి. ఎంచేతంటే కళ ద్వారా పెంపొందే రసదృష్టి జీవితాన్నంతనీ ఏక సూత్రంగా బంధించే సమగ్ర దృష్టి, అంటే జీవితంలోని బరువుల్ని తేలిక పరచేదీ తేలికగా ఉండే వాటిని బరువుగా రూపాంతరం చెందించేదీ కళాదృష్టి. రసాస్వాదన. ఈ విషయాన్ని మరింత విశ్లేషిస్తూ ఆయన అంటారు –

> 'ఈ రసదృష్టి లేనట్టయితే జీవితం కటువుగానూ, నిరానందంగానూ ఉండిపోతుంది. నిత్యజీవితం తన ఆకర్షణని పోగొట్టుకొని అదొక మోయలేని బరువుగా ఉండిపోతుంది.

రసదృష్టి అనేది ఏవో కొన్ని సమయాల్లో ఏ కొందరికో కలిగే అసహజమైన ఆవేశం కాదు. అది ప్రతి అంతస్తులోని వ్యక్తి యొక్క నిత్యజీవితంలో చాలా అవసరం. మామూలు మనిషి చూచి భయపడే భయంకర నిశీధిలోని భీకరమైన తుఫాను, మధ్యమధ్యనూ ప్రళయాకాశంలో మెరిసే మెరుపుల్నీ, చెవులూ, హృదయం కూడా బ్రద్దలయ్యేలాగ ఉరిమే ఉరుముల్ని ఎంతో తన్మయత్వంతో ఆనందించటానికి మనకు తోడ్పడేది ఈ రసదృష్టే!'

ఈవిధంగా రసకృత్ నిర్మించిన కృతిని రసవిత్ అర్థవంతంగా గ్రహించడంలో 'కళా సమీక్షకుడి' అవసరం ఉంది. అయితే విమర్శకుడు 'గోడ కాదు. వంతెన' గోడ అని అనుకున్నా 'స్ఫటికపు గోడ' నిర్మాణాత్మకంగా తోడ్పడటమే ఈ సమీక్షకుడి పాత్ర. 'నిర్మాణాత్మకంగా' అంటే సౌందర్య దృష్టిని జీవితపు విలువలతో – ప్రత్యేకించి నైతిక, ఆధ్యాత్మిక వలువలతో – సమన్వయపరచే సగమదృష్టిని కలిగించటం. క్లుప్తంగా, 'రసదృష్టి ముదిరితే యోగదృష్టి అవుతుంది' అన్న సత్యాన్ని జీవితంలో అనుభవంలోకి తెచ్చుకోటం – కళకి రసాస్వాదనకి పరమ లక్ష్యాలు.

శ్రీ సంజీవదేవ్ శిల్ప సిద్ధాంత విశేషాలు ఎన్నో ధ్వన్యార్థాలతో నిండి ఉంటాయి. వాటిలో కొన్నింటిని సూత్ర ప్రాయంగా విశ్లేషించడానికి ఈ వ్యాసం లఘు భూమిక మాత్రమే. భిన్న సంస్కృతులతో ఆయన సంబంధం, కళా సృష్టిలో, రసాస్వాదనలో తారసపడిన వ్యక్తులు, ఆయన విశ్లేషించిన సిద్ధాంతాలు, వాదాలు, గతాన్ని వర్తమానంతో సమన్వయం చేసి గీచిన స్మృతి బింబాలు, ఎన్నో ప్రదేశాల్లో దాదాపు అనితర సాధ్యమైన ఎన్నో అనుభవాల సంపద – అన్నిటినీ మించి వీటిని వ్యక్తీకరించడానికి మలచుకొన్న అపూర్వమైన శయ్యా, భాష, వీటి పూర్వరంగంలోనే మరింత విస్తృతమైన విశ్లేషణ సంభవం, అవసరం.

ఏది ఎలాఉన్నా 'గతంలోకి' అన్న తన పుస్తకంలో ఆయన చెప్పిన మాటలు ఆయన శిల్ప సిద్ధాంతాలకి, జీవన దృక్పథానికి ప్రతీకలు:

> The rhythm of life renders the rhythm of art vivent whereas the rhythm of life aesthetic. Life and art interpenetrate each other. We cannot conceive of a life bereft of art and an art bereft of life.

(రచయిత – డా. ఎమ్. శివరామకృష్ణ, హైదరాబాదు
ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఆంగ్ల శాఖాధిపతిగా పదవీ విరమణ చేశారు.)

# సంజీవదేవ్ విమర్శ - పరామర్శ

*డాక్టర్ జి.వి. సుబ్రహ్మణ్యం*

డాక్టర్ సంజీవదేవ్ పేరు సాహిత్య విమర్శలో ఒక శాఖకు పెట్టిన పేరుగా వినపడుతుంది. సాహిత్య విమర్శను కవితా కళాసూత్రాలతో వివేచించే వారు చాలామంది కనపడతారు కానీ, మిగిలిన లలితకళా సూత్రాలతో మేళవించి, దర్శించి, విమర్శించి, అనుశీలించేవారు దాదాపు అన్ని సాహిత్యాలలోనూ అరుదుగానే ఉంటారు. అటువంటి కోవకు చెందిన విమర్శకులు డాక్టర్ సంజీవదేవ్ గారు.

తెలుగులో కట్టమంచి, విశ్వనాధ మొదలైనవారు సాహిత్య శాస్త్ర మర్యాదలను, రహస్యాలను కావ్యాదుల అనుశీలనంలో ప్రవచించి సాహిత్య విమర్శను ఒక సాహిత్య ప్రస్థానంగా సాగించినవారు. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు సంగీత శాస్త్ర మర్యాదలను, సరస్వతీ పుత్ర పుట్టపర్తి నారాయణాచార్యులవారు సంగీతాది శాస్త్ర మర్యాదలతో పాటు భారతీయ భాషా సాహిత్యాల తులనాత్మక విమర్శ సూత్రాలను కూడా మేళవించి విమర్శించే విశిష్ట మార్గాలలో తమ విమర్శను నడిపించారు. ఇలాగే డాక్టర్ సంజీవదేవ్ చిత్రకళా శాస్త్ర మర్యాదలను సాహిత్య కళానుశీలనంలో ప్రదర్శించే ఒక ప్రత్యేక బాణీని తెలుగులో కల్పించుకొని, దానికి తామే ఆచార్యులై, మార్గప్రవర్తకులై తమ ప్రత్యేకతను నిలబెట్టుకున్నారు. ఇలాగే శిల్పశాస్త్ర కళా విమర్శలో తమ మార్గాన్ని సుస్థిరంగా నిలుపుకొన్నవారు కొండూరు వీరరాఘవాచార్యులుగారు.

సాహిత్య కళా విమర్శలో లలితకళా విమర్శను సమన్వయించి ఒక నవ్యమార్గాన్ని నిర్మించే సృజనాత్మక విమర్శకులు తెలుగులో వేళ్ళమీద లెక్కబెట్టదగినవారు మాత్రమే ఉన్నారు. వారిలో సంజీవదేవ్‌గారు సమున్నతులు, కనిష్ఠికాధిష్ఠితులు.

ఈ వ్యాస శీర్షిక చెప్పకచెప్పే మొదటి విషయమేమిటంటే డాక్టర్ సంజీవదేవ్ గారు పీఠికలలో సామాన్యంగా విమర్శనను కొంత, పరామర్శను కొంత చేసి తమ ముందు మాటలకు ఒక కళాఖండ గౌరవాన్ని కల్పిస్తారు. కొందరు ముందుమాటలను ముచ్చటలతో ముంచెత్తుతారు. మరికొందరు సిద్ధాంత రాద్ధాంతాలతో అంబరాలను అంటిస్తారు. కొందరు ప్రశంసల వర్షంతో కావ్యాన్ని అభిషేకం చేస్తారు; మరికొందరు పట్టి పట్టి దోషాలను వెలికితీసి విమర్శిస్తారు. కొందరు కావ్యానికి తగిన ప్రమాణాలను సమీకరించి, గ్రంథానికి సమన్వయించి అనుశీలిస్తారు. మరికొందరు అప్రస్తుత ప్రమాణ చర్చలతో రచనను చిన్నాభిన్నం చేస్తారు. కొందరు కవి/రచయిత దృక్పథాన్ని సహృదయత్వంతో దర్శించి, స్థాపించి, వివరించటానికి ప్రయత్నిస్తారు. మరికొందరు రచయితది ఏ దృక్పథమైనా, తమ సిద్ధాంతంతోనే విలువ కట్టే చూపును సారిస్తారు. ఇలా పఠితల హృదయాలలో కలకాలం నిలిచేవి కొన్నే- ఏ పీఠికలు పఠితలకు సాహితీ కళాఖండాలను చదివిన అలౌకిక భావానుభవాన్ని కలిగిస్తాయో అవి సహృదయుల మనసుల్లో గూడుకట్టుకొని ఉంటాయి. డాక్టర్ సంజీవదేవ్ పీఠికలు ఈ కోవకు చెందుతాయి.

సంజీవదేవ్ పీఠికలు విమర్శ కళావర్ణ చిత్రాలు, ప్రాణమున్న పరామర్శ రేఖాచిత్రాలు. వీరి పీఠికలను బట్టి నిర్వచించవలసివస్తే విమర్శ వర్ణ చిత్రం లాంటిది, పరామర్శ రేఖాచిత్రం లాంటిది. ఏది ఎప్పుడు ఎలా వేయాలో కళాస్రష్ట సంజీవదేవ్‌గారికి బాగా తెలుసు.

డాక్టర్ సంజీవదేవ్ పీఠికలలోని విమర్శ పరామర్శలను గమనించటానికి ముందు వారే యే రచనలకు ముందుమాటలు రాశారో స్థూలంగా తెలుసుకోవడం అవసరం. ముఖ్యమైన వాటిని ఇక్కడ పేర్కొంటాను.

1973లో శ్రీ గోదా గ్రంధమాల వారు డాక్టర్ సంజీవదేవ్ 1962-72 నడుమ అంటే పదేళ్ళ కాలంలో రాసిన ముఖ్యమైన పీఠికలను కలిపి 'సమీక్షా రేఖలు' అనే పేర ఒక సంకలనాన్ని వెలువరించారు. అందులో 10 గ్రంధ పీఠికలు పొందుపరచబడ్డాయి. అవి -

1. రెండు పలుకులు (1962) - శ్రీమతి నేలనూతుల పార్వతీకృష్ణమూర్తి రచించిన 'రామచరిత మనసామృతము' వక్త ముందు మాట

2. స్వరకల్పన (1964) - శ్రీమతి కె. రాధాదేవి రచించిన 'శిథిల సౌధం' పీఠిక

3. స్పందన (1969) - శ్రీ వేగుంట మోహన ప్రసాద్‌రచించిన 'చితి-చింత'కు పీఠిక

4. గురించి (1969) – శ్రీ దోనేపూడి రాజారావు రచించిన 'గోపీచంద్'కు ముందుమాట.

5. నీరాజనం (1970) – శ్రీ సామవేదం జానకీరామశర్మ రచించిన 'రాధా హృదయము'నకు పీఠిక.

6. నైవేద్యం (1970) – శ్రీ కె.టి.ఎల్ నరసింహాచార్యులు గారి 'లోకమాత' కు పీఠిక.

7. సుకవిత (1972) – శ్రీ రంధి సోమరాజుగారి 'పొద్దు'కు పీఠిక.

8. అవలోకన (1972) – శ్రీ లింగం వీరభద్రయ్య చౌదరిగారి 'అభిప్రాయాలు–అనుభవాలు'కు ముందుమాట.

9. అనుశీలన (1972) – శ్రీమతి దివ్యజ్ఞాన సరోజినీదేవి రచించిన 'చిత్రకళ'కు పీఠిక.

10. పరిప్రేక్ష (1972) – శ్రీ కె. హనుమంతరావుగారి 'వాఙ్మయ సమాలోచనము'నకు పీఠిక.

ఈ శతాబ్ది ఆరు, ఏడు దశకాల్లో సంజీవదేవ్ గారి విమర్శ వ్యక్తిత్వ వికాసాన్ని వివేచించటానికి ఈ సంకలనం ఒక మంచి ఆధారంగా ఉంది. ఇందులోని పీఠికా వ్యాసాలే కాక సంజీవదేవ్ విమర్శక వ్యక్తిత్వాన్ని వివేచించటానికి తోడ్పడేవి మరికొన్ని కూడా ఉన్నవి. అవి ఈ సంకలనంలోకి చేరలేదు. వాటిలో ముఖ్యమైనవి రెండు –

1. అనుమేళన (1958) – చలంగారి విశ్వకవి రవీంద్రుని గీతాంజలి తెలుగు సేతకు అనుబంధ పీఠిక (పీఠిక చలంగారే రాసుకున్నారు).

2. విహంగ వీక్షణ (1962) – శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు రచించిన 'శిల్పకళా క్షేత్రాలు' (ప్రథమ సంపుటం) పీఠిక.

డాక్టర్ సంజీవదేవ్ 1980–1990 నడుమ దాదాపు ఇరవై గ్రంథాలకు పీఠికా రూప విమర్శలు, పరామర్శలు చేశారు. వీటిలో కవితా సంపుటాలున్నాయి (పద్య వచన కవితలు రెండూ), శాస్త్ర గ్రంథాలున్నాయి; వ్యాస సంపుటులున్నాయి, విమర్శ గ్రంథాలు, పరిశోధన గ్రంథాలూ ఉన్నాయి. వాటిలో ముఖ్యమైనవి ఇవి –

1. విన్యాసం (1980) – శ్రీమతి రేవతీదేవిగారి వచన కవితా సంపుటి 'విలాలోహిత'కు ముందుమాట.

2. ఆస్వాదన (1981) – ఆచార్య యస్వీ జోగారావుగారి పద్యకృతి 'శృంగార సర్వజ్ఞము'నకు మున్నుడి.

3. తోరణం (1983) – శ్రీ కరుటూరి సత్యనారాయణగారిపద్యకావ్యం 'ఆశ్రమ దర్శనము'నకు పీఠిక.

4. అగ్ని అక్షరాలు (1985) – ఆచార్య తిరుమలగారి ఖండ కావ్య సంపుటి 'అక్షరాగ్ని'కి పీఠిక.

5. ఒక చిన్నమాట (1985) – శ్రీ నాగభైరవ కోటేశ్వరరావుగారి 'గుండ్లకమ్మ చెప్పిన కథ' పద్య కథా కావ్యానికి ముందుమాట.

6. గాలిహోరు (1988) – శిఖామణి కవితా సంపుటి 'హోరుగాలి'కి పీఠిక.

7. మాటల నీడలు (1988) – శ్రీ బీరం సుందరరావు కవితా సంపుటి 'చైతన్యం నా చిరునామా'కు ముందుమాట.

8. కవితా కలాపం (1988) – డాక్టర్‌జి.వి. పూర్ణచందు కవితా సంపుటి 'కాంతిస్వప్న'కు పీఠిక.

9. కొంగా కొంగగోళ్ళు (1988) – శ్రీ రావెల సాంబశివరావు బాలల విజ్ఞాన కవితల సంపుటి 'గోరుముద్దలు'కు ముందుమాట.

10. వీక్షణ (1983) – శ్రీమతి సి. వేదవతి 'సామెత'కు పీఠిక.

11. దిక్సూచి (1984) – డాక్టర్‌మన్నవ సత్యనారాయణ సిద్ధాంతి వ్యాసం 'శ్రీ అడివి బాపిరాజు నవలా సాహిత్యానుశీలనము'నకు పీఠిక.

12. తానం (1984) – 'బాలబంధు' శ్రీ బి.వి. నరసింహారావు 'చలం 'అరుణాచలం' లేఖలు'కు ముందుమాట.

13. వివేచన (1984) – శ్రీమతి ఎస్.ఎస్.లక్ష్మి రచించిన 'మానవతా పథంలో – మహిళా పురోగతి'కి పీఠిక.

14. చర్చ (1985) – శ్రీమతి ఎస్.ఎస్.లక్ష్మి రచించిన 'చలం సాహిత్యావలోకం'కు పీఠిక.

15. పరిప్రేక్షితం (1985) – శ్రీ కొండిపర్తి శేషగిరిరావు వ్యాస సంపుటి 'కాంతి–శాంతి'కి ముందుమాట.

16. ఒక చిన్న మాట (1985) – శ్రీ అన్నపరెడ్డి వేంకటేశ్వర రెడ్డి సైకాలజీ గ్రంథం 'మనసు మర్మం'కు ముందుమాట.

17. గద్యదృష్టి (1985) – డాక్టర్ పోచిరాజు శేషగిరిరావు సాహిత్య వ్యాస సంపుటి 'కాదంబిని'కి ముందుమాట.

18. సింహావలోకనం (1985) – డాక్టర్ కేశవరెడ్డి రచించిన 'అతడు అడవిని జయించాడు'కు చివరి మాట. (ముందుమాట 'కరక్కాయ పీఠిక' శ్రీ పురాణం సుబ్రహ్మణ్య శర్మ రాశారు).

19. సమ్యక్‌దృష్టి (1987) – డాక్టర్ గుంటుపల్లి రామారావు సిద్ధాంత వ్యాసం 'కవిత్రయ మహాభారతం – ధృతరాష్ట్రుడు'కు పీఠిక.

20. 'స్థూల రేఖలు' 'బింబాలు' మొదలైన మరికొన్ని పీఠికలు.

ఈ పట్టీ సమగ్రం కాకపోవచ్చు. కానీ డాక్టర్ సంజీవదేవ్‌ను తెలిసికొనటానికి ఇది ఒక సూచికగా పనికివస్తుంది.

డాక్టర్ సంజీవదేవ్ 'తెలుగు విద్యార్థి'కి పీఠికా రచనను గురించి ఒక మంచి వ్యాసం రాశారు. విమర్శను గురించీ, విమర్శకుణ్ణి గురించీ మరొక వ్యాసం కూడా రాశారు. ఒక విధంగా వారు రాసిన పీఠికలలో 'విమర్శ–పరామర్శ' అనే అంశాలు వారి ప్రమాణాలతోనే వివేచించటం సమంజసంగా ఉంటుందనుకుంటాను. పీఠికా రచనకు సంబంధించి వారి అభిప్రాయాలు సంగ్రహంగా ఇవి –

1. పీఠిక – గ్రంథంలోని విషయాన్ని తేలికగా తెలుసుకొనటానికి తోడ్పడుతుంది.

2. సుదీర్ఘంగా ఉండే పీఠికలలో అసలు గ్రంథంలో లేని ఎన్నో విషయాలు ఉండే అవకాశం ఉంది. రచయితలే తమ రచనలకు సొంతంగా పీఠికలు రాసుకొన్నప్పుడు ఇటువంటివి తరచుగా జరుగుతుంటాయి.

3. ఉత్తమ పీఠిక ఏదంటే, 'ఏది నిష్పక్షపాతంగా గ్రంధాన్ని గురించి ప్రశంసించాల్సినచోట ప్రశంసించటం, నిందించాల్సినచోట నిందించటం చేస్తుందో అది'.

4. 'నూతన గ్రంథకర్తలకు ప్రోత్సాహాన్నిచ్చే నిమిత్తం కొంత వారి రచనలను గురించి మంచి మాటలు చెప్పటం అవసరం అవుతుంది'.

5. 'కొందరి గ్రంధాలను గురించి ఉన్నది ఉన్నట్లు రాస్తే (పీఠికాకర్త) వారికి విరోధి అవుతాడు. లేనివి ఉన్నట్లుగా రాస్తే అసత్యాలను రాసినవాడవుతాడు. ఉన్నదాన్ని లేనట్లు రాస్తే భ్రష్టుడవుతాడు'.

6. 'అన్ని రచనల వలెనే పీఠికా రచన కూడా ఒక కోమల కళ అయితే, మిగతా కళల్లో సత్యాన్ని మరుగుపరిచే హక్కు ఉంటుంది కళాకారుడికి. పీఠికా రచనలో మాత్రం అది లేదు'.

7. 'ఆలోచించి చూస్తే అందరి గ్రంథాలకు, అన్ని విధాల గ్రంథాలకు పీఠికలు అవసరం ఉండవు'.

8. 'కొందరి గ్రంథాలకు పీఠికనుబట్టి విలువ రావడం జరుగుతుంటే, కొందరి పీఠికలకు గ్రంధాలనుబట్టి విలువ అబ్బుతుంది'.

డాక్టర్ సంజీవదేవ్ పీఠికలన్నీ వారి ప్రమాణాలను పరిపూర్ణంగా పాటిస్తాయి. లక్ష్యా లక్షణాలు తెలిసిన ఉచితజ్ఞులు వారు. వారు పీఠిక రాస్తే పుస్తకానికి గౌరవం వస్తుందని తెలుగువారందరూ భావిస్తారు. వారి పీఠికను విజ్ఞులు విలువల తీర్పుగా వివేచిస్తారు.

డాక్టర్ సంజీవదేవ్ పీఠికలను కాలక్రమ దృష్టితో పరిశీలిస్తే కొంత వికాస స్థితి గోచరిస్తుంది. ఒక విధంగా విశ్లేషిస్తే – సంజీవదేవ్ గారి విమర్శలో 1980కి పూర్వం కంటే 1980 తరువాత వైలక్ష్యం ఎక్కువ కనపడుతుంది. మొదటిది పూర్వదశ అందాం. చివరిది ఉత్తరదశ అందాం. విశ్లేషణకు ఈ విభాగం తోడ్పడ్డా మౌలిక లక్షణంలో మార్పు లేదన్న విషయం గమనించాలి.

డాక్టర్ సంజీవదేవ్ రచనను ఒక సమగ్ర కళాఖండంగా చూచి, వివేచించి, అనుభవించే ప్రవృత్తిని ప్రధానంగా ప్రదర్శిస్తారు. సాహిత్యంలోని వర్ణ శబ్దార్థ సంయోజనం వారి చిత్త సంస్కారంలో చిత్రవర్ణ సంయోజనం వలన కలిగి బింబ భావనాన్ని జాగృతం చేస్తుంది. చిత్రకారుని కళా దర్శనంతో సాహితీ లోకాన్ని వివేచించే ఒక విమర్శ ప్రస్థానం డాక్టర్ సంజీవదేవ్ రచనా విధానం. పీఠిక రాసినా, వ్యాసం రాసినా, సమీక్ష రాసినా ఈ దృక్పథం మాత్రం సహజ ప్రధాన లక్షణంగా వారి విమర్శలో దర్శనమిస్తుంది.

అయితే, 1980 వరకు రాసిన పీఠికలలో ఈ సహజ దృక్పథంలోనే కాల్పనిక భావుకత

విమర్శలో విరివిగా లాస్యం చేస్తూ ఉండటం గమనిస్తాం. చలం గీతాంజలికి 'అనుమేళన' రాసిన నాటినుండి 'పరిప్రేక్ష'దాకా ఈ ప్రవృత్తి ప్రవహిస్తూంటుంది. 1980 తరువాత వారి విమర్శలో లలిత కళా ప్రధానమైన సాహిత్యానుశీలన దృక్పథం ప్రధానంగా ప్రకటితమౌతూ ఉంటుంది.

విమర్శలో కాల్పనిక భావుకత రచన కొక కవితా విస్ఫూర్తిని కలిగిస్తుంది. కావ్యాన్ని చదివినప్పుడు విమర్శకుడు పొందిన అతీంద్రియానుభవాన్ని భావావేశంతో కూడిన ఒక కళాభివ్యక్తి ద్వారా ప్రకటించాలనే ప్రయత్నం అందులో ప్రగాఢంగా కనపడుతుంది. తన అనుభవానికి తానే అభినవ ప్రమాణాలను సృష్టించి లయాత్మకంగా నిర్మించాలనే ప్రవృత్తి ద్యోతకమౌతుంది. డాక్టర్ సంజీవదేవ్ గీతాంజలికి రాసిన అనుమేళనలో వారి విమర్శ భావాంబర వీధుల్లో ఎగురుతూ కళా సూత్రాలను లయాత్మకంగా దర్శించి అనుశీలనలో కాల్పనిక ధోరణిని వ్యక్తం చేయటం ఎత్తుగడలోనే కనపడుతుంది.

మౌనం అభివ్యక్తమైతే భాష
భాష అవ్యక్తమైతే మౌనం
మౌనం భావానికి చెందింది
భాష రూపానికి చెందింది.

ఇది పద్యం కాదు. తన విమర్శకు లయాత్మకంగా డాక్టర్ సంజీవదేవ్ (పుట 132) ఆలపించుకొన్న లక్షణ సూక్తం. పీఠికలో టాగూర్, చలం భాషాభివ్యక్తులను గురించి సమీక్షించటానికి ఈ సూక్తాన్ని ప్రాతిపదికగా చేసుకొన్నారు. దీనిని వివేచించేటప్పుడు సంజీవదేవ్‌గారు మొదటి రోజుల్లో అనుభూతిని, మర్మధోరణిని బలంగా వ్యక్తంచేసేవారు. ఇప్పటికీ ఆ జీవలక్షణం వారి విమర్శకు ఉంది. అనుభూతి విమర్శ అంటే విమర్శకుడు తాను అనుభవిస్తున్న కళానుభవాన్ని వచనంలో పఠితకు అభివ్యక్తి ద్వారా అందించే ఒక రచనా పద్ధతి. ఎలాగంటే – శైలక్షణాలను వివరిస్తూ గీతాంజలి పరంగా వ్యాఖ్యానించేటప్పుడు కూడా సంజీవదేవ్‌గారు అనుభూతి సాంద్రత నుండి విమర్శ భూమి మీదకు దిగి వాస్తవంగా పలకరు. ఉదాహరణకు –

'గీతాంజలికి ఇలాంటి విశ్వజనీనతను కలిగించిన రవీంద్రుని జీవితం ఒక గొప్ప మౌన గీతాంజలి. రవీంద్రుని జీవితం భాషారూపందాలిస్తే 'గీతాంజలి' అవుతుంది. 'గీతాంజలి' మౌనాన్ని దాలిస్తే రవీంద్రుని జీవితం అవుతుంది. నిశ్శబ్ద 'గీతాంజలి' ఆయన జీవితం 'సశబ్ద జీవితం ఆయన గీతాంజలి'.

ఇది విమర్శ కాదని చెప్పలేం. కాని, కాల్పనిక ధోరణిలో కవితామయంగా చేసిన విమర్శ. పైకి చూస్తే ఇది పరామర్శలాగా కూడా అనిపిస్తుంది. కాని, సంజీవదేవ్‌గారు విమర్శను విస్పష్టంగా వ్యక్తీకరించగలరు కూడా. 'నుడికారం లేని భాషకుండే భాష తీవ్రత నుడికారం ఉన్నభాషకుండదు. చలంగారి భాషలో తెలుగు నుడికారం తక్కువ. అందుకే ఆయన భాషకు పదునెక్కువ. 'గీతాంజలి' అనువాదానికి ఇలాంటి భాషే ఎక్కువ అందాన్ని తెచ్చేది'. ఇటువంటి వాక్యాలు విమర్శకు ప్రాణాలు. డాక్టర్ సంజీవదేవ్ విమర్శను కాల్పనిక ప్రమాణాలతో వినిర్మించటం వల్లా, సౌందర్యశాస్త్రంలో, కళాభివ్యక్తిలో ఉండే మర్మాలను విలువలుగా వివేచించటంవల్లా కాల్పనిక భావుకతను పోషించి తమ ప్రత్యేకతను నిల్పుకొన్నారు.

కాల్పనిక భావుకతలో మరొక ముఖ్య లక్షణం. వినూత్న పారిభాషిక పద కల్పనం. డాక్టర్ సంజీవదేవ్ లలితకళా స్రష్టలు, కళా విమర్శకులు. వారి సృష్టిలో మరికొన్ని ప్రమాణాలు క్రొత్తగా సాహిత్య క్షేత్రంలో కల్పింపబడ్డాయి. ఇవి సాహిత్య లక్షణాలను మాత్రమే పాటించేవారికి నవీనాలుగా, అపూర్వాలుగా అనిపిస్తాయి. ఉదాహరణకు సంజీవదేవ్‌గారి 'లలిత సాహిత్యం' అనే పారిభాషిక పదకల్పనం గ్రహించవచ్చు.

'ఇక లలిత సాహిత్యం అంటే బాహ్య ప్రయోజనాలకు తక్కువ స్థానం ఇచ్చి మానవుని రసజగత్తుకు ఎక్కువ స్థానం ఇచ్చే రచనలు' (పుట 137). ఈ వివేచనం ఉపయోగి కళలు, లలిత కళలు అనే కళాదృక్పథం గల విమర్శకుడు దర్శించగలిగేది. ఒక కళలోని విమర్శన మర్మాలను మరొక కళలో ప్రవేశపెట్టి, ఒక అద్భుత తులనాత్మక అనుభూతిని కల్పించే ప్రవృత్తి కాల్పనిక భావుకతా విమర్శలో ఉండే ఒక బలమైన లక్షణం. ఆ ప్రవృత్తి సంజీవదేవ్‌గారి విమర్శకు మూలబలం.

సామాన్యంగా కాల్పనిక భావుకత గల విమర్శలో అలంకారికత, మార్మికత, ఒక్కొక్కసారి ప్రతీకాత్మకత, భావబింబాత్మకత కూడా విరివిగా చోటు చేసుకొనవచ్చును. ఎలాగంటే, సంజీవదేవ్ గారు రవీంద్ర కవీంద్రుణ్ణి విశ్వజనీన సాహిత్య స్రష్టగా పేర్కొని, వారి అనుభవాన్ని పఠితలో బలపడేటట్లు ప్రతి సృజనం చేయటానికి పైమార్గాన్ని అనుసరించారు, గమనించండి.

'రవీంద్రుని లేఖిని ఒక విశ్వవీణ; ఈ వీణాతంత్రుల ఝుంకారం విశ్వమానవుని హృదయ స్పందనాన్ని ప్రతిధ్వనిస్తుంది; రవీంద్రుని హృదయం ఒక విశాల దర్పణం; ఈ దర్పణం విశ్వప్రేమ యొక్క విరాట్ రూపాన్ని ప్రతిబింబిస్తుంది. ఇందులో సంకుచిత దేశభక్తికీ, జాతి దురభిమానాలకూ, సాంఘిక పరిధులకూ తావులేదు' (పుట 137-138).

కాల్పనిక భావుకుడైన విమర్శకుడు కావ్య తత్వాన్ని వివేచిస్తే ఇలా ఉంటుంది. మచ్చుకు – 'గీతాంజలి తత్వం ద్వైత తత్వం. ప్రేమికుడూ ప్రేయసీ ఇద్దరుగా ఉంటేనే ఆనందాన్ని అనుభవిస్తున్న జ్ఞానం ఉండేది. ఇద్దరూ తమ వ్యక్తిత్వాల్ని పోగొట్టుకొని ఒకటిగా అద్వైత సిద్ధి పొందితే ఇక అనుభవించేవారూ ఉండరు. అనుభవించబడేవారూ ఉండరు. అలాంటప్పుడు ఆనందానుభవం సున్న. ఆనందిస్తున్న జ్ఞానం ఆరకుండా ఉంటేనే ఆనందం; అందుకే ద్వైతంలో ఆనందం. ఆనందిస్తూన్న జ్ఞానం ఆరిపోతే ఆనందం సున్న. అందుకే అద్వైతంలో ఆనందం లేదు. భోక్తా భోగ్యాల పార్థక్యమే ఆనందానుభూతిని సార్థక పరిచేది. ద్వైత సమ్మిలనం సరసం, అద్వైతైక్యత నీరసం' (పు. 149).

ఈ విమర్శలోని భాష అనుభూతి భాష. 'ఆనందిస్తున్న జ్ఞానం ఆరిపోవటం' వంటి అభివ్యక్తి అనుభూతి వ్యంజకం. మార్మిక కవితా తత్వాన్ని ఆవిష్కరించటంలో అనుభూతి విమర్శ ఒక సముచిత మార్గమనీ, అనుభూతి విమర్శావ్యక్తికి కాల్పనిక భావుకత ఒక సద్గుణమనీ సంజీవదేవ్ గారు భావించి ఉంటారు.

'సమీక్షారేఖలు'లో ప్రకటించిన పీఠికలన్నింటిలో కాల్పనిక భావుకతతో కూడుకున్న అనుభూతి విమర్శ దర్శనమిస్తుంది. సంజీవదేవ్‌గారి ఈ పీఠికలో మన మనస్సులకు అందే అనుభవం ఏమంటే వారు రచనను చదివిన అనుభవాన్ని ఒక వర్ణచిత్రంగా మనసులో ముందు దర్శిస్తారు. దానిని భావాలలో, భాషద్వారా పఠితకు అందించటానికి ప్రయత్నిస్తారు. ఆందువలన పీఠికలు ఒక కళాకారుని మనస్సులో అనుభూతి వర్ణచిత్రాల లయాత్మక అభివ్యక్తులుగా మనకు దర్శనమిస్తాయి.

ఇటువంటి విమర్శ విశ్లేషణ జీవితసూత్రంగా ఎన్నుకోదు. సంయోజనను దర్శనపాత్రంగా గ్రహిస్తుంది. శిల్పవిశేషాలను సోదాహరణంగా ప్రపంచించదు, శిల్పానుభూతిని పఠితలో అనుస్పందింపచేయటానికి తానే కళామయంగా రూపవైచిత్రిని ప్రదర్శిస్తుంది. రచనాగతమైన సౌందర్యాన్ని ఈ విమర్శలో విమర్శకుడు దర్శించి మనకు ప్రదర్శించినట్లు రచించి చెప్పడు కాని, రచనాగత సౌందర్యానుభూతికి కావలసిన భావోద్వేగ స్థితిని పీఠికారచన ద్వారా పఠితలో కల్పించి, రచనను స్వయంగా, సూటిగా అదే చిత్తపరీపాకంతో చదివి ఆస్వాదించే అభిరుచి ఆవిష్కరించే ప్రయత్నంచేస్తాడు. రచయితకు తగిన మనఃప్రవృత్తిని పీఠికద్వారా కల్పించే మర్మం అనుభూతి విమర్శలో సంజీవదేవ్‌గారు ఆవిష్కరించే కళాధర్మం!

ఏ రచననైనా పఠిత చదివి ఆస్వాదించాలంటే దానికి తగిన తాత్విక భూమిక ముందుగా అతని చిత్త క్షేత్రంలో ఏర్పడి ఉండాలి. దాన్ని పీఠిక సంతరించి పెట్టాలి. అదే ప్రధానలక్ష్యం

సంజీవదేవ్‌గారి పీఠికా రచనలో గోచరిస్తుంది. అందువలన సంజీవదేవ్‌గారి పీఠికల ఎత్తుగడలన్నీ విచిత్రంగా ఉంటాయి. ఎక్కడ మొదలు పెడుతున్నారు? ఎక్కడకు తీసుకొని పోతున్నారు? ఎక్కడ ముగిస్తారు? – అనే భావోద్వేగాన్ని కల్పిస్తూనే మనలో రచనాస్వాదనాపరమైన ఒక సజాతీయ చిత్త సంస్కారాన్ని క్రమంగా నిర్మించుకుంటూ పోతారు.

పీఠికా ప్రారంభంలో సంజీవదేవ్‌గారు కొన్ని కళా సూత్రాలు, తత్వసూక్తాలు పలుకుతున్న లాక్షణికుడుగా, దార్శనికుడుగా గోచరిస్తారు. అవన్నీ ఆయన సహృదయునిలో గ్రంథోన్ముఖంగా నిర్మింపదలచుకొన్న అనుభూతి భవనానికి పునాదులు, తాత్త్విక భూమికలు. శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులుగారి 'శిల్పకళాక్షేత్రాలకు' వ్రాసిన ముందుమాట 'విహంగవీక్షణ' – ఆ ముందుమాటలోని ముందుమాటలు, సంజీవదేవ్‌గారు వారి పీఠికకు వేసుకుంటున్న కళాసూత్ర ప్రాతిపదికలుగానే కాకుండా, సహృదయులు ఆ గ్రంథం చదివి ఆస్వాదించటానికి కావలసిన తాత్త్విక ప్రాతిపదికలుగా మనకు దర్శనమిస్తాయి. గమనించండి –

'సురూపాన్ని కనటం, సునాదాన్ని వినటం సుందర జీవనంలో ఒక మధురసాధన, వస్తురూపంలో సహజంగా సౌందర్యం లేనప్పుడు మానవుడు దానిలో సౌందర్యాన్ని సృష్టిస్తాడు'.

అప్పుడు ఆ వస్తువు శిల్పం అవుతుంది. ఆ మానవుడు శిల్పి అవుతాడు. అప్పుడు ప్రకృతి శిల్పంగా రూపాంతరం చెందుతుంది.

ప్రకృతి భావం (Being), శిల్పం భావం (Becoming), మొదటిది స్థితి, రెండవది గతి. స్థితి నియమబద్ధం, గతి లయబద్ధం. నియమబద్ధం బంధనామయం, లయబద్ధం స్వేచ్ఛా మయం.

ప్రకృతి బంధనంలో బద్ధమై వుంటే, శిల్పం స్వేచ్ఛావాయువుల్లో విహరిస్తుంది.

శిల శిల్పంకాదు; శిల లయమయమైనప్పుడే శిల్పం. వర్ణం చిత్రం కాదు; నాదం సంగీతం కాదు; చలనం నృత్యం కాదు. ఇవన్నీ ముడిపదార్థాలు. ఇవి లయ యంత్రంలో తయారైనప్పుడే కళా స్వరూపాలు కాగలవు.

కనుక లయమయ వర్ణం మాత్రమే చిత్రం; లయమయ నాదం మాత్రమే సంగీతం; లయమయ చలనం మాత్రమే నృత్యం.

కవులు, పండితులు, శిల్ప మర్మజ్ఞులు అయిన దర్శనాచార్య కొండూరు వీరరాఘవా

చార్యులుగారు రచించిన 'శిల్పకళాక్షేత్రాలు' ఇటువంటి సృజనాత్మక శిల్పాల గురించిన సమీక్షాత్మక రచనలు'.

ఈ చివరి పేరా రాయటానికి పీఠికాకర్త తొమ్మిది పేరాలు రాశారు. అవన్నీ గ్రంథ నామంలోని 'శిల్ప' శబ్దాన్ని సహృదయులు సక్రమంగా అర్థం చేసుకొనటానికి తోడ్పడే కళాశాస్త్ర సూత్రాలు. అంటే – ఈ గ్రంథానికి కావలసిన శాస్త్ర వివేచన ప్రమాణాలు. గ్రంథానికి అనువైన పఠితను తయారుచేసే శాస్త్రకోశం సంజీవదేవ్‌గారి పీఠికా పూర్వపాదం. ఇది సాధారణమైన లక్షణం వారి విమర్శలో.

సామాన్యంగా దార్శనిక విమర్శకుల పీఠికలుగానీ, విమర్శలుగానీ ఈ స్వభావాన్ని సంతరించుకొని ఉంటాయి. విశేషమేమంటే గ్రంథకర్త వీరరాఘవాచార్యులు గారూ, పీఠికాకర్త డాక్టర్ సంజీవదేవ్‌గారూ ఇరువురూ దార్శనికులే. 'ఒక జాతి సభ్యతా సంస్కృతులు ఆ జాతి సాహిత్యం మీద, దార్శనిక దృష్టిమీదా ఎంతగా ఆధారపడి ఉంటవో అంతకంటే ఎక్కువగా ఆ జాతి శిల్పకళా సంపదపై ఆధారపడి ఉంటవి'. అన్నారు శ్రీ సంజీవదేవ్‌గారు. శిల్పకళ మీద సాహిత్యం మీద కంటే, తత్త్వదర్శనం మీద కంటే చింతాకంత ఎక్కువ అభిమానం ప్రకటించడం ఈ గ్రంథ శిల్పావిష్కరణ రహస్యంలోని శిల్పం.

పీఠికలలో విమర్శకుని వ్యక్తిత్వం గురించి వివేచించటం కష్టం. ఎందుకంటే – పీఠిక గ్రంథం కోసం కాని. గ్రంథం పీఠికకోసం కాదు. పీఠికా కర్త గ్రంథ పరిధిని దాటి విహరించటానికి వీలులేదు. గ్రంథంలోని తత్త్వాన్ని ఆవిష్కరించే యత్నంలో రచయిత దర్శనాన్ని తన దార్శనిక దృక్పథంతో ఆవిష్కరించాలి. రచయితకూ, పీఠికాకర్తకూ హృదయ సంవాదం కుదిరినప్పుడే అటువంటి పని సాధ్యం!

'సమీక్షారేఖలు' లోని పీఠికలలో సంజీవదేవ్‌గారు స్థూలంగా అనుభూతి విమర్శ పద్ధతిని పాటించారని చెప్పాలి. పీఠికలు సమగ్ర విమర్శ స్థాయిలో వెలువడటానికి వీలుండదు కాబట్టి (కొందరు రాస్తారు. కానీ సంజీవదేవ్‌గారికి ఆ అలవాటు లేదు), సమీక్షలని పేరుంచినట్లుంది. పేర్లుంచటంలో సంజీవదేవ్‌గారికి ఔచిత్య దృష్టి, సార్థక్య దృష్టి అధికం.

తెలుగులో సాహిత్య విమర్శకులు సామాన్యంగా పాటించే విశ్లేషణ విధానాన్ని గానీ, తెలుగు విమర్శలో రూఢికెక్కిన విమర్శక సూత్రాలను గానీ సంజీవదేవ్‌గారు ఒక్కొక్కసారి పాటించరు. వారి చిత్రకళారంగంలోని ఆలోచన ధోరణులను సాహిత్యలోకంలోకి తెస్తారు. అంతేకాదు సాహిత్యానికి సంబంధించిన వాటిని కూడా కొత్తగా తమ దృష్టితో వివేచిస్తారు,

విశ్లేషిస్తారు. దీనివలన తెలుగు విమర్శకు కొన్ని కళా ప్రమాణాలు దొరికాయి. అయితే, అవి సాహిత్య క్షేత్రంలో ప్రాచుర్యం చెందాయా లేదా అన్నది మాత్రం వేరే విషయం.

డాక్టర్ సంజీవదేవ్‌గారు తమ పీఠికలలో ఆయా రచనల పట్ల ప్రసరించిన సాపేక్ష ప్రమాణాలకు సంబంధించిన కొన్ని అంశాలు –

1. అనువాదాలు మూడు విధాలని తెలుగు విమర్శకులు సంభావించటం ప్రసిద్ధమే. కాని, ఆ మూడింటికీ, డాక్టర్ సంజీవదేవ్‌గారు చెప్పే మూడు విధాలకూ తేడా ఉంది.

'అనువాదాలు ప్రధానంగా మూడు విధాలు. పద్యానికి పద్యానువాదం. గద్యకు గద్యానువాదం. పద్యానికి గద్యానువాదం'. (రెండు పలుకులు – రామచరిత మానసామృత పీఠిక (1962) సమీక్షా రేఖలు – పు. 20).

ఈ విభాగం పీఠిక రాస్తున్న రచనను ఆస్వాదించేటందుకు ఉపయోగపడే సాపేక్ష విభాగమే కాని, సాహిత్యానికంతా వర్తించే విశ్లేషణం కాదు. అనువాదం గద్య పద్యాత్మకమైన వాహికల కంటే విశిష్టమైన లక్షణాలతో చూడదగిన కళ. అయితే, శ్రీమతి నేలనూతల పార్వతీకృష్ణమూర్తిగారి రచన పద్యానికి గద్యానువాదం. దాని గుణాన్ని చెప్పటానికి ఈ విశ్లేషణం ప్రాతిపదిక కావలసి వచ్చింది. డాక్టర్ సంజీవదేవ్‌గారి విమర్శ సాపేక్ష లక్షణాల సంజీవని.

2. శ్రీ వేగుంట మోహన ప్రసాద్‌గారి 'చితి–చింత'కు పీఠికను రాస్తూ ఆధునిక కవితా స్వరూప స్వభావ వివేచనాన్ని అనుభూతి పరంగా సాగించారు. వారి విమర్శకు స్పష్ట ప్రతిపత్తిని కలిగించే వివేచనను ముందుగా వారే లక్షణ సూక్తంగా మనకందిస్తారు. అందువలన పఠితకు ప్రాణం సుఖంగా ఉంటుంది. ఉదాహరణకు ఒకటి –

'కవితకు ప్రధానంగా నాలుగు అంగాలుంటవి. మొదటిది కవిత నిర్మించబడిన శబ్దాలు వెలువర్చే సంవేదనాత్మక ధ్వనులు, వాటి ద్వారా వ్యక్తమయ్యే రూపాలు. రెండవది ఈ శబ్దాలు కలిసి ఒక పరికల్పనలో తాల్చే సంయుక్త రూపం. కవితలోని రెండు అంగాలనూ కలిపి రసాత్మక బహిర్భాగం అనవచ్చు. దీన్నే పాశ్చాత్య రసతత్వంలో Aesthetic surface అంటారు. భారతీయ ఆలంకారికులు దీన్నే కావ్య స్వరూపం అంటారు. మూడవది, ఈ కావ్య స్వరూపం దేన్ని వ్యక్తం చేసేదీ తెలుపుతుంది. అంటే అర్థం అనేదాన్ని ప్రసాదిస్తుంది. అది మానవుని గురించి రచించబడిందా, దానవుని గురించి రచించబడిందా, లేక చెట్టును గురించో, గుట్టను గురించో, పశువును గురించో, పక్షిని గురించో రచించబడిందా అని తెలుపుతుంది. దీన్నే కావ్య వస్తువు అనీ, poetic content అనీ అంటారు. ఇక నాలుగవది భావం. మొదటిదీ రెండవదీ కలిసి

కవితను మన గ్రహణేంద్రియాలకు అందజేస్తవి. మూడవది మనకు భోగట్టా ఇస్తుంది. నాలుగవది రసానుభూతిని కలిగిస్తుంది. పై నాలుగంగాలలో కొన్ని కవితలలో కొన్ని అంగాల ప్రాధాన్యం, మరికొన్ని కవితలలో మరికొన్ని అంగాల ప్రాధాన్యం ఉంటే, ఇక మరికొన్నిటిలో అన్ని అంగాలూ సమాన ప్రాధాన్యాన్ని వహించి ఉంటవి'. (సమీక్షా రేఖలు – పుట 25–26).

3. శ్రీ దోనేపూడి రాజారావుగారి 'గోపీచంద్' (1969) కు ముందుమాట 'గురించి' రాస్తూ చేసిన ఈ వివేచన ఆ రచనకు ఎంత వర్తిస్తుందో సంజీవదేవ్‌గారి విమర్శకు కూడా అంతే వర్తిస్తుంది.

'రచన ప్రధానంగా మూడు విధాలుగా విభజించవచ్చు. 1. వర్ణన, 2. సమీక్ష, 3. ఆత్మాభివ్యక్తి (Self-expression). బాహ్య భాగాని కెక్కువగా చెంది ఉంటుంది వర్ణన. బాహ్యాభ్యంతరాలకు రెంటికీ చెంది ఉంటుంది సమీక్ష. ఇక ఆత్మాభివ్యక్తి చెంది ఉంటుంది అభ్యంతరానికి' (సమీక్షారేఖలు – పుట 38).

పేరును బట్టి చూస్తే 'సమీక్షారేఖలు'లో పీఠికలలోని విమర్శలు రచనలో బాహ్యాభ్యంతరాలను రెండింటినీ సమీక్షించేవని స్పష్టమౌతుంది. డాక్టర్ సంజీవదేవ్‌గారు అద్దం, దీపం ఉపమానంతో ఈ అంశాన్ని బాగా వివరించారు. M H Abrams - The Mirror and the Lamp అనే పేరుతో Romantic Theory and Critical Tradition మీద రాసిన గ్రంథం ఇంగ్లీషులో చాలా ప్రసిద్ధికెక్కింది. దానిని ఆక్స్‌ఫర్డు యూనివర్సిటీ ప్రెస్‌వారు 1953లో ప్రచురించారు.

అద్దంలో అంతా ప్రతిబింబిస్తుంది. అంటే కనిపించేది ప్రతిబింబిస్తుంది. కనిపించక చీకటిలో మరుగుపడినదాన్ని చూపిస్తుంది దీపం. సాహిత్యంలో అద్దానికి సంబంధించింది కొంత, దీపానికి సంబంధించింది కొంత. అద్దానిది వాస్తవవాదం. దీపానిది ఆదర్శవాదం. అద్దానికి రూపం ప్రధానం. దీపానికి భావం ప్రధానం. పాశ్చాత్య సాహిత్యంలో అద్దానికి సంబంధించిన దాన్ని క్లాసిసిజం అనీ, దీపానికి సంబంధించిన దాన్ని రొమాంటిసిజం అనీ అనటం జరిగింది. ప్రాచ్య సాహిత్యంలో శుద్ధమైన క్లాసిసిజంలో కూడా రొమాంటిసిజం ఛాయలు గోచరిస్తాయి. కేవలం రూప పరిపూర్ణత ప్రాచ్య సాహిత్య లక్షణం కాదు.

రూపంతో కూడా భావం లగ్నమైఉంటేనే అది ఉత్తమ సాహిత్యంగా ప్రాచ్య సంప్రదాయం తలంచుతూ వచ్చింది. కనుపించే దానికి అనుకరణ కాక, కనుపించని దాన్ని అన్వేషించి పట్టుకోటం. అందుకే ప్రాచ్య సాహిత్యానికి అద్దానికంటే దీపం ప్రధానమైంది. అద్దంలోకి బయటి నుండి వస్తువులు ప్రవేశిస్తాయి. కనుక వస్తుగతం (objective), దీపపు కాంతి వెళ్ళి వస్తువుల

మీద పడుతుంది కనుక అది వ్యక్తిగతం (Subjective). ఉత్తమ సాహిత్యంలో అద్దం-దీపం ఈ రెంటి సంశ్లేషణ, దానిలో బాహ్యరూపమూ, ఆంతరిక భావమూ రెండూ తగినంతగా ఉండాలి' (సమీక్షారేఖలు : పుట 54).

అంతర్బహిర్దర్శనాల సమన్వయ సమీక్ష సంజీవదేవ్‌గారి విమర్శ వివేకం. 1980 దాకా వారి వివేచనలో కాల్పనిక భావుకత ప్రధాన పాత్ర నిర్వహించింది. ఆ తరువాత లలితకళా దర్శన ప్రధానమైన సాహిత్యానుశీలనం ఎక్కువగా చోటుచేసుకొన్నది. సంజీవదేవ్‌గారు 1980 దాకా తమ చూపుతో సాహిత్యాన్ని చూచారు; ఆ తర్వాత క్రమంగా సాహిత్యంలో స్వీయ అస్తిత్వంతోనే కరిగి జాలువారారు. ఈ తేడా వారి పీఠికలలో కనపడుతుంది.

1980 తరువాత డాక్టర్ సంజీవదేవ్‌గారు అటు పద్య కావ్యాలకూ ఇటు వచన కవితా సంకలనాలకూ పీఠికలు రాశారు. అయితే నా దృష్టిలో పద్య కవితలకు రాసిన పీఠికలు చాలావరకు విమర్శలనటం కంటే పరామర్శలనటం మేలు. ముఖ్యంగా ఆచార్య యస్వీ జోగారావుగారి 'శృంగార సర్వజ్ఞము'నకు రాసిన 'ఆస్వాదన' అభిప్రాయం అలాంటిది.

కవిలోని సృజనాత్మక ప్రతిభను 'ప్రఖ్యా' అంటారు. కవితా శిల్పాన్ని 'ఉపాఖ్యా' అంటారు. ఆచార్య జోగారావులో వున్నది 'ప్రఖ్యా', వున్నది 'ఉపాఖ్యా'. అందుకే ఆయన కవిగా రూపొందితే, ఆయన వాక్యం కావ్యంగా రూపాంతరించింది'. అభిప్రాయంలో కూడా అంతర్లయను పొంగించి అలంకృంతం చేసే నేర్పు సంజీవదేవ్‌గారికి ఉంది.

ఈ కోవకే చెందుతుంది డాక్టర్ నాగభైరవ కోటేశ్వరరావుగారి 'గుండ్లకమ్మ చెప్పిన కథ'కు రాసిన 'ఒక చిన్నమాట'. ఈ ముందుమాటలో కొన్ని కావ్యానికి అతికేవి ఉన్నాయి; కొన్ని అతకనివీ ఉన్నాయి. అయినా మనకు రెండూ ఉపయోగపడతాయి.

'ఉన్నతమైన కవి భౌతికవాదానికి, మర్మవాదానికి (Misticism) మధ్యలో ఉంటాడు. భౌతికవాదుల వలె ఇంద్రియ గ్రాహ్య జగత్తును మాత్రమే అంటిపెట్టుకొని ఉండడు. మర్మవాదుల వలె అతీంద్రియ జగత్తుకు మాత్రమే అతికి ఉండడు. రెంటి సమన్వయం కవి. వాస్తవ జగత్తూ మాయకాదు, కల్పనా జగత్తూ మాయ కాదు కవి దృష్టిలో. రెండూ వాస్తవాలే'. ఈ మాటలు పీఠికలో చదివి పఠిత లాభిస్తాడు. విమర్శ ప్రమాణాలు వికసిస్తాయి. పరామర్శలో నుండి సంజీవదేవ్‌గారు ఇటువంటి విమర్శ సూత్ర పారిజాతాలను విరజిమ్ముతూ ఉంటారు'.

పరామర్శ పరిధిని దాటి విమర్శ స్పృహను గలిగించే పీఠిక 'తోరణం'. ముందుమాట ముగిస్తూ మంచి జడ్జిమెంటు ఇచ్చినట్లు రాసిన ఈ భాగం పీఠికకు విమర్శ స్థాయిని కల్పిస్తున్నది.

'కవితా రచన చేయటానికి ఇతివృత్తం అనేది ఒక సాకు మాత్రమే కొందరు కవులకు, మరికొందరకు ఇతివృత్తాన్ని వ్యక్తపరచటానికి కవితా శిల్పం కేవలం ఒక వాహనం మాత్రమే. ఈ రెండు రీతుల్లో కూడ కొంత అసమగ్రత గోచరిస్తుంది'.

మరి 'ఆశ్రమ సందర్శనము' కావ్యకర్త అయిన శ్రీ సత్యనారాయణ పై రెండు విధానాల్లో దేనికి చెందుతారు? అంటే, ఆ రెంటిలో దేనికీ చెందరు అని తేలుతుంది. వారి కావ్యాన్ని అనుశీలించిన తరువాత ...

వారు దేనికీ చెందక ఇక చెందేది దేనికి?

రెంటి సమన్వయమైన మూడవదానికి చెందుతారు.

ఈ మూడవ విధానంలో కవి ఇతివృత్తాన్నీ, కవితా శిల్పాన్ని వేరు వేరుగా గ్రహించక రెంటినీ ఒకటిగానే గ్రహిస్తారు. వస్తువూ, రూపం, రెండూ ఒకటినొకటి పెనేసుకొని వారికి గోచరిస్తవి. మాధ్యమం నిమిత్తం ఇతివృత్తమూ కాదు. ఇతివృత్తం నిమిత్తం మాధ్యమమూ కాదు. రెండూ కూడ రెంటి నిమిత్తమే'.

పీఠిక మొదలు పెట్టేటప్పుడు ఒక రకమైన అబ్బురపాటును కలిగించటం, ముగించేటప్పుడు మరొక రకమైన అద్భుతాన్ని ప్రదర్శించటం డాక్టర్ సంజీవదేవ్‌గారి శిల్పం!

వచన కవితా సంపుటాలకు సంజీవదేవ్‌గారు రచించిన పీఠికలన్నీ విమర్శ స్పృహతో వెలుగొందుతున్నవే. అయితే శ్రీమతి రేవతీదేవిగారి 'శిలాలోహిత'కు ముందుమాట రాసినప్పుడు (1980) డాక్టర్ సంజీవదేవ్‌గారు వచన కవితా ఖండికలను ఉదాహరించి, స్పందించి, వ్యాఖ్యానించే వర్ణనాత్మక సమీక్షను సాగించారు. అయినా అక్కడక్కడా విమర్శ వీచికలను సారించారు. మచ్చుకు ఒక్కటి –

'ఆమె కవితల్లో కవితా శిల్పంకంటే దార్శనిక చింతన, మనోవైజ్ఞానిక అవగాహన ఎక్కువగా గోచరిస్తాయి. వీటికి తోడు నిత్యజీవితంలోని వడుదుడుకులు సామాజిక అన్యాయాలు, నిరాశా నిస్పృహలు మొదలైన వాస్తవానుభూతులు కూడా ఇందులో తొంగిచూస్తుంటాయి. వచన కవితలో కూడా కవిత్వం అనిపించుకొనే శిల్పం కొంత ఉంటుంది. అటువంటిది కూడా లేనప్పుడు వచన కవిత వచనంగా మాత్రమే నిలచిపోయే ప్రమాదం ఉన్నది'.

ఆచార్య తిరుమలగారి అక్షరాగ్నికి ముందుమాటలో ముత్యాల్లాంటి మూడు వివేచన సూత్రాలను వ్యక్తీకరించారు. అనుశీలనంలో ఆకృతి తాల్చిన విమర్శాంశ వివరణలివి – చూడండి.

1. 'ఛందోబద్ధ కవితలో శిల్పం ప్రధానం. ముక్తఛ్ఛంద కవితలో భావం ప్రధానం. రెంటిలో కూడా ప్రధానం ప్రాణ స్పందన'.

2. 'ఒకోసారి అంత్యప్రాసలు కవిలోని భావ దారిద్ర్యానికి ప్రతీకలై నిలుస్తాయి'.

3. 'అభావాన్ని భావంలోకి, భావాన్ని రూపంలోకి, రూపాన్ని రసంలోకి, రసాన్ని విశ్వ శ్రేయంలోకి రూపాంతరం పరుస్తుంది కవితా శిల్పం'.

వచన కవితా సంకలనాలకు పీఠికలు రాసిన సంజీవదేవ్‌గారి సాహితీ వ్యక్తిత్వం విశిష్టమైనది. ఒక్కొక్క కావ్యం, ఒక్కొక్క కవిత డాక్టర్ సంజీవదేవ్‌గారి భావ సమాధిని స్పందింపచేస్తుంది. దానికి వారు అనుస్పందించినట్లు, ప్రతిస్పందించినట్లు పీఠికలు రాశారు. కావ్యాలు నిమిత్తాలుగా గోచరిస్తాయి; సంజీవదేవ్ గారి దీర్ఘ స్వగతంలా సాగుతుంది పీఠిక. అందులో పంచకోణాత్మక ప్రవృత్తిలాగా అయిదు అవస్థలు గోచరిస్తాయి. ఆనందమయ కోశం లాంటి అనుభూతి స్థితి, విజ్ఞానమయ కోశం లాంటి శాస్త్ర వ్యుత్పత్తి. ప్రాణమయ కోశం లాంటి కళాస్పందన ప్రవృత్తి, మనోమయ కోశం లాంటి విమర్శ సూత్ర వివేకం; అన్నమయ కోశం లాంటి వివరాలు. అయితే ఈ అయిదింటినీ వేరుచేయటం కష్టం. అందులోనూ డాక్టర్ సంజీవదేవ్ గారు అన్నమయకోశం కంటే ఆనందమయ కోశంలో ఎక్కువగా ఉపజీవించే కళాతపస్వి. ఆయన మాటలు వాక్కులలా వినపడే బుక్కులు.

1. అనుభూతి ప్రధానమైన కవిత సమాజ స్పృహకు దూరం కాదు (గాలిహోరు).

2. ఏ విధంగా రచించినా కవిత కవితే. దాన్ని సామాజిక స్పృహ కవితనీ, అనుభూతి కవితనీ విభజనం ఏర్పరచటం, 'ఇజం'ల ఇనుప సంకెళ్ళలో బిగించటం కవిత్వాన్ని భగ్నం చేస్తుంది (గాలిహోరు).

3. కవితా కళలో ప్రధాన భాగస్వాము లిద్దరు - కవి, సహృదయుడు. పాశ్చాత్య కవితా జగత్తులో కవికివ్వబడిన ప్రాధాన్యం సహృదయుడికి ఇవ్వబడలేదు (మాటల నీడలు).

4. కవిత అంటే మాటలు కాదు; మాటల నీడలు (మాటల నీడలు).

5. ఆధునిక వచన కవితలో విషయం కాని, రూప నిర్మాణం కాని అంత ప్రధానం కావు. కవితలో ఒక నవచైతన్య స్రవంతి ముఖ్యం నేడు (మాటల నీడలు).

6. శాస్త్ర విషయాల్లో స్పష్టత అవసరమైట్లు కళా విషయాల్లో కొంత అస్పష్టత అవసరం (కవితా కలాపం).

7 కొందరి కవితల్లో రూపం ప్రత్యక్షమైనట్లే, కొందరి చిత్రాల్లో కవితలు వినిపిస్తాయి. అటువంటి చిత్రాలనే 'రంగుల్లో కవితలు' అంటారు. రూపాలు గోచరించే కవితల్ని 'మాటల్లో చిత్రా' లంటారు (కవితా కలాపం).

8. ఆధునిక కవితలోనే కాక మిగతా కళల్లో కూడా వస్తు ప్రాధాన్యం సన్నగిల్లిపోయింది (కవితా కలాపం).

9. అసలు కళలోని ప్రధాన దశ సృజన కంటే ఆస్వాదనదే (స్థూల రేఖలు).

10. సమీక్షకులందరూ న్యాయంగా సంచరిస్తే మంచిదే కాని, వారిలో కూడా అన్యాయంగా సంచరించే వారుంటారు. వ్యక్తిగత అభిమానాలు, మరికొన్ని రకాల పక్షపాతాలూ వారిని న్యాయపథంలో నడవనీయవు. ఏది ఏమైనా మొత్తంమీద న్యాయ నిర్ణయానికి సమీక్షకుడే అర్హుడు (బింబాలు).

వచన కవితా సంపుటాలకు పీఠికలు రాసినా, డాక్టర్ సంజీవదేవ్‌గారు తెలుగు సాహిత్య వికాసం మీద గాని, కవుల మీద గాని, ప్రయోగాల మీద గాని బలమైన ఆరోపణలు గాని, అధిక్షేపాలు గాని చేయలేదు. తన పని తాను చూచుకొంటూ, తన మాట తాను నిలుపుకుంటూ, తన వ్యక్తిత్వం తాను పోషించుకొంటూ విమర్శ సాగించిన సాహిత్య కళా విమర్శకులు డాక్టర్ సంజీవదేవ్ గారు.

డాక్టర్ సంజీవదేవ్ చేత పీఠికలు రాయించుకొందామని సాహితీ మిత్రులు కోరేవారు. వారు రాసేవారు. ఈ పీఠికా రచన ఒక విధంగా అవధాన విద్య లాంటిది. పృచ్ఛకుడడిగిన ప్రశ్నకు అనుగుణంగా అవధాని కవిత చెప్పాలి గాని స్వయంగా తన వస్తువు తానెన్నుకొనే స్వేచ్ఛ ఉండదు. పీఠికా రచన విమర్శకుని స్వేచ్ఛను పరిమితం చేస్తుంది. కాని, ప్రతిభతో అందులో తన ప్రజ్ఞను ప్రదర్శించాలి. అటువంటివే పీఠికల్లో ప్రతిఫలించే విమర్శ – పరామర్శ.

విమర్శ గ్రంధాలకూ, పరిశోధన గ్రంధాలకూ, శాస్త్ర రచనలకూ డాక్టర్ సంజీవదేవ్‌గారు విలువైన పీఠికలు రాశారు. ఒక్కొక్కటీ ఒక్కొక్క మణిహారం.

'ఒక చిన్నమాట' శాస్త్ర హితోక్తికి చక్కని బాట. 'వీక్షణ' సామెతల సాహిత్యాన్ని గురించిన సమ్యక్ సమీక్ష. 'పరిప్రేక్షితం' వ్యాస శిల్పానికి అక్షర నీరాజనం. 'చర్చ' చలం సాహిత్య చర్చకు మరో చందన చర్చ. 'సింహావలోకనం' నవల మీద నవ్యాలోకం. 'దిక్సూచి' బాపిరాజు నవలా తత్త్వ కళాసూచి, 'వివేచన' మహిళాభ్యుదయం మీద మానవతా వ్యాఖ్య. 'తానం' – చలంగారి

అరుణాచల లేఖా స్వరాలకు స్వర విన్యాసం. 'గద్యదృష్టి' సాహిత్య కళా వివేచన దృష్టి; 'సమ్యక్ దృష్టి' పరిశోధన పరమార్థ నిర్ధారణ దృష్టి. బాల సాహిత్యం కూడా వారి పీఠికలను నోచుకున్నది.

నేనీమధ్య డాక్టర్ టి. రామదాస్‌గారి కవితా సంపుటి 'అనుభూతి'ని చదువుతున్నప్పుడు డాక్టర్ సంజీవదేవ్ గారి 'ఆలోచన' అనే శీర్షికతో ఉన్న పీఠికను ఆసక్తితో గమనించాను. 'అనుభూతి' కవితకు 'ఆలోచన' పీఠిక– అని మనసులో మురిసిపోయాను. సంజీవదేవ్ గారికి ఆలోచన అంటే ఎంతో అభిమానం. ఆలోచన కోసమే కళను గాని, కవితను గాని ఆలంబనంగా ఎన్నుకొనే ప్రవృత్తి వారిది.

డాక్టర్ సంజీవదేవ్ తెలుగు సాహిత్య విమర్శలో కళాచింతనను ప్రతిఫలింపజేసిన ప్రతిభా మూర్తి. ఆయన ఆ శాఖకు ఆచార్యుడు. వారి విమర్శకూ, పరామర్శకూ ఆయన వ్యక్తిత్వం ఎలా స్పందించేదో వారి మాటలలోనే తెలుసుకొందాం.

'ఒక విషయంలో సత్యాసత్యాలను తేల్చే నిమిత్తమై నేను ఆలోచనను సాధనగా తీసుకోను. ఆలోచించే నిమిత్తమే ఏదో విషయాన్ని సాకుగా తీసుకుంటాను. నాకు ఆలోచన నిమిత్తమే విషయం కాని, విషయం నిమిత్తం ఆలోచన కాదు. ప్రయాణం నిమిత్తం వాహనాన్ని ఎక్కటం కాక, వాహనాన్ని ఎక్కేనిమిత్తమే ప్రయాణం చేస్తాను. అయితే నా ఆలోచనకు ప్రధాన లక్షణం విశ్లేషణ కాదు, సంశ్లేషణ మాత్రమే. అంటే నా ఆలోచన ఎక్కువగా సమీక్షాత్మక ఆలోచన కాక సృజనాత్మక ఆలోచనే. అంటే నా ఆలోచనలో లాజిక్ కంటే మ్యూజిక్ అధికం అని'.

డాక్టర్ సంజీవదేవ్‌గారి విమర్శ, పరామర్శలకు వారి ఈ వాక్యాలే ఆదర్శ సూత్రాలు!

(రచయిత : డాక్టర్ జి.వి. సుబ్రహ్మణ్యం, ఉపాధ్యక్షులు,
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు.)

# సంజీవదేవ్ భాష-శైలి

- డాక్టర్ సి. రామచంద్రరావు

ఒక రచయిత శైలి రచనా ప్రారంభం నుంచి ఒకే విధంగా ఉంటుందని చెప్ప వీలులేదు. విషయ ప్రాధాన్యాన్నీ రచనాభ్యాసాన్నీ బట్టి శైలి మారుతుంటుంది. పాఠకుల స్థాయీ భేదాన్ని బట్టి శైలి మారుతుంది. సంజీవదేవ్ శైలి గురించి దిఙ్మాత్రంగా పరిశీలించటమే ప్రస్తుత వ్యాస లక్ష్యం.

**పదక్రమం :** తెలుగు క్రియాంత భాష. వాక్యంలో కర్త, కర్మ, క్రియ క్రమంగా వస్తాయి. క్రియ వాక్యాంతంలో ఉంటుంది. ఇటువంటి వాక్యాలు సామాన్య పదక్రమంలో ఉన్నాయని చెప్పవచ్చు.

'కన్ను తెరిచి దృశ్య జగత్తులోకి చూస్తే ఎన్నో రూపాలు ఎన్నో రంగులు గోచరిస్తాయి'. (సం.వ్యా. 1–పే– 7)

మృణ్మయ దృశ్యం చిన్మయ కల్పనగా మారింది. (సం.వ్యా –1, పే–45)

రూప కళలలో వాస్తవ వాదం నియతి అవుతుంది (అదే – పే–57)

ప్రబంధ కవిత్వం ఏనాడో పాతబడిపోయి, భావ కవిత్వం ప్రాదుర్భవించింది (సం.వ్యా–1, పే–61)

నేడు ప్రపంచమంతటా ఒక విశ్వజనీన చిత్రకళ వెలసింది (అదే. పే–99)

అయితే సామాన్య పదక్రమాన్ని మార్చటం వల్ల విశేష పదక్రమంతో ప్రముఖంగా కూడిన వాక్యాలు ఏర్పడతాయి. కవితా శైలిలో ఇవి ప్రచురంగా కనిపిస్తాయి. కాని వచనంలో ముఖ్యంగా

వ్యాసాల్లో, చాలా తక్కువగా కనిపిస్తాయి. కానీ సంజీవదేవ్‌గారి వ్యాసాల్లో విశేష పదక్రమ వాక్యాలు ఎక్కువ మోతాదులో ఉన్నాయి.

'కన్ను తెరిస్తే కనిపిస్తుంది ప్రకృతిలోని రంగు, చెవి విప్పితే వినిపిస్తుంది ప్రకృతిలోని రాగం' (సం.వ్యా- 1, ప్ర.భా. పే-45)

'అయితే సహృదయుని ఈ స్వాతంత్ర్యం ఆధారంలేనిది మాత్రమే అవుతుంది ఎక్కువగా' (సం.వ్యా-1, ప్ర.భా. పే-131)

'సంస్కృతి నుంచే వికసిస్తవి సకల విజ్ఞానాలూ, సమస్త కళలూ' (అదే, పే-5)

విశేష పదక్రమ వాక్యాలను ఒక ప్రయోజనం కోసమో, ప్రాధాన్య వివక్ష కోసమో, విస్తృత విషయ పూరణం కోసమో, పాఠకుల దృష్టి మరలకుండా ఆకర్షించటంకోసమో ప్రయోగించినట్లు సంజీవదేవ్ వ్యాసాల్లో కనబడుతుంది.

'జ్ఞాన పిపాస కలవారంతా విజ్ఞానం వైపుకు పయనంసాగిస్తే, రస పిపాసులంతా పయనాన్ని సాగిస్తారు కళలవైపుకు' (సం.వ్యా-1, ప్ర.భా.-పే-5)

'మనిషి నివసిస్తాడు మనిషికి బయటవున్న ప్రపంచంలో' (అదే. పే-13)

'ఉదయాన చారుదత్తుడు తెలుసుకుంటాడు తనవన్నీ పోయినవని' (సం.వ్యా-, ప్ర.భా, పే-29)

'సౌందర్యం ఆనందాన్నిస్తే, నీతి ఇస్తుంది శ్రేయాన్ని' (సం.వ్యా-1, ప్ర.భా., పే-35)

శైలీ వైవిధ్యాన్ని సాధించటానికి భాషా సహజ లక్షణాలతో కొన్ని పద్ధతులను అవలంభిస్తారు. అందులో ఒకటి పదపశ్చాత్కరణం. తెలుగు వాక్యనిర్మాణంలో పదాలకు ఎడమవైపున విశ్లేషణపదాలు చేరతాయి. ఇది తెలుగు భాష సహజలక్షణం.

పిల్ల

కుక్క పిల్ల

తెల్ల కుక్కపిల్ల

మా తెల్ల కుక్క పిల్ల

ఈ సహజ లక్షణానికి భిన్నంగా, వాక్యంలో కుడివైపుకు పదాలను జరపటాన్నే 'పద

పశ్చాత్కరణం' అనవచ్చు. దీనివల్ల వాక్యాల్లో ఒక రకమైన తూగు ఏర్పడి పాఠకులకు ఆకర్షణ కలుగుతుంది. సంజీవదేవ్ చిత్రకారుడు. దాంతో వస్తువుల మధ్య సంబంధాన్ని, సమతౌల్యాన్ని చూస్తాడు. రచనల్లో పదాలమధ్య కూడా ఆ భావనే కలిగేలా భాషాలక్షణాన్ని నియోగించుకున్నారు.

'రచన అనేది వినిపిస్తుంది ఇంపుగా దాని అక్షరాలు కనిపిస్తాయి సొంపుగా' (రచన : దీపావళి సంచిక 1991)

'జర్మన్ ఫ్రెంచ్ మూలాలకు చెందిన కుటుంబంలో జన్మించాడు 1893లో, జన్మస్థానం పూర్వపు శాక్సోని రాజ్యంలో, పాండిత్యం సంపాయించింది ప్రాకృత సంస్కృత భాషల్లో' (సం.వ్యా-II, ప్ర భా, పే-17)

సత్యాన్ని తాను చూసి ఇతరులకు చూపుతాడు రేఖలలో, రంగులలో (సం.వ్యా, -II, ప్ర.భా., పే-17)

తర్కశాస్త్రంలో ఉదాహరణ ప్రాయాలైన వాక్యాలు సంజీవదేవ్ గారికి నమూనాగా ఉపయోగపడ్డాయి. వీటిని తారుక వాక్యాలనవచ్చు. దాదాపు ప్రతి వ్యాసంలోనూ ఇటువంటి వాక్యాలు కనబడతాయి. ఇవి సంజీవదేవ్ శైలిని గుర్తించటానికి ప్రత్యేకంగా ఉపయోగపడతాయి.

'నిజానికి కవులుకూడా రచయితలే. ఒక విధంగా చెప్పాలంటే కవులందరూ రచయితలే. కాని రచయితలంతా కవులు కాదు. సంపెంగలన్నీ పూవులే కాని పూవులన్నీ సంపెంగలు కానట్లు. ప్రాణులే మనుషులంతా కానీ ప్రాణులంతా మనుషులు కానట్లు' ('రచన' ప్రారంభ సంచిక 1991)

'కళాకారులంతా మానవులే కాని మానవులంతా కళాకారులు కారు' (సం.వ్యా-I ప్ర.భా., పే-21)

తత్వవేత్తలు వస్తుతత్వంలో భాగంగా పదపదార్థ విచారణ చేస్తారు. భాషాశాస్త్రవేత్తలు కూడా పద-పదార్థ చర్చలు ఎలాగూ చెయ్యాలి. వస్తుతత్వం ద్వారా అర్థం తెలుసుకోటానికి తత్వవేత్తలు ప్రయత్నం చేస్తే, అర్థం ద్వారా వస్తుతత్వాన్ని తెలుసుకోటానికి భాషా శాస్త్రవేత్తలు ప్రయత్నం చేస్తారు. తాత్విక చింతన ద్వారా భాషా శాస్త్రకారుల ఆలోచనలకు దగ్గరయ్యారు సంజీవదేవ్‌గారు.

'రచన అంటే కూర్పు. రచన అంటే సృజన. రచన అంటే నిర్మాణం మొదలైనవి. ఇంకా చెప్పాలంటే సాహితీ రచన, సంగీత రచన, వ్యూహ రచన మొదలైనవి అయితే ఎందుకనో సాహితీ

రచన చేసే వారినే 'రచయిత' లేక 'రచయిత్రి' అంటారు కానీ మిగతా రచనలు చేసే వారిని అనరు'. (రచన : ప్రారంభ సంచిక 'రచన' 1991)

తెలుగులో క్రియారహిత వాక్యాలు క్రియాలోపంవల్ల కూడా ఏర్పడతాయి. సంజీవదేవ్ 'ప్రకృతి శిల్పికేదేశాటనకూ అవినాభావ సంబంధం ఉంటుంది' (సం.వ్యా-I, ప్ర.భా. పే-23) వంటి వాక్యాలను అక్కడక్కడ సంబంధార్థాన్ని సూచించడానికే వాడారు. కొన్ని సందర్భాల్లో బావగాఢత ప్రబలంగా ఉండి, దీర్ఘ వాక్యాలు ఎన్నుకోవడం వల్ల, అన్వయక్లేశం కలుగుతుంది.

'ఈ ఇరవై సంవత్సరాల్లో సాహిత్యంలోనూ, మిగతా లలితకళల్లోనూ జరిగిన ఉన్నతి స్థూలత్వం నుంచి సూక్ష్మత్వం వైపుకు వికసించిన పరిణతి రూపత్వం నుంచి నైరూప్యంలోకి చెందిన రూపాంతరం అలంకారం నుంచి సాదాతనానికి పయనించిన నిరాడంబరత' (సం.వ్యా-I, ప్ర.భా. పే-61).

'– ఏమండీ భౌతిక రూపం వృద్ధిపొందటం అంటే భౌతిక సత్తా క్రమేణా శక్తిరూపంలోకి మారటమే అవుతుంది' (సం.వ్యా-I, ప్ర.భా., పే-30)

వ్యక్తి నిరపేక్షంగా రచించడానికి 'బడు' ప్రయోగాన్ని సంజీవదేవ్ ఉపయోగించుకున్నారు.

'పదవ గుహలో బుద్ధుని జాతక కథల్లో ఒకటైన చద్దంత జాతకం సుందరంగా చిత్రించబడి ఉంది' (సం.వ్యా-I, ద్వి.భా., పే-13)

'సృజనాత్మక సాహిత్యం అధిక సంఖ్యాకుల చేత చదువబడితే, సమీక్షాత్మక సాహిత్యం అల్ప సంఖ్యాకులచేత చదవబడుతుంది'. (సం.వ్యా-I, ప్ర.భా., పే-131)

'సృష్టించబడిన ప్రతిజీవి తిరిగి సృష్టిస్తుంది' (సం.వ్యా-1, ప్ర.భా , పే-21)

'కన్నం వేయబడ్డ పద్ధతిలోని నైపుణ్యం ఆయన మనసును ఆకర్షిస్తుంది'. (సం.వ్యా-1, ప్ర.భా., పే-29)

'సంఘానికి మేలుచేసేవి మాత్రమే కళలనీ, కీడుచేసేవి కళలుకావని చెప్పబడును' (సం.వ్యా-1, ప్ర.భా., పే-53)

'ఒకే విషయాన్ని ప్రాచీనులు చేస్తే పవిత్రం అనీ, నవీనులు చేస్తే అశ్లీలం అనీ అనబడదు' సం.వ్యా-11, ప్ర.భా., పే-15)

దీనికి తోడు సంప్రదాయ భాషా ప్రీతి సంజీవదేవ్‌కు చాలా మెండు. 'జీవించజాలడు'

ప్రగతి గావించలేదు
ఇవ్వజాలవు
రచించ జాలవు
ప్రకృతి శిల్పియగు టర్నర్
ప్రథమంలో డాక్టరు.

ఇది వ్యావహారిక భాషా ఉద్యమ సారధులు ఒక దశలో ఉపయోగించిన సరళ గ్రాంధిక శైలికి సన్నిహితమేమోననిపిస్తుంది. అందుకు తోడు ఆంగ్లభాషా ప్రభావం కూడా సంజీవదేవ్ శైలికి ఒక విలక్షణతను ఇచ్చింది

'... ఇష్టం కలిగి ఉండటమో, అయిష్టం కలిగి ఉండటమో ఇందుకు ప్రధాన కారణం' (సం.వ్యా.-1, ప్ర భా )

నైతిక విలువలు సామాజిక విలువలు అయివున్నాయి. రసాత్మక విలువలు మానవీయపు విలువలు అయివున్నాయి' (సం.వ్యా., ప్ర.భా., పే-36)

భావాన్ని పరిపుష్టంగా చెప్పడానికి కొత్త పదాలనూ, క్రియా రూపాలను సృష్టించుకున్నారు సంజీవదేవ్ ఏభాషలోనైనా పదాలు పరిమితంగా ఉంటాయి. భావాలు అపరిమితంగా ఉంటాయి. అందువల్ల కొత్త రూపాలను ఉన్న వాటితో ఏర్పరిచి కొత్త భావస్ఫూర్తి కలిగించగలుగుతారు.

'ఆనందపరచు
సజీవపరచు
అనుకరణచేయు (సం.వ్యా-1, ప్ర.భా., పే-32)
ఆధునిక వేత్త
అర్థనిరూపణ ప్రయోజనం (సం.వ్యా-1, ప్ర.భా. పే-134)

సంజీవదేవ్వ్యాసాల్లో 'యొక్క' చాలా ఎక్కువగా కనబడుతుంది. సమాసం సాధ్యంకాని సందర్భాల్లో ఈ విభక్తి ప్రత్యయాన్ని ప్రయోగించారు.

'ఆకలి తీరేవరకే అన్నంయొక్క అవసరం' (సం.వ్యా-1, ప్ర.భా., పే-57)
'సౌందర్యం తీక్షణత యొక్క పార' (అదే)
'సౌందర్యోపాసన యొక్కవత్తి' (అదే)

సంజీవదేవ్ వ్యాసాల్లో హేతు నిరూపణ ప్రయోజనాన్ని దృష్టిలో పెట్టుకొని రచన సాగిస్తారు.

'ఒకరికి తట్టిన సురూపం మరొకరి దృష్టిలో కురూపం.

కాబట్టి సౌందర్యం అనేది వ్యక్తిగతమే కాని వస్తుగతం కాదని అనిపిస్తుంది'.

(సం.వ్యా.-1, ప్ర.భా., పే-35)

'కళ ఎందుకున్నదీ అంటే మానవులకు రసానందాన్ని ప్రసాదించి జీవితాలను తన్మయీ భావనతో నింపటానికి మాత్రమే' (అదే)

'వెలుగులేంది దృష్టి లేదు. దృష్టిలేంది సృష్టి లేదు. కనుక వెలుగులేంది సృష్టి లేదు' (సం.వ్యా-1, ప్ర.భా., పే-41)

హేతు నిరూపణ లక్షణం ఎక్కువ అయితే రచనలో విసుగు కలిగించే సాగుడు గుణం వస్తుంది.

'క' అనే అక్షరం, 'వి' అనే అక్షరం కలిస్తే 'కవి' అనే రెండక్షరాల పదం అవుతుంది. ఆ రెండక్షరాలు కలవక వేరే వేరే ఉండిపోతే 'క' 'క' గానే ఉండిపోతుంది. 'వి' 'వి' గానే నిలిచిపోతుంది. కాని 'కవి' కావు. చీలిక 'కవి'ని చేయదు. కూడిక మాత్రమే చేస్తుంది 'కవి'ని. విశ్లేషణ కవితను కూర్చదు. కవితను కూర్చేది సంశ్లేషణ'

రేవతీదేవి 'శిలాలోలిత' విన్యాసంలో మొదటి పేరాను ఉటంకించాను. శైలీ లక్షణాలన్నిటినీ సమగ్రంగా పరిశీలిస్తే మరింత పదునైన శైలీ నిరూపణం సాధ్యపడుతుంది.

(రచయిత - డాక్టర్ సి. రామచంద్రరావు,
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదులో ఆచార్య పదవిలో ఉన్నారు.)

# సంజీవదేవ్ వ్యాసాలు

*కడియాల రామమోహనరాయ్*

డాక్టర్ సంజీవదేవ్కళోపాసకులు. జీవించటం ఒక కళగా భావించి ఆ కళాసాధనలో రసరమ్య జగత్తును సృష్టించుకొని ఆనందమయంగా గడిపిన కళాకారులు కళావిమర్శకులుగా ఆయన ఉన్నత శిఖరాలను అధిరోహించారు. ప్రకృతి చిత్రాల చిత్రకారునిగా ప్రత్యేకతను సంపాదించారు. చరాచర ప్రకృతిని గురువుగా చేసుకొని ఆయన సాధించిన విజయాలు స్వయంకృషితోనే సాధించారు. ఆయన చెప్పదలచుకొన్న భావాలకు వ్యాసం చక్కని వాహికగా అమరింది కవితలు రచించినా, చిత్రాలను చిత్రించినా ఆయన ప్రతిభ వ్యాస రచనలోనే వికసించినట్లు భావించవచ్చు.

డాక్టర్ సంజీవదేవ్ వ్యాసాలను 1. చిత్రకళా వ్యాసాలు, 2. సాహిత్య వ్యాసాలు, 3. ప్రకృతి సౌందర్య వ్యాసాలు, 4. తాత్త్విక వ్యాసాలు, 5. మహనీయుల మూర్తి చిత్రణా వ్యాసాలు, 6. పుస్తక సమీక్షా వ్యాసాలు, 7. ప్రకీర్ణ వ్యాసాలు అని ఏడు విధాలుగా విభజించి పరిశీలించవచ్చు. సప్తవర్ణ శోభితమైన హరివిల్లు విరిసిన కాంతి ఈ వ్యాసాలలో కన్పిస్తుంది.

సంజీవదేవ్ తన 14వ ఏట స్వామి రామతీర్థ రచనలు చదివి హిమాలయాలపై తీవ్రమైన ఆసక్తిని పెంచుకున్నారు. హిమాలయాల పేరులోనే ఏదో లోకోత్తర ఆకర్షణ తోచేది. హిమ శిఖరాలు, దేవదారు అరణ్యాలు, జలపాతాలూ ఆయనను తమవైపు ఆకర్షించాయి. ఆయన బాల్యంలో గడిపిన తుమ్మపూడి, కోనాయపాలెం గ్రామాలలోని ప్రకృతి శోభ, కాలువలు, తోటలు, సంధ్యా సమయాలు, పంట చేలూ ఆయన మనస్సుపై చెరగని ముద్ర వేశాయి. తన 16వ ఏట ఆయన హిమాలయాలను దర్శించారు. 'మాయావతి'లో 'ప్రబుద్ధ భారత'

కార్యాలయంలో ఆయన కొన్నాళ్ళు ఉన్నారు. హిమాలయ శోభ ఆయన్ను ముగ్ధుణ్ణి చేసింది. రవీంద్రుని 70వ జన్మదినోత్సవ అభినందన గ్రంథంలో నందలాల్ బోస్ చిత్రించిన 'గ్రామ కుటీరాలు' చిత్రం ఆయన మనస్సుకు హత్తుకొన్నది

హిమాలయాల నుండి తిరిగివచ్చిన రెండేళ్ళ తర్వాత 1939లో డాక్టర్ సంజీవదేవ్ తెలుగులో రచన ప్రారంభించారు. చిన్నప్పుడే, తెలుగు భాషను పాఠశాలలో చదువుకోకపోవటంవల్ల తెలుగులో రచన చెయ్యటానికి మొదట ఆయన సంకోచించారు. తెలుగులో ఆయన మొదటి రచన 'కళా-విజ్ఞానము' వ్యాసం.

ప్రసిద్ధ బెంగాలీ, ఇంగ్లీషు పత్రికల నుండి సేకరించిన చిత్రాలతో ఆయన ఒక ఆల్బమ్ తయారు చేసుకున్నారు. అప్పటికింకా ఆయన చిత్రరచన ప్రారంభించలేదు. చిత్రకళకు సంబంధించిన వాఙ్మయం తెలుగులో చాలా తక్కువ. కళాతత్వాన్ని అనేక వ్యాసాలలో తెలిపి సంజీవదేవ్ ఈ వాఙ్మయ శాఖను పరిపుష్టం చేశారు.

'చిత్రాన్ని రచించటం ఒక మధుర సాధన
చిత్రాన్ని ఆనందించటం మధురతర సాధన అని'

సంజీవదేవ్ గారు తెల్పినట్లు చిత్రకళోపాసకులై ఆయన చిత్రకారులను ఆరాధించిన వ్యాసాలు వారి చిత్రాలలో అందచందాలను విశ్లేషించిన తీరూ, కళా సిద్ధాంతాలను తెలిపే వ్యాసాలు, చిత్రకళా చరిత్రను తెలిపే వ్యాసాలు పుంఖాను పుంఖాలుగా రచించారు. రసరేఖలు, కాంతిమయి, రూపారూపాలు, రూపదర్శిని, దీప్తిధార, సంజీవదేవ్ వ్యాసాలు-1, సంజీవదేవ్ వ్యాసాలు-2, ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం - లలితకళలు సంపుటిలో వ్యాసాలు ఆయన భావ ప్రపంచాన్ని తెలుసుకోవటానికి ఉపయోగించే గ్రంథాలు.

## 1. చిత్రకళా వ్యాసాలు

### అ). కళ మూలతత్వాన్ని తెలిపే వ్యాసాలు

కళ అంటే ఏ పనినైనా చేయటంలో ప్రత్యక్షమయ్యే కౌశలం. మానవుని ద్వారా సృజించబడని సృష్టిలోని కౌశలాన్ని ప్రకృతి అంటాం. మానవుని ద్వారా సృజించబడే కౌశలాన్ని కళ అంటాం. కళ అస్తిత్వానికీ, సమాజ అస్తిత్వానికీ కూడా కళాకారుడైన వ్యక్తి ముఖ్యుడు. నిజానికి కళాకారుడు తన ఆనందం నిమిత్తమే కళాసృష్టి చేసుకొంటాడు (కళ-సమాజ పరిణామం). 'సౌందర్యోపాసన' అనే వ్యాసంలో శ్రీ దేవ్ 'ఆకలి తీరనంత వరకు సంస్కృతీ సందేశం ఎవరికీ వినిపించదు' అని హెచ్చరించారు.

'సౌందర్యం వస్తుగతమూ, చూచేవారి మనోగతమూ కూడా' అని సంజీవదేవ్ తలుస్తారు. నైరూప్య కళలోని అందాలను ఏవిధంగా ఆస్వాదించాలో కూడా ఆయన వివరించారు. 'సౌందర్యారాధన సుందరానుభూతి, రమణీయ లావణ్య దృష్టి మానవ జీవితానికి మహోజ్వల కాంతులు, ప్రోజ్వల శాంతులు అంటారు సంజీవదేవ్ (సౌందర్యం అంటే).

'రమ్యం కాని వస్తువును రమ్యంగా వీక్షించటానికి చిత్త సంస్కారమూ, మానస సాధనా అవసరం'. అప్పుడు గూలాబీపూవు, మురికిగుంట, వెన్నెల, చీకటి, నవకిసలయాలు, ఎండిన ఆకులు, ఉద్యానవనం, శ్మశానం అన్నీ సుందరంగా కన్పిస్తాయి (రమ్యాలోకన).

ప్రకృతి సౌందర్యాన్ని ఆస్వాదించనివారు కూడా కళలో సౌందర్యాన్ని ఆస్వాదిస్తారు. 'ఆకాశానికి అడ్డంగా నిలుచున్న ఒక వెదురు పొదను ప్రకృతిలో ఆనందించలేని వ్యక్తి దాన్నే ఒక బొమ్మలో చూచి ఆనందిస్తాడు' (రసదృష్టి). 'చిత్ర రచన కళాకారుని అనుభూతిలోంచే ఉద్భవిస్తుంది కాని రంగులూ రేఖలలోంచి కాదు' అనే అంశాన్ని 'లంకావతార సూత్రము' అనే ప్రాచీన గ్రంథంలో నుండి, షారీక్ అనే కళా విమర్శకుని పలుకుల నుండి నిరూపించారు. రసదృష్టి గల మానవులు మరణశయ్య మీద కూడా మృత్యువు వల్ల కలిగే బాధను చిరునవ్వుతో ఆహ్వానించగలరని 'రసదృష్టి' అనే వ్యాసంలో తెలిపారు.

సంజీవదేవ్ వ్యాసాలలో 'చిత్రం ఆనందించాలంటే' అనేది విశిష్టమైనది. చిత్రాన్ని సంపూర్ణంగా ఆస్వాదించాలంటే రేఖా విన్యాసం, వర్ణికా భంగిమ, భాగస్వామ్యం, లయశీలత మొదలైన వాటి జ్ఞానం ఉండాలి. విష్ణుధర్మోత్తరం 'సిద్ధహస్తులు రేఖలను మెచ్చుకుంటారు. స్త్రీలు చిత్రంలోని ఆభరణాలను, మిగతా జనసామాన్యం రంగుల రమణీయతను మెచ్చుకుంటారు' అని చిత్రాన్ని ఎవరెవరు ఎలా ఆనందించేదీ తెలియజేసింది.

నిజమైన కళాకారుడికి సమదృష్టి ఉంటుంది. నందలాల్ బోస్ అర్ధనారీశ్వరులను చిత్రించిన కొంచెంసేపటికే కుక్కపిల్లనో, కూలి మనిషినో కూడా చిత్రించేవాడట. జీవితంలో రసానుభూతి నశిస్తే మానవుడు దానవుడవుతాడని, పచ్చిక బయళ్ళు ఎడార్లుగా గోచరిస్తాయని శ్రీ దేవ్ హెచ్చరించారు.

ఒకనాటికి నవ్యమైనది మరొకనాటికి ప్రాచీనమౌతుంది. నవ్యమైనది సవ్యమైనది కాదని తలచటం సరికాదు. 'ఆధునిక చిత్రకళకున్న మొదటి ప్రాధాన్యత ఏమంటే, అది విషయ వస్తువును పూర్తిగా విసర్జించింది. గొప్ప విషయాలనుండి సామాన్య రూపాలకు అక్కడ నుండి స్వల్ప

విషయాలకు తర్వాత నైరూప్య పద్ధతికి ప్రయాణించింది. ఈ నవ్యధారను దిగజారుడుగా తలచ కూడదు. నైరూప్య చిత్రకళను అర్ధం చేసుకోవటంలో దాని విశిష్టతను తెలియజెప్పటంలో సంజీవదేవ్ శ్రద్ధ చూపారు (నవ్యధార).

ఆ). చిత్రకళ, శిల్పకళల చరిత్రను, రీతులను తెలిపే వ్యాసాలు.

'బౌద్ధయుగపు తొలికళలు' అనే వ్యాసంలో హీనయానంలోని సర్వాస్తివాదం, మహాయానంలోని మాధ్యమిక వాదం, వజ్రయానంలోని తాంత్రిక వాదం వాటికి అనుకూలమైన కళారూపాలను నిర్మించుకున్నాయి'. ధ్యాన బుద్ధుని శిల్పించిన వులితోనే మధుపాత్రను పట్టుకొని ఉన్న మిధునాన్ని కూడా శిల్పించారు. మిధునాన్నే కాదు మైధునాన్ని కూడా కల్పించారు. ఒక సంప్రదాయానికి సంబంధించిన కాలంలో నిర్మాణమైన కళలలో రూప సౌందర్యం, రసస్పందన ఉండదనుకోవటం హ్రస్వదృష్టి మాత్రమేనని దేవ్ హెచ్చరించారు.

బుద్ధుని జీవితకాలంలో గాని, బుద్ధుని మరణానంతరం కాని బుద్ధుని చూచియున్నవారు బుద్ధుని రూపాన్ని చూపించనప్పుడు, దీర్ఘకాలం గడిచిపోయిన తరువాత మహాయాన శిల్పులు ఏ ఆధారాల మీద ఆధారపడి బుద్ధుని రూపాన్ని శిల్పించారో తెలియదు. హీనయాన శాఖవారు బుద్ధుని జీవిత దశలను ప్రతీకాత్మకంగా శిల్పించారు. క్రీ.శ. 7వ శతాబ్దంలో మహాయాన తాంత్రికులు బౌద్ధంలో శాక్తేయ సంప్రదాయాన్ని ప్రవేశపెట్టారు. (బౌద్ధ కళావిన్యాసాలు).

'మొగలాయి చిత్రకళ' వ్యాసం సమాచారం, వివరణ, అభిప్రాయ ప్రకటనలతో ఉత్తమ శ్రేణి వ్యాసమనదగినట్లు ఉన్నది. అక్బరు, జహంగీరు చక్రవర్తుల పరిపాలనా కాలంలో మొగలాయి చిత్రకళ శిఖరాగ్రాలను అందుకొన్నది. ఇరాని రాజపుత్ర చిత్రకళల మిశ్రమమే మొగలాయి చిత్రకళ. రామాయణ, మహాభారత కథా చిత్రాలను కూడా అక్బర్ కాలంలో చిత్రించారు. ప్రముఖులందరూ తమ రూప పటాలను వేయించుకోవాలని అక్బర్ ఫర్మానా జారీ చేశాడు. ఆ కాలంలో చిత్రం పూర్తి అయిన తరువాత దానిని నున్నని మెరుగు రాయితో రుద్దటం ద్వారా 'మనకారీ' అనే మెరుపు వచ్చేది. మొగలాయి చిత్రాలు ఎక్కువ భాగం 'మీనియేచర్స్'.

దక్కను చిత్రకళ అనే వ్యాసాన్ని కూడా శ్రీ దేవ్ మిక్కిలి ఆసక్తికరంగా రచించారు. బీదర్, బీరార్, అహమద్ నగర్, బీజాపూర్, గోల్కొండ రాజ్యాలు దక్కన్ రాజ్యాలు క్రీ.శ. 16,17 శతాబ్దాలలో విజయనగర సామ్రాజ్య పతనానంతరం విజయనగర కళా ప్రభావం దక్కన్ చిత్రకళపై ప్రసరించింది. 'పాటల వర్ణం నీలం, ఆకుపచ్చ, లేత గోధుమ వర్ణం, బంగారు రంగు, తెలుపు ఈ కాలపు చిత్రకళలో ప్రాధాన్యం వహించాయి. రాగాలకు రూపాన్ని కల్పించే

రాగిణీ చిత్రాలు ఈ కాలపు ప్రత్యేకత హిందోళరాగం అనే చిత్రం రమణీయమైనది. గోల్కొండ చిత్రాలలో 'మైనా పిట్టతో ఉన్న సుందరి' చిత్రం ప్రసిద్ధమైనది. గోల్కొండ ఔరంగజేబు వశమైన తరువాత హైదరాబాద్ చిత్రకళా సంప్రదాయం ఏర్పడింది. ఈ సంప్రదాయం షోలాపూర్, కర్నూల్, కడప, గద్వాల్, వనపర్తి సంస్థానాలకు కూడా విస్తరించింది. దక్కన్ చిత్రాలలో నల్-దమ (నల దమయంతులు) చిత్రం ప్రసిద్ధమైనది దక్కన్ చిత్రకళా రీతులను వివరించటంలో శ్రీ దేవ్ చిత్రకళా పోషణే పరిగణనకు తీసుకున్నారుగాని వారి రాజ్యపాలనా విధానాన్నికాదు. కళా విమర్శకులు చేయవలసిన పనినే శ్రీ దేవ్‌చేశారు.

'రవీంద్ర చిత్రకళ' అనే వ్యాసంలో శ్రీ దేవ్ రవీంద్రుని చిత్రాలలో అర్థం కోసం వెతక కూడదంటారు. రవీంద్రుడు చిత్రకళను ఎవరి దగ్గరా 'అభ్యసించలేదు'. 'స్వచ్ఛంద లయమయ రసానందం' రవీంద్రుని చిత్ర రచనలో ఉన్నది. రవీంద్రుని చిత్రాలల్లో ప్రకృతి దృశ్యాలు ఉత్కృష్ట మైనవి. 'రసజగత్తులో ఆయన చిత్రాలు ఒకనూతన అనుభూతిని, ఒక నవరస సృష్టినీ, ఓ లోకోత్తర దృశ్య సంగీతాన్ని ప్రవేశపెట్టినవి' అన్నారు సంజీవదేవ్.

ఆకాశవాణి విజయవాడ కేంద్రం (శ్రీ పి.ఆర్ రెడ్డి డైరెక్టరుగా ఉన్న కాలంలో) శ్రీ సంజీవదేవ్ గారిచేత చిత్రకళ, శిల్పకళ చరిత్రను తెలిపే 15 ప్రసంగాలను ప్రసారం చేసింది అవి 'రూపదర్శిని' సంపుటిగా రూపొందాయి.

'కళ'ను పరిచయం చేస్తూ శ్రీ సంజీవదేవ్ 'చౌర్యం కూడా కౌశలంతో చేయబడితే కళ అవుతుంది అన్నారు. మృచ్ఛకటికమ్ లో చారుదత్తుడు తన ఇంటి గోడకు కన్నం వేసి, దొంగ తనసొత్తును దోచుకువెళ్ళినా కూడా లెక్కచేయక తన గోడకు వేసిన కన్నపు రూప కౌశలాన్ని ఆనందిస్తాడు. అదీ శుద్ధ రసజ్ఞత అన్నారు. ఇటువంటి సంఘటన సంజీవదేవ్ గారి ఇంటిలో కూడా జరిగింది. చారుదత్తుడిలాగే సంజీవదేవ్ కూడా సొమ్ము పోయినందుకు దుఃఖించక సరసోక్తులాడిన రసజ్ఞులు.

సామాన్య శ్రోతలకు అర్థం కావటం కోసం శ్రీ సంజీవదేవ్ రూపదర్శిని ప్రసంగాలలో కొన్ని ప్రాథమిక విషయాలను కూడా తెలిపారు. 'చిత్ర రచనలో ప్రకృతి దృశ్య వాతావరణ శోభను ప్రదర్శించే వీలున్నది. కాని శిల్పానికి అటువంటి అవకాశం లేదు. శిల్పానికి అసాధ్యమైనది చిత్రానికి సుసాధ్యం. వర్ణచిత్రాలకంటే రేఖారచన చేయటం కష్టం. ఇందుకు మానసిక పరిపక్వతా, హస్తకౌశలం రెండు కూడా ముఖ్యం.

ఇ) చిత్రకళా మాధ్యమాలు

ఒక్కొక్క మాధ్యమం చిత్రానికి ఒక్కొక్క ప్రధాన లక్షణాన్ని కలిగిస్తుంది. నీటిరంగు చిత్రం కోమలంగా, కాంతివంతంగా, కవిత్వమయంగా గోచరిస్తుంది. తైలవర్ణ చిత్రం దీనికి వ్యతిరేకంగా, గంభీరంగా, దట్టంగా చేతికి తగిలే స్పర్శనీయతతో బలిష్టంగా ఉంటుంది. పేస్టులతో వేసిన చిత్రం మృదుమధురంగా, లేత రంగుల్లో చెవికి సంగీతం వినిపిస్తున్న విధంగా కంటికి గోచరిస్తుంది. ఇక టెంపెరా మాధ్యమంలోని చిత్రం నీటిరంగుల సౌకుమార్యాన్ని కలిగి ఉంటూ తైలవర్ణ చిత్రంలోని బలిష్టతను ప్రదర్శిస్తుంది. ఈ టెంపెరా విధానం తైలవర్ణ చిత్రాలకంటే ఇంకా ఎక్కువ ప్రాచీన కాలం నుండి అమలులో ఉంది (రూపదర్శిని).

మూర్తికల్పన భారతదేశంలో, గ్రీసులోను; ప్రకృతి చిత్రకళ చైనాలో, అచల చిత్రకళ పాశ్చాత్య దేశాలలో ప్రారంభమై ఇతర ప్రాంతాలకు వ్యాప్తి చెందాయి (రూపదర్శిని).

ప్రాచీన శిలాయుగం వారు పచ్చి మాంసం తిన్నా, సగం కాలిన మాంసం తిన్నా మనుషులనే మనుషులు తిన్నా కూడా వారు కళా స్రష్టలుగా పేరు పొందారు. ఆదిమ చిత్రకళ బళ్ళారి జిల్లాలో 'కావగల్లు' అనే తావున కూడా లభ్యమైంది (రూపదర్శిని).

ఈ). శిల్ప నియమాలు

భారతీయ శిల్ప నిర్మాణానికి 'తాలమానం' అనే నియమం ప్రధానం. ఇది శిల్పపు తలను పెట్టి కొలిచి విగ్రహాన్ని నిర్మించే విధానం. మామూలు మనిషి నిర్మాణం అష్టతాలమానం ఉపయోగిస్తే దేవతామూర్తుల నిర్మాణానికి దశతాలమానం ఉపయోగిస్తారు. అంటే ఒక మనిషి తల ఏ కొలతలో ఉంటే ఆ కొలతకు ఎనిమిదిరెట్లు కలిపి మిగతా శరీర నిర్మాణం చేయడం అష్టతాలమానం అవుతుంది (రూపదర్శిని).

బుద్ధుడు తన అనుయాయులకు చిత్రకళలో ప్రవేశించవద్దని ఉపదేశించాడు (రూపదర్శిని). భారతీయ శిల్పం ప్రధానంగా రెండు విధాలైన శిల్ప మూర్తులను ప్రసాదించింది ప్రపంచానికి. ఒకటి ఉత్తర భారతదేశపు బుద్ధ ప్రతిమ. ఇది శిలా నిర్మితం. రెండవది దక్షిణ భారతపు నటరాజ విగ్రహం. ఇది లోహ నిర్మితం (రూపదర్శిని).

'ఒక వస్తువును మూడు రకాలుగా చిత్రించవచ్చు. మామిడి కాయను మామిడి కాయగా చిత్రించటం, మామిడి కాయను కొంత మామిడి కాయగా కొంత మామిడికాయ కానట్లుగా చిత్రించటం, మూడవ పద్ధతిలో అసలు మామిడి కాయ కాయగా చిత్రించకపోగా ఏకాయ కాకుండా చిత్రించటం. మొదటిది సామాన్యం, రెండవది వైరూప్యం, మూడవది నైరూప్యం (రూపదర్శిని).

ఉ). చిత్రకారుల ప్రజ్ఞా విశేషాలను తెలిపే వ్యాసాలు

ప్రసిద్ధులైన ఇరవైమంది చిత్రకారుల ప్రజ్ఞావిశేషాలను శ్రీ సంజీవదేవ్ వివిధ వ్యాసాలలో వివరించారు. విశ్వభారతీ కళాభవనానికి ప్రధానాచార్యునిగా నందలాల్ బోస్ ఎందరో చిత్రకారులను తీర్చిదిద్దాడు. అవనీంద్రనాథ్ టాగోర్ నందలాల్ గురువు. 'రామకృష్ణ పరమహంసకు, స్వామి వివేకానందకు ఉన్న సాన్నిహిత్యం లాంటిదే అవనీంద్ర – నందలాల్‌ల సాన్నిహిత్యం. గురువైన అవనీంద్రుని చిత్రణ రాజపుత్ర మొగలు కళాశైలికి చెందిన సుకుమార రూపసృష్టి. నందలాల్‌ది అజంతా విధానానికి చెందిన బలీయ రూప సృష్టి'. శివుని రూపాన్ని చిత్రించటంలో నందలాల్ శక్తివంతమైన రూపాన్ని సృష్టించాడు. 'బుద్ధుని జననం', 'మహాభినిష్క్రమణం', 'తపో విరమణ', 'స్వర్గం నుండి బుద్ధుని పునరాగమనం', 'అంబాపాలిక'; 'నిర్వాణం' చిత్రాలు నందలాల్ ప్రతిభకు జయకేతనాలు. కుణాలుడూ, కాంచనమాల చిత్రం నందలాల్ చిత్రాలలో విలక్షణమైనది. కుణాలుని బలిష్టకాయాన్ని చిత్రించటంలో అమేయ శక్తిని ప్రదర్శించాడు. 'ఆయన చిత్రించిన వర్ణ ప్రకృతి చిత్రాలు ఆయన మూర్తి చిత్రాలున్నంత అందంగా లేవేమో ననిపిస్తుంది' అని సంజీవదేవ్ అభిప్రాయపడ్డారు. 'సాధారణంగా చిత్రకారులలో గోచరించే ఆ వేగం, చంచలత, విలాసితా ఆయనలో గోచరించవు. ఒకవిధమైన స్థిరతా, నిండుతనం, సాదాతనం, అహంకార శూన్యతా ఆయనలో గోచరిస్తవి. ఆయన కళా సృష్టి వలెనే ఆయన జీవితం కూడా ఉన్నతాదర్శ ప్రేరితం' అన్నారు సంజీవదేవ్.

ప్రపంచ ప్రఖ్యాత చిత్రకారులు నికోలస్ రోరిక్ సంజీవదేవ్ గారికి ఆప్త మిత్రులు. వారి స్నేహానికి వయోభేదం అడ్డురాలేదు. ఒకప్పుడు రవీంద్రుడు తన కవిత్వం కంటే రోరిక్ చిత్రాలే తనకు ఎక్కువ ఆనందాన్ని ఇస్తాయని అన్నాడట. 'రవీంద్రుడు తన కవి జీవితాన్ని నాకిచ్చివేసి నా చిత్రకారుని జీవితాన్ని తాను తీసుకుంటానన్నాడు చిరునవ్వుతో, చివరకు జరిగింది కూడా అంతే – ఆయన చిత్రాలూ చిత్రించసాగాడు, నేను కవితలూ అల్లసాగాను' అని రోరిక్ పసిపిల్లవాని వలె నవ్వుతూ సంజీవదేవ్ గారితో చెప్పారట. రోరిక్ హిమాలయాల అందాలను వందకు పైగా చిత్రాలలో పట్టుకున్నాడు. అన్నీ మణిదీపాలే. వివిధమానవ స్వభావాలను తెలుసుకోవాలనే ఆకాంక్ష రోరిక్‌లో బలీయంగా ఉండేదట. కొందరు కళాకారుల జీవితం ఎంత గొప్పదో వారి జీవితం కూడా అంత గొప్పది. వారి జీవితం కళకు జీవాన్నిస్తుంటే వారి కళ జీవితానికే రసాన్నిస్తుంది. ఈ వర్గానికే చెందుతాడు నికోలస్ రోరిక్. రోరిక్ తన చిత్రాలు కొన్నింటిని సంజీవదేవ్‌కు బహూకరించారు రోరిక్ జీవిత విశేషాలను, కళా వైభవాన్ని నికోలస్ రోరిక్ వ్యాసంలో మరపురాని విధంగా రచించారు. అయినా ఆయన రంగులన్నిటికీ మూలమైన

విశుద్ధ తెల్లని జగత్తులో జీవించేవాడు చిత్రకళా వర్ణాలలో రోరిక్ పర్‌పుత్' అనే మాట నిలిచిపోయింది.

'గగనేంద్రనాధ్ టాగోర్ వ్యాసంలో శ్రీ దేవ్' గగనేంద్రుడు, సర్వస్వతంత్రుడు. ఈయన కలానికి, కుంచెకు హద్దులు లేవు. చిత్రకళలో అనేక నూతన పంథాలను త్రొక్కాడు. భారతీయ క్యూబిస్టు చిత్రకళకు దారితీశాడు. ప్రకృతిలో ఒక దృశ్యాన్ని చూచి ఆనందించలేని వ్యక్తి అదే దృశ్యాన్ని గగనేంద్రుని చిత్రంలో చూచి ఆనందించగలిగేవాడు'. గగనేంద్రుడు వ్యాధి పీడితుడై మంచం పట్టినప్పుడు, కుంచె పట్టుకోవటానికి వీలులేక, చిత్రించాలనే ఆకాంక్షతో తీవ్ర వేదనకు గురైనాడు. గగనేంద్రుని దృష్టిని 'విశ్వదృష్టి' అని ఆయన కుంచె 'విశ్వవీణ' అని సంజీవదేవ్ వర్ణించారు.

ప్రఖ్యాత చిత్రకారులు అసిత్ కుమార్ హల్దార్ సంజీవదేవ్‌గారికి ఆత్మీయ మిత్రులు. 'నవ్య భారత చిత్రకారులలో నందలాల్ బోస్‌కు పిమ్మట అసిత్ కుమార్ హాల్దారే దిట్ట' అని శ్రీ దేవ్ భావిస్తారు. శ్రీ హాల్దార్ కళాకారుడు, కవి, పండితుడు, రవీంద్రుని మేనకోడలు కుమారుడు. 'నందలాల్ బోస్ రేఖలు స్థూలం, పురుష సహజం అవి మహాకావ్యం లాంటివి, అసిత్ కుమారునివి సూక్ష్మం, నారీ సహజం, అవి ఖండకావ్యం లాంటివి, హాల్దార్ చిత్రాలలో తుఫాన్ ఉమర్ ఖయ్యాముల చిత్రావళి ప్రసిద్ధమైనవి. వాక్సిట్ (చెక్కపైన లక్క చిత్రణ) రీతిలో కూడా హాల్దార్ చిత్రాలను రచించారు.

ఆంధ్ర చిత్రకారులలో బి.వి. నరసింహారావుగారి రూపాతీతమైన రంగుల ఇంద్రజాలాన్ని, ఎస్.వి. రామారావుగారి స్వతంత్ర దృష్టిని, ఆయన సాధించిన విజయాలను శ్రీ దేవ్ వివరించారు. ఇరవై మందికి పైగా చిత్రకారుల కళానైపుణ్యాన్ని విశ్లేషణాపూర్వకంగా వివరించినప్పుడు కూడా సంజీవదేవ్ పడికట్టు మాటలను ఉపయోగించలేదు. పునరుక్తికి పాల్పడలేదు. గుణాలను ఘనంగా కీర్తించారు; లోపాలను మృదువుగా, మర్యాదగా వెల్లడించారు.

## 2. సాహిత్య వ్యాసాలు

డాక్టర్ సంజీవదేవ్ షేక్స్‌పియర్, ఆల్డస్ హక్సలీ లాంటి ప్రపంచ ప్రసిద్ధ రచయితలను గూర్చి అరవిందులు, హరీన్, మాస్తి వెంకటేశ్ అయ్యంగార్ వంటి భారతీయ రచయితలను గూర్చి, కృష్ణశాస్త్రి, గోపీచంద్, నార్ల వంటి తెలుగు రచయితలను గూర్చి వ్యాసాలు రచించారు. ఇవి లోతైన గంభీరమైన విమర్శ వ్యాసాలు కావు. ఆ రచయితల రచనల్లో గుణాలను విశ్లేషించి

తెలిపినవి. షేక్స్పియర్ పై సంజీవదేవ్ వ్యాసం తెలుగు మాత్రమే తెలిసిన పాఠకులకు ఉపయోగపడేది. ఇందులో షేక్స్పియర్ జీవిత విశేషాలను తెలిపి శ్రీ దేవ్ ఆ మహారచయిత ఔన్నత్యాన్ని కొనియాడటం మాత్రమే చేశారు. భారతీయ సంస్కృతి పట్ల గాఢానురాగం కలిగిన రచయిత శ్రీ ఆల్డస్ హక్స్లీ గొప్ప సాత్విక జీవి, విశ్వ మానవుడుగా హక్స్ లీని శ్రీ దేవ్ అభివర్ణించారు. 'హక్స్లీ అభిప్రాయాలు చాలా విచిత్రంగా ఉంటవి. సంఘంలోనూ, మతంలోనూ పాతుకుపోయిన పాత భావాలను హేళన చేస్తాడు, క్రొత్త భావాలనూ హేళన చేస్తాడు. సనాతనులకు అధునాతనుడు గాను, అధునాతనులుకు సనాతనుడుగాను గోచరిస్తాడు. హక్స్లీలో రసానుభూతి కంటే తర్కం ప్రధానం'. హక్స్లీ రచనలను రేఖామాత్రంగా మాత్రమే పరిచయం చేస్తుందీ వ్యాసం.

అరవింద ఘోష్ రచించిన మహేతిహాసం 'సావిత్రి'ని శ్రీ సంజీవదేవ్ అజరామర కావ్యమని వర్ణించారు. 'అరవిందుని ఆంగ్లశైలి జటిలమైంది. అందులోనూ సావిత్రి కావ్యం మరింత జటిలతరమైంది'. సావిత్రి ఈ మర్త్యలోకంలో ఉన్న మృత్యువును జయించి అమరత్వాన్ని ఈ భూమి మీదకు తెచ్చినదని అరవిందుని అన్వయం – 'సావిత్రి కావ్యంలో లాలిత్యం కంటే గాంభీర్యం ఎక్కువ; అనుభూతి కంటే ఆలోచన ఎక్కువ; రసం కంటే ఆత్మోపలబ్ధి ఎక్కువ, కావ్యం పూర్ణమానవతకు ప్రతీక' అన్నారు సంజీవదేవ్.

హరీంద్రనాధ్ చటోపాధ్యాయ (జీవితంలోని కొన్ని ఘట్టాలు) వ్యాసం హరీన్ స్వీయ చరిత్ర మొదటి భాగంలో విశేషాలను సంక్షిప్తంగా తెలియజేస్తుంది. హరీన్ జీవిత విశేషాలను తెలుసుకొనగోరేవారికి ఇది ఆసక్తిని కలిగిస్తుంది.

కన్నడ సాహిత్యవేత్త ఆధునిక కన్నడ కథానికా రచనకు ఆద్యుడు మాస్తి వెంకటేశ అయ్యంగార్ బహుగ్రంధ రచయిత. ఆయనకు తెలుగు భాష కూడా వచ్చు. 'శ్రీనివాస్ అనే కలంపేరుతో ఆయన కథలు, నవలలు, కవితలు, నాటకాలు, వ్యాసాలు, ఇంచుమించు అన్ని సాహితీ ప్రక్రియలలోనూ మేలైన రచనలు చేశారు. ఆయన రచనలను దిఙ్మాత్రంగా పరిచయం చేసే వ్యాసం 'ఆధునిక కన్నడ సాహిత్య పితామహుడు మాస్తి'.

కృష్ణశాస్త్రిగారి 'అప్పుడు పుట్టివుంటే', 'పుష్ప వావికలు', 'బహుకాల దర్శనం' సంపుటాలలో అందచందాలను వివరించిన వ్యాసం కృష్ణశాస్త్రిగారి గద్య రచనలు. గోపీచంద్, నార్ల వెంకటేశ్వరరావు గారలపై రచించిన వ్యాసాలు రచయితకు వారితోగల పరిచయాన్ని, మైత్రిని తెలిపేవి.

## 3. ప్రకృతి సౌందర్య వ్యాసాలు

డాక్టర్ సంజీవదేవ్ ప్రధానంగా సౌందర్యోపాసకులు. విరగపూసిన పూల మొక్కను చూచి ఆనందించినంత తన్మయత్వంతో మోడువారిన చెట్టు అందాన్ని ఆస్వాదించగలిగిన రసతపస్వి ఆయన.

'హిమాలయ' అనే పేరులోనే అంతులేని ఆకర్షణ ఉంది. హిమాలయాలు లోకాన్ని అంతగా ఆకర్షించడానికి వాటి ప్రాచీనత కారణం కాదు. ఒక విధమైన పురాతత్వ సాధన యొక్క వాతావరణంతో వాటికి అవినాభావ సంబంధం ఉంది. 25000 అడుగుల కంటే ఎత్తయిన శిఖరాలు దాదాపు 60 ఉన్నవి. ఉత్తర భారతదేశంలో నదులన్నీ హిమాలయంలోనే పుట్టాయి. హిమాలయాల శోభ కవులకు, చిత్రకారులకు కళా సృజనకు ప్రేరణ కలిగించింది. హిమాలయ ప్రాంతంలో జీవించే చాలామందికి సముద్రం ఎలా ఉంటుందో తెలియదట! హిమాలయాలెంత అందమైనవైనా సముద్రం అందం కూడా అందమే కదా! వైవిధ్యవంతమైన సౌందర్యాన్ని ఉపాసించటంలో సంజీవదేవ్ గొప్ప కళాజీవి.

'ఊటీలో సంధ్య' వ్యాసంలో శ్రీ సంజీవదేవ్ ఊటీలో సంధ్యాకాశ సౌందర్యాన్ని చూచి టర్నర్ చిత్రాన్ని తలచుకున్నారు. 'టర్నర్ సంధ్యాకాశాన్ని ఊటీలో సంధ్య అనుకరించిందేమో? అని ఆశ్చర్యపోయారు. చీకటి కమ్ముకు వస్తున్నా – పశ్చిమాకాశంలోని సంధ్యా రాగం మాత్రం దీప్తిమంతంగా వెలుగుతూంది. నిజంగా దివ్య దృశ్యం ప్రకృతి. ఇంత ఆనందమయంగా ఉంది, కాని మానవులలో ఏది ఈ ఆనందం? దైన్యం, వ్యథలూ, బాధలూ, ఆకలీ, దప్పికా, రోగాలూ, మరణాలూ' సంజీవదేవ్ అంతర్ముఖులై పలికిన ఈ మాటలు మరీ మరీ ఆలోచింపచేస్తాయి.

## 4. తాత్త్విక వ్యాసాలు

భారతీయ తాత్త్విక చింతనతో పాటు పాశ్చాత్య దర్శనాలను కూడా డాక్టర్ సంజీవదేవ్ అధ్యయనం చేశారు. 'ఎగ్జిస్టెన్షిలిజం' అనే వ్యాసంలో ఆ తత్వం ఎప్పుడు పుట్టినదీ? ఏ విధంగా వ్యాపించినదీ తెలిపారు. పాస్కల్, కీర్క్‌గార్డ్, జాస్పర్‌ల కాలంలో ఎగ్జిస్టెన్షిలిజం ప్రగతిని వివరించారు. 'ఎగ్జిస్టెన్షలిజం' అంటే పరిసర ప్రభావాలకు లొంగని మానవుడు తన స్వీయసత్తామీద ఆధారపడి జీవించటం అని జాస్పర్ వివరించాడు. సాత్రే మూడు విధాలైన అస్తిత్వాలను చూపేడు. ఒకటి Being for itself, రెండవది Being in itself, మూడు Being - for others మానవుడు తనకు తానే స్రష్ట, అటువంటప్పుడు తన విలువలను తాను ఆచరణలో

చూపాలి. ఆచరణలో చూపకపోతే కేవలం మిథ్యా జీవితాన్ని గడుపుతున్నట్లే'. 'పాశ్చాత్య తత్త్వ శాస్త్ర రీతులపై తిరుగుబాటే ఎగ్జిస్టెన్షలిజమ్స్. వ్యక్తి స్వాతంత్ర్యాన్ని సృష్టిలోని అనిర్ణయ వాదాన్ని, హేతువాదపు అసంపూర్ణత్వాన్ని, జగత్తులోని నిరంతర పరివర్తనాన్ని ప్రతివారిలోనూ దాగివున్న గుప్తబాధనూ వ్యక్తపరచేది ఎగ్జిస్టెన్షలిజమ్ అన్నారు సంజీవదేవ్–గహనమైన ఎగ్జిస్టెన్షలిజమ్ ను గురించి తగుమాత్ర పరిచయం కల్గివుండటానికి సంజీవదేవ్‌గారి వ్యాసం ఉపయోగపడుతుంది.

మనోవిజ్ఞానం గురించి తెలుగులో వచ్చిన రచనలు చాలా తక్కువ. 'మనోవిజ్ఞానానికి శరీరంలోని నాడీమండలం చాలా ప్రధానమైనది. వ్యక్తి తనలో దాగివున్న లోపాలను తెలుసుకోవటానికి తనలో వ్యక్తమైన మిథ్యా గుణాలను అర్థంచేసుకోవటానికి ఎంతగానో ఉపయోగపడుతుంది' మనోవిజ్ఞానం. మనోవిజ్ఞానంలో చేతనకున్న ప్రాధాన్యం కంటే అచేతనకు ప్రాధాన్యం ఎక్కువగా ఉన్నది. మనోవిజ్ఞానంలో Phobia అనే విషయం మీద చాలా పరిశోధనలు జరిగాయి. Phobia అంటే ఒక విధమైన భయం అని అర్థం. నీటి భయం, నిప్పు భయం, మెరుపుల భయం, మూసిన గదులలో ఉండటానికి భయం మొదలైనవి. ఈ భయాలు సహజమైనవి కావు. వీటిని కనిపెట్టి ఆయా వ్యక్తుల్లో ఇటువంటి భయాలను నిర్మూలించవచ్చు.

'మానవ మనోవిజ్ఞానం, పరామనోవిజ్ఞానం వ్యాసాలు ఆ విషయాలను బోధపరచుకోవటానికి ఉపయోగకరమైనవి.

## 5 మహనీయుల మూర్తి చిత్రణా వ్యాసాలు

మహా పండితుడు, బౌద్ధ దార్శనికుడు రాహుల్ సాంకృత్యాయన్ సంజీవదేవ్ గారికి ఆప్తమిత్రులు. రాహుల్‌జీ భౌతికవాది, బౌద్ధుడు, సామ్యవాది. ఈ అంశాలు పరస్పర విరుద్ధమైనవిగా కనిపించినా ఆయన దృక్పథంలో సమన్వయం పొందాయి. మొదట ఆయన మహంత్, తర్వాత ఆర్య సమాజంలో చేరాడు. ఆతర్వాత దాన్ని వదిలిపెట్టి బౌద్ధాన్ని అభిమానించాడు. ఆయన బౌద్ధమత గ్రంథాల పాండిత్యమునకు మెచ్చి 'త్రిపిటకాచార్య' బిరుదిచ్చారు. రాహుల్‌జీ మహాసాహసి. ప్రభుత్వ అనుమతి లేకుండా లోయలు, అడవులు, నదులు, హిమ ప్రదేశాలను దాటి టిబెట్టు చేరుకున్నాడు. 'శరీరం చాలా విలువయినది కాని సమయం వచ్చినప్పుడు అది కొంచెం కూడా విలువైంది కాదు. కార్యమైనా సాధించబడాలి లేక శరీరమైనా త్యజించబడాలి' అనేది విశ్వాసం. టిబెట్టు నుండి 34 మోపులు కట్టిన బౌద్ధ గ్రంథాలతో సింహళం చేరుకున్నారు.

1944లో రాహుల్‌జీ తుమ్మపూడి (సంజీవదేవ్ గారి వూరు) వచ్చి ఐదారు రోజులుండి శ్రీ దేవ్‌తో కలసి అమరావతి, నాగార్జునకొండ సందర్శించారు. సాంఖ్యయోగ, న్యాయ, వైశేషిక,

మీమాంస, వేదాంత ఉపనిషత్ దర్శనాలను, సోక్రటీస్ ప్లేటో, అరిస్టాటిల్, మార్క్స్, ఏంగెల్స్, జీన్ పాల్ సార్త్రేల తాత్త్విక చింతనను రాహుల్‌జీ అధ్యయనం చేశారు. సంజీవదేవ్‌గారు అన్నట్లే 'రాహుల్‌ను గురించిన జ్ఞాపకాలు రత్నదీపాలు'.

భారతీయ శిల్పకళా, చిత్రకళా ప్రాభవాన్ని జగమంతటికీ చాటి చెప్పిన వారిలో ఇ.బి. హావెల్ తర్వాత ఆనందకుమారస్వామి ప్రముఖులు. డాక్టర్ సంజీవదేవ్ రచించిన 'ఆనందకుమారస్వామి' వ్యాసం ఒక రసగుళిక. ఆనంద కుమారస్వామి జీవిత విశేషాలను అమెరికాలోని బోస్టన్ మ్యూజియంకు ఆయన తరలించిన భారతీయ చిత్రకళా శిల్ప సంపదను ఆయన రచించిన గ్రంధాలలో విశేషాలను శ్రీ దేవ్ ఈ వ్యాసంలో ఆసక్తికరంగా తెలిపారు.

'చింతకుడు జిడ్డు కృష్ణమూర్తి' వ్యాసంలో డాక్టర్ సంజీవదేవ్ సాంఘిక జీవితానికంటే వ్యక్తి జీవితానికి కృష్ణమూర్తి ఎక్కువ విలువనిస్తారన్నారు. కృష్ణమూర్తి దృష్టిలో వ్యక్తిగత సమస్య ప్రపంచ సమస్య. కృష్ణమూర్తి గారిని శ్రీ దేవ్ 'Free thinker' గా అభివర్ణించారు. 'మానవునికి ఏమి అవసరం లేదో తెలుసుకున్నంత విశదంగా మానవునికి ఏమి అవసరమో కృష్ణమూర్తి బాగా తెలుసుకోలేదేమో' అని శ్రీ దేవ్ సంశయాన్ని వెలిబుచ్చారు.

ఉన్నత వ్యక్తుల జీవిత విశేషాలను తెలిపినప్పుడు, వారి ఔన్నత్యాన్ని అంచనా వేసినప్పుడు శ్రీ సంజీవదేవ్ శైలి ఆసక్తికరంగా ఉంటుంది.

## 6. పుస్తక సమీక్షా వ్యాసాలు

పుస్తక సమీక్షా వ్యాస రచనలో శ్రీ సంజీవదేవ్ గుణపక్షపాతి. రచయితను ప్రోత్సాహ పూర్వకంగా – చిన్న గుణాన్నైనా గుర్తించి గౌరవించే రీతిలో సమీక్ష చేస్తారు. దోషాలను సాధారణంగా బయటపెట్టరు. దోషాలను ప్రస్తావించిన చోట గూడా ఖండితంగా దోషమని చెప్పకుండా దోషాన్ని గుర్తించి మృదువుగా మందలించి వదిలేస్తారు.

రంధి సోమరాజుగారి 'పొద్దు' కావ్యం, లింగం వీరభద్రయ్య చౌదరిగారి 'అభిప్రాయాలు –అనుభవాలు', దివ్యజ్ఞాన సరోజనిగారి 'చిత్రకళ', కె. హనుమంతరావుగారి వాఙ్మయ సమాలోచనము' సంజీవదేవ్‌గారు సమీక్షించిన గ్రంధాలలో కొన్ని.

'పొద్దు' కావ్యాన్ని సమీక్షిస్తూ వారు 'రంధి సోమరాజుది సుకవిత, నవకవిత, యువకవిత' అన్నారు. కావ్యాన్ని వర్ణించటమంటే వాతావరణాన్ని వర్ణించటమే కాదు, ఆయా కాలాల్లో ప్రజలు పొందే ఆనందాలను, నిరానందాలను, ప్రజల ఆశలను, నిరాశలను, వెలుగు నీడలను

వర్ణించటం. 'పొద్దు'లోని కవితలు మాటల మణిదీపాలు, మనస్తాత్విక రూపాలు, వాస్తవిక నవజీవన ప్రతిబింబాలు' అన్నారు. వాఙ్మయ సమాలోచనమును సమీక్షిస్తూ 'సాహితీ సమీక్ష సాహిత్యంలో ఒక ప్రముఖ విభాగం. సాహితీ స్రష్ట సృష్టిని పాఠకులు చదివి సూటిగా తెలుసుకోవటం ఉత్తమమైన పని. కాని కొందరు రచయితల రచనలు ఎక్కువమంది పాఠకులకు బోధపడవు. అక్కడే సాహితీ సమీక్షకుడు, తోడ్పడతాడు. సాహితీ రచనను సుబోధకం చేస్తాడు'. ఈ పనిని సంజీవదేవ్ కొంతవరకే చేశారు. సాహిత్యంలో గ్రంధం విలువను నిర్ణయించే పనికి సంజీవదేవ్ పూనుకోలేదు. గ్రంధంపై ఆసక్తిని కలిగించటం మాత్రమే చేశారు.

## 7. ప్రకీర్ణ వ్యాసాలు.

లలిత కళలపైననే గాక శ్రీ సంజీవదేవ్‌గారి దృష్టి 'ఎస్పరాంటో' లాంటి భాషపైనా 'ఏక లిపి' లాంటి విషయాలపైనా, 'మారుతున్న విలువలు – రచయిత బాధ్యత' లాంటి గంభీరమైన విషయాలపైనా 'కీర్తితృష్ణ'లాంటి సరదా అంశాలపైన కూడా ప్రసరించింది. ఈ అంశాలు లోతైన విషయచర్చతో కూడినవి కావు.

శ్రీ సంజీవదేవ్ సుమారు 150 వ్యాసాలు రచించారు. వాటిలో ఎక్కువ భాగం ఉత్తమమైనవి. మరికొన్ని సామాన్యమైనవి. కొన్ని పేలవమైనవి కూడా ఉన్నాయి.

**భాష, శైలి** : శ్రీ సంజీవదేవ్ తెలుగు సహజమైనది కాదు. చిన్న వయస్సులో ఆయన తెలుగు భాషను పాఠశాలలో చదువుకోలేదు. అంతేగాక ఆయన ఒక విలక్షణ భాషను అలవాటు చేసుకున్నారు. ఈ విషయంలో జమ్ములమడక మాధవరామశర్మ గారు జ్ఞాపకానికి వస్తారు. శ్రీ శర్మ సంస్కృత అలంకార శాస్త్రాలను తెలుగులో రాసేటప్పుడు సంస్కృత నుడికారాన్ని విడిచిపెట్టలేక పోయారు. శ్రీ సంజీవదేవ్ కళా విషయాలను తెలుగులో రాసేటప్పుడు ఇంగ్లీషు పారిభాషిక పదాలకు తెలుగు పదాలను ఉపయోగించినప్పుడు కొన్ని వింత పదాలను వాడారు. Background అనటానికి ఆయన 'పృష్ఠభూమి' అన్నారు చాలాచోట్ల. కాని తెలుగు కళావిమర్శలో దీన్ని 'నేపథ్యం' అనటమే సబబుగా ఉంటుంది. తన భాషా ప్రయోగంలోని వైలక్షణ్యాన్ని శ్రీ సంజీవదేవ్ 'నా వాక్య నిర్మాణంలో కొన్నిచోట్ల కొంత గజిబిజి, తికమక కూడా ఉంటుంటాయి. పరస్పర విరుద్ధాలు కూడా ఎక్కడైనా తొంగి చూస్తుంటాయి'. అటువంటి దోషాలను నేను బుద్ధిపూర్వకంగానే చేస్తుంటాను. కొన్ని లోతైన సత్యాలను విశదపరచటానికి. భాషను విక్ర తపరిస్తే కాని కొన్ని ప్రకృత సత్యాలు బయటపడవు. అయితే ఈ గజిబిజి, తికమక పాఠకులను కొంత బాధపెడతాయి విషయాన్ని అవగాహన చేసుకోవటంలో. మొత్తంమీద నా శైలి సరళమైనదే

కాని ఆ సారళ్యం కొందరికి కాఠిన్యంగా తట్టటం జరుగుతుంది. నా రచనల్లోని విషయాలు కొంత గహనంగా ఉంటుండంతో కొంత జటిలంగా ఉండక తప్పదు' అన్నారు. సంజీవదేవ్‌గారు వ్యాసాలలో తెల్పిన చాలా అంశాలు ఇంతకుముందు తెలుగులో ఎవరూ ప్రస్తావించినవి కావు. వాటిని ఆయన తెలుగు వారికి వివరించటమేగాక, ఉత్తమాభిరుచులు నెలకొనటానికి తమకు చేతనైన కృషి చేశారు. కళోపాసనలో జీవితాన్ని తీర్చిదిద్దుకోవటమేగాక తన ఆలోచనలను, తెలుసుకున్న విషయాలను వ్యాసాలుగా రచించి శ్రీ సంజీవదేవ్ తెలుగు జాతికి, భాషకు ఎంతో సేవ చేశారు.

(రచయిత కడియాల రామమోహనరాయ్
జి.కె.సి. కళాశాల, గుంటూరులో తెలుగు శాఖాధిపతిగా పదవీ విరమణ చేశారు.)

# సంజీవదేవ్ కవిత్వం

– కె.వి. పూర్ణేశ్వరరావు

సాహితీ జగత్తులో కవితకొక ప్రత్యేకస్థానముంది. దీనికి కారణం కవిత, మిగతా రకాలైన భావ ప్రకటనల కంటే భిన్నంగా ఉండటమే. ఈ రోజుల్లో మంచి కవిత్వం రావటంలేదనడం నిర్వివాదాంశం. మంచి కవిత్వం అంటే 'ఆలోచింపజేసే'దని నిర్వచిస్తే విమర్శకు అతీతంగా ఉండవచ్చు. ఆలోచింపచేసే కవిత్వం యాదృచ్ఛికంగా వచ్చిన కవిత్వానికి భిన్నంగా ఉంటుంది. కవి తన మనస్సులోని ఆలోచనలకు ఎట్టి శ్రమ లేకుండా కవితారూపం ఇస్తే దాన్ని యాదృచ్ఛిక కవిత్వం అనవచ్చు. అట్లాకాక కవి తన భావాలను తనలో తాను నెమరు వేసుకొని; తగిన రూపకల్పన ఇచ్చి, కవితారూపంలో వెలువరింపజేస్తే అది ఆలోచింపజేసే కవిత్వం అవుతుంది.

ఉదాహరణకు శృతిచేసిన వీణను మీటితే దాని నుండి శ్రావ్యమైన శబ్దం వెలువడుతుంది. అట్లానే శృతిచేయబడిన మనసునుండి ఉదాత్త కవిత్వం వస్తుంది. ఒక రకంగా చెప్పాలంటే ఉదాత్త కవిత్వాన్ని 'ఆలోచింపజేసే' కవిత్వం అనవచ్చు.

సంజీవదేవ్‌ది ఆలోచింపజేసే కవిత్వం. కవిత పాఠకుడిని ఆలోచింపజేయాలంటే దాని భావ, రూపాల మధ్య చక్కని సమన్వయం సాధించబడాలి. అప్పుడు కవితా ప్రయోజనం సిద్ధిస్తుంది. కవితా పటిమ ప్రస్ఫుటంగా కనబడుతుంది. అందుకే సంజీవదేవ్ కవితలను గూర్చి పరిచయ పంక్తులు రాస్తూ డాక్టర్ సి. నారాయణ రెడ్డి ఇలా అన్నారు –

ఆలోచనానికి ఆలోచన
ఆలోచనకు ఆలాపన

ఆలాపనకు ఆకృతి
ఆర్బిటాల్ ఝుంకృతి
అమరించగలిగిన అమృతభావుడు
సంజీవదేవుడు.

రెడ్డిగారి మాటలలో ఏమాత్రం అతిశయోక్తి లేదు. సంజీవదేవ్ కవిత్వం పాఠకుడి మెదడుకి మేత లాగా పనిచేస్తుంది. భావనలో అనుభూతి రంగరించబడితే అత్యుత్తమ కవిత్వం ఆవిర్భవిస్తుంది. కవి హృదయంలోంచి వచ్చిన భావము సూటిగా పాఠకుడి గుండెలో నాటుకుంటుంది. కవియొక్క భావం ఏమాత్రం నష్టంగాక తగిన రసోత్పత్తిని కలిగిస్తుంది.

సంజీవదేవ్ కవితలలో ముద్రణ పొందిన కవితా సంకలనం 'తెల్లమబ్బులు'. ఇది గాక మరికొన్ని తెలుగు ఆంగ్ల కవితలు అముద్రితాలుగా వున్నాయి. ఆయన కవితలు అవి వ్రాయబడిన కాలక్రమంలో ఏర్పాటు చేయబడివున్నట్లయితే కవిలో కలిగిన మానసిక పరిణామం ఊహకందేది. కాని అట్టి ప్రచురణ లేనపుడు, కవి తన దృష్టి ప్రధానంగా ఏ విషయాలపై కేంద్రీకరించారో పరిశీలించాల్సిన అవసరం వుంది.

సంజీవదేవ్‌కి కవితలో ముఖ్యంగా కనిపించేవి రెండు అంశాలు. ఒకటి ప్రకృతి వర్ణన. రెండవది తాత్వికచింతన. సంజీవదేవ్ ప్రధానంగా ఆధ్యాత్మికవేత్త. జీవన రంగుల దీపకాంతుల్ని స్పష్టంగా చూసిన ద్రష్ట. అందుకే ఆయనలో ఒక ఆవేదన కనడుతుంది. తరచి తరచి తెలుసుకొన్న జీవన సత్యాలను ఇతరులకు అందజేద్దామన్న తపన. ఉదాహరణకు జీవనరాగం అనే గేయంలో ఆయన ఇలా వ్రాస్తారు.

తెర కావల
విరాట్ రూపం
తెర కీవలి
జీవ స్వరూపం
తెర తెగితే
రెండూ ఒకటి

తెరతెగితే అంటే అర్థమేమిటో కవి చెప్పకనే చెప్పారు సూచన ప్రాయంగా. ఆత్మ ఒక వైపు పరమాత్మ మరోవైపు. ఏకరూపం ఒకవైపు భిన్న రూపాలు మరోవైపు. తెరకావలిది సత్యం. తెరకీవలిది అసత్యం. అసత్యం, సత్యంలో లీనం కావలసిందే. ఏక్షణంలో ఈ మార్పు

జరుగుతుందో ఎవరూ చెప్పలేరు. కాని మార్పు తథ్యం. జీవన స్వరూపం, విరాట్‌రూపంలో లీనంకాక తప్పదు. అట్లా జరుగుతుందని చెప్పగలిగినవాడే జ్ఞాని. అట్టి జ్ఞానం కలవాడు కనుకనే సంజీవదేవ్ సృష్టి రహస్యాన్ని సరళంగా, సూటిగా నివేదించగలిగారు. ఇదే భావం మరల 'అంధబాల' గేయంలో ప్రతిధ్వనిస్తుంది.

గ్రహిస్తుంది చివరకు
జగత్తులోని స్వరూపం తన స్వరూపమని
ప్రతిరూపాన్ని పరిశీలిస్తుంది ఆమె
స్పర్శతో వాసనతో సులభంగా
ప్రతిరూపంలోనూ తన స్వరూపాన్ని
సారూప్య పరచుకొంటుంది ఆమె
తీర్మానిస్తుంది చివరకు
తన రూపం విశ్వరూపమే అని
అంధబాల ఆమె
అందాల బాల ఆమె.

ఆమె బాహ్యంగా అంధత్వానికి గురైంది. కాని ఆమె మనోనేత్రాన్ని ఏదీ మూయజాలదు. అదే జ్ఞాననేత్రం. అందుకే ఆమె తన జ్ఞానంతో పొందే ఆనందాన్ని చక్కగా వర్ణించాడు కవి. కళ్ళు వుండి కూడా గ్రుడ్డివాళ్ళ లాగా వుండే వారనేకులు. కళ్ళు లేకపోయినా జ్ఞాన సముపార్జన చేస్తారు కొందరు. అటువంటి వారే ఆత్మ సౌందర్యంతో ప్రకాశిస్తూ వుంటారు. అందుకే కవి అంధబాలను, అందాల బాల అని పిలుస్తాడు. అశాశ్వతమైన బాహ్య సౌందర్యం, శాశ్వతమైన ఆత్మ సౌందర్యం ముందు తీసికట్టు అన్న విషయాన్ని చాలా నేర్పుగా కవి స్పష్టం చేసాడీ గేయం చివర.

సంజీవదేవ్ ఆలోచనలన్నీ చివరకు జీవుని ఆవేదన వైపు మరలుతవి. 'రవి కవి' అనే గేయం రవీంద్రుని కవితా ప్రస్తావనతో మొదలయి విశ్వజీవుని ఆత్మవేదనతో ముగుస్తుంది. ఆత్మసాక్షాత్కారము వైపు ప్రయాణం చేసే హృదయానికి ఆత్మవిశ్వాసమే త్రోవచూపుతుంది. అందుకే కవి 'నైరాశ్యవాదాన్ని' త్రోసిపుచ్చుతూ...

'ఈ ఎడారికి అంతు పొంతులు లేవు
నైరాశ్య వాదానికి కాంతులే లేవు'
అంటాడు.

వస్తువుల రూపారూప విచక్షణ. తాత్త్విక చింతనలో భాగం. ఉదాహరణకు వెలుగు చీకటి అనేవి కవిత్వంలో వాడబడితే అవి సుఖదుఃఖాలకు ప్రతీకలు. వెలుగు అంతమయినచోట చీకటి మొదలవుతుంది. చీకటి అంతమైతే వెలుగు మొదలవుతుంది. కానీ మనసులోని బాధ ఒకేసారి అంతంకాదు. దుఃఖంలోంచి సుఖంలోకి పోయినా కొన్ని రోజులపాటు ఆ బాధ మనోగతంగా వుంటూనే వుంటుంది. మానసిక స్థితిలో మార్పు క్రమంగా వస్తుంది. రెండు మానసిక స్థితులలోని మార్పును నీడ సూచిస్తే నీడలో వచ్చే మార్పు మనసులోని పరిణామాన్ని తెలియచేస్తుంది.

'నడిచే నీడలు' గేయంలో ఈ విషయం సూచన ప్రాయంగా వుంది.

'చీకటి వెలుగు తీరాల మధ్య
సేతు రూపమే నీడ
నీడ తెలుపుకు తిరుగుతే వెలుగు
నలుపుకు తిరుగుతే చీకటి'

మానసిక పరిస్థితిలోని పరిణామానికి రంగుల చిత్రీకరణ ఇవ్వటం జరిగింది. ఇది రంగుల గుణవిశేషాలను తెలిసికొన్న కవికే సాధ్యం. ఒక విశిష్టమైన ప్రక్రియ ద్వారా సంజీవదేవ్ ఒక సత్యాన్ని ఇక్కడ చాటగలిగారు.

అనురాగాలు, మానసిక బంధాలు, సాగరాలు బాహ్యాజగత్తులోని బంధాలు. అనురాగాలు సాగరాల కంటే బలమైనవి జలధి విస్తృతికి పరిధి వుంది, కాని అనురాగ విస్తృతికి పరిమితి లేదు. 'దగ్గరదూరాలు' అనే కవితలో ఇలా వ్రాశారు.

సాగరాలు దూరం
అనురాగాలు దగ్గర
సాగరాలను దాటగలం
అనురాగాలను దాటలేం

ఈ భావం సంజీవదేవ్ ఇతర రచనలలో కూడా కనబడుతుంది.

సంజీవదేవ్ అనేక విలువైన పుస్తకాలను సమకూర్చుకొన్నారు తన గ్రంథాలయంలో. ఆయన ఆహ్వానం మేరకు ఈ రచయిత ఆయన గ్రామం తుమ్మపూడి వెళ్ళినపుడు ఆయన గ్రంథాలయం చూసే అదృష్టం కలిగింది. అపుడు ఆయన మాట్లాడుతూ ప్రపంచానికి భారతదేశం

ఇచ్చిన గొప్పకానుక 'యోగవిద్య' అన్నారు. యోగం ద్వారామనిషికి మహత్తర శక్తులు వస్తాయని, టిబెట్‌లోని లామాలు సహితం యోగం ద్వారా అనేక శక్తులను పొందగలిగారని ఆయన అన్నారు. సంజీవదేవ్ ప్రత్యక్షంగా చూసిన విషయాలనుండి జ్ఞానాన్ని సముపార్జించుకొన్నారు.

భారతీయ వేదాంతాన్ని జీవిత పాఠశాలలో నేర్చుకొన్నాడు సంజీవదేవ్. ఆత్మ పరమాత్మల జ్ఞానాన్ని సరిగా అర్థం చేసుకొన్న వ్యక్తి ఆయన. బాహ్య అంతర రూపాల మధ్యగల సంబంధాన్ని తరచి తెలుసుకొన్న వ్యక్తి సంజీవదేవ్. అందుకే ఆయన ఇలా వ్రాయగలిగాడు.

లోనిది ఇంద్రియాతీతం
బయటిది ఇంద్రియ గ్రాహ్యం
లోనిది అదృశ్యమయం
బయటిది దృశ్యమయం
లోనిది చిరకాలికం
బయటిది క్షణకాలికం
లోనిది ఆత్మికం
బయటిది భౌతికం
భౌతికం అభివ్యక్తమైతే ఆత్మికం
ఆత్మికం అవ్యక్తమైతే భౌతికం

అంతర బాహ్య విషయాల తేడాలను వివరిస్తూ వాటిమధ్య వున్న సమన్వయాన్ని సాధించగలిగారు రచయిత.

సంజీవదేవ్ 'తెల్లమబ్బులు' కావ్య సంపుటి 'శీతసంధ్య' అనే గేయంతో మొదలవుతుంది. గేయం మొదట్లో అలతి, అలతి పదాలతో ఒక ప్రకృతి దృశ్యాన్ని పాఠకుడి మనో నేత్రం ముందుంచుతాడు కవి.

దూరంలోని
కొండలు
దగ్గరలోని
కోనలు
మధ్యలోని

చెట్లు
కదలవు
మెదలవు
ప్రకృతి ప్రశాంతి
ఘనీభవించెను
శీత సంధ్యలో
లేత మంచులో

ఇలా మొదలైన కవిత నెమ్మదిగా నడుస్తుంది. గతిలో వేగం లేదు. నెమ్మదిగా ఒక పదచిత్రం, తర్వాత మరొకటి పాఠకుడి ముందుంచబడతాయి. ఇటువంటి వర్ణనలు సంజీవదేవ్ రచనలలో కొల్లలు కొల్లలు. ఈ పంక్తులను కవిత్వం అందామా?

అందుకే ఆయన 'తెల్ల మబ్బులు'కు పీఠిక వ్రాస్తూ వాటిని కవితలు అనే కంటే 'అకవితలు అనటంలో ఎక్కువ ఔచిత్యం వుంటుంది'. అంటారు. మరల ఆయన 'నా వాటిని కవితకాని కవితలు' అన్నాను అంటారు. 'శీత సంధ్య'లోని మరికొన్ని పంక్తులు పరిశీలిస్తే కవిత ఎంత చక్కగా, కమ్మగా, ఆయన కలం నుండి వెలువడిందో అర్థం అవుతుంది.

మూర్తీభూత
నిశ్శబ్దత
ముదిరి ముదిరి గానమై
సాంధ్యగీతమై
గీత సంగీతమై
చెవికి వినుపించని
చైతన్య రాగమై
శీత సంధ్యను నింపెను.

నిశ్శబ్దంలో గానం వెలువడింది. అది సాంధ్య గీతంగా, గీత సంగీతంగా, మనసుకు వినిపించింది. సాంధ్య ప్రకృతిలో కవి పొందిన అనుభూతి, ఉదాత్తంగా చెప్పబడింది.

పదముల అమరికలో విశిష్టత గోచరిస్తుంది. ఈ పంక్తులు చక్కని ఆలోచింపచేసే కవితకు ఉదాహరణ. అందుకే డా॥ సి. నారాయణరెడ్డి 'తెల్ల మబ్బులు'ను

కవితల్లాగా కదిలే తెల్లమబ్బులివి

కలం కుంచె ఎలనవ్వులివి - అన్నారు.

అదే కవిత ముగింపులో సంజీవదేవ్ ఇలా వ్రాసారు.

మర్మసాధకుల
ఆత్మనివేదన
కవికుమారుల
కావ్యకల్పన
రసద్రష్టల
తన్మయదృష్టి
ఆకారస్రష్టల
సాకారసృష్టి
సాంధ్యకాంతిలో
రాగమ్మై
అనురాగమ్మై
రూపమ్మై
రంగులదీపమ్మై
ఆనందధారలో
అనుమేళించెను.

ఈ కవిత సంజీవదేవ్‌కే గాక, పాఠకుడికి గూడా ఆత్మానందాన్నిస్తుంది. సంజీవదేవ్ తన కవితలను తన ఆత్మానందానికి వ్రాసారు అంటే తప్పుకాదేమో.

ఒక రచయిత రాస్తున్నపుడు, తన్నుతాను పరిశోధిస్తాడు, గాలిస్తాడు (explores himself) సంజీవదేవ్ కవితలు అట్టి పరిస్థితులలోనే వెలువడ్డాయి.

జీవిత సత్యాన్ని పరిశోధించే మనసుకు సౌందర్యము, వికారము రెండూ ఒకటే. ఈ రెండు కూడా ఒకే సత్యాన్ని చాటుతవి. జీవితం ఎడల సమగ్ర అవగాహన ఉన్నపుడు మాత్రమే ఈ సత్యం బోధపడుతుంది. సంజీవదేవ్‌కు ఇట్టి సమగ్ర అవగాహన ఉంది. అందుకే ఆయన ఇలా రాయగలిగారు.

మల్లె మొగ్గ
తెలుపులో

మగువ సిగ్గు
ఎరుపులో
ముష్టివాని
అరుపులో
కుష్టువాని
కురుపులో
ప్రతిధ్వనించును
ప్రతిబింబించును
జీవనరాగం

తత్త్వదృష్టికీ, కళాసృష్టికీ ప్రేరణ ఈ జీవనరాగం. 'గీత సంధ్య'లో విన్న జీవనరాగం ఇదే అయివుండాలి. ఈ మౌనగీతం ఆయనలో ప్రేరణ కలిగించింది. ఆ ప్రేరణ ఫలితమే ఆయన కవితలు.

'సమాధిపై గడ్డి' గేయం వేదాంతపరంగా సాగుతుంది.

'మృత్యువులో మునుగుతుంది
జీవితం నేడు
తిరిగి రేపు సరికొత్తగా
పైకి తేలటానికి'.

అనాదిగా వస్తున్న భారతీయ వేదాంత భావనకు ఆధారం జనన మరణాల రహస్యం. మన ఋషులు జన్మించిన ప్రతిది మరణిస్తుందని, మరణించిన ప్రతిది జన్మిస్తుందని చెప్పారు. జనన మరణాలను వృత్తాకారంలో బంధించారు. ఈ భావన భారతీయుడైన ప్రతివాడి నోటివెంట ఎప్పుడో ఒకప్పుడు వినబడుతుంది. సంజీవదేవ్ మృత్యువులో మునుగుతుంది జీవితం అనటం, పాతభావనకు నూతన రూపకల్పన ఇవ్వటమే. అంటే మృత్యువు సాగరం అని జీవితం పడవలాంటిదని, ఎప్పుడో ఒకప్పుడు ఈ పడవ తాను ప్రయాణం చేసే సాగరంలో మునగాల్సిందేనని చెప్పటంలో నూతనత్వం కొట్టవచ్చినట్లుంది. మునిగిన ప్రతిది పైకి తేలుతుంది. చనిపోయిన ప్రతి జీవి తిరిగి జన్మపొందుతుంది. ఒకే ప్రతీకతో రెండు భావాలను కవి చక్కగా వివరించారు. ఇది ఆయన ప్రతిభకు తార్కాణం.

మనిషి
మరణించలేదు

సమాధి మీద గడ్డిలో
జీవించి వున్నాడు

అనే పంక్తులతో ఈ కవిత ముగుస్తుంది.

'ఆరని దీపాలు' గత చరిత్ర వైభవానికి అద్దం పడుతుంది. భారతదేశ ఉత్కృష్ట చరిత్రను కన్నుల ముందు కనిపించే రీతిలో కవి రచన సాగించారు.

ఆరని దీపాలలో
మారిన రూపాలతో
అతీతపు ఇతిహాసం
చేస్తోంది మందహాసం
మౌర్య రాజ్య ప్రాభవంలో
చంద్రగుప్తుని శౌర్యదీప్తి
చాణక్యుని చతురనీతి
రణభేరుల రుద్రరవం
అర్థశాస్త్రపు అమలకాంతి
మౌర్యశిల్పుల రూపకల్పన
కవి వతంసుల కావ్యసృజన
వెలిగించిన దీపాలు
ఆరిపోయే
నిర్మించిన రూపాలు
మారిపోయె

ఆనాటి మహావిజయాలు కాలగర్భంలో కలిసిపోయినవి. కాని అవే జాతిపురోగమనానికి ప్రోత్సాహం ఇచ్చాయి. అందుకే ఈ కవిత చివరలో 'ఆరలేదు దీపాలు, మారలేదు రూపాలు' అన్నారు సంజీవదేవ్.

'తెల్లమబ్బులు'లోని కవితలు, అన్నింటిలో ఒకే రకమైన కవితా పాటవం కనబడదు. ఈ సంకలనానికి 'తెల్లమబ్బులు' అనే పేరు పెట్టటం చాలా సమంజసంగా ఉంది. మబ్బులు భిన్న ఆకారాలలో వుంటాయి. వాటిలోని నీటి సంపదలో కూడా తేడాలుంటాయి. ఇదే విషయం 'తెల్లమబ్బులు' లోని కవితలు స్పష్టం చేస్తాయి. ఈ సంకలనంలో సంజీవదేవ్ అనేక విషయాలపై

రాసారు. భిన్న శైలులు, భిన్న పోకడలు ప్రదర్శించారు. అతిసులభమ్మైన శైలి నుండి ప్రౌఢ శైలి వరకు రుచి చూపించారు కవి.

'కాళిదాసు ఉపమకాని, దండి యొక్క పదలాలిత్యం కాని లేవు నా కవితల్లో ఇక చివరకు మిగిలింది ఒకే ఆశ. అది భారవికి చెందిన అర్ధగౌరవం. నా కవితల్లో ఇది కొంత వున్నట్లు నా భ్రమ'. ఇంత స్పష్టంగా తను రచనలను తానే విశ్లేషించి, విమర్శించిన రచయితలు ఎందరున్నారు. ఆయన కాదన్నా ఆయన కవితల్లో పదలాలిత్యం మెండుగా వుంది. వాటికి అర్ధగౌరవం చేకూరింది.

సంజీవదేవ్ఆంగ్లంలో రాసిన 53 అముద్రిత కవితలను 'బ్లూబ్లూమ్స్' అనే శీర్షిక క్రింద సంపుటీకరించారు. అవన్నీ ఆయన స్వదస్తూరీలో వున్నవి. ఈ గేయగుచ్ఛము 'క్రిస్టల్ ప్రిజమ్ అనే గేయంతో ప్రారంభమవుతుంది. ఈ గేయం సంజీవదేవ్ కవితా రీతిని ప్రతిపాదిస్తుంది. మానవుడు తన చుట్టూ తానొక పారదర్శక ఖైదును నిర్మించుకొంటాడు. అతనికి బాహ్యా ప్రపంచం కనబడుతుంది. కాని అతడు ఖైదీయే. అతనికి ఖైదులో వుండటం ఇష్టం కాదు. ఖైదు పగలగొట్టి స్వేచ్ఛను సాధిస్తాడు.

'హిమాలయాలలో' సాయంత్రం ఒక మధురగేయం కవికి ప్రకృతిపై గల ప్రేమ, హిమాలయాల ఒడిలో కవి పొందిన మధురానుభూతులు ఇందులో వర్ణించబడ్డవి.

'పాట ప్రతిధ్వని' అనే గేయం కవిలోని భావనాశక్తికి నిదర్శనం.

పాట ప్రతిధ్వని
వినిపించింది
అంతరంగ
నిశ్శబ్దం నుంచి
దాని ప్రతిధ్వని
మరల వినిపించింది
దిఙ్మండలం నుంచి
మేఘాల చాటు నుంచి
పాట ప్రతిధ్వని
వినిపించింది
కోయిల గానంలో

శిశిరంలో రాలిన
ఆకు శబ్దంలో
పుట్టుక ఏడ్పులో
గిట్టుక నిశ్శబ్దంలో
సూర్యుడు
చంద్రుడు
పశువులు
పక్షులు
జీవులు
నిర్జీవులు
ఆపాట
ప్రతిధ్వనులే.

ఇలా సాగే ఈ గేయం ఒక ప్రతిధ్వని యొక్క రూపాలే ఈ సృష్టి అంతా అని చాటుతుంది. సృష్టి 'ఓంకారం' నుండి జనించిందని చెబుతుంది భారతీయ వేదాంతము. బైబిల్ఒక 'మాట' నుంచి సృష్టి వచ్చిందని చెబుతుంది. ఈ రెండు భావాల ఛాయ ఈ గేయంలో కనబడుతుంది. వేదాంత సత్యాలను గేయ రూపంలో పొందుపరిచారు సంజీవదేవ్

'భిక్షుపాత్ర' అనే గేయం భిక్షకుడి జీవితంలో వడుదుడుకులను భిక్షపాత్ర ఎట్లా అనుభవిస్తుందో వర్ణిస్తుంది. భిక్షకుడి జీవితం భిక్షపాత్రతో ముడివేసికొని ఉంది.

సంజీవదేవ్ కవితలు ఆధునిక కవితల క్రిందికి వస్తాయా అన్న విచారణ ఎట్టి ప్రయోజనాన్ని చేకూర్చదు. ఆధునిక కవితల లక్షణాలను కొన్నింటిని ఏరి, అవి సంజీవదేవ్ కవిత్వంలో లేవు కాబట్టి ఆయన కవితలను ఆధునిక కవితలు అనలేం అని నిర్ధారించటం కూడా సమంజసం కాదు. సమకాలీన కవిత్వంలో భిన్న స్వరాలున్నపుడు, దేనిని ఆధునికం అంటాం? దేనికి పట్టంకట్టి, దేనిని త్రోసిపారేస్తాం. ఏ కవిత ప్రయోజనం దానిది.

కవి తన కవితలను ఏ ఉద్దేశంతో రాసాడో ఆ ఉద్దేశం సరిగా అర్థం చేసుకొని, వాటిని చదివి ఆనందించటమే కవితల యెడల సరైన ఆధునిక దృక్పథం. సదవగాహన చాలా ముఖ్యం. ఏ రచయితనైనా అవగాహన చేసుకొని, సానుభూతితో ఆయన రచనలను చదవమని ప్రఖ్యాత ఆంగ్ల రచయిత్రి, విమర్శకురాలు, వర్జీనియా ఉల్ఫ్ (Virgenia Wolf) చెప్పిన మాటలలో ఎంతో సత్యముంది.

సంజీవదేవ్ కవితలు, సాహిత్యాకాశంలో విరిసిన హరివిల్లు 'స్మశానాలతో', 'నెత్తురు మడుగులతో' 'కుళ్ళు కాల్వలతో' – మరికొన్ని వ్యర్థ పదజాలాలతో విసిగిన పాఠకుడికి హాయి కలిగించే జీవనరాగాలు సంజీవదేవ్ కవితలు. వాటి ప్రయోజనం వాటిదే. వాటి నూతనత్వం వాటిదే.

సంజీవదేవ్ సామాన్యులకు అందుబాటులోనుండే భాషలో గొప్ప విషయాలు రాసారు. అది గొప్ప కవిత్వం కాదా? ప్రకృతి ఆయనను పరవశింపజేసింది. భారతీయ తత్త్వచింతన ఆయనకు ఆనందం కలిగించింది. ప్రసిద్ధ ఆంగ్ల కవి విలియమ్ వర్డ్స్ వర్త్ కవితా పోకడలకు, సంజీవదేవ్ పోకడలకు మధ్య సారూప్యం కనబడుతుంది

ఆత్మ దృష్టి, కళాసృష్టి – ఈ రెంటి యొక్క సమన్వయమే సంజీవదేవ్ కవిత్వం.

(ఈ వ్యాస రచయిత – కె.వి. పూర్ణేశ్వరరావు
ఆంగ్ల శాఖాధిపతిగా కె.వి.ఆర్. కళాశాల, నందిగామలో పనిచేసి పదవీ విరమణ చేశారు )

# కవిగా సంజీవదేవ్

*వేగుంట మోహన ప్రసాద్*

సంజీవదేవ్ కవిత్వంలో లేని గుణాలేవో చెప్పటం తేలికే కాని ఉన్న గుణాలేవో చెప్పటం అంత తేలిక కాదు. తన కవిత్వంలో అలంకారాలు లేవని, ఛందో రీతులు లేవనీ, ఉన్నవల్లా పదార్థాలు, ఆలోచనలూ అనీ, అందులోనూ అనుభూతుల కంటే ఆలోచనలే అధికమనీ, వాటిని కవితలు అనేకంటే అకవితలు అనటంలోనే ఎక్కువ ఔచిత్యం ఉంటుందనీ, ఆయనే చెప్పుకున్నారు, ఒప్పుకున్నారు. తాను ప్రధానంగా 'కవినికాన'ని, సమీక్షకుడిననీ, తన కవితలో రససృష్టి కంటే ఆలోచనా పుష్టి ప్రధాన లక్షణమని స్వీయ విశ్లేషణ చేసుకున్నారు. కాళిదాసు, దండి, భారవి కవుల కవితా వైశిష్ట్యాలైన ఉపమ, అర్థగౌరవ, పద లాలిత్యపు ఇంపు కవిత్వంలో తగినంతగా లేవని భయాన్ని వ్యక్తం చేస్తూనే ఎంతో కొంత అర్థ గాంభీర్యం ఉన్నదేమోనన్న భ్రమ తనకే ఉన్నట్లు చెప్పుకున్నారు. తనది అటు బూర్జువా కవిత్వమూ కాదు, ఇటు ప్రజా కవిత్వమూ కాదు కేవలం తనదే అయిన సంజీవదేవ్ కవిత్వమని 'తెల్ల మబ్బులు' కవితా సంకలనానికి పీఠికలో రాసుకున్నారు.

ఈ ప్రకటనలన్నిటిలోనూ ప్రథమ పఠనం ఒకనొక వైరుధ్యమున్నట్లు తోస్తుంది. ఆమాటకొస్తే కవిత్వాన్ని గూరించి కవులందరూ చేసిన నిర్వచనాలలో ఎక్కడా సారూప్యమున్నట్లు తోచదు. ఎవరి కవిత్వాని కనుగుణమైన నిర్వచనాన్ని వారు ఇచ్చుకున్నారు. ఈ కవిత్వమనే బ్రహ్మ పదార్థానికి ఒకే సూత్రమూ ఒకే ఒక భాష్యమూ ఈనాటికీ ఎవరూ ఇవ్వలేకపోయారు. అంతమాత్రామాన ఇది సంజీవదేవ్ కవిత్వమనీ దీని ప్రధాన లక్షణం కళాత్మకమైన దార్శనికత అనీ చెప్పి ఊరుకోలేము. నిజమే. సంజీవదేవ్ మరొక కవిలా రాయలేదు; మరే కవీ సంజీవదేవ్‌లా

రాయటమూ లేదు. అలా రాయకుండా ఉండటమూ, రాయలేక పోవటమూ వాటంతటవే విశిష్ట విషయాలు కావు.

సంజీవదేవ్ తన కవితలను కావాలంటే 'అకవితలు' అనుకోమన్నారు ఆల్ఫ్రెడ్ విగ్నీ అనే ఫ్రెంచ్‌కవి 1837లో తాను రచించిన కవితలను 'పొయమీ' (Poeme) లని పిలవమన్నాడు. ఆ ఫ్రెంచ్ కవి తన తాత్త్విక భావనలకు కవిత్వపు రూపరేఖలని మాత్రమే ఇచ్చాడు. అందుచేతనే వాటిని Poems philosophiques అని పిల్చుకున్నాడు.

ఇక పద లాలిత్యపు ఇంపు దగ్గరకు వస్తే – ఈనాటికీ కవులకూ విమర్శకులకూ మధ్య జరిగే చర్చల్లో ఏ అంగీకారము కుదరలేదనే చెప్పాలి. 1800 సంవత్సరంలో వర్డ్స్‌వర్త్ 'ప్రిఫేస్ టు లిరికల్‌బాలెడ్స్' రాసిన నాటినుండీ వర్డ్స్‌వర్త్ కవిత్వం మీద వ్యాసం రాసిన డీ కన్‌స్ట్రక్షనిస్ట్ పాల్ డీ మాన్ నాటి వరకూ.

ఉపమ దగ్గరకొస్తే – ఆంగ్ల కవిత్వంలో ఛాసర్‌కూ ఇటాలియన్ కవిత్వంలో దాంతేకి ముందూ ఉపమాలంకారపు వాడుక చాలా అరుదుగా ఉండేదని తెలుస్తుంది. అరిస్టాటిల్ కూడా ఉపమాలంకారం కంటే రూపకాలంకారమే ఉన్నతమైనదని చెప్పాడు. హోమర్ కావ్యం 'ఇలియడ్'లో మహాకావ్యత్వం కలిగిన ఉపమాలంకార వినియోగం కనిపిస్తుంది. అయితే సంజీవదేవ్ తన కవితలో లేదన్నది ఒక్క ఉపమ మాత్రమే కాదు – అలంకారికత. అలంకరణ ప్రాయమైన అలంకారికత. నిజమే, అలంకారాలు కవిత్వానికి సాధారణ భాష నుండి విముక్తి కలిగించి ఒకానొక వినూత్నతనిస్తాయి. కాని శబ్దాలంకారాల కంటే భావాలంకారాలే గొప్పవి కావా మరి? కొన్ని అలంకారాలు చెవికి వినిపిస్తే మరికొన్ని కంటికి కనిపిస్తయ్. మనసుకు తోచే, మనసుని తట్టే అలంకారాలు మరొక వర్గానివి. ఆంగ్ల కవిత్వంలో అలంకారం ఆధి భౌతికమవటం కోల్‌రిడ్జ్ నాటి నుండి మొదలైందని చెప్పవచ్చు. మొన్నమొన్నటి దాక మెటఫర్ పొందిన గౌరవాన్ని ఇపుడు మెటానమీ సాధించుకుంటూంది. అలంకరణ ప్రాయమైన అలంకారిత రెటారిక్ అవుతుంది కాని కవిత్వం కాదు. అయితే ఏ కవి ఏ అలంకారాన్ని ఎక్కువ వాడుతాడో దాన్నిబట్టి ఆ కవి యొక్క మనస్తత్వాన్ని కూడా అంచనా వేసే సాహిత్య మనోతత్వ శాస్త్రం కూడా బయల్దేరింది. శైలిని బట్టి కవి వ్యక్తిత్వాన్ని పట్టుకునే పద్ధతిలో.

'అసలు సనాతన అర్థం ప్రకారం అయితే నేను కవినేకాను' అంటున్నారు సంజీవదేవ్. అపుడు రస సిద్ధాంతం జోలికి వెళ్ళాలి. కావ్య శాస్త్రానికి సౌందర్య భావానికీ ఉన్న దగ్గరతనమేదో తెలుసుకోవాలి. రస శబ్ద, అర్థ వికాసమెలా జరిగిందో, రసప్రాప్తి వల్ల అనుభూతి కలుగుతుందో లేక అనుభూతి వల్లనే రసప్రాప్తి అవుతుందో, శోక శ్లోకాల సమీకరణమేమిటో, రీతి ముఖ్యమా

ధ్వని ముఖ్యమా, అనుభూతి లేని కల్పన ఉంటుందా, అసలు కావ్య ప్రయోజనమేమిటి లాంటి పెద్ద పెద్ద ప్రశ్నలు వేసుకోవాలి. సంజీవదేవ్ కవితలో చమత్కారాలు ఉండవు. చమత్కార పూర్ణమైన వ్యంగ్యార్థాలూ ఉండవు. ఒకే ఒక్క వాక్యంతో రసాత్మకమైన కావ్య స్థితికి చేరే అవకాశమూ ఆయన కల్పించుకోరు. అలా అని వ్యర్థమైన వాక్యాలుంటాయా అంటే అవీ ఉండవు.

తన కవితల్లో మార్మిక ఛాయలుంటాయని సూచిస్తూ 'కవితలో వ్యంజన, లేక ధ్వని ఉంటుంది ప్రధానంగా. ఈ ధ్వని అనేది పదం ఇచ్చే మామూలు అర్థానికంటే భిన్నంగా ఉంటుంది. ఆవిధంగా ఉండటమే మర్మం అనిపించుకొంటుంది' అంటారు సంజీవదేవ్. అంటే తన కవితలో భావ ప్రేరితమైన కల్పనతో బాటు శబ్దార్థ సంయోగం ఉండి దానివల్ల వచ్చే అభివ్యక్తి ఆనందాన్ని ఇస్తుందని సూచన. అయితే ఈ అభివ్యక్తిలో వక్రోక్తి పాలు ఎంత?

అధునాతన అర్థం ప్రకారం అయితే సంజీవదేవ్ ఎంత వరకు కవి? ఆదర్శ వాదాన్ని గంభీరంగానూ దార్శనికంగానూ నైతికంగానూ ఆధ్యాత్మికంగానూ హితబోధనగానూ మానవతా దృక్పథంతోనూ చెప్పటమే కవిత్వ పరమార్థమా? అలా చెప్పటంలో కవితా శిల్పం ఎంతవరకు పరిపోషితమవుతుంది? ప్రతిపాద్య విషయమే ప్రధానమా' జీవన దర్శనంలో దేశకాలాల మాటేమిటి? ప్రకృతి పరిశీలనతో మానవ ప్రకృతి అనుశీలన పూర్తయిపోతుందా? సామాజిక యదార్థ వాదపు ద్వంద్వాత్మిక భౌతిక సిద్ధాంతాల ప్రసక్తి ఏమీ ఉండదా?

ఆధునిక కవిత్వపు ప్రధాన లక్షణాలేమిటి? భయం, సందేహం, సందోహం, అనిశ్చయం, క్షోభ, ఆవేగం, ఉద్విగ్నత్వం, అశాంతి, విచ్ఛేదం, అంతర్ముఖిత్వం, అసంబద్ధత్వం, ఆత్మహత్యా ప్రియత్వం, నిస్సంగత్వం, పరాయీకరణ, నిర్మోహత్వం ఇవేవీ సంజీవదేవ్ కవితల్లో కనబడవేమీ? అభినవ ప్రతీకలు, వ్యక్తిగతమైన అతిశయాపూర్వక అనుభూతి, అసంధిగ్ధతా కన్పించవేమీ?

ప్రకృతి ప్రతిబింబమే కవిత్వమన్నాడు డ్రైడెన్ – కవిత్వం ప్రకృతిని అనుకరిస్తుంది అనే భావంలో, సంజీవదేవ్ 'శీత సంధ్య' మొత్తం కవితను ఉదహరిస్తున్నాను –

'దూరంలోని కొండలు  
దగ్గరలోని కోనలు  
మధ్యలోని చెట్లు  
కదలవు మెదలవు'

ప్రకృతి ప్రశాంతి
ఘనీభవించెను
శీత సంధ్యలో
లేత మంచులో,

పడమటి గగనపు
రక్త కాంతిలో
ప్రాదుర్భవించిన
సాంధ్యతార
అలోకించెను
సమాధి మీది సంధ్యా దీపాన్ని!
కదలిక లేని
సాంధ్యతార
ప్రతిబింబించెను
నర్తనశీల దీప శిఖలలో.

అనంతాలైన
దిగంతాలలో
ఎగిరే పిట్టలు
ఎగరని చెట్టులలో
కట్టిన గూడులలో
వణుకుట మాని విశ్రమించినవి
వెచ్చగా
నులివెచ్చగా.

పొయిల నుండి
లేచే పొగలు
ఆకాశానికి కెగురుతూ
అస్పష్ట నీలాభను
సృష్టిస్తూ అభ్రభ్రమను
కల్పిస్తూ

పొగమంచు పొరల గుండ
ఛాయా రూపాల్లో
స్వప్న దృశ్యాన్ని నిర్మిస్తాయి.

చీకటి ముదురుతుంటే
దృశ్య జగత్తులో
లేవు రంగులు
లేవు రూపాలు
ఉన్నదల్లా చలి
చల్లని చలి
నల్లని చలి
చర్మాన్ని నాకుతూ
ఎముకల్ని కొరుకుతూ
గుండెల్ని పిండుతూ ప్రాణాన్ని తింటూ
బ్రతికే మొండి చలి
బండ చలి.

మూర్తీభూత
నిశ్శబ్దత
ముదిరి ముదిరి గానమై
సాంధ్యగీతమై
శీత సంగీతమై
చెవికి వినుపించని
చైతన్య రాగమై
శీత సంధ్యను నింపెను
అనాహత నాదంతో
ఆనంద కాంతితో అనుపమ శాంతితో.
పున్నాగపు
లేత సుగంధం

పారిజాతపు
ప్రౌఢ సుగంధం
దిక్కులన్నిటిని
దివ్య మొనర్చెను ముక్కులన్నిటిని
ముగ్ధుల చేసెను
ప్రాణ స్పందనకు
పరవశ మిచ్చెను.

ముందు చెట్లు
స్ఫుటంగాను
మధ్య చెట్లు
అస్ఫుటంగాను
వెనుక చెట్లు అదృశ్యంగాను
చేసి వేసిన
శీత సంధ్యలోని
ఆవిరి మంచు
సాంధ్య ప్రకృతికి
లోకోత్తర శోభను
చేకూర్చింది.

అరణ్యాల
అంచులు
కొండల మీద
మంచులు
సెలయేళ్ళ
జలజలలు
జంతుజాలపు
వింత అరుపులు

గిరి ప్రజల
చలిమంటలు
పొయిల మీద
ఉడికే వంటలు
దూరం నుంచి
విన్పించే మురళీ రవం
దగ్గరలో
మ్రోగుతున్న
తప్పెట శబ్దం
నిశ్శబ్ద సంధ్యకు
శబ్ద ఆభరణాలు

నది లోపల
ఇసుక దిబ్బలు
దిబ్బల మీద
రెల్లు దుబ్బులు
దిబ్బల చుట్టూ
నీల జలాల దిబ్బల దగ్గర
నిలచిన పడవ
పడవలో వేగే
ఎండు చేపల
మెండు వాసనలు
సాంధ్య వాయువులో
విలీనమై
సకల దిశలకు
సాగిపోయినవి.

అతి సుందర
శీత సంధ్యలో
భగ్న ప్రేమికుల
మౌన వేదన
మర్మ సాధకుల
ఆత్మ నివేదన
కవి కుమారుల
కావ్యకల్పన
రసద్రష్టల
తన్మయ దృష్టి
ఆకార స్రష్టల
సాకార సృష్టి
సాంధ్య కాంతిలో
రాగమ్మై
అనురాగమ్మై
రూపమ్మై
రంగుల దీపమ్మై
ఆనంద ధారలో
అనుమేళించెను'.

ఒక లిరిక్‌లా కొనసాగిన చిరు చిరు శబ్దాల చిన్ని చిన్ని దృశ్యాల ఈ సుదీర్ఘ కవితలో పాఠకుడు ఏయే చిత్ర విచిత్ర దృశ్యాల్ని కంటాడు? ఏ పద చిత్రానికా పదచిత్రం బాగానే ఉంటుంది కాని, మొత్తం మీద ఒక లాండ్‌స్కేప్ పెయింటింగ్‌ని చూచిన అనుభూతి కలుగుతుంది కాని ఏ పంక్తులు మన జ్ఞాపకం మీద దాడి చేస్తవి? ఏ పదబంధాలు మన నాలుక మీద నాట్యమాడతాయి? ఈ కవిత మొత్తం సంజీవదేవ్ రచించే ఏదేని జలవర్ణ చిత్రానికి మాటల మూటగా తోస్తుంది. సాంధ్యతారకూ సమాధి మీద సంధ్యా దీపానికీ ఉన్న దూరాన్ని తగ్గించే టెలిస్కోపింగ్ కూడా చిత్రకళలోని ఒకానొక శైలీ విన్యాసమే. కదిలే వస్తువులూ కదలని వస్తువులూ జంటగా ఒకచోట ఉండే స్థితిలో కవి కూడ ఐక్యమైపోవటాన్ని యునానిమిజమ్ అంటారు. జూల్ రొమైన్స్1903లో ఒకానొక సాయం సమయాన మిత్రుడితో వ్యాహ్యాళి కెళ్తూ, ఆమ్‌స్టెర్‌డామ్ లోని ఒకానొక వీధిలో - ఇలా అనుకున్నాడు. 'మానవుని దేహంలోని అణువులా, కణంలా,

చెట్ల ఆకులలోని ఒకానొక పత్రంగా నేనీ ఆమ్‌స్టర్‌డామ్ వీధిలో ఉన్నాను. ఈ క్షణంలో ఈ అభిజ్ఞ నా ఒక్కడిలోనే కలుగుతూంది. ఇక నేను ఈ వీధిలోని జీవితాన్నంతా పొదివి పట్టుకోవాలి. అసంఖ్యాకమైన ఈ వాహనాల్లోనూ వాహనాలలో ప్రయాణించే వాళ్ళలోని అంతరంగ చైతన్యాన్ని నాదిగా నేను చేసుకోవాలి. నాలోని ఈ కాంతిని ఈ నడిచిపోతున్నవాళ్ళందరి చేతనను మించిందిగానూ ఈ వాహనాల శబ్దాలను అధిగమించేది గాను గొప్ప వెల్తురుతో ప్రసరింపచేయాలి' అని తన మిత్రుడితో చెప్పాడు. బహుశా వాల్ట్ విట్‌మన్ కూడా చేసిందిదే. తన వైయక్తిక చైతన్యాన్ని సామూహిక చేతనతో ముడిపెట్టేశాడు.

'శీతసంధ్య' కవితలో సంజీవదేవ్ దార్శనికత దృష్టి సమగ్రంగా కనిపిస్తుంది – వర్డ్స్‌వర్త్ రచించిన 'టింటర్న్‌యాబీ' కవితలో ఆయన తాత్విక సమగ్రత ఎట్లా విశ్వరూపంలో కన్పిస్తుందో అట్లా. సంజీవదేవ్ 'పొయిల నుండి లేచే పొగలు ఆకాశానికెగురు' తూండటం చిత్రిస్తే, వర్డ్స్‌వర్త్, 'రీడ్స్ ఆఫ్ స్మోక్ సెంట్ అప్, ఇన్ సైలెన్స్, ఫ్రమ్ అమాంగ్ ది ట్రీజ్' అన్నాడు. సంజీవదేవ్ గిరి ప్రజల చలి మంటల్నీ, పొయిల మీది ఉడికే వంటల్నీ మర్మ సాధకుల ఆత్మ నివేదనలనీ వర్ణిస్తే, వర్డ్స్‌వర్త్ 'అఫ్ వాగ్రంట్ డ్వెలర్స్ ఇన్ ది హౌస్‌లెస్ ఉడ్స్ ఆర్ ఆఫ్ సమ్ హెర్మిట్స్ కేవ్, వేర్‌బై హిజ్ ఫైర్ ది హెర్మిట్ సిట్స్ అలోన్' అనే పద చిత్రాన్నిచ్చాడు.

'శీతసంధ్యలో ఎంత లేవు లెమ్మనుకొన్నా ట్రాన్స్‌ఫర్డ్ ఎపిటెట్, పాతటిక్ ఫాలసీ లాంటి అలంకారాలు కనిపిస్తాయి. అంటే అది అప్రయత్నంగానే వచ్చినవన్నమాట. 'చల్లని చలి, 'నల్లని చలి', 'మూర్తీభూత నిశ్శబ్దత ముదిరి ముదిరి గానమై' లాంటి పద బంధాలలో ఆ అలంకారికత కన్పిస్తుంది. కాని, 'పారిజాతపు ప్రౌఢ సుగంధం దిక్కులన్నిటిని దివ్యమొనర్చెను ముక్కులన్నిటిని ముగ్ధుల చేసెను' అన్నచోట కవిత కుంటినట్లూ తెలుగు తనాన్నుంచి గెంతినట్లూ అనిపించటం లేదూ? అర్థం కుదురుతుంది కాని శబ్దం కుదరటం లేదు.

కవితా రచనలో 'ప్రకృతి చిత్రణ ఒక విషయం అవటం అటుంచి, ప్రకృతి కవితా సిద్ధాంతాలలో ఒకటిగా ఎప్పటి నుండో ప్రవర్తిత మవుతూనే ఉంది. మానవుడు ప్రకృతిలో ఉన్నాడు గాని ప్రకృతి కోసంకాడనీ, పోనీ ప్రకృతి కోసమే గాని ప్రకృతిలో లేడనీ, లేదా ప్రకృ తిలో ఒకానొక విశిష్టమైన భాగమనీ ఇలా కొన్ని వాద వివాదాలున్నాయ్. ఖగోళ శాస్త్రాన్ని శోధించే మానవుడే చివరకు ఒక ఖగోళం అవుతున్నాడు. పురాణ కవిత్వంలో ప్రకృతికి సూపర్ నాచురల్ స్థానముంది. ఇంకా చెప్పాలంటే మూఢనమ్మకాలతో ప్రమేయముంది. మత విశ్వాసాలకు అందులో చోటుంది. దైవత్వానికి అధీనమైన భావముంది. విశ్వాసాలకు ఆలంబనమైన సత్యానికి సంబంధముంది. వాస్తవప్రపంచాన్ని త్రోసి రాజనే ప్రార్థనా పూర్వక

దివ్యత్వ కాంక్ష ఉంది. మానవుడు తప్పు చేస్తే సృష్టిలోని గతులు తప్పుతాయనే హెచ్చరిక బైబిల్‌లో కనిపిస్తుంది. సోఫోక్లిజ్ నాటకం ఈడిపస్‌లో ప్లేగ్ మహమ్మారి అందుకే వ్యాపిస్తుంది. పూర్వ కవితలోని ప్రాకృతిక దృశ్యాలలో కనిపించే వాళ్ళందరూ – అయితే దేవతలూ లేకుంటే రాక్షసులూను. భావ కవిత్వంలోనైతే కనిపించే పూలూ, పిట్టలూ, మబ్బులూ, నక్షత్రాలూ అందులో పొదిగి ఒదిగిన ప్రేమసీను. షేక్స్పియర్ నాటకాలలో – 'యాజ్ యు లైకిట్', 'టెంపెస్ట్' లాంటి వాటిల్లో గ్రామీణ జీవన దృశ్యాలుంటే, 'కింగ్ లియర్'లో రాజైన మానవుడినే గడగడలాడిస్తుంది ప్రకృతి! 'జూలియస్‌సీజర్' నాటకంలో ప్రకృతి మానవ వికృత ప్రవృత్తిని అనుకరిస్తుంది. మిల్టన్‌స్మృతి గీతం 'లిసిడాస్'లో ప్రకృతిలోని మానవీయత గోచరిస్తుంది. వర్డ్స్‌వర్త్ లాగానే సంజీవదేవ్ ప్రకృతిలో సమగ్రతను దర్శించారు. సమ్యగ్వీక్షణం చేసారు. ఒక తులాభారపు సమస్థితిని ఊహించారు. పొగమంచు లాంటి పారదర్శకత్వాన్ని భావించారు. కాని అదే ప్రకృతి షెల్లీని ఆశ్చర్య, భయ, విభ్రమాలకు లోనుచేసింది – 'ఓడ్ టు వెస్ట్ విండ్' లోలా, 'ఓడ్ టు ఇంటలెక్ఛ్యువల్ బ్యూటీ'లోలా. కీట్స్ సౌందర్య దర్శన చేసి ఆగిపోయాడు తన 'ఓడ్ టు ఆటమ్'లో ప్రవాహ శీలమొక్కటే ప్రకృతి లక్షణం కాదని గ్రహించిన కవులు హాప్కిన్స్, ఎలియట్‌లు. సమకాలీన సామాజిక సంక్షోభాన్ని దర్పణంగా చూపించింది 'వేస్ట్‌లాండ్' కావ్యం. మార్మికుడైన విలియం బ్లేక్‌కు కవితా స్ఫురణ ప్రకృతిలోని చిత్ర చైద్యాలనించే జనించింది. ప్రకృతి ఒక శక్తి. దీన్నించి కవి ప్రేరణ పొందుతాడు. దాని శక్తిని జాన్‌డన్, హెన్రీవాన్, రిచర్డ్ క్రాషా, జార్జ్ హెర్బర్ట్‌లు ముందుగా రక్తి నుంచి మొదలై ముక్తిని పొందారు. సంజీవదేవ్ ప్రకృతికవితల్లో విరాగం లేదు గాని అనురాగం ఉంది. మానవీయ దృష్టికంటే అందులో కళాత్మక సృష్టి అధికం. ఆధునిక కవిత మానవుడికీ ప్రకృతికీ కలిగిన పరాయీకరణను చిత్రిస్తుంది. ఎలియట్ రచించిన 'డ్రైశాల్వేజస్' లోనూ, అలెన్ టేట్ రచించిన 'ఒడ్ టు ది కన్‌ఫెడరేట్ డెడ్' లోనూ ఈ స్ఫురణ కొట్టొచ్చినట్లు కన్పిస్తుంది. విలియం బట్లర్ ఏట్స్ కవిత్వంలో తాంత్రికత కన్పిస్తే, సంజీవదేవ్ ప్రకృతిలో దృశ్యాదృశ్యాల అంతరిక జిజ్ఞాస కనిపిస్తుంది. ఈ జిజ్ఞాస మరి మనకు తృప్తినిస్తుందా? కవికి ప్రకృతి ఇచ్చిన విశ్రాంతి పాఠకుడికి ఆ కవిత ఇస్తుందా?

'నివేదనలు' అనే కవితలో 'ప్రాణాల ప్రమిద' అనే చక్కని పదబంధం ఉంది. కవిత అంతా చదివినా మన ఆవేదనలు నివేదనల స్థాయికి ఎదగవెందుచేత? 'భావ ప్రకంపనలను ప్రకృతి కవిత స్థాయీ భావానికి చేర్చుతుందన్నాడు ఐ.ఎ. రిచర్డ్స్. కవి ముందుగా సంచార భావాల్ని ఆజ్ఞలోకి తీసుకోవాలి. వాటికొక నాటకీయత కల్పించాలి. వాటిని హ్యూమనైజ్ చేయాలి. లేనపుడు ప్రకృతి కవితలన్నీ నైరూప్య కవితలవుతాయి! 'నివేదనలు' అలాంటి నైరూప్య కవిత.

'జీవన రాగం' అనే సంజీవదేవ్ సుదీర్ఘ కవితలో కొన్ని కొన్ని పాదాలు మానవీయతను ప్రదర్శిస్తాయి - అదీ కవిత చాలాసేపు కొనసాగినాక -

'మల్లె మొగ్గ
తెలుపులో
మగువ సిగ్గు ఎరుపులో
ముష్టివాని
అరుపులో
కుష్టువాని
కురుపులో
ప్రతిధ్వనించును
ప్రతిబింబించును జీవన రాగం'

బాగానే ఉంది. కాని సంజీవదేవ్ తత్వ దృష్టికీ కళా సృష్టికీ ఉన్న మమైక్యత

'పుట్టుట
ఒక మోదం
బ్రతుకుట
ఒక ఆమోదం
చచ్చుట
ఒక ప్రమోదం
ఏదీకాదు
ఖేదం'

అన్నపుడు పాఠకుడిలో సిద్ధిస్తుందా? ఇది నైరూప్యమైన కేవలం బుద్ధివాదం కాదా? కీట్స్ అనలేదా 'యాక్సియమ్స్ ఇన్ ఫిలాసఫీ ఆర్ నాట్ యాక్సియమ్స్ అన్‌టిల్ దే ఆర్ ప్రూవ్‌డ్ అపాన్ అవర్ పల్సెస్'? సంజీవదేవ్ వస్తువులకు రంగుల్ని రాగాల్నీ ఇస్తారు. అలాగే పుట్టుకకీ గిట్టుటకీ కూడా.

'మృణ్మయ లోకపు
మధుర పరాగం
చిన్మయ జీవికి
చిర సమయోగం' అంటారు.

'ప్రకృతిలో
వికృతిలో
తన ఆకృతికే
అనుకృతి
కాంచును
జీవనరాగం'

అని సిద్ధాంతరీకరిస్తారు. కాని ఈ భావం అనుభవమయ్యే అవకాశం, అనుభూతిగా మిగిలిపోయే రససిద్ధీ ప్యూర్ పొయిట్రీ ద్వారా కావు. శుద్ధ కవితను ఆస్వాదించాలంటే పాఠకుడు తనలోని సంచారీ, వ్యభిచారీ భావాలనన్నిటినీ మరచిపోవాలి.

కవిత ఇవొకేటివ్‌గానన్నా ఉండాలి. లేదా ప్రొవొకేటివ్‌గానైనా ఉండాలి. సంజీవదేవ్ కవిత 'అంధబాల'లో ఇవొకేటివ్ లక్షణం ఉంది. ఆ కవిత –

'అందాలబాల ఆమె
ఆణిముత్యం వలె
అందాల బాల ఆమె
ఆమె ఓ కరుణా కిరణం.

నాదం అంటే ఇష్టం ఆమెకు
నర్తిస్తుంది ఆమె హృదయం
లయకూ రాగానికీ
ఆనందిస్తుంది స్పర్శనూ రుచినీ.
భైక్షుక గాయకుడు
పాడుతుంటే వీధిలో
అంధబాలకు ఆనందమ్మై
నర్తిస్తాయి లయతో పాదాలు.

ఆమెకు లేదు దృష్టి
అందుకే రంగు అంటే అంత తృష్ణ
ఎరుపూ తెలుపూ ఊదా

పసుపూ హరితం నీలం
మందారాన్ని స్పృశిస్తుంది
ఆఘ్రాణిస్తుంది మల్లికను
రుచి చూస్తుంది గులాబిని
ప్రశ్నిస్తుంది వాటి రంగులను
ఎరుపేమో తెలుపేమో
ఎరుగనే ఎరుగదు ఆమె
అన్ని రంగులూ ఒకటే ఆమెకు
గుర్తిస్తుంది పూలను తావినిబట్టి.
తల్లి అంటుంది తనయతో
'చిలుక రంగు పచ్చన'
చిరు నవ్వుతుంది అంధబాల
చిలుక రంగూ ఎలుక రంగూ ఒకటే ఆమెకు.

తమ్ముడు అంటాడు
'ఇంద్ర ధనుసు, ఇంద్ర ధనసు'
పైకెత్తుతుంది తలను నిరాశతో
గగనానికి త్రిప్పుతుంది
కనుపించని కళ్ళ
రాలుతాయి కన్నీళ్ళు కపోలాల పైకి.

అడుగుతుంది తల్లి చీరను స్పర్శించి
దాని రంగేమని
'గులాబి అంచు నీలి చీర'
జవాబిస్తుంది తల్లి.

తహతహ లాడుతుంది అంధబాల
స్వీయ రూపాన్ని చూడాలని
పాపం, చిర నూతనమే అవుతుంది
ఆమె పెంచుకున్న చిర ఆకాంక్ష.

గ్రహిస్తుంది చివరకు
జగత్తులోని సర్వమూ తన స్వరూపమని
ప్రతి రూపాన్నీ పరిశీలిస్తుంది ఆమె
స్పర్శతో వాసనతో సులభంగా

ప్రతి రూపంలోనూ తన స్వరూపాన్ని సారూప్య పరచుకొంటుంది ఆమె.
తీర్మానిస్తుంది చివరకు
తన రూపం విశ్వరూపమే అని.

అంధబాల ఆమె
అందాల బాల ఆమె'.

ఇంతకుముందు ప్రస్తావించిన 'యునానిమిటీ' ఈ కవితలో పుష్కలంగా ఉంది. ఈ కవిత చదివిన తర్వాత సింపతీ కలగటమే గాక ఎంపతీని కూడా పొందుతాం. కారణమేమంటే జీవన విలువలన్నీ మానవ హృదయంలోంచి వచ్చినవే గానీ అర్థ రహితమైన బాహ్య ప్రకృతి చిత్రంలోంచి వచ్చినవి కాకపోవటం చేత, సెంటిమెంటాలిటీని అధిగమించిన సెన్సిబిలిటీ ఈ కవితలో ఉంది కాబట్టి.

ఇతరుల పట్ల మనలో కలిగే సున్నితమైన భావాలు కరుణ రసంగా సిద్ధిపొంది ఒక ఆవేశ రూపాన్ని తీసుకొంటాయి. గోల్డ్‌స్మిత్ రాసిన 'సిటీ నైట్ పీస్' వచనంలో ఉన్నా ఒక గొప్ప కవితయే, కాని 'అంధబాల' లోని పంక్తి 'చిలుక రంగూ ఎలుక రంగూ ఒకటే ఆమెకు' సున్నితత్వాన్ని మనలో కలుగుతున్న ప్రకంపననీ అడ్డుకోవటం లేదా? దైహికమైన ఇంద్రియజ్ఞాన లోపం అతీంద్రియ స్థాయికి చేరుకొనే ఉదాత్త స్థితి 'ఎలుక' కాస్తా అడ్డుపడుతుంది.

సంజీవదేవ్ విరచిత కవిత 'శిలా స్వప్న' ఆయన కవితా దృష్టికీ కళాసృష్టికీ ఒక ఉదాహరణగా నిలుస్తుంది. "Gray and Green" (PP I-II) లో ఇలా రాసారు –

"Literary craft comprises both the microcosm and macrocosm - the world of ideas and the world of objects. Sensation and ideation are two physiological cum- psychological functions needed for literary or any other artistic creation....

The idea may get idealised or distorted in tune with the subjective attitude of the creater - poet, painter, musician, dancer, actor, sculptor etc.,.."

'శిలా స్వప్న' కవిత చదివితే చిరకాలంనించి ఉన్న, విన్న పిగ్మాలియన్ కధ గుర్తు రాదూ! 'శిలా ఖండం కళా ఖండంగా' మారీ అంతర్దశలోనే మానవుడి సృష్టి కాంక్ష ఇమిడి ఉంది. సైప్రస్ రాజొకడు శిల్పాన్ని మల్చాడు. అంత అందమైన శిల్పం లాంటి భార్యనివ్వమని ఆఫ్రోడైట్‌ని ప్రార్ధించాడు. తీరా ఆమె, ఆ శిల్పానికే ప్రాణం పోసింది. ప్రాణం పోసుకున్న గెలేటియాని వివాహం చేసుకున్నాడు. కళాకారుడికి కళాఖండం మీద ప్రేమ. కళ వాస్తవం అనే భ్రమవల్ల కళాఖండానికి కళాకారుడు వాస్తవమనే ప్రేమ. ఇలా కవి తన కవిత మీద ప్రేమను పెంచుకొంటే, స్వీయ ప్రేమను పెంచుకొంటే, కవిత కూడా స్వీయ వ్యక్తిత్వాన్ని పొందుతుందన్నమాట! సంజీవదేవ్ తన ఈ కవితలో పారడాక్స్‌నీ, పారలలిజమ్‌ని చాలా నైపుణ్యంతో వాడి కవితకు స్వయంజనితమైన వ్యక్తిత్వాన్ని, అస్తిత్వాన్ని ఇచ్చారు.

సంజీవదేవ్ కవితల్లో కవిత్వంపాలు కంటే కవిత్వ తత్వం దార్శనికత ఎక్కువ ఉంటుందనటంలో విరోధాభాసం లేదనుకొంటాను. వేదాంతులందరూ కవులు కారు కాని కవులు అందరూ ఎంతో కొంత తాత్విక భావాన్ని ప్రవర్తితం చేస్తూనే ఉంటారు. 'లోపలా బయటా' అనే శీర్షికలో ఉన్న సంజీవదేవ్‌కవితలో తార్కిక భావాల పొడిగింపుతో, అర్ధం విపరిణామం చెందని పదాల నిర్మాణంలో ఒకానొక తాత్విక భావం అభివ్యక్తమవుతుంది. 'లోపల అభివ్యక్తమైతే బయట /బయట అభివ్యక్తమైతే లోపల' ఇలా మొదటి పద్య భాగంలోని ఎనిమిది పంక్తులూ సాగిపోతాయి. కొంత విసుగు జనిస్తుంది కూడా పాఠకుడిలో. అలా అని ఈ తార్కిక వాక్యాలలో ఎక్కడన్నా కుతర్కమున్నదా అంటే అదీ కన్పించదు. ఈ ఎనిమిది పంక్తుల తర్వాత కూడా మరొక మూడు పదుల పంక్తుల దాకా కొనసాగుతుంది కవిత. ప్రతి పంక్తి ఒక థీసిస్. దాని తర్వాత వచ్చేది యాంటి థీసిస్. కవి సాధించేది సింథసిస్. బౌద్ధికమైన స్పష్టత ఉంటుంది కాని కవితాత్మకమైన గాఢత లోపిస్తుంది. కవి వస్తువుల ద్వారా, విషయాల ద్వారా ఆలోచన చేస్తున్నాడు గాని భావాలను వస్తువులుగాను విషయాలు గాను మలచటం లేదు. రాబర్ట్ బ్రిడ్జెస్ రచించిన 'టెస్టమెంట్ ఆఫ్ బ్యూటీ' కావ్యంలోనూ ఇదే శిల్పం కనిపిస్తుంది. సంజీవదేవ్ రచించిన 'బయోసింఫనీ' తాత్విక గ్రంధంలో ఉదాహృతమైన సంజీవదేవ్ ఆంగ్ల కవిత 'క్రిస్టల్‌ప్రిజన్'కీ ఎలియట్ రచించిన కావ్యం 'ఫోర్ క్వార్టెట్స్'కీ రచనా శిల్పంలో పోలికలు కన్పిస్తాయి. సంజీవదేవ్ మరొక ఆంగ్ల కవిత 'ఐ యామ్' శుద్ధ తార్కిక కవితకు మరొక తార్కాణం. తన 'క్రిస్టల్ ప్రిజన్' కవితను ఆయన కాన్సెప్ట్యువల్ కవిత అని చెప్పుకున్నారు. 'ఎ వ్యూ' అనే మరొక ఆంగ్ల కవితను పెర్సెప్ట్యువల్ కవిత అని పిలుచుకున్నారు. కవితాత్మక ప్రతీకలను వాడకపోతే ('క్రిస్టల్ ప్రిజన్'లో ఈగిల్, 'ఎ వ్యూ'లో వయొలెంట్ స్ట్రీమ్ అలాంటి ప్రతీకలు) ఇలాంటి కవితలు కూడా విసుగు కల్గిస్తాయి.

అసలు ఏ కవయినా తాత్విక విచారం ఎందుకు చేస్తాడు? తనను తాను అధిగమించటానికే. వ్యక్తి నిష్టత్వాన్నించి సమూహ చేతనను చేరటానికే, తాత్కాలికల నుండి సర్వకాలాలకు వెళ్ళటానికే. పర్టిక్యులర్స్‌ని గట్టిగా పట్టుకొని యూనివర్సల్స్‌ని అందుకోడానికే. అందుకే షెల్లీ అన్నాడు 'కవులందరూ మహోన్నత ఊహాశక్తి గల తాత్వికులని'. నిబద్ధమైన నేనులోంచి అనంతమైన అనిబద్ధమైన నేను లోకి చేసే నిరంతర పునఃచర్యే కవిత్వపు ఊహ అన్నాడు కోల్‌రిడ్జ్.

సంజీవదేవ్ కవితలలోని ఒక సుగుణం బిలీఫ్ ఆటిట్యూడ్ లేకపోవటం, ఫిలసాఫికల్ బిలీఫ్ ఉండటం. బిలీఫ్ ఆటిట్యూడ్ ఉన్న కవులు మతవాదులైతే ఫిలసాఫికల్ బిలీఫ్‌ఉన్న కవులు కవిత్వ తత్వ వాదులవుతారు.

కాని ఆలోచనలోని సారళ్యత అక్షరాలలోనిక్కూడా ప్రవేశిస్తే ఆ కవితలు ఇంకా హృదయంగమంగా ఉండే అవకాశం ఉంటుందేమో! అనుకుంటున్నానా, అంతలోనే 'ఆరని దీపాలు' కవిత కన్పించింది. 'శీత సంధ్య'లా, 'నదీ మార్గం'లా ఈ కవిత కూడా సుదీర్ఘమైనదే. ముఖ్యంగా 'నదీమార్గం' కవితలోని ప్రవాహ వేగం 'ఆరని దీపాలు'లో కూడా ఉంది. శ్రీశ్రీ 'దేశ చరిత్రలు' లో చారిత్రక విభాస సంధ్యల మానవ కథ వికాసాన్ని చాలా అధీరుడై ప్రవచించాడు. 'ఏవి తల్లీ' అనే అనువదిత కవితలోనూ అదే అధైర్యాన్నీ బెంగనీ ప్రకటించాడు. కాని సంజీవదేవ్ 'దీపాలు ఆరిపోయే రూపాలు మారిపోయె' అంటూ ప్రారంభించి ఇతిహాసపు మందహాసాన్ని గుర్తు చేస్తూ శిలాయుగ మానవుడి నుండి తామ్ర, కాంస్య, ఇనుప యుగాల నాగరికతను మననం చేసుకుంటూ హరప్పా, మొహంజోదారో, మౌర్య రాజ్య, చంద్రగుప్త, నాగరిక పాలనా స్థితులను తలచుకొంటూ, శాతవాహన సంస్కృతినీ అమరావతి ధర్మచక్రాన్నీ తలపోసుకొంటూ, పల్లవ, చాళుక్య, చోళ, కాకతీయ, విజయనగర, హొయసలా, పాండ్య, చేర ప్రజ్ఞాశాలురను జ్ఞప్తికి తెస్తూ, మొగల్, బ్రిటిష్ సామ్రాజ్యాల మంచి చెడులను విశ్లేషిస్తూ, ఒక సుదీర్ఘమైన క్రానికల్‌కవితను రచించి, చివరికి 'ఆరలేదు దీపాలు మారలేదు రూపాలు' అని ముగిస్తారు. చరిత్రకారుల కంటే కవులే గొప్పవాళ్ళని అరిస్టాటిల్ అన్నదిందుకే. తాత్కాలికల నుండి శాశ్వతత్వాలకూ సర్వకాలాలకూ సార్వదేశికానికీ పాఠకుడిని తీసికెళ్తారు కాబట్టే.

సంజీవదేవ్ కవితలలోనూ ఇతర కళల లక్షణాలు ఎక్కువగాచోటు చేసుకొంటాయి. వాటికితోడు బౌద్ధికమైన ఆలోచన ద్వంద్వ వాక్యాలతో వైరుధ్యాల పదబంధాలతో వచ్చి కూచుంటుంది మధ్యన. అచ్చమైన తెలుగుతనం ఆ వాక్య నిర్మాణంలో ఉండదు.

సంజీవదేవ్ కవితల ప్రయోజనం ప్రమోదమే. జీవన ఆనందమే, జీవిత స్వీకారమే. సౌందర్య భావనని, సాధారణీకరం చేయటమే. ఆనందాన్ని పంచటమే. దుఃఖాన్ని భరించగలిగే సత్తాని పెంచుకోవటమే. కాని ఏ కవితా స్వీయానుభవంలోకి రాకపోతే, రప్పింపకపోతే అనుభూతిని కలిగించదు. సంజీవదేవ్‌దే అయిన ఒకానొక ప్రత్యేక శైలీవిన్యాసపు (ద్వంద్వ భావనల విశ్లేషణ తర్వాత వచ్చే సంశ్లేషణ) అభివ్యక్తి పాఠకుడి అనుభూతికి అడ్డువస్తుంది. ఆంధ్రాంగ్ల భాషలు రెండిటిలోనూ ఇదే జరుగుతుంది. అంతర్ముఖీనమై ఆ కవితలు ప్రసరించే భావాల్ని గురించి ఆలోచనలోకి వెళ్ళాల్సిందే గాని సరాసరి అనుభూతిలోకి ఇమడవు. మనన యోగ్యంగా ఏ పంక్తీ దానికది ఒక అస్తిత్వాన్ని పెంచుకోదు.

ముఖ్యంగా నేను, నాలాంటి పాఠకులు కోరుకొనే సంఘర్షణ ఉండదు. పోరాటం లేనిదే ప్రశాంతి ఎక్కడ? విరుద్ధ భావాల సంఘర్షణలోంచే కదా చివరికి విశ్రాంతి! సంజీవదేవ్ దీర్ఘ కవితలలో మానవీయ గుణాలను వర్ణిస్తారు కాని తన హ్రస్వ కవితలలో తాత్విక ప్రకటనలు మాత్రమే చేస్తారు. అది తృప్తినివ్వదు. పోనీ ఆ హ్రస్వ కవితలు హైకూలలా మనస్సునీ హృదయాన్నీ పట్టేస్తాయా అంటే – లేదనేచెప్పాలి.

కవిగా సంజీవదేవ్ సంజీవదేవే !

(రచయిత శ్రీ వేగుంట మోహన ప్రసాద్ సిద్ధార్థ కళాశాల,
విజయవాడ నుండి ఆంగ్ల శాఖాధిపతిగా పదవీ విరమణ చేశారు.)

# కళాతాత్త్విక స్రష్ట డాక్టర్ సంజీవదేవ్

*డాక్టర్ జి.సుందరరామయ్య*

అల్డస్ హక్సలీ అంతటి మేధావితో పరిచయం ఉన్నవారు, ఆయనతో స్నేహాన్ని, ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపినవారు భారతదేశంలో బహు కొద్దిమంది. అటువంటి అరుదైన వ్యక్తి డాక్టర్ సంజీవదేవ్. మానవుడు స్వేచ్ఛాజీవి. మానవుడు అన్నింటికన్నా స్వాతంత్ర్యాన్ని, స్వేచ్ఛను కోరుకుంటాడు. స్వేచ్ఛ లేని మానవుడు పంజరంలో ఉన్న పశువు. సార్వత్రికంగా అంగీకరింపబడిన ఒక నిర్వచనం స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు ఉన్నాయి. దుఃఖాన్నించి, దారిద్రాన్నించి, మనోవేదనల నుంచి, నిత్యావసరాల నుంచి, రాజకీయ, సామాజిక, ఆర్థిక పీడిత శక్తుల నుంచి విముక్తి చెంది ఉండటమే స్వేచ్ఛ. అదే స్వాతంత్ర్యమని సహేతుకమైన నిర్వచనాన్ని శ్రీ సంజీవదేవ్ హక్సలీకి వ్రాసిన ఉత్తరంలో మనం చూడవచ్చు. దుఃఖం బంధమైతే దాని నివృత్తి స్వేచ్ఛ. దాని విరగడ స్వాతంత్ర్యానికి పరాకాష్ఠ. నేటి నాగరిక దేశాలు ఇటువంటి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు దోహదం చేయాలని మానవాళిని హెచ్చరించిన జాతి వైతాళికుడు డాక్టర్ సంజీవదేవ్.

విశ్వకవి రవీంద్రనాధ్ ఠాకూర్ మేనకోడలు కొడుకైన అసిత్ కుమార్ హల్దర్ ప్రపంచ ఖ్యాతి గాంచిన చిత్రకారుడు. తన కావ్యం 'మానసముకీర్' ను శ్రీ సంజీవదేవ్‌కి అంకితం ఇచ్చాడు. ఏ చిత్రకారుడు కూడా తనదికాని సంస్కృతీ నాగరికతల ప్రభావానికి లోనై చిత్రాలను గీయడు. అంతమాత్రాన ఆయా సంస్కృతి నాగరికతలను చూచి ఏమీ నేర్చుకోలేదనీ చెప్పలేం. కొందరు బాగా ప్రభావితమైతే, మరికొందరు అంతగా ప్రభావితులు కారు. సాంస్కృతిక సంసర్గం ఉంటుంది. అది అవసరం కూడా. హేతువాదం విజ్ఞాన

వికాసానికి, జాతీయవాదం అంతర్జాతీయ వాదానికి దారితీస్తే ఆ రెంటినీ స్వీకరించవచ్చు. విశ్వమానవ సౌభ్రాతృత్వానికి, విశ్వమానవ సదవగాహనకు కళ తోడ్పడుతుంది. భారతీయ కళ, చైనా కళ, జపాను కళ, ఐరోపా కళ అనే వివిధ నామాలు కళలోని అంతరాలను తెలియచేస్తాయే కాని, కళలు వైవిధ్యానికై ఉన్నాయని చెప్పవు. సమగ్రత, సమైక్యత, సమదృష్టి, సమత్వము కళ ఉద్దేశం. ఆధునిక కళ సాంప్రదాయ కళకు విరోధికాదు. ఆ రెండూ ఆరాధ్యాలే. దేని సౌందర్యం దానికి ఉంది. దేని ప్రయోజనం దానికి ఉంది.

మానవుడు ఆశావాది. సహేతుకంగా, ఆరోగ్యంగా, ఆనందంగా మానవుడు జీవించాలి. మృత్యుభయంతో జీవించరాదు. మరణం జీవితానికి అంతిమ దశ కాదు. మరణం అంటే నవ్య నూతన జీవితంలోకి ప్రవేశింపచేసే సంఘటన. పరమార్థతత్త్వ స్వరూపం ఎవరికి తెలుస్తుంది? అంతమాత్రాన అది లేదని కాదు. కళాత్మకమైన అద్వైతానుభూతితో చెప్పిన మాటలివి అని డాక్టర్ సంజీవదేవ్ అసిత్ కుమార్‌కు వ్రాసిన లేఖలో మనం చూడవచ్చు.

అట్లాగే శ్రీమతి వడ్లపట్ల లలితాంబగారికి రాసిన లేఖలో ఒక మాతృమూర్తిని ఎలా సంబోధించాలో, ఎట్లా పరామర్శించాలో, ఎట్లా ప్రస్తుతి చేయాలో గోచరిస్తుంది. ఒక చిత్రకారుడు గీసిన చిత్రాన్ని చూచినపుడు ఆ వ్యక్తి కన్ను, మనస్సు, హృదయం, ద్రవించినపుడు ఆ చిత్రం సజీవమైనదంటాడు డాక్టర్ సంజీవదేవ్.

నేటి సమాజంలో స్వార్థము, అసూయ, ద్వేషం అధికమవుతున్నదని ఆయన దయార్ద్ర హృదయం ద్రవిస్తుంది. చిత్రకారుని చిత్రం ఎట్లా వెలువడింది అంటే సామాన్యంగా కుంచె రంగులు కాన్వాసు నుంచి వెలువడుతాయి అని సమాధానం వస్తుంది. అట్లాగే కావ్యరచన ఎట్లా ఏర్పడుతుంది అంటే కలం కాగితం ఉంటే వస్తుందంటారు. ఇవి సామాన్య దృష్టికి అందే కారణాలు. కాని నాదృష్టిలో ఈ రెండూ అంటే కళ, కావ్యం రససృష్టికి మూలమైన హృదయం ఉంటే వస్తాయి. ఉపకరణాలైన కుంచె, కలం ఆ రసహృదయాన్ని తాకినప్పుడే కళాఖండాలను, కావ్యఖండాలను అందించగలుగుతాయి. ఆ స్పర్శ లేకపోతే చిందేవి రంగులు, పదాలు మాత్రమే.

కళ బాధపడే వ్యక్తిని బాధ నుంచి సుదూరంగా ఉంచడానికి ప్రయత్నిస్తుంది. మరణించేవారిలో పునర్జీవన కళను ప్రసాదిస్తుంది. నిరాశ చెందేవాళ్లను ఆశాజీవులుగా చేస్తుంది. వార్థక్యంలో ఉన్నవారిని వారి యవ్వనంలోకి తొంగిచూచేటట్లు చేస్తుంది. వియోగవేదన అనుభవించే వారికి సంయోగానందం సంప్రాప్తినిస్తుంది. చీకటిలో ఉన్నవారిని వెలుతురులోకి తెస్తుంది. అనుకూలంగా లేని పరిస్థితులను సానుకూలంగా ఉండేటట్లు చేస్తుంది. కళ

సోమరితనాన్ని హర్షించదు. కళాత్మక దృష్టి, కళాత్మక హృదయం జీవితాన్ని సుగంధ పరిమళం తో నింపుతాయి. అందువలన కళాదృష్టికి బాహ్యమైన మెరుపులు దిద్దనక్కరలేదు. కళలు అనేకం సాహిత్యం ఒక కళ. సంగీతం ఒక కళ. చిత్రలేఖన ఒక కళ. శిల్పకళ ఒక కళ. ఈ విధంగా చూస్తే అనేకమైన కళలున్నాయి. ఐతే సమస్తమైన కళలకు ఆధారపీఠం అంటూ ఒకటి ఉంది. అదే జీవితం అదే జీవనం అదే జీవిత విధానం. ఇక్కడి నుంచే సమస్తమైన కళలూ, సమస్త శాస్త్రాలు ఉద్భవిస్తాయి. కనుక వీటన్నిటి కంటే జీవితమే గొప్పదని చెప్పిన డాక్టర్ సంజీవదేవ్ భావాలు, ఆనాడు యాజ్ఞవల్క్య మహర్షి మైత్రేయికి చెప్పిన జీవిత రహస్య సత్యాన్ని చెబుతున్నాయి.

జీవితంలో మానవుడికి కావలసింది ఏమిటి? ఈ ప్రశ్నకు సమాధానం ఒకే రీతిలో ఉండదు. జీవితాన్ని దుఃఖరాహిత్యంగా ఉంచుకోమని, జీవితాన్ని ఆనందమయంగా ఉంచుకోమని, దుర్వ్యసనాలకు, దురలవాట్లకు దూరంగా ఉండమని, నిర్భయత్వంతో, జ్ఞాన, విజ్ఞాన వికాసాలను అందుకోమని శ్రీ సంజీవదేవ్ చెబుతారు. కీర్తి, యశస్సు, శ్రీ, ధీశక్తి కలిగివున్న జీవితాల కన్నా ధర్మబుద్ధితో ఉన్న జీవితాలు ఉన్నతమైనవి. ఇక్కడ ధర్మబుద్ధి అంటే మైత్రి, కరుణ, నమ్రత, వినయము, శీలము, దయ  ఇత్యాది గుణాలన్నమాట. మంచితనం, దయ ఉన్న జీవులు ధన్యజీవులు. డాక్టర్ సంజీవదేవ్ దృష్టిలో శ్రీమతి వడ్లపట్ల లలితాంబ ధన్యజీవి.

సమాజంలో మానవుడుఎటువంటి సంబంధాన్ని కలిగి ఉండాలి. Anti-social గా ఉండటాన్ని సంజీవదేవ్ సహించరు. Super-social గా ఉండటాన్ని వారు ఆమోదిస్తారు. బ్రిటీష్ తత్త్వవేత్తయగు F.H. Bradley తాత్త్వికధోరణి కొంత ప్రభావాన్ని కలిగివుంది డాక్టర్ సంజీవదేవ్ పైన. అందుకే ఆషాకు రాసిన లేఖలో అంటాడు

"Man is not Man at all unless social; but he is
not much above the beasts unless more than social"

సమాజ జీవితం కన్నా విలువైనది అంతర్గత జీవితం. అంటారు డాక్టర్ సంజీవదేవ్ బాహ్య పరిస్థితులు అనుకూలంగా ఉన్న తరుణంలో కూడా మానవుడు అంతర్వేదనకు గురి అవుతాడు. కనుక మానవుడు సాధన ద్వారా మానసిక పరిస్థితిని అదుపులోకి తెచ్చుకోవాలి. అప్పుడు మనస్సులో ఎగిరిపడే 'శగలూ పొగలూ' ఆయన్ను ఏమీ చేయజాలవు. అనుకూల పరిస్థితుల్లో మానవుడు ఆనందంగాను, ఉల్లాసంగాను కాలాన్ని గడుపుతాడు. కాని ప్రతికూలంగా పరిస్థితులు ఉన్నప్పుడు మనోనిగ్రహాన్ని పొందకల్గినవాడు నిజమైన సాధకుడు. భాష ఆత్మాభివ్యక్తిక (self-expression) లావణ్యాన్ని చేకూరుస్తుంది. భాష, భావ గంభీరత ఈ

రెండూ చాల అవసరం. సుందరమైన భాష, సుందరమైన భావం ఉన్నప్పుడే పాఠకుడు గ్రంధాలను చదువుతాడు. శైలి, భావం, భాష, సన్నివేశాలు, కధాగమనం, కథావస్తువు ఇవన్నీ కళలే. స్వాధ్యయనంతో అన్ని కళలు నేర్చుకోవచ్చు అంటాడు. తాను నేర్చుకొన్నదంతా స్వాధ్యయనం వలనే అంటాడు. ఇక్కడ తైత్తిరీయ ఉపనిషత్తులో మౌద్గల్య మహర్షి చెప్పిన విషయం చేత డాక్టర్ సంజీవదేవ్ ప్రభావితుడైనాడా అనిపిస్తుంది.

'స్వాధ్యాయాన్న ప్రమది తవ్య'
నీ అంతట నీవు నేర్చుకొనే విధానంలో అశ్రద్ధ వహించక.

అట్లాగే సాంఖ్యాదర్శనకారుడైన కపిల మహర్షి చేత కూడా డాక్టర్ సంజీవదేవ్ ప్రభావితుడైనాడా అని అనిపిస్తుంది. ఆయన ఆషాకు రాస్తారు – నేను ప్రకృతి దృశ్యకారుణ్ణి; ప్రకృతిని చిత్రీకరిస్తాను. ప్రకృతి తనను రేఖల్లోను, చిత్రాల్లోను వ్యక్తం చేయమని నన్ను ప్రేరేపిస్తుంది. కపిల మహర్షి అంటాడు

'ప్రకృతి ప్రవర్తతే దర్శనార్థం'
ప్రకృతి తనను చూడమని, తనను అనుసరించమని ప్రబోధిస్తుంది.

రంగుల ప్రపంచం, సాహిత్య ప్రపంచం ఆయనకున్న రెండు అభిరుచులు. విశ్వకవి రవీంద్రుని శతవార్షిక సంపుటికి రవీంద్రుని కళను గురించి రాసిన కళాసాహితీవేత్త డాక్టర్ సంజీవదేవ్ జీవనతత్వంపై ఆయనకు కొన్ని విశేషమైన భావాలున్నాయి. మానవుని హృదయం ఆరని ఆ అందానికి మూలం. కాని దాన్ని అందుకోలేక తన ఆనందం నిమిత్తం బాహ్య వస్తువులపై ఆధారపడతాడు. అది అనుకున్నంతగా దొరకనందువలన బాధపడతాడు. అంటే మానవుడు తన ఆనందానికి ఏ బాహ్య వస్తువు పైనా ఆధారపడకుండా అంతః చైతన్యంపై ఆధారపడితే ఆ ఆనందాన్ని అనంతంగా అందుకోగలడు.

మానవ మనస్సు శరీరానికి మధ్యగల సంబంధాన్ని గురించి ఆ రెండూ పరస్పరం ఏ విధంగా ప్రభావితాలయేది, విజ్ఞాన శాస్త్రాలు ఈ విషయంలో ఏమి చెబుతున్నదీ, చైనా తాత్వికులు, టిబెట్ తాత్వికులు ఈ విషయంపై ఏమి చెప్పింది, మొదలైన విషయాల్లో వారు చక్కని అవగాహనను కలిగివున్నారు. బలహీనత ఒక రుగ్మతకాదు. అది ఒక అవధి లాంటిది.

అందుకే మానవుల శక్తి పైకి శారీరక సౌష్టవంలో కనిపిస్తున్నప్పటికీ, మానసిక శక్తి లేకపోతే వారు దుర్బలత్వాన్ని కలిగివున్నట్టే. అట్లాగే మనోధైర్యాన్ని, మనోస్థైరాన్ని, కలిగి ఉన్నవారు వికలాంగులైనప్పటికీ వారు శక్తిమంతులే.

ప్రతి చిత్రకారుడికి కొంత ప్రత్యేకత ఉంటుంది. కొందరు చిత్రకారులు మానవాకృతులను చిత్రిస్తారు. కాని వారు రమణీయమైన ప్రకృతి దృశ్యాలను మాత్రమే తన చిత్రకళా సామగ్రిగా ఎంచుకొన్నారు. ఇక్కడ ఆయన మళ్లీ సాంఖ్యదర్శనతత్త్వంచే ప్రభావితుడైనాడు. అట్లాగే విశిష్టాద్వైత దర్శనం చేత కూడా డాక్టర్ సంజీవదేవ్ ప్రభావితుడైనట్లు ఆయన చెప్పిన శరీరాశరీర భావాలను బట్టి తెలుస్తున్నది. శరీరం అనేక నియమ నిబంధనలకు లోబడి ఉంటుంది. అది పరిమితం. ప్రాణం అపరిమితం ఈ పరిమిత శరీరంలో ప్రాణం నిరంతరం, నిత్యమూ ఉంటే అది బందీ జీవితమౌతుంది. దానికి స్వేచ్ఛ కావాలి. 'శరీరం కొంతమూలమైనా అశరీరం పాత్రను ధరించకపోతే శరీరంలోని అనంత స్వేచ్ఛకు దెబ్బ. ససీమ నుంచి అసీమ (finite నుంచి infinite) పరివ్యాప్తమవుతూండటమే ఆనందజీవుల లక్షణం'. Body-Consciousness లో నుంచి Spirit Consciousness లో నివసించటమే మానవ జీవితానికి పరమార్థం అంటాడు డాక్టర్ సంజీవదేవ్.

భగవద్పాదులు శ్రీ శంకరాచార్యులు రాసిన 'సౌందర్యలహరి' చేత ప్రభావితుడై 'సౌందర్యోపాసన' అనే చిన్న గ్రంథాన్ని రాశారు డాక్టర్ సంజీవదేవ్ సంస్కృతికి ఒక కొత్త నిర్వచనాన్ని ఇచ్చాడు. సంస్కృతి అంటే పని, తీరికల సమ్మిళితం, Work is Worship, కాని ఆ Worship Leisure లో ఉంటుందంటాడు. సంస్కృతి పంథా ఒక మహాజ్వాల. అది మానవ హృదయాలకు వెలుగునూ, వెచ్చదనాన్ని ప్రసాదిస్తుంది. తైత్తిరీయ ఉపనిషత్తులోనున్న 'పంచకోశ సిద్ధాంతానికి' నూతన భాష్యాన్ని చెప్తాడు. అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞాన మయ, ఆనందమయ కోశాలు ప్రతి జీవిలోనూ ఉంటాయి. సంస్కృతీ నాగరికత, మానవత్వం, కల్గిన హృదయాలు' అన్నం కంటే లలిత తరమైన దాని కొరకు, వెన్నకంటే మృదువైన దాని కొరకు, రక్తమాంసాదులతో నిండుకొని ఉన్న భౌతిక శరీరానందం కంటే మిన్నయైన ఆనందాన్ని పొందడానికై ఆరాటపడతాయి. భారతీయుల ఆధ్యాత్మికత, పాశ్చాత్యుల భౌతికతపైన పద్యం, గద్యం, సంగీతం పైన ఆయనకు కొన్ని విశిష్టమైన భావాలు, ప్రత్యేకమైన దృక్పథం ఉన్నాయి. ఈ విషయాన్ని గురించి ఆయన మాటల్లోనే చూద్దాం.

"Spiritualism is not in the orient
Nor Materialism is in the occident
More Poverty and less plenty in the orient
More plenty and less poverty in the occident"

అట్లాగే, గద్యం అంటే ఆలోచన, పద్యం అనేది వేదన, సంగీతం అనేది సంవేదన. గద్యం ద్వారా తెలుపలేనిదాన్ని పద్యం ద్వారాను, పద్యం ద్వారా చెప్పలేని దాన్ని సంగీతం ద్వారాను

చెప్పవచ్చు. గద్యం భూమి అయితే, పద్యం అనేది ఆకాశం, సంగీతం అనేది ఆ ఇంద్రధనస్సు లాంటిది అంటారు డాక్టర్ సంజీవదేవ్.

భారతదేశంలో అత్యంత ప్రముఖమైన వైష్టవ మతాన్ని గురించి విశిష్టాద్వైతాన్ని గురించి, అద్వైతాన్ని గురించి ఆయన అచ్యుతవల్లిగారికి రాసిన లేఖలో చూడవచ్చు. భక్తి లేని జ్ఞానం శక్తిహీనం భక్తి అంతా గౌణభక్తి (అంటే పూజ, పునస్కారం, నైవేద్యం, సంకీర్తన, భజన, నామధ్యానం, ఉపాసన, విగ్రహారాధన, దీప ధూపములతో అర్చన) తో ఆగిపోరాదు. అందులోనే కూరుకొనిపోతే అది సమంజసమైనది కాదు. రూపారాధన ద్వారా అరూపమైన, అనంతమైన పరమార్థ తత్త్వాన్ని పొందాలి. 'వైష్టవభక్తి చాలా ఉత్కృష్టమైనది'. విశిష్టాద్వైత అటు అయోమయమైన అద్వైతానికి, ఇటు దాస్యభావం గల ద్వైతానికి మధ్యవారధి, 'వైష్ణవ భక్తి మధుర రసానందదాయిని'. ఆయనకు రాధాకృష్ణుల ప్రణయతత్వం బాగా నచ్చింది. ఇటువంటి 'ఉత్తుంగ ప్రణయ భక్తి' ఆయనకు ఎంతో ఇష్టం. ఆత్మదాహం, తీరని ఆత్మ దాహం, మహా ప్రేమజ్వాల, ప్రాణవిభుని ప్రత్యక్షం, నయనానందకరం, అదే అద్భుతం అదే దైవ ప్రత్యక్షం.

భగవద్గీతలో చెప్పిన ఆత్మ రతి, ఆత్మ కామత్వం డాక్టర్ సంజీవదేవ్‌ని ప్రభావితం చేసినాయి. అందుకే ఆయన సగుణ భక్తిని దాటి నిర్గుణతత్త్వ ఆరాధనకై ఆరాటపడ్డాడు. ఐతే సాంప్రదాయ భాష్యకారులకు, ఈ నవ వైతాళికునికి మధ్య ఒక తేడా ఉన్నది. సాంప్రదాయ భాష్యకారులు ఒకరి మతాన్ని మరొకరు తప్పుపడితే, ఒక మతంలో ఉన్న తార్కిక ఆభాసలను మరొకరు ఎత్తిచూపితే, సంజీవదేవ్ అటువంటి పొరపాటు చేయలేదు. అందుకే నేను నిర్గుణో పాసకుణ్ణి అయినా, నేను మతంలోను, మతాచారాల్లోను, కర్మకాండలోను, గౌణభక్తిలోను తప్పుపట్టను. వీటిని తప్పు అనను. కాని వీటిని దాటిపోవాలంటాను ఆయన మత సామరస్య దృష్టికి ఇది నిదర్శనం

'ఆనందో(బ్రహ్మ' , అని చెప్పిన ఉపనిషత్ వాక్యానికి తనదంటూ ఒక ప్రత్యేకమైన వ్యాఖ్యను రాశారు. ఆనందోపాసన సర్వమతాల సారం. అన్ని తత్త్వ శాస్త్రాల్లో లక్ష్యం ఆనందాన్ని ప్రసాదించటమే. ఆనందం క్షణికంగా ఉండరాదు. శాశ్వతంగా ఉండాలి. మన ఆనందం ఇతరులకు బాధ కలిగించేదిగా ఉండరాదనే మానవతావాద సారాంశం ఆయనలో కన్పిస్తుంది. కనిపించని, వినిపించని ఆనందమయ స్వరూపమైన పరమార్థ తత్త్వాన్ని పొందడంలో గల ఆనందం అన్ని ఆనందాలకు ఆశ్రయాన్నిస్తుంది. దాన్ని కవులు, గాయకులు, చిత్రకారులు అనేక రకాలుగా వర్ణిస్తారు. భావిస్తారు. చిత్రీకరిస్తారు కూడా. ఈ భావన వేదంలో చెప్పబడిన మహాకావ్యాన్ని స్ఫురణకు తెస్తుంది.

'ఏకం సత్ విప్రా బహుదా వదంతి'

సత్ పదార్థం ఒక్కటే. విప్రా అంటే ప్రజ్ఞా పాటవాలున్నవారు దాన్ని బహుధా (అనేక విధాలుగా) వదంతి అంటే చెబుతారు. చక్కని అవగాహనకదూ!

ప్రాచీన భారతీయ తాత్త్విక సాహిత్యంతో పాటు ఆధునిక ఐరోపా సాహిత్యాన్ని కూడా చదివి, అర్థం చేసుకొని, ఆచరణలో పెట్టగల్గిన ధీశాలి డాక్టర్ సంజీవదేవ్ అందుకేనేమో షేక్స్పియర్ భావాలను తన ఉత్తరాల ద్వారా తెలియచేస్తాడు. మానవుడు ఆశాజీవి. మానవుడు అర్థకాముడు. వీటన్నింటి కన్నా కీర్తి కాంక్ష ఆయనలో ఉంటుంది. ఈ విషయాన్ని తెలుపడానికై ఒక చక్కని కథను చెప్పాడాయన. ఒక శిల్పి తనకు మరణం ఆసన్నమైనది తెలుసుకొని, అచ్చం తన రూపాన్ని పోలిన అనేక రూపాలను సృష్టించి వాటి మధ్య కదలక మెదలక పడుకొంటాడు. యమధర్మరాజ భటులు వచ్చి చూచి ఆ శిల్పిని గుర్తించలేకపోతారు. అప్పుడు యమధర్మరాజు వచ్చి, మొదట్లో ఆ శిల్పిని గుర్తించలేకపోతాడు. కాని శిల్పి కళా నైపుణ్యాన్ని మెచ్చుకొంటూ ఆ శిల్పిని ప్రశంసిస్తాడు. ఆ ప్రసంశలను వింటున్న శిల్పి వెంటనే లేచి కూర్చుంటాడు. శిల్పిని గుర్తించిన కారణంగా యమధర్మరాజు తన పని నిర్వర్తిస్తాడు. ఈ కథ చమత్కారం కోసం చెప్పింది కాదు. పొగడ్తలకు, ప్రశంసలకు శిల్పి అతీతంగా ఉండాలని హెచ్చరించడానికి మాత్రమే. కీర్తి కండూతి శిల్పులకు, ఆచార్యులకు తగదంటాడు.

ఆయనకున్న భాషాశాస్త్ర పరిజ్ఞానం అద్భుతమైనది. తెలుగు, ఉర్దూ, ఫ్రెంచి, ఇంగ్లీషు భాషల్లో ప్రావీణ్యముంది. నూతన పదాలను ప్రయోగించి వాటికి అర్థాన్నివ్వడంలో ఆయనది అందెవేసిన చేయి. అభిదార్థము, లక్షణార్థము, వ్యంగ్యార్థము మొదలైన ప్రయోగాలన్నీ ఆయనకు తెలుసు. ఆర్థిక సంపద మీద కూడా ఆయనకు తనదంటూ ప్రత్యేకమైన అభిప్రాయాలు కొన్ని ఉన్నాయి. అట్లాగే పేదరికం, దారిద్ర్యం పైన కూడా, మానవ భేద మోదాలు కళాసృష్టికి జీవాలంటాడు.

శివరాజు సుబ్బలక్ష్మిగారికి రాసిన లేఖల్లో ఒక కళాస్రష్ట మరొక కళాస్రష్టను కలిసినపుడు కలిగే స్పందనలను చూస్తాం. లోపం లేని కళ, మానవుడు, సన్నివేశం అంటూ ఏమీ ఉండదు. అన్ని పదార్థాల్లోను లోపం ఉంటుంది. అంతమాత్రాన అవి అవాంఛనీయంకాదు. రచనల్లోను, కళాఖండాల్లోను, జీవితాల్లోను, సంస్కృతీ సాహిత్యాల్లోను జనజీవిత విధానంలోనూ లోపాలుంటాయి. అసమగ్రత నుంచి మానవుడు సమగ్రతకు పయనిస్తాడు. చీకటి నుండి వెలుతురులోకి వెళతాడు. ఇదే అభ్యుదయం. ఇదే ప్రగతి. ఇదే కృషి, కరుణ, ప్రేమ, సానుభూతి మానవతకు లక్షణాలు. రచన, వ్యాసంగం, ఉపన్యాసాల ద్వారా వీటిని ప్రదర్శించలేము.

ఆచరణ ద్వారా వీటిని ప్రదర్శించగలం. పడవ నీటిలో ఉంటే ప్రమాదం లేదు. కాని పడవలో నీళ్లుంటే ప్రమాదం. అట్లాగే ఈ గుణాలు కూడా మితంగా ఉండాలి. అవసరం వచ్చినప్పుడు బహిర్గతం కావాలి.

అరుణగారికి రాసిన ఉత్తరంలో ఒక వ్యక్తి మరొక వ్యక్తిలోని తప్పొప్పులను ఎత్తి చూపేదానికన్నా, ఆ వ్యక్తికి ధైర్యస్థైర్యాలనివ్వడం గొప్ప గుణమంటాడు.

ఒక చిత్రకళాకారునికి విద్యకు సంబంధించిన విషయాలపై మాట్లాడే అర్హత, హక్కు ఉన్నదా అని కొంతమంది సంకుచితులు భావిస్తారు. వారి భావాలను వమ్ముచేసే విధంగా ఆధునిక విద్యా విధానంపై తనదంటూ ఒక ప్రత్యేక భావ సంపుటి ఉన్నదని అరుణగారికి రాసిన లేఖలో డాక్టర్ సంజీవదేవ్ పొందుపర్చారు. ఆధునిక విద్యా విధానం నిస్సంశయంగా చాలా మంచిది. కాని విద్యారంగం, విద్యాపాలన బాగాలేదు. పరీక్షల నిర్వహణ, పాఠ్య ప్రణాళికను తయారుచేయుట, చేసిందాన్ని సక్రమమైన పద్ధతుల్లో చెప్పకపోవడం ప్రతిభను గుర్తించకపోవడం మొదలగు అవాంఛనీయ పరిస్థితులు విద్యారంగాల్లో చోటు చేసుకొని స్థిర నివాసం ఏర్పరచుకొన్నాయి. ఆధునిక విద్యార్థులపై ఆయనకు ఒక చక్కని అవగాహన ఉన్నది. వారు చురుకైనవారు. తెలివిగలవారు. కాని అనుకున్నంతగా దీక్షతోనూ, పట్టుదలతోను వారు కృషి చేయటం లేదు. ప్రస్తుత దేశకాల పరిస్థితుల్లో విద్యార్థినులే రాణిస్తున్నారని చెప్పడానికి ఆయన సంశయించలేదు. బోధనా భాషగా ఏది ఉండాలని ఆయన్ను అడిగితే 'ఇంగ్లీషును తొలగించరాదు' అంటాడు. ఇంగ్లీషును అంతర్ రాష్ట్రీయ భాషగాను, అంతర్జాతీయ భాషగాను, విశ్వసాంస్కృతిక భాషగా వాడుకోవచ్చంటాడు. అంతమాత్రాన మాతృ భాషలను ఆయన విస్మరించమని చెప్పినట్లు కాదు.

అసలు మానవునికి విద్య ఎందుకు? దాని వలన మానవునికి సిద్ధించే ప్రయోజనం ఏమిటి? చూడండి! ఎటువంటి మౌలికమైన విద్యాతాత్త్విక ప్రశ్నలకు ఆయన సమాధానం చెప్పడానికై ప్రయత్నించాడో ఆనాడు గ్రీకు తత్త్వవేత్త యగు ప్లేటో 'రిపబ్లిక్' అనే గ్రంథంలో ఇటువంటి ప్రశ్నలనే వేసినాడు. మానవుడిలో ఉండే మానవీయ గుణాలను వికసింప చేయడంలో తోడ్పడేదే విద్య. విద్య ఆదర్శవంతంగా ఉండాలి'. జీవితపు, శారీరక, మానసిక, బౌద్ధిక, రసాత్మక, ఆత్మిక శక్తులను వికసింప చేస్తుంది విద్య. విద్యార్థులకు విజ్ఞానం, వినోదం ఇచ్చేదిగా ఉండాలి. ఎంత చక్కని నిర్వచనం!

ఒక భావుకుడుగా, చింతకుడుగా, పరిశీలకుడుగా, ఒక మహా పాఠకుడుగా కన్పిస్తాడు

డాక్టర్ సంజీవదేవ్. లేకపోతే ప్రముఖ పాశ్చాత్య విద్యా వేత్తలు విద్యను గురించి చెప్పిన విషయాలను తన లేఖల్లో రాయలేడు. పాశ్చాత్య తాత్త్వికుడైన Dean Ruskin విద్యను గురించి చెప్పిన విషయాలను అరుణగారికి రాసిన లేఖలో ఈక్రింది విధంగా శ్రీ సంజీవదేవ్ పొందికగా చెప్పడం జరిగింది. డాక్టర్ సంజీవదేవ్ అంటాడు విద్యా లక్షణాలు మూడు. అవి

1. To enable a boy or a girl to earn his or her living.

2. To equip him to play his part as the citizen of a democracy.

3. To enable him to develop all the latent powers and faculties of his nature and so enjoy a good life.

సిద్ధార్థ గౌతమ బుద్ధుడు చెప్పిన మధ్యమార్గం చేతను, గ్రీకు తత్త్వవేత్తయగు అరిస్టాటిల్ చెప్పిన "Golden man" చేత ప్రభావితుడైన డాక్టర్ సంజీవదేవ్ ఏ ప్రశ్నకు ఏకపక్షంగా సమాధానం చెప్పడు. అన్ని కోణాల నుంచి చూచి మరీ సమాధానం చెబుతాడు. ఇది ఆయన సర్వజ్ఞతకు నిదర్శనం కాకపోయినా ఆయన సమగ్రదృష్టికి మాత్రం నిదర్శనమని చెప్పక తప్పదు. ప్రాచీనులు ప్రతిభ కలవారా? లేక ఆధునికులా? అని ప్రశ్నిస్తే, కళల్లో ప్రాచీనులని, వైజ్ఞానిక ఒరవడిలో ఆధునికులని చెప్తాడాయన. ఇంతకన్నా సమగ్రదృష్టికి నిదర్శనం ఏమి కావలె!

సంస్కృతి, నాగరికత, మానవుని స్వేచ్ఛ, సమాజంపై ఆయన కొన్ని విశిష్టమైన భావాలను కలిగివున్నాడు. వ్యక్తి స్వేచ్ఛ, సామాజిక స్వేచ్ఛ నాగరికతకు చిహ్నాలంటాడు. మానవుడు ప్రకృతిపై ఆధారపడి జీవిస్తున్నాడనే భావంతో ఆయన అంగీకరించడు. సాంప్రదాయంగా చెప్పబడే వాదాలను తన దృష్టితో చూచి ఆ భావాలకు ఒక నూతన రూపాన్ని ఏర్పరుస్తాడు. ప్రకృతిని అధ్యయనం చేయడం ద్వారాను, దాని శక్తులను అధీనంలోకి తెచ్చుకోవడం వల్లనూ, దాన్ని పూర్తిగా లోబరుచుకోవడం ద్వారాను మానవుడు జీవిస్తున్నాడంటాడు.

చిత్రకళా రంగం పారిశ్రామికులగు భానుభూపాల్‌గారి ధర్మపత్నియగు భారతీదేవిగారికి రాసిన లేఖల్లో "evening in the Himalayas" , "Between Joy and Sorrow" and "Two Red Flowers" అనే తన కొత్త రచనలను ఆమెకు పరిచయం చేస్తారు డాక్టర్ సంజీవదేవ్.

ప్రకృతిలో రెండు సూత్రాలుంటాయంటారు. అవి-1. Regularity, 2.Punctuality. ఈ రెంటినీ అలవర్చుకొన్నవారి జీవితాలు సామాజిక దృక్పథంలో ధన్యమైనవి అంటాడు. విజ్ఞాన శాస్త్రం ఇంకా కొన్ని రహస్యాలను గురించి తెలుసుకోవాలంటాడు. అది చెప్పింది శాశ్వత సత్యం

అని అనుకోరాదు. Nature Poets అగు Keats, Shelly, Byron, మొదలగు వారిచేత ప్రభావితుడైన డాక్టర్ సంజీవదేవ్ అంటాడు. Beautiful things ను సేకరించడం కంటే Beautiful thoughts ను కలిగి ఉండటంలో eternal beauty ఉంటుందంటాడు. ఎంత చక్కని భావము. ప్రేమ, వియోగాలను సహనశక్తిలో సహించాలి.

బృహదారణ్యక ఉపనిషత్తులో యాజ్ఞవల్క్య మహర్షి తన భార్యయైన మైత్రేయకి చెప్పిన ఆత్మ తత్త్వాన్ని తన సోదరియగు రాజేశ్వరికి చెప్పి ఆమెను ధన్యురాలను చేస్తాడు శ్రీ సంజీవదేవ్.

'ఆత్మనస్తుకామాయ ప్రియం భవతి' అంటాడు యాజ్ఞవల్క్యుడు. ఈ విషయాన్నే డాక్టర్ సంజీవదేవ్ ఉటంకిస్తారు. జీవితంలో సంతృప్తి, శాంతి, సుఖము, ఆనందం ఉన్నప్పుడు ఆ జీవితం ధన్యం. అవి లేనప్పుడు అసంతృప్తి, అశాంతి, దుఃఖం ఉంటాయి. స్వర్గ నరకాలకు మధ్యవున్న తేడా ఇదే. సాహిత్యం, కళ, ప్రకృతి వర్ణన, ఇతరుల ఆనందంలో పాలుపంచుకోవడం సమాజంలోని వారిలో మైత్రితో జీవించడం, భయరహితంగా జీవించడం, నిర్భయంగా ఉండటం, సత్యశీలాన్ని కలిగి ఉండటం సునిశిత విమర్శ చేసుకొంటూ జీవించటం అంతా కళాత్మకంగా జీవించటమే అవుతుంది. జీవితం అంటే ఒక కొత్త నిర్వచనాన్నిచ్చాడు. శ్రీమతి కాపాలి లక్ష్మీగారికి రాసిన లేఖలో ఊహలు సున్నితంగాను, సుందరంగాను ఉంటాయి. కాని మనుషులందరూ సున్నితంగాను, సుందరంగాను ఉండరు, వికారమైన భావాలు వికారమైన జీవితాలకు ప్రతిబింబాలు. ఆదర్శ జీవితం ఎంతో ఉత్తమమైనది. ఉత్తమమైన ఆదర్శాలను కల్గిన జీవితం పరమోత్కృష్టమైనది. మన సమాజం సాంకేతిక రంగంలో అభివృద్ధి చెందినంతగా, సామాజిక విలువలను ఆదరించి ఆచరణలో పెట్టే దశకు అంతగా పెరగలేదు. కారణం మానవుల సంకుచిత తత్త్వమేనంటాడు.

శ్రీకృష్ణదేవరాయల ఆస్థానంలో అష్టదిగ్గజాలనదగిన మహాకవుల్లో పింగళి సూరన ఒకరు. ఆయన రాసిన ' కళాప్రపూర్ణోదయం' వారిని ఎంతగానో ప్రభావితం చేసింది. "Mystic Poets, Christian Mysticism" చాలా గొప్పవి. రవీంద్రుడు, అరవిందుడు, కబీర్, మీరాబాయి, వేమన, George Yeats, Russell వీరంతా Mystic Poets, అంటే Nature Mystic Poets. వారి కోవకు చెందుతారు డాక్టర్ సంజీవదేవ్.

చలసాని వసుమతి గారికి రాసిన లేఖలో డాక్టర్ సంజీవదేవ్ ఒక వైద్యునిగా కనిపిస్తాడు. శరీరం రోగాలకు నిలయమని భావిస్తుంది ఆమె. ఆమెభావాలను సరిదిద్దుకోమని ఉపదేశిస్తాడు. శరీరం సౌందర్యానికి నిలయం. శరీరం ధర్మార్థ సాధనకు ఒక పనిముట్టులాంటిది. వాడకం

లేకపోతే పనిముట్లు తుప్పుపట్టినట్లే, సరైన పోషణ, వ్యాయామం, కృషి, చింతన లేకపోతేనే శరీరం రోగగ్రస్తమవుతుంది. మనస్సును అధీనంలో ఉంచుకొని, శరీరాన్ని అదుపులో ఉంచుకొంటే రోగాలు అంత త్వరగా రావు. 'ఆత్మశక్తి తేజం ముందు అన్ని వ్యధలూ ఆవిరిగా అదృశ్యమైపోతాయి'. ఎంతచక్కని ఆధ్యాత్మికత ఆయనలో ఇమిడి ఉన్నదో కదా! జీవిత తత్వాన్ని గురించి ఇట్లా అంటారు ఆయన.

'కంటికి కనుపించే భౌతిక జగత్తు మాత్రమే సత్యం, కనుపించని
సూక్ష్మజగత్తు అనేది వట్టి అసత్యం అనటం ఎంత మిద్యయో,
అదేవిధంగా కంటికి కనుపించని సూక్ష్మజగత్తే సత్యం, కనుపించే
భౌతికజగత్తు అంతా అసత్యం అనడం కూడా మిధ్యే'

ఇక్కడే ఆయనలో ఉన్న సమన్వయ దృష్టి మనకు కన్పిస్తుంది. ఆయన వాదం సమగ్రవాదం. నివృత్తి మార్గం, ప్రవృత్తి మార్గంఅని రెండు మార్గాలను భగవద్గీత భోధిస్తుంది. 'భౌతిక ప్రేమ, శారీరక ప్రేమ ఆధ్యాత్మిక జీవితానికి ఏ మాత్రం అడ్డురాదు. సంకుచిత తత్వం అంటే ఆయనకు గిట్టదు. మానవ తత్వం అంతా సమగ్రంగాను, సమన్వయంగాను ఉండాలంటాడు.

ప్రతి విషయాన్ని ఆయన ప్రత్యేకమైన రెండు దృక్పథాల నుంచి చూస్తాడు.

1. వైజ్ఞానిక దృక్పధం
2. కళాదృక్పథం లేదా రసదృక్పథం

వైజ్ఞానిక దృక్పథం సమీక్షా దృక్పథం, కళా దృక్పథం సృజనాత్మక దృక్పథం. ఒకటి విశ్లేషణాత్మకం, అంటే విశ్లేషించి లేదా విభజించి చూస్తుంది. రెండోది సంశ్లేషణాత్మకం అంటే సమన్వయపరచి చూస్తుంది. మొదటిది జ్ఞానాన్నిస్తుంది. రెండోది ఆనందాన్నిస్తుంది.

సత్యం, శివం, సుందరం అనే దానికి నూతనార్థాన్ని చెప్తాడు. 'సత్యం అనేది విజ్ఞానాన్ని, శివం అనేది శ్రేయాన్ని, సుందరం అనేది రసానందాన్ని ప్రసాదిస్తాయి' అంటాడు. ఈ మూడింటిలో ఏది కొరవడినా జీవితం కొరతగానే ఉంటుంది.

భగవద్గీతలో చెప్పబడినట్లు 'అభయం సత్య సంశుద్ధి' డాక్టర్ సంజీవదేవ్ భయాన్ని గురించి, నిర్భీతిని గురించి ప్రవచనం చేస్తారు. 'జీవితంలో భయమే అన్నింటినీ మించిన బంధన; భయమే దుఃఖం అభయమే విముక్తి. అభయమే ఆనందం అందుకే మహామహులు అభయహస్తాన్ని ప్రసాదిస్తామంటారు' . హృదయ స్పందనతో కూడిన భావాలకు విలువ

నిస్తాడు. ఐతే వాటికి విలువ కట్టనంటాడు. "Plain living and High thinking" కి ప్రాధాన్యం ఇమ్మంటాడు పూజాగృహాలు ప్రత్యేకంగా నిర్మించుకోనక్కరలేదు. మానవ హృదయం, ఈ విశ్వం రెండూ పరిణామంలో తేడాతో మహాపూజా మందిరాలే. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారిని ఉటంకిస్తూ 'విశ్వమంతా ప్రాణవిభుని మందిరమ్మైతే'... అంటాడు. కవికి, కళాకారుడికి ఈ విశ్వం ఒక మందిరం వారు దాన్ని ఆరాధిస్తారు. ఐతే ఆ ఆరాధనా విధానంలో కొంత తేడా ఉంటుంది. కానిఫలితం ఒకటే, కవికి కావ్యానందం కళాకారునికి రసానందం కావ్యానందం కూడా రసానందంలో లయమవ్వాల్సిందే కదా అంటాడు డాక్టర్ సంజీవదేవ్.

ఆయనకు వెన్నెల అన్నా, మల్లెలు అన్నా చాలా మక్కువ. అవి కాంతిని, చల్లదనాన్ని, తెల్లదనాన్ని, సువాసనను ఇస్తాయి. ఇక్కడ ఆయన ఒక చిత్రమ్మైన విషయాన్ని చెబుతాడు. వెన్నెలకు తెల్లదనం, చల్లదనం ఉంది. మల్లెలకు తెల్లదనం, సువాసనా ఉన్నాయి. అందుకే ఈ రెండూ ఉన్నప్పుడు పాషాణ హృదయాలు కూడా కరిగి పోతాయంటాడు. మరి కళాహృదయం కదా ఆయనది!

కీట్సు మహాకవి రచనల చేత ప్రభావితుడై ప్రకృతి కవిత్వంలో ఉండే గుబాళింపులను చిత్రీకరించాడు శ్రీ సంజీవదేవ్ భావాలు రెండు రకాలు.

1. వ్యక్త భావాలు

2. అవ్యక్త భావాలు

ఈ రెంటిలో ఏది మధురమ్మైనది అని ప్రశ్నిస్తాడు. వ్యక్త భావాల కంటే అవ్యక్త భావాలే ఎక్కువ మధురమంటాడు.

డాక్టర్ సంజీవదేవ్ రాసిన లేఖలు చదువుతూ ఉంటే ఆయన ఒక గొప్ప ఆధ్యాత్మిక సాధకుడా అని అనిపిస్తుంది. లేకపోతే మరేమిటి? ఆయన అంటాడు

'మనిషికి/జీవికి/శరీరం ఒక జైలు. ఆ జైలు నుండి బయటపడటానికి అనేక వేదాంతాలు, అనేక యోగసాధనలు. శరీరంలో జీవిస్తూనే శరీరాన్ని వదలి ఆకాశంలో స్వేచ్ఛగా మేఘాల మీద తిరుగుతున్నట్లు తీవ్రంగా భావించి ఆనందాన్ని అనుభవించవచ్చు. అటువంటి అశరీర స్థితిలో చైతన్యం ఆనందమయమ్మై బాధలేమీ తట్టవు'.

ఆనందో బ్రహ్మ

ఆనందో కళ
ఆనందో రసః
రసో వై సహః
రసో వై బ్రహ్మ.

ఇది ఆయనకు సిద్ధించిన కళాసాధన ఫలితం.

మిత్ర ధర్మాన్ని గురించి ఆయన చెప్పిన మాటలు మరవరానివి. అద్వైత వేదాంతియగు భర్తృహరి చెప్పిన మాటలను డాక్టర్ సంజీవదేవ్ ఎంత రమణీయంగా చెప్తాడు. ప్రాతః కాలపు నీడలవలె చాలా పొడుగ్గాను, పెద్దదిగాను ఉండి, మధ్యాహ్నకాలం రాగానే ఆ నీడలు సంకుచిత మైనట్లు, చెడువారి మధ్య ఉండే సావాసం కూడా ఇట్లాగే ఉంటుంది. కాని మధ్యాహ్న కాలం లోని నీడల వలె చిన్నవిగా ఉండి, సాయం సమయమయ్యేసరికి చాలా పెద్దవిగా ఉండే నీడలవలె, మంచివారి మధ్య మిత్రత్వం ఉంటుంది.అదే భావాన్ని డాక్టర్ సంజీవదేవ్ ఎంత బాగా చెప్తాడు.

'అపరిచితులు పరిచితులుగా, పరిచితులు సుపరిచితులుగా, సుపరిచితులు చిర పరిచితులుగా మారటంలో మానవ హృదయానికి ఎంత మనోజ్ఞ అనుభూతో'.

భర్తృహరి 7వ శతాబ్దం వాడు. కాళిదాసు 4వ శతాబ్దం వాడు. వారి రచనలను తన భావ సంపుటిలో పదిలపరచుకొన్న ధీశాలి డాక్టర్ సంజీవదేవ్ అందుకే ఆయన అంటాడు. 'అపరితోషాద్విదుషాం నసాధుమన్యే ప్రయోగ విజ్ఞానం' 'స్రష్టలు సృష్టిస్తే సహృదయులు ఆనందిస్తే స్రష్టలు సంతృప్తులు అవుతారు'.

ప్రాచీన కవులు రాసిన కావ్యాలను, తాత్త్వికుల వాదనలను, అలంకారికులు చేసిన రసమీమాంసను డాక్టర్ సంజీవదేవ్ఆకళింపు చేసుకొన్నారు. "Too much of familiarity breeds contempt" అనే ఆంగ్ల సామెతను 'ఏదైనా తరచుగా చేస్తే అందులోని నూతనత్వం నశించే అపాయం ఉంది. నూతనత్వం పోగానే అందులోని రమణీయత్వం లోపిస్తుంది'.

శనైశ్శనైః యన్నవలూముపైతి
తద్దైవ రూపం రమణీయతామ్

దేన్నుంచి నెమ్మదినెమ్మదిగా నూతనత్వం ఉత్పన్నమవుతుంటుందో అదే సౌందర్యం Pun of the language లో ఈయన కడు ప్రసిద్ధుడు. భాషలో ఉండే సొగసును కథల రూపంలో

చెప్పడంలో బహు నేర్పరి. కథాంశం 'రాముడు సీతను అడవికి తీసుకొని వెళ్లి చంపి రమ్మంటాడు'. లక్ష్మణుడు రాముని బాణాలను అడుగుతాడు. అన్నగారి బాణాలు తమ్ముడు ముట్టరాదంటాడు రాముడు. ఐతే అన్న బాణాలు తమ్ముడు ముట్టకూడనప్పుడు అన్న భార్యను తమ్ముడెలా చంపవచ్చును? దీన్ని జానపదులు ఏ విధంగా శ్లేష, ధ్వని, రెండూ వచ్చే విధంగా చెప్పేది డాక్టర్ సంజీవదేవ్ చమత్కారంగా చెప్పారు. లక్ష్మణుడి రాకను సీత చూచి

'పాలు కలవని నీళ్లు పాదాలకిచ్చింది'.
'నీళ్లు కలవని పాలు దాహానికిచ్చింది'

ఆయనకు ఈ జానపదులు నచ్చాయి. ఈయనే వాటిని సృష్టించలేదు కదా! నీళ్లు కలవని పాలు దాహానికివ్వడం అనడంలో నూతనత్వం లేదు. 'కాని పాలు కలవని నీళ్లు పాదాలకివ్వడం' అనడంలో ఎంతో నవ్యత్వం ఉన్నది. భవ్యత్వం కూడా ఉన్నది ఇక్కడ కవి ప్రత్యేకత, కవి చమత్కారం, కన్పిస్తాయి. అందుకే డాక్టర్ సంజీవదేవ్ అంటారు 'కవి దృష్టి గల స్రష్ట, సృష్టి గల ద్రష్ట' పాలు కలవని నీళ్లు పాదాలకు, నీళ్లు కలవని పాలు దాహానికి ఆహా మనోహరం ఈ పద ప్రయోగం.

డాక్టర్ శ్రీధరబాబుకు రాసిన ఉత్తరాల్లో ప్రాచ్య ప్రతీచీ తాత్త్విక సంస్కృతి, కళాస్రవంతి సమ్మిళిత మవుతాయి. కళా సంస్కృతి, తాత్త్విక సంస్కృతిని స్పందిస్తుంది. ఐన్‌స్టీన్ చెప్పిన Theory of Relativity ని అనువర్తన చేసి సుదూర ప్రాంతాల్లో ఉన్న మిత్రలకు ఊరట కలిగించటంలో శ్రీ సంజీవదేవ్ సిద్ధహస్తుడు. 'దూరం' అనేది ఒక భ్రమ మాత్రమే. 'మన ఆత్మలు ఎల్లప్పుడూ విశ్వవ్యాప్తమే. మనం ఎంత దూరదేశాల్లో ఉన్నప్పటికీ మనమంతా నిరంతరం ఆ శరీర రూపాలలో అంతటా తిరుగుతూనే ఉంటాం' ప్రతి మానవుడికి రెండు లక్షణాలు ఉండాలి. అవి

1. పరిశీలన (Observation)

2. అంతర్వీక్షణ (Introspection)

'మధుర సంవేదన, మధుర భాషణ, మధుర వర్తన జీవితాల్లో ప్రతిబింబించాలి' అని డాక్టర్‌సంజీవదేవ్ చెప్పిన ప్రవర్తనా సూక్తి ఎంత మధురంగా ఉన్నది. ఉపనిషత్తుల్లోని శాంతి మంత్రాల్లోని ఉపదేశ వ్యాక్యాలకు చక్కని కూర్పుకదూ ఇది. తైత్తిరీయ ఉపనిషత్తు చెబుతుంది.

'పృధివి మాతర్మామాహిగింసీ మాంసో హిగింసీ ర్మధు మనిష్యే

మదు జనిష్యే, మధు వక్ష్యామి, మధు వదిష్యామి, మధుమతీం

ఓ పృధ్వీ నీవు అన్నింటికి మాతృమూర్తివి. నీవు మధువును బంధించి మమ్ములను రక్షిస్తావు. కనుక నీనుంచి వచ్చేదంతా మాధుర్యంగా ఉంటుంది. కనుక మాధుర్యమైనవే వింటాను. మాధుర్యమైన దాన్నే చేస్తాను మాధుర్యమైన మనస్సునే కలిగివుంటాను.

'ఉద్యోగికి దూరభూమి లేదు' అనే తెలుగు నానుడిని, 'విద్వాన్‌సర్వత్ర పూజయేత్ అనే ఆర్యోక్తిని ఆకళింపు చేసుకొని జీవన నౌక మైత్రీ తరంగాల్లో ఉన్నంతవరకు ఆనందదాయకంగానే ఉంటుందంటారు డాక్టర్ సంజీవదేవ్.

'రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకీ భవతి యత్సుఖితోపి జన్తుః
తత్‌చేతసా స్మరతి నూనమబోధ పూర్వం
భావ స్దిరాణి జననాంతర సౌహృదాని'

అంటే, మనోవికాసం లేని వ్యక్తి తన ఊరు విడచి మరోచోట నివసించలేదు. అంతకంటే కొంచెం మనోవికాసమున్న వ్యక్తి దూరప్రాంతానికి, అంతకంటే మరీ మనోవికాసం ఉన్నవారు సుదూర ప్రాంతాలకు వెళ్లగలరు ఈ విధంగా మనోవికాస వైశాల్యం వికసితమైన కొద్ది విశ్వంలో ఎక్కడా పరాయితనం గోచరించదు. మానవులంతా ఒకటే అని చెప్పడంలో కొంత విచిత్ర మున్నది. వ్యక్తిగా ప్రతివారు తమ తమ వ్యక్తిత్వాన్ని కావాలనుకొంటారు సమిష్టి జీవనంలో తామంతా ఒకటేననుకొంటారు. ఇది వ్యష్టిలో సమిష్టి మరియు సమిష్టిలో వ్యష్టి.

ప్రియ మిత్రులు ఎస్.వి. రామారావుగారికి రాసిన లేఖలో జీవితం గురించి డాక్టర్ సంజీవదేవ్ ఇచ్చిన సందేశాన్ని చూద్దాం –

Life is Light
Life is delight
Life is Life

ఇవి కేవలం కవితా వాక్యాలు కావు ఏదైనా ఒక వస్తువు మార్పు చెందిందీ అంటే అందులో ధర్మ పరిణామం. అవస్థా పరిణామం, లక్షణ పరిణామం జరుగుతుంది. జీవితంలో కూడా అంతే Light లోకి Delight లోకి Life ను మార్చుకొనే బదులు Light నూ Delight నూ మార్చుకోవటం సముచితం.

అంతేగాక

> Life is an incessant song of joy of the spirit
> which echoed in Krishna's flute in the form of
> Cosmic music, whose rhythm has made its
> manifestation in the spiritual dance of Shiva

తానొక కళాజీవినంటాడు డాక్టర్ సంజీవదేవ్ సరైన పనిముట్లు తన కళారాధనకు లభ్యం కాకపోయినా, సామర్ధ్యం, దీక్ష ఉంటే కార్యం సానుకూలంగా చేయవచ్చు.

'సిద్ధిర్భవతి సత్త్వే నాన్యోప కరణే'

అనురాగాలకు హద్దులుండవుట, సాగరాలకు హద్దులుంటాయట, వీటిని దాటగలం వాటిని దాటలేం. భౌతిక జగత్తులో నుంచి వ్యావహారిక జగత్తులోనికి. అందులో నుండి రసజగత్తులోకిపోయిన వారి హృదయాలు రమణీయంగా స్పందిస్తాయి. హృదయస్పందన ప్రాణాయామంలాంటిది. ఆలోచనా జగత్తులోనుంచి అనుభూతి జగత్తులోకి, అందులోనుంచి ఆనంద జగత్తులోకి వెళ్లి అక్కడ తిష్ట వేసుకొని ఉంటే రసబ్రహ్మానుభూతి కలుగుతుంది పోతనగారి భాగవతంలోని 'కారే రాజుల్ వారేరీ సిరుల్ మూటన్ కట్టుకొని పోవంజాలరే, భువిపై పేరైనన్ కలదే' అనే భావాన్ని శ్రీమంతులూ, సామంతులూ, పండితులూ, పామరులూ, సన్మార్గులూ, దుర్మార్గులూ, దాతలూ, కృపణులు ఎందరెందరో ఈ భూమిపై అవతరించి అంతరించారు. అవతరించటం, అంతరించటం ఈ భూమిపై జరిగే రెండు కళాఖండాలు అని వ్యాఖ్యానిస్తారు.

విజ్ఞానశాస్త్రం పెరుగుతున్న ఈ రోజుల్లో మానవుడు రాతిని రప్పను, చెట్టునూ పుట్టను, కాకిని, కొంగను, కోతిని అర్థం చేసుకొన్నాడేగాని, సాటి మానవుణ్ణి తోటి మానవుడిగా అర్థం చేసుకోలేకపోతున్నాడని ఆయన ఆవేదనను వ్యక్తం చేశాడు.

సిద్ధార్ధ గౌతమబుద్ధుడు బోధించిన ఆర్య అష్టాంగ మార్గం శ్రీ సంజీవదేవ్‌ని ప్రభావితం చేసింది. అందుకే ప్రతివారు సంయగ్ దృష్టి, సంయగ్ చరిత, సంయగ్ శీలము, సంయగ్ శ్రద్ధ, సంయగ్ ఆలోచనను అలవరచుకోవాలనే ఆయన అభిలాష మిత్రులు కలిదిండి నారాయణ రాజుగారికి రాసిన లేఖలో మనకు కనిపిస్తుంది.

'ఆత్మిక కలాపం' అంటే ఆయనకు చాలా ఇష్టం. మహాజ్ఞాని 'ఆత్మ రతి' చేస్తాడని భగవద్గీత చెబుతుంది. కళా రతి ఈయన రెండో అభ్యాసం. సాహిత్య కలాపం మూడో

అభ్యాసం. ఇవన్నీ అనంతమైన ఆనందాన్నిస్తాయని ఆయన భావన. వీటిలోకి దిగనివారికి ఆ ఆనందం అంటుకోదంటాడు. తుమ్మ జిగురు దాన్ని బంధించలేదు కదా! ఆధ్యాత్మిక జీవనం అంటే ఆయనకు ఇష్టం. ఐతే ఆయన నిర్వచనం దానికి మరో రకంగా ఉన్నది. 'శరీరంలో ఉంటూ, శరీరంతో జీవిస్తూ, శరీరం బయట జీవించాలి. అది నిజమైన ఆధ్యాత్మిక జీవనం. దేహంలో ఉంటూ విదేహిగా ఉండాలి. ఇదే జీవన్ముక్తావస్థ. ఇదే బ్రహ్మానిర్యాణము. ఇదే స్థిత ప్రజ్ఞావస్థగా భగవద్గీత వర్ణిస్తుంది'.

ఒక కళాకారునికి దేశంలో ఆర్థిక సంక్షోభానికి ఏమిటి సంబంధం అని కొందరు అనుకోవటం కద్దు. అసలు కళకు పనికిరానిదంటూ ఏమీలేదు. రూపాయి విలువ తగ్గి పోతుంటే ఈ కళాకారునికి నష్టంట. కొందరికి ఇది విడ్డూరంగా కనిపించవచ్చు. కాని విదేశాల్లో ప్రచురిత మయ్యే గ్రంధాలకు చందాకట్టి, అక్కడ కళారంగం ఏ విధంగా అభివృద్ధి చెందు తున్నదో తెలుసుకోవాలని ఆయా గ్రంధాలను తెప్పించుకొని చదివి, కళాసాహితీ సేవ చేసే డాక్టర్ సంజీవదేవ్‌కి ధరలు పెరగడంలో ఉన్న ఇబ్బంది తెలుస్తుంది. అపారకులకు ఏమి తెలుస్తుంది!

అంధత్వము కొందరు శాపము అనుకొంటే అంధత్వంలో కడిగిన ముత్యంలాంటి సాధుత్వ ముంటుందంటాడు. అందుకే "The Blind Girl" అనే గేయంలో ఇట్లా చెబుతాడు

A blind girl is she
She is a kind girl
Handsome is she
As a refined pearl

చిత్రకళను గురించి ఈయనకు చాలా ఉన్నతమైన భావాలున్నాయి. ప్రాంతీయత అన్నా మా చిత్రకళ, మీ చిత్రకళ అన్నా ఆయనకు గిట్టదు. 'ఉన్నదంతా విశ్వ కళే' దాన్ని మనం ఆధునిక చిత్రకళే అని పిలుస్తాం. నేడు ఆంధ్ర చిత్రకళ అంటూ ప్రత్యేకించి ఏమీలేదు. ఆధునిక చిత్రకళలో రెండు భాగాలున్నాయి. అవి

1. ఆకృతిక కళ (Figurative) సాకార కళారూపకళ
2. నిరాకృతిక కళ (Abstract) నిరాకార కళారూపకళ

మొదటిదానిలో మనం గుర్తించే ఆకారాలు ఉంటాయి. ఇందులో మనకు పరిచయమైన జగత్తు కొంతవరకు ఉంటుంది. రెండో కళ మనకు పరిచయం లేని రూపాలను కలిగి ఉంటుంది. ప్రపంచంలోని చిత్రకారులంతా దాదాపు ఈ రెండు విధానాల్లోనే చిత్రీకరిస్తున్నారు. ఆంధ్రులు ఈ విధానాలనే అనుసరిస్తున్నారు. కళారంగం ఒక ప్రవాహం లాంటిది. నేటి మానవ జీవితం

ఐక్యత, తాదాత్మ్యములేని అస్తవ్యస్త భావాల కలయిక. కళ కూడా అట్లాగే ఉంటుంది నేటి మానవుడు ఐక్యతను చూడాలనుకోవడం లేదు. విభజనను, విశ్లేషణను చూద్దామను కొంటున్నాడు. సమైక్యత సంశ్లేషణ నేటి మానవుడు కోరుకోవడం లేదు. కళను రసాత్మక బుద్ధితో గాక గణాంక పద్ధతుల ద్వారా తెలుసుకొంటున్నాడు. కళను చూచి ఆనందించడం నేటి లక్ష్యం కాదు. కళను చూచి తెలుసుకోవడమే నేటి లక్ష్యం. అందుకే నేటి కళను విమర్శనాత్మక కళ అని అంటారు. అది సృజనాత్మకం కాదిప్పుడు. అనుకరణ, అనుసరణ కళలో ఒక ముఖ్యాంశం. అన్ని దేశాల్లోను అనుకరణ ఉంటుంది. వైయ్యాకరుణులు వ్యాకరణాన్ని నేర్చుకొని గ్రంధరచన చేస్తారు. కాని నేడు సామాన్య చిత్రకారులు. కళలో ఉన్న లోతుపాతులను, మెళుకువలను తెలుసుకోకుండానే చిత్రాల్ని గీస్తున్నారు. ఇది అంతగా హర్షదాయకమైన విషయం కాదు. ప్రోత్సహింపదగింది కాదు.

ప్రతి వ్యక్తి ప్రతిభను సంతరించుకొని, ప్రజ్ఞా పాటవాలను ప్రదర్శించినపుడు కొంత విమర్శకు గురికాక తప్పదు. విశ్వ విఖ్యాతి చెందుతున్న తరుణంలో శ్రీ సంజీవదేవ్ వ్యతిరేకులు అసహనభావంతో ఆయన మీద అనేకమైన సవిర్శనలు, కువిమర్శనలు కురిపించారు ఐతే ఆయన పొగడ్తలకు, తెగడ్తలకు అతీతంగా ఉండే మనఃస్వబావాన్ని అలవాటు చేసుకున్నాడు. అందువలన ఈ విమర్శలు ఆయన కళాసృష్టికి ఎంతమాత్రం ఆటంకం కాలేదు.

సాహితీవేత్త అయిన వేగుంట మోహనప్రసాద్‌కు రాసిన ఉత్తరంలో డాక్టర్ సంజీవదేవ్ ఒక లాక్షణికుడుగా కనిపిస్తాడు. Impression అంటే అర్ధం ఏమిటి? expression అంటే అర్ధం ఏమిటి? ఈ రెండూ అంత పెద్దగా విభేదాన్ని సూచించవుట. 'ఇంప్రషన్‌కు వ్యక్త రూపమే ఎక్స్‌ప్రెషన్. ఎక్స్‌ప్రెషన్‌కు గుప్తరూపమే ఇంప్రషన్. వ్యక్త రూపంలో కంటే గుప్తరూపంలోనే మాధుర్యం అధికం' అంటాడు ఆయన.

ఆ రోజుల్లో విదేశీ పత్రికల్లో వ్యాసాలు ప్రచురించటం విద్యా ప్రతిభకు, కళా ప్రగతికి నిదర్శనం. London నుంచి వెలువడే Common Wealth Scholar అనే సంచికలో Abstract Art పై డాక్టర్ సంజీవదేవ్ రాసిన మాటలివి.

"Form is a huge deception-an optical illusion-and thus it is a material burden, a physical bondage and a veil hiding the absolute reality. Art begins in form and culminates in the formless. So, the Artist in the course of his creative evolution should transcend the form in order to have greater freedom in his or her luminous pilgrimage of self-expression".

ఈ భావం కళాద్వైతాన్ని సూచిస్తుంది. అద్వైత వేదాంతంలో నామరూపాలు మిధ్య. అవి

భ్రాంతి జన్యాలు. అవి మాయా మోహితాలు. అవి బంధానికి కారణాలు. యదార్ధమైన నిర్గుణ పరమార్థ తత్త్వాన్ని మరుగున పడేటట్టు చేస్తాయి. సాధకుడు తన బుద్ధి ద్వారా సత్యాన్ని తెలుసుకొని నామరూపాలు అసత్యమని అనుకొంటాడు. విజ్ఞాన ఘనమైన ఆత్మే సత్యమని ఆయనకు గోచరిస్తుంది. కళాస్రష్ట కూడా నామరూపాలు భ్రాంతి జన్యమనుకొంటాడు. వాటిని గీచింది తానే. తానే స్రష్ట అని గుర్తించిన కళాకారుడు అద్వైతానుభూతి పొందుతాడు ఆవిధంగ నామరూప దశ నుంచి కళాకారుడు అద్వైతానుభూతి పొందుతాడు. ఆ విధంగా నామరూప దశ నుంచి కళాకారుడు నిర్గుణదశకు వస్తాడు అక్కడ ఆయనకు కళాజ్యోతి స్వప్రకాశంలో కనిపిస్తుంది.

ఎంత మధుర భావమిది!

ఆయన మర్మవాది కాదు. ఆయన నాస్తికుడు కాదు. ఆయన ఆస్తికుడు కాదు. తన అంతః చైతన్యంలో ఉండే ఊర్ధ్వచేతనా దశను అందుకోవాలనే ఆరాటపడే వ్యక్తి. ఆ ఆరోహణా క్రియలో ఆయన ఒక పాంధుడు. అచేతనకు, అక్కడి నుంచి చేతనకు, అక్కడి నుండి ఊర్ధ్వచేతనకు చేరాలని తపించే కళాతపస్వి శ్రీ సంజీవదేవ్ ఇతరులు ఏమనుకొన్నా ఆయన అది మాత్రం కాదు. ఆయన ఒక మహాద్వైత కళాస్వాధ్యాయ తపస్వి.

కృష్ణాబాయిగారికి రాసిన లేఖలో మానవులు ఎటువంటి జీవులు అని ప్రశ్నించి చక్కని సమాధానం చెప్పినాడు. మనం రాజకీయ జీవులం కాదుట. మనం ఆర్థిక జీవులం కాదుట. అంటే గ్రీకు తత్త్వవేత్త అరిస్టాటిల్ చెప్పిన నిర్వచనాన్ని, కారల్ మార్క్స్ చెప్పిన నిర్వచనాన్ని కాదని మరొక నిర్వచనం చెప్పడం ఇక్కడ విశేషం. మానవులందరూ శుద్ధ సాంస్కృతిక జీవులు. సంస్కృతి మనకు ధృవతార. సంస్కృతే మన జీవనపథం. సంస్కృతి అంటే శాంతి, దాంతి, కాంతి, పుష్టి, తుష్టి కలిగి జీవించటమే. ఆయనకు 'ఎండు వేదాంతం' అంటే గిట్టదు. సజీవంగా ఉండే వేదాంతి ఆయన. నిమ్మకాయ పులిహోర, నిమ్మరసం ఆయనకు ఇష్టం. పుస్తకాలు, పూలు, కిలకిలార్భాటాలు చేసే పక్షులు, ప్రకృతిలో నిరంతరం జరిగే మార్పు ఆయన ధ్యాన వస్తువులు. విధవా వివాహం సంస్కరణ వివాహం కాదు. అది మామూలు వివాహమే. మనిషికీ మనిషికీ మధ్య ఆకర్షణతో కూడిన జీవమనే అయస్కాంతపు తరంగాలు ఉంటాయి (invisible psychic currents). ఇవి అనుకూలంగా ఉంటే మానవులు దగ్గరవుతారు. ప్రతికూలంగా ఉంటే మనుషులు దూరమవుతారు.

బెంగాలీ సాహిత్యం, బెంగాలి చిత్రకళ అంటే ఆయనకు ఎంతో అభిమానం. ఐతే ఈ అభిమానం బెంగాలీల సంకుచిత, స్వార్థ తత్త్వాన్ని గురించి చెప్పడానికి అడ్డం కాదంటాడు.

అద్వైత వేదాంతం మీద ఆయనకు అపారమైన అభిమానం ఉన్నది. ఐతే దాన్ని విమర్శించ డానికి, తిరిగి మరొక రకమైన ఆదునిక భాష్యం చెప్పడానికి వెనుకాడడు బారతీయ దర్శన విజ్ఞానంలో అద్వైతం ఒక గొప్ప దర్శనం ఐన్‌స్టీన్ రిలేటివిటీ సిద్ధాంతాన్ని అర్థంచేసుకోవడంలో ఎంత శ్రమ ఉన్నదో. అద్వైతాన్ని అర్థం చేసుకోవాలన్నా అంతే శ్రమ ఉంటుంది తాను రసాస్వాదినని, ద్వైతంలో గోచరించే రసానందం అద్వైతంలో గోచరించదని రాస్తే కొందరు ఆయన్ను అపార్థం చేసుకొన్నారు. అద్వైతం ఒక Science. ద్వైతం ఒక Art. అందులో దొరికే రసానందం Science లో దొరకదు Science లోనిది కాంతి; Art లోనిది శాంతి ఈ శాంత కాంతిని సమబాగంలో ఉంచుకొంటే లోక కళ్యాణం లేకపోతే కన్నీళ్లే నంటాడు ఈ రసాద్వైతి

ఆయన Capitalist కాదు. Imperialist అసలేకాదు. Communist కాలేడు. Socialist కాలేక Lyricist అయ్యాడు. గేయకారుడుగా పై 'ఇజాలని' వ్యక్త పరచాడు. Epic ఒక మహా వట వృక్షం అయితే, Lyric మాలతీనికుంజం లాంటిది వటవృక్షానిది గాంభీరం అయితే, మాలతీనికుంజానిది సౌందర్యం. గాంభీరత, సౌందర్యం పెనవేసుకొంటే రసానుభూతి కలుగుతుంది. వటవృక్షం శక్తి. మాలతీ నికుంజానిది ప్రేమ. శక్తి ప్రేమల కలయిక రసానుభూతికి దారితీస్తుంది. శక్తిలేని ప్రేమ బలహీనతలకు లక్షణం. ప్రేమలేని శక్తి రాక్షసత్వం. ఈ రెండూ ఉంటే లలిత మధురానందం అంటాడు శ్రీ సంజీవదేవ్. ప్రాంతీయ సాహిత్యాల్లో సంసర్గత ఉండాలి. అట్లా ఉన్నప్పుడు భావసంసర్గత జరిగి దేశం ఏక ఖండంగా ఉంటుంది లేకపోతే ప్రాంతీయ తత్త్వం పెరిగి దేశ సమైక్యతకు భిన్నం కలుగుతుంది. చిత్రకళ విషయంలోను ఇంతే. భౌతికవాదులకు, ఆధ్యాత్మికవాదులకు మధ్య రసపోషణ చేసే కళ ఒక వారది లాంటిది. భౌతిక ప్రపంచం ఎంత నిజమో ఆధ్యాత్మిక వాదుల అంతః ప్రపంచం కూడా అంతే నిజం. సమగ్ర దృష్టి, సంపూర్ణ దృష్టి, సత్యదృష్టితో చూస్తే భౌతికవాదంలోని సత్యం, ఆధ్యాత్మిక వాదంలోని సత్యం కనిపిస్తాయి. లేకపోతే అసమగ్రతే కనిపిస్తుంది. భౌతికవాదులకు భౌతికత మిగిలి పోతుంది. ఆధ్యాత్మిక వాదులకు మాయ మిగిలిపోతుంది

దీపావళి పండుగ అంటే ఆయనకు చాలా ఇష్టం. అశాంతి, అంధకారాన్ని పారద్రోలే పండుగ, మాటల్లో చెప్పలేని దాన్ని మౌనంలో చెప్తాం. చేష్టల్లో చెప్పలేనిదాన్ని శబ్దాల్లో చెప్తాం. వీటన్నిటికి ఈ పండుగ ప్రతీక. సత్యం, శివం, సుందరం, తర్కశాస్త్రం సత్యాన్ని అన్వేషిస్తే, నీతిశాస్త్రం శివాన్ని అన్వేషిస్తుంది. రసశాస్త్రం సుందరాన్ని అన్వేషిస్తుంది. నీతిశాస్త్రం మత బోధనలను అందిస్తుంది. రసశాస్త్రం కళను ప్రతిపాదిస్తుంది. పాశ్చాత్య తత్త్వశాస్త్రంలో తర్కము, నీతిశాస్త్రం, రసశాస్త్రం ముఖ్యమైన అంతర్భాగాలు. ఈ మూడు శాస్త్రాల అధ్యయనం వలన జీవితం క్రమబద్ధీకరణ మవుతుంది. వీటికి తోడు మంచితనం, దయాస్వరూపం ఉంటే జీవితం

ఆనంద మయమవుతుంది. ఇవి లేకపోతే జీవితం నిస్సారంగాను, నీరసంగాను ఉంటుంది. 'ఈ మూడు ఏ కాలంలోను, ఏ దేశంలోను, ఏ సంఘంలోను, ఏ వ్యక్తిలోను సమాన భాగాల్లో విరాజిల్లవు. ఒక్కోకాలంలో ఒక్క దేశంలో ఒక్కోదానికి ప్రాధాన్యం ఉంటూ వచ్చింది'. ఐతే ఎక్కడో ఒకచోట ఈ మూడు అత్యున్నతమైన దశలో ఉన్నాయి. ఆ కాలాన్ని 'Period of Enchantment" అంటారు. అవి పూర్తిగా నశిస్తే "Period of dis-enchantment" అంటారు. మనది తార్కిక సంధియుగం. ఈ రెంటి మధ్య మనం ఉన్నామిపుడు.

"Platonic love" అంటే చాలామందికి తెలియదు. ఈ ప్రేమలో వియోగం, వేదన, త్యాగం ముఖ్యాంశాలుగా ఉంటాయి. ఇటువంటి ప్రేమను అందరూ తమ జీవితాల్లో అనుభవించటం కుదరదు. అటువంటి ప్రేమనే అమరప్రేమ అంటారు. దాన్ని అనుభవించ గల్గిన వారు ధన్య జీవులు. జీవనరాగం కాక ఈయనకు సంగీతంలోని కొన్ని రాగాలమీద ఆసక్తి ఉంది. కాంభోజి రాగము, కళ్యాణి రాగము, అఠాణా రాగము అంటే ఆయనకు ఇష్టం. సంగీతాన్ని ఆనందించ లేనివారు పాషండులు.

వారి మనస్సుల్లో దయాదాక్షిణ్యాలు ఉండవు. కర్కశ హృదయాలను వారు కలిగి ఉంటారు. వారిలో వక్రత, క్రూరత ఎక్కువ.

మన భారతదేశానికి స్వాతంత్ర్యం లభించింది కాని అది సురాజ్యంగా మారలేదుట. రామరాజ్యం బదులు సురాజ్యం ఉండాలంటాడు. మనది స్వస్థతతో కూడిన సురాజ్యంగా మారాలంటే చెప్పిన నాలుగు ముఖ్య సూత్రాలను మనం పాటించాలి. అవి -

1. Freedom of speech
2. Freedom of Worship
3. Freedom from Want
4. Freedom from Fear

నిర్భీతితో సమాజంలో సంచరించిన నాడు సమాజం వికసించినట్లే. భయంతో మానవుడు తన మనుగడను సాగిస్తుంటే ఆటవిక నాగరికతలో ఉన్నట్లే.

భయం ఉంటే దుఃఖం ఉంటుంది. భయాన్ని జయిస్తే దుఃఖం నశిస్తుంది. ఉదయం మొదలు సాయం సంధ్య వరకు, అది దాటి నిద్రావస్థలో నున్న నిశీధిలో స్వప్నావస్థలో కూడ మానవుడు భయంతో జీవిస్తాడు. రాజకీయ భయం, సాంఘిక భయం, ఆర్థిక భయం, పరివార భయం, వ్యక్తిగత భయం, వ్యాధి భయం, మరణ భయం ఈ విధంగా ఎన్నో రకాల భయాలతో మానవ హృదయం ప్రకంపన చెందుతూ ఉంటుంది. ఇలాంటి భయాల నుంచి బయటపడి

నిర్భయంగా ఏ మానవ సమాజం ఉంటుందో అదే సురాజ్యం అంటాడు శ్రీ సంజీవదేవ్ ఇదంతా బుద్ధ భగవానుని ఆర్యసత్యాల్లో ప్రథమ సత్యమైన 'సర్వదుఃఖం' అనే దానికి ఈయన చెప్పిన వ్యాఖ్య కదూ!

జీవితాల్లో సంయోగ వియోగాలు సహజం. వాటిని ఓర్చుకొనే మానసిక సత్తా మానవులు సంపాదించుకోవాలి. ఇందుకోసం వివేకాన్ని, హేతువాదాన్ని పెంచుకోవాలి. ఈ రెంటిలో అంటే సంయోగ వియోగాల్లో ఏది మధురానుభూతిని ఇస్తుంది? ఈ ప్రశ్నకు సమాధానంగా ఆయన ఒకచోట ఈ విధంగా రాసినాడు.

"Some times separation is sweeter than union, in separation the memory of the beloved is intensively awakened and thus memory is sweeter than the incident. In union, th lovers live in physical consciousness where as in separation they live in mental consciousness. In fact physical consciousness yields sometimes discontent, sorrow and suffering whereas the mental consciousness is a source of delight, free from pain and strain. Body is bound by limnitations, mind is free form limitations. Hence psychological union is more pleasant than physical union. Physical separation means psychological union".

ఆధునిక ప్రేమికులు ఈ భావాలను అర్థం చేసుకొంటే వారి ప్రేమ ఫలించినట్లే!

సముద్రాలకతీతంగా ఉంటుంది నిర్మలాకాశం. దానికి అతీతంగా ఉంటుంది ఆత్మ. కనుక అనంతమైన ఈ ఆత్మదృష్టిని అలవరచుకోవలె. అట్లా అలవరచుకొన్న వారికి నైసర్గిక సౌందర్యం కన్పిస్తుంది. లేనివారికి ప్రకృతి మోడుపోయిన చెట్టులాగా కనిపిస్తుంది. Landscape ని ఐసెన్ హోవర్, చర్చిల్, చైనా ప్రాచీన కవులు చిత్రించేవారు. ఆ కోవకు చెందుతాడు డాక్టర్ సంజీవదేవ్ చిత్రలేఖనా రంగంలో.

Mysticism అంటే ఈయనకు చాలా ఆసక్తి. అసలు దానికి ఒక నిర్వచనం చెప్పినాడు. Mysticism అంటే మధురభక్తిట. భక్తి అంటే మహాప్రవాహంతో కూడిన ప్రేమ అంటాడు ఈ నిర్వచనం శాండిల్య మహర్షి రాసిన భక్తి సూత్రాల్లో లాగా లేదూ!

"Love is the highest bliss that man can attain to, for through it alone he truly knows that he is more than himself, and that he is one with all".

అందనిదాన్ని అందుకోడానికి ప్రయత్నిస్తే అది భక్తి అవుతుంది. ప్రేమంటే ఏమిటంటే తనకంటే వేరైన మరొకరి కొరకు తీరని ఆకాంక్ష. ప్రేమను భక్తిగాను, భక్తిని ప్రేమగాను మధుర భక్తిలో చూడవచ్చు. అటువంటి భక్తిని మధురంగా, ఆనందమయంగా ఏకాగ్ర ధ్యానంలో

ఇమిడ్చి ఒక పరమార్ధ తత్వాన్ని లభ్యపరచుకోవడానికై ఉపయోగిస్తే అదే Mysticism అవుతుంది భక్తి రెండు రకాలు గౌణభక్తి, పరాభక్తి.

గౌణభక్తి సగుణోపాసనలో ఒకభాగం. రెండోది నిర్గుణోపాసన. పరాభక్తి లోనిది. భక్తి మళ్లీ ఐదు రకాలుగా పరిణమించింది. అవి దాస్య భక్తి, వాత్సల్య భక్తి, ఆప్త భక్తి, సఖ్య భక్తి, మధుర భక్తి.

రాధాకృష్ణుల ప్రేమ మధుర భక్తి సూచిస్తుంది. దైవాన్ని తన ప్రియతమమ్మైనదిగా భావించి ఆయనతో క్రీడా వినోదాల్లో ఉండటం దైవభక్తి. మధుర భక్తికి పరాకాష్ఠ. ఇటువంటి ప్రక్రియలను సాహిత్యంలో ప్రవేశ పెట్టి ఛాయావాదం, మర్మవాదం అని పిలుస్తున్నారు. సంగీతాన్ని వింటుంటే ఆనందం కలుగుతుంది. చిత్రపటాన్ని చూస్తుంటే ఆనందం కలుగు తుంది. ఇటువంటి రసానందం తీవ్రంగా కలగాలంటే దాన్ని శాశ్వతంగా అనుభవించాలంటే మార్మిక వాదాన్ని ఆశ్రయించాల్సిందే. అది అన్నింటిని మించిన రసానుభూతి. వేదాంత పరిభాషలో చెపితే జీవాత్మ పరమాత్మలో ఐక్యం కావడానికి చేసే మధుర యోగం. మిస్టిక్ కవులన్నా వారి కవితలన్నా శ్రీ సంజీవదేవ్‌కి నచ్చుతాయి. స్వీడన్ మిస్టిక్ కవితలను ఆయన లేఖల్లో అక్కడక్కడా మనం చూడవచ్చు. ఉదాహరణకు, స్వీడన్ మిస్టిక్ Gustuf Froding కవితను ఆయన పేర్కొన్నాడు.

"Condemned to hell for ever and age.
I lasted now to burn and slay
But the sign of the woods, the voice of the stream,
The beauty of morn's awakening gleam
And the weeping autumn rain-
These taught me love again".

"Fragrance of Culture" అనే వ్యాసంలో సంగీతము, సాహిత్యము, చిత్రకళ, నాట్యకళ సంస్కృతిలో భాగాలు అని చెప్పినాడు. మరి సినిమా రంగం సంగతేమిటి? అది కళను కళంకితం చేస్తున్నదా! ఏమో? మానవుడు ఏ విధంగా బ్రతకాలి? ఎందుకు బ్రతకాలి? బ్రతికి ఏమి సాధించాలి? ఈ ప్రశ్నలు ఆయన్ను నిరంతరం వేధిస్తాయి. దానికి భారతీయ, చైనా, జపాను, అమెరికా, ఐరోపా తత్త్వవేత్తలు, కళాకారులు, చింతకులు, కవులు, గాయకులు, సాహితీవేత్తలు చెప్పిన విషయాలను సమీక్షించి సమగ్రంగా తెలుసుకొని, అట్లా తాను తెలుసుకొన్న విషయాలను తన ఉపన్యాసాల్లోను, లేఖల్లోను తెలియజేస్తాడు శ్రీ సంజీవదేవ్. అందుకే అంటాడు -

"A Man should so live as to be like a poem and
A thing should so look as to be like a picture ".

మానవుడు కవితలాగా జీవించడం, వస్తువులు బొమ్మల్లాగా కనిపించడం జరిగితే ప్రపంచం ఎంత విచిత్రంగా ఉంటుందో! ఇదో ఊహల్లో జనించే రసం బొగ్గు రత్నంగా కనిపిస్తే ఆనందిస్తాం. కాని రత్నం బొగ్గుగా కనిపిస్తే ఆనందించగలమా?

భారతీయ సంస్కృతిలో స్త్రీకి ఒక ప్రత్యేక స్థానమున్నది. గొప్పతనాన్ని, దైవత్వాన్ని పురుషులకు కాక స్త్రీలకు ఆరోపించటం నేటికాలపు ఫ్యాషన్ అయింది నిజమేకాని ఇది అనాదిగా వస్తున్న ఆచారమే. సర్వకాలాల్లోను స్త్రీని ఆరాధ్య దైవంగా భావించడం జరిగింది.

'యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్రదేవతా'

'ఎక్కడైతే స్త్రీలు పూజింప బడతారో, అక్కడ దేవతలు నివసిస్తారట' భగవంతుని స్త్రీ మూర్తిగా ఆరాధించడం కూడా అన్ని కాలాల్లోను ఉన్నది.

యాదేవీ సర్వభూతేషు మాతృ రూపేణ సంస్థితా

భక్తులందరూ సర్వభూతములలోను సంస్థితమైన దేవిని మాతృరూపంలో చూస్తారు. తనకు బాల్యంలోనే ఇటువంటి మాతృమూర్తి కరువైపోయిందనే మాతృభావనా ఆవేదనను వ్యక్తం చేస్తాడు. అందుకే జగజ్జననియైన ఆ సర్వభూతాంతరాత్మగా భాసించే ఆ దేవియే తన మాతృమూర్తి అని ఆమెను సంభోదించాడు. ఈ విషయం రాస్తున్నపుడు ఆయన కనులు చమర్చి ఒక కన్నీటి బిందువు వ్రాలిందిట. ఆహా! ఎంత రసహృదయం శ్రీ సంజీవదేవ్ గారిది!

కాళిదాసు రాసిన 'మేఘసందేశం' అనే గ్రంధం ఆయనన్ను ఎంతో ఆకర్షించింది. ఎందుకంటే అందులో ప్రతి శ్లోకము ఆయనకు ఒక 'పదచిత్రంగా' కన్పిస్తుందిట. మరి సామాన్యుల మాట ఏమిటి? వారికేం కనిపిస్తుంది? ఏమోనంటారు శ్రీ సంజీవదేవ్.

తనతో లేఖల ద్వారా పరిచయమున్న 'ఆషా' అనే బాలిక అత్యంత ప్రతిభావంతురాలు. అతి బాల్యంలోనే అంటే 20 సంవత్సరాల వయసులోనే మరణిస్తే ఆయన తన ఆవేదనాయుతమైన సంతాపాన్ని ప్రకటించిన రీతి బుద్ధుడు సుజాతకు చెప్పిన వాక్యాలను గుర్తుకుతెస్తాయి. 'ఏ ప్రతిభలైనా, ఏ సౌకుమార్యాలైనా, మృత్యువుకు లోకువేగా' ఈ భావాలనే జాషువా కవి హరిశ్చంద్రుని గురించి చెప్పడం జరిగింది.

చరిత్ర అంటే ఏమిటి? చరిత్రలో పరిశీలనా పద్ధతి ఎట్లా ఉంటుంది? చరిత్రలో సత్య నిర్ధారణ ఎట్లా జరుగుతుంది?

ఒకానొకప్పుడు చారిత్రక సత్యాలుగా గుర్తింపబడినవి కాల ప్రవాహంలో ఎందుకు నిలవలేకపోతున్నాయి? ఇటువంటి గంభీరమైన ప్రశ్నలకు సమాధానాలు ఆయన లేఖల్లో ముఖ్యంగా సోదరి కృష్ణకు రాసిన లేఖల్లో మనం చూడవచ్చు.

చరిత్రకు వ్యతిరేకమైనదంతా అసత్యం అనుకోరాదు. 'చరిత్ర అంతా అబద్ధాల బొంత' ఎందుకంటే నేటి వరకు దొరికిన ఆధారాలను బట్టి నిజమని తేల్చిన చారిత్రక సత్యం, రేపు దొరికే నూతన ఆధారాలతో దాని సత్యతను కోల్పోయి అసత్యంగా మిగులుతుంది మానవుడిలో పరిశోధనాశక్తి, ఆసక్తి ఉన్నంతవరకు చారిత్రక సత్యం గతి ఇంతే. కనుక చరిత్రలో నిత్యసత్యాలూ, శాశ్వత సత్యాలు అంటూ ఉండవు.

తన రేడియో ప్రసంగంపై తన మిత్రుడు అమరేంద్ర రాసిన లేఖలోని విషయం ఆయనకు బాగా నచ్చిందిట. తనకు నచ్చిన విషయాన్ని తనకు తెలిసిన భాషలోకి అనువాదం చేయడం ఆయన హాబీ! అందుకే అమరేంద్ర రాసిన విషయం రమ్యంగాను, గంభీరంగాను ఉందట అమరేంద్ర అంటాడు

'అరూపరత్నం కోసం రూపసాగరంలో వలలు వేసే జాలరులు కళాస్రష్టలు' సంజీవదేవ్ అనువాదం

"Artists are the fishermen who cast their nets
in the ocean in search of the formless gem".

DH Lawrence నవలలంటే ఈయనకు ఎంతో అభిమానం. ఎందుకుట ఈ అభిమానం. ఆ నవలలు మానవ మనోభావాలకు, నైసర్గిక సౌందర్యానికి, ప్రేమ తృష్ణకూ, అంతర్ దృష్టికి, మంచి ఐక్యతకు ఆధారభూతాలు. ఈ సుగుణాలు Lawrence నవల్లో దోబూచులాడుతాయి. ఇక్కడ మనకు శ్రీ సంజీవదేవ్ ఒక చిత్రకారుడిగా కనిపించడు. మరెట్లా కనిపిస్తాడు? ఆయన ఒక లాక్షణికుడుగా, ఒక నవలా విమర్శకుడుగా కనిపిస్తాడు. ఒక నవల ఇచ్చే సందేశం ఎట్లా ఉండాలో నిర్దేశించి చెప్తాడు. ఒక సాహితీ విమర్శకుడుగా కనిపిస్తాడు. Flesh లోనే Flame of the spirit ను చూడగల ప్రేమ ఉపాసి అయిన వేదాంతి లేక వేదాంతోపాసి అయిన ప్రేమికుడు లారెన్స్.

ఒక చిత్రకారుడిగా చిత్రాల్ని వేయడం సహజ ప్రవృత్తి. వేసిన చిత్రాలను చూసి ఆనందించడం రసదృష్టి. మరి తాను వేసిన చిత్రానికి భాషలో భాష్యం చెప్పే భాషా భావ చిత్రకారుడు శ్రీ సంజీవదేవ్ మానస సరోవర చిత్రాన్ని ఏ భావకుడైనా ఊహించవచ్చు.

సంగీతం తెలిసినవారు ఎవరైనా ''మానస సంచరరే'' అను మధుర కవితను గానం చేయవచ్చు. కాళిదాసాదులు మానస సరోవరాన్ని గురించి వర్ణనలు చేయవచ్చు. కాని శ్రీ సంజీవదేవ్ చేసే ప్రక్రియలు విశిష్టంగా ఉంటాయి. ఒక చిత్రాన్ని గీస్తాడు. దాన్ని పదకవితా గేయంలోకి మారుస్తాడు. ఈ గుణము అరుదైన గుణం. అందరికీ లభ్యపడదు. మానస సరోవర చిత్రాన్ని గీచి, దాన్ని ఎటువంటి పదకవతిలోకి మార్చినాడో చూద్దాం.

బుచ్చి బాబుగారికి రాసిన లేఖలో మానస సరోవర వర్ణచిత్రానికి పదకవితా వర్ణన

నీలహరిత మానస సరోవరంపై
మనో ప్రకంపనలు మేల్కొంటై
అక్కడ అంతరిస్తుంది రూపమయదృష్టి
అవిశ్రాంత శాంతికి అదొక మూలం
నిజంగా అదొక అచిత్రిత కళాఖండం
దేశకాలాల స్పర్శకు అతీతం.

అసలు రచన ఎట్లా ఉండాలి? రచనలు ఎట్లావుంటే ఇతరులను ఆకర్షిస్తాయి? అవి ఎట్లా లేకపోతే ఇతరులను బాధిస్తాయి? ఈ ప్రశ్నలకు సమాధానం చూద్దాం. రచన తర్కబద్ధంగా ఉండాలి. అంటే తార్కిక చట్రంలో ఆలోచనా నియమాల మేరకు రచనలు ఉండాలి. ఒకే విషయాన్ని, అంటే మొదటి వాక్యంలో చెప్పిన విషయాన్నే 'సాగదీసి, అరగదీసి, ఈకకు ఈక, తోకకు తోక విడగొట్టి విశదీకరించవచ్చు. లేదా దాన్నే సంక్షిప్తంగాను, సమగ్రంగాను చెప్పవచ్చు. విశదీకరణలో శైలి ఉంటుంది. విమర్శనలో సంకీర్ణత ఉంటుంది. వాక్య నిర్మాణం అంతా తర్కబద్ధంగాను, హేతువుతో కూడి ఉండాలి. చిత్ర ప్రదర్శన అంటే ఏమిటి? ఏవో కొన్ని చిత్రాలను, పటాలను, బొమ్మలను అక్కడ పెట్టి టిక్కెట్టు పెట్టో, పెట్టకుండానో ప్రేక్షకులను మౌనంగా చూచి వెళ్లమనడం కాదు. చిత్రకారుని చిత్రాలతో పాటు ఆయన చిత్రాన్ని ప్రేక్షకులు చూచినపుడు అది చిత్రకళా చిత్త సందర్శనం అవుతుంది'.

డైరీ రాయడం ఆయనకు అలవాటే కదా! అందుకే దాని గురించి కొన్ని భావాలను ఆయన డైరీలో భద్రపరిచారు ఈ విధంగా

"To know othrers, to see others and to love others is a great delight; but to be known by others, to be seen by others and to beloved by others is a greater delight; when we praise others the greater pleasure is enjoyed by those hat are praised than those that praise".

"In loving others we lose our egoism where as in being loved by others we retain our

egoism and that is why we feel far happier in the passive phase. In the active phase we give while in the passive phase we are given or we take. Taking is selfish and hence it is more delightful than giving which is above selfishness".

బుచ్చిబాబు పేరుతో ప్రఖ్యాతి గాంచిన వారి నిజనామం శివరాజు వెంకట సుబ్బారావు. ఆయన భార్య పేరు సుబ్బులక్ష్మి. సంజీవదేవ్ గారికి బుచ్చిబాబు గారికి మధ్య జరిగిన లేఖా సంపర్గాన్ని గురించి తెలుసుకుందాం.

Aldous Huxely చేత వీరిరువురూ ప్రభావితులైనారు. Landscape కళను గురించి హక్సలీ రాస్తాడు.

"Today, as, Landscapes have gone out of fashion, and instead of fresh woods and pastures new, we are treated to the endless monotonies of Abstract expressionism".

డాక్టర్ సంజీవదేవ్ దృష్టిలో కూడా Landscape Art అంతరించిపోతున్నా దాన్ని చూచి ఆనందించటంలో "Call of the infinite" ఆనందం కలుగుతుంది. అనంతం ఆనందించమని పిలుస్తుందిట. ఎంత మనోహరమైన భావం ఇది.

బుచ్చిబాబుగారి చిత్రీకరణ Epical ఈయనిది Lyrical ఆయన ఉష్ణ వర్ణాలను బాగా వాడితే ఈయన శీతల వర్ణాలను వాడ్తాడు. ఆయన కళా సృష్టి ప్రధానంగా పాశ్చాత్య కళ నుంచి ప్రేరణను పొందితే ఈయన కళ దూర ప్రాచ్య (చైనా, జపాన్ ఇండోనేషియా) కళల నుంచి ప్రేరణ పొందింది. అంటే వీరిరువురి కళలకు ప్రేరణను భారతీయ కళ ఇవ్వలేకపోయింది. ఎందుకంటే, భారతీయ చిత్రకళ ప్రకృతి దృశ్య చిత్రణకు ప్రాధాన్యం ఇవ్వలేదు కనుక.

"If pure the stream- what matters from whence it bursts?" అంటాడు Wordsworth.

జాతీయత తాత్కాలికం, అంతర్జాతీయత చిరకాలం. మాటలు చెప్పలేని భావాలను రంగుల కుంచెలతో చిత్రాల ద్వారా చెప్పవచ్చంటాడీయన. భాషకు అందని భావాలను చిత్రం ద్వారా చిత్రీకరించవచ్చు. కొన్ని భావాలను భాషలో చెబితేనే బాగుంటాయట. ఉదాహరణకు

motions face
Intellect wanes
Institution wanes
space spreads
Into infinity,
Time melts
Into eternity

In the waning moon light
The mountain casts its shadow
In the vale of mystery
That reverbe rates with the echo
The echo of the song
That fades away
Into the silence within

మానవుడు ఆశాజీవి. ఎన్నో చేయాలనుకుంటాడు. ఏమేమో చేయాలనుకొంటాడు.

జీవితంలో ఎన్నని చేయగలం
జీవితంలో ఒక్కోసారి ఎన్నయినా చేయగలం
జీవితంలో మరోసారి ఏమీ చేయలేం

జీవితపుటంచుల్లో అసలు ఏమైనా ఎందుకు చేయటంఅనిపిస్తుంది. 'క్రియావాదము' అక్రియా వాదాలపై రాసిన అనేక గ్రందాల సారాంశాన్ని నాలుగు వాక్యాల్లో చెప్పారు సంజీవదేవ్

Life, light and Love
Make us rise above-

Jean Paul Sartre రాసిన "Being and Nothingness" అనే గ్రంధాన్ని చదివి దానిలోని ఆలోచనా గంభీరతను ప్రశంసించాడు. ఏ విషయానికి ఆయన తీవ్రంగా స్పందించడు. అసలు స్పందించకుండాను ఉండలేడు. తనదైన ఒక మార్గాన్ని ఏర్పరచుకొని స్పందిస్తాడు. మధ్యమం గాను, మధురంగాను స్పందిస్తాడు. ఆ స్పందనతో సత్యం దోబూచులాడుతుంది. ఎవరు ఎటువైపు నుంచి చూస్తే వారికి ఆయా సత్యచ్ఛాయలు కనిపిస్తాయి.

ఢిల్లీ నుంచి వెలుబడే Art and Culture అనే పత్రికలో ఆయన రాసిన వ్యాసాన్ని ఈ విధంగా ఆరంభించాడు

"All artists are human beings while all human beings are not artists, in the strictest sense. What distinguishes the artist from the mere human beings is the easthetico-creative approach to the phenomenal world in which the multi farious forms, colours, sound and words exist and are perceived by the senses".

Picture ని Lectur ని పోల్చి చెప్పినాడు. Lecture [illegible] Picture [illegible].

"What fails to be done by a Lecture
could well be done by a picture;
Thousand lines would make a lecture
only a few lines could make a picture;
Harmony of a picture and lecture
Would produce an audio-visual rapture;
Word and form are the vehicles of culture".

కళాకారుడు సంస్కృతికి వారధి వంటివాడు.

కళాపోషణ గొప్పదా?లేక పశుపోషణ గొప్పదా? ఎంత భావగంభీరమైన ప్రశ్న ఇది. ఒకటి రస జగత్తుకు, మనో భావ వికాసానికి సంబంధించింది. మానవుడిలోని పశుత్వాన్ని నశింపచేసి రస జగత్తులోకి, ఆనంద జగత్తులోకి తీసుకొని వెళుతుంది కళాపోషణ. మరి పశు పోషణ మాటేమిటి? 'పశు పోషణ' అంటే గేదెలు, ఆవులు, మేకలు మొదలగునవి పెంచటం కాదుట. మానవుడిలో ఉండే పశుతత్వాన్ని పెంచడం అని అర్థం చేసుకోవాలి. అప్పుడు పశు పోషణకు తావుండదు. రసపోషణకే ప్రతివారు ప్రాధాన్యం ఇస్తారు కదూ! ఇది శ్రీ సంజీవదేవ్ చమత్కార ధోరణికి నిదర్శనం.

కళ, సాహిత్యం, పద్య గద్యాలు మానవుణ్ణి విముక్తుణ్ణి చేస్తాయట. ఆయన్ను దుఃఖాన్నించి విముక్తుణ్ణి చేస్తాయి. అట్లా చేయకపోతే వాటికి సార్ధకత ఉండదు.

"Whatever end avours to triumph to liberate man (including woman) from sorrow and suffering is the highest culture- Any art-poetry, painting, music, dance etc.,- that fails to liberate man from the burden of sorrow and suffering is not an ideal art".

'అతిథిదేవోభవ' అంటారు కదా! అంటే ఏమిటి దాని అర్థం అని శ్రీ సంజీవదేవ్‌ని ఒక మిత్రుడు అడిగితే ఆయన చెప్పిన సమాధానం.

'ప్రేమ, సౌహార్ద్రత, ఓర్పు, కరుణ, మైత్రి, శీలము, విశాల దృక్పధం, క్షమా గుణం ఉన్నవారు మన ఇంటికి వచ్చి మన బాగోగులను పరామర్శించి, మనలను అలరింపచేసి వెళ్లేవారు దేవుళ్లే' అదే దాని అర్థం.

మీకు Culture అంటే మక్కువా? లేక Agriculture అంటే ఎక్కువ మక్కువా అన్న ప్రశ్నకు ఆయన Agriculture లో Culture ని చూస్తానని, Culture లో Agriculture చూస్తానని చెప్పినాడు.

"Logic, Music, Magic, Reason, Faith" అనే పదాలకు నూతనార్థాన్ని చెప్పినాడు.

ఉదాహరణకు –

"Man is a rational being, no doubt, but man cannot live by reason alone; he requires faith in addition to reason. Reason imparts to man logic: but logic in the absence of music annihilates the magic of life.

The intellectual appetite is filled by reasons but the psychical one needs faith. Reason yields unrest in an analytical manner while faith does peace and bliss".

అట్లాగే Sight, Fore sight and insight అనే పదాలకు కూడా నూతనార్థాన్ని చెప్పినాడు.

"Sight is a great boon to humanity, foresight is a greater boon; but insight is the greatest boon to humanity."

ప్రతివారి జీవితం ఆందోళనలకు, వేదనలకు, ఆవేదనలకు, పరివేదనలకు, సంవేదనలకు లోనవుతుంది. శరీరం రోగ గ్రస్థమవుతుంది. శుష్కిస్తుంది. బలం తగ్గిపోతుంది. నిస్తేజమవుతుంది. అనారోగ్యానికి, వృద్ధత్వానికి, మరణానికి శరీరం ఆశ్రయమిస్తుంది. కాని అంతర్ దృష్టి కల వారిని ఇవేమీ చేయలేవు. శరీరం ఒక ప్రమిదలో పోసిన నూనెలాంటిది. ఆత్మ వత్తిలాంటిది. నూనె వ్యయం అయినకొద్దీ వత్తి దేదీప్యమానంగా వెలుగుతుంది. ఆత్మజ్యోతి ప్రజ్వలించాలంటే శరీరం నశింపక తప్పదు. ఇటువంటి గంభీరమైన తాత్త్విక భావాలను, జైనమతం నుంచి, బౌద్ధం నుంచి, మీమాంసాదర్శనం నుంచి క్రోడీకరించి ఆదరణీయ మిత్రులైన శ్రీ వెలమాటి శ్రీమన్నారాయణ మూర్తిగారికి రాసిన లేఖల్లో పొందుపరుస్తాడు శ్రీ సంజీవదేవ్.

భయం, మృత్యువు అనే రెండు పదాలకు కూడా నూతనార్థాన్ని చెప్పినాడు. భయం నుండి విముక్తి పొందవచ్చు. జీవితంలోని అనుభవం ద్వారా, జ్ఞానం ద్వారా, ధ్యానం ద్వారా, భక్తి ద్వారా, కళోపాసన ద్వారా భయం నుండి మానవులు విముక్తులవుతారు. ప్రతి మానవుడు తన అంతర్గత మనో మందిరాన్ని పరిశీలించి చూచుకొంటే అక్కడ భయం అనే పీఠం ఉంటుంది. కొందరిలో ధనభయం, కొందరిలో రాజకీయ భయం, కొందరిలో సంతాన భయం, కొందరిలో సాంసారిక భయం, కొందరిలో పదవీ భయం ఈ విధంగా తీరని వేదన, ఆవేదనా రూపంలో భయంగా మారి మానవ మనస్సుల్లో ఉంటుంది. అటువంటప్పుడు దాన్ని తెలుసుకొని ఆ భయానికి దాసులు కాకుండా ఉండటమే స్వేచ్ఛ. అటువంటి జీవితాన్ని గడపడమే స్వేచ్ఛా జీవనమవుతుంది. నిర్భీతి, నిర్భయత్వము మోక్షానికి ప్రథమ సోపానాలు.

ఇకపోతే రెండోది మరణం. జీవితంపై స్పష్టమైన భావాలున్నట్లే మరణంపై కూడా

డాక్టర్ సంజీవదేవ్ గారికి కొన్ని స్పష్టమైన భావాలున్నాయి. జీవితంలోని ఉజ్జ్వలమైన ఒక భాగం మృత్యువు. బ్రతికి ఉండటం జీవితంలోని సగం భాగమే. మరణాన్ని కలుపుకొన్నప్పుడే జీవితం సంపూర్ణమవుతుంది.

'మరణాన్ని గురించి మధుర భావనలను కలిగి ఉండాలి కాని భయాన్నీ బాధనూ కలిగి ఉండరాదు. మరణం మీద ఆనంద భావనను పెంచుకొన్న వ్యక్తికి జీవించడమూ ఆనందమే మరణించడమూ ఆనందమే'నంటాడు శ్రీ సంజీవదేవ్.

ఈశావాస్యోపనిషత్, పర్షియా కవులు ఫిరదౌసి, ఓమర్ ఖాయాం మొదలగు వారి రచనలచే ఈయన ప్రభావితుడైనట్లు ఇక్కడ కనిపిస్తుంది.

'మరణ భయంబు నాకు అణుమాత్రము లేదు

మదీయ జీవసంభరణ భయం ఉందంటాడు ఓమర్ ఖాయం'.

పంచభూతాత్మకమైన ఈ శరీరం వాటిలో లయం కావటమే మరణం. భగవద్గీతలో చెప్పిన ఆత్మ సిద్ధాంతాన్ని తనదైన ధోరణిలో అంగీకరిస్తాడు ఈయన. ఆత్మజ్యోతి ఆనందజ్వాల వెలుగుతుంటే చాలుట. శరీరం పిడికెడు బూడిద ఐతేనేం అని ఆర్య సంప్రదాయాన్ని తిరిగి మరో నూతన పంథాలో చెప్పిన ధీశాలి.

ధ్యానబౌద్ధం కూడా ఈయన్ను బాగా ఆకర్షించింది. The zen master of Buddhism చేత చాలావరకు ప్రభావితుడైనాడు. అందుకే అంటాడు.

"The flame of life lies in the heart of each passing second" .

ప్రాణజ్వాల ధగధగా మండుతూ ఉంటుంది. కాని దాన్ని మనం ఎంతవరకు ఉంచు కోగలం అనేది సమస్య.

వేగుంట కనక రామబ్రహ్మం గారికి రాసిన లేఖల్లో మానవుడికి భౌతిక అవసరాలు ఎంత ప్రాముఖ్యమో వివరిస్తూ రసజగత్తు కూడా అంతే అవసరమని చెప్పడం జరిగింది. పల్లెటూళ్లను గురించి వాస్తవిక దృష్టిలో చూసినారు. అవి ఆదర్శ నివాసాలు కావు. ఆనంద నికేతాలు అసలు కావు. అవి కుళ్లుకు, పరస్పర దూషణకు, ఛాందసానికి, విషపూరితమైన ఉద్వేగాలకు, పాశవికతకు నిలయాలు నిరంతర ద్వేషజ్వాలలకు అక్కడ అమాయకులు తమ ప్రాణాలను కోల్పోతున్నారు. ఎంత ఆవేదన! ఎంత సత్యమున్నది ఈ వాక్యాల్లో! ఎంత నిర్భయంగా రాసినారు!

భరతనాట్యంలో ఆహార్యానికి, శిల్పానికి చాలా ప్రాముఖ్యమున్నది. నిజమైన శిల్పానుభూతి కలిగినప్పుడు ఆనందం కలుగుతుంది. కాని అసలైన శిల్పం చూచినప్పుడు రసోత్తేజం కలుగుతుంది. మానవుడికి గృహం నివాసం అంటే గృహంలో శరీరం నివసిస్తుంది. శరీరంలో మనస్సు నివశిస్తుంది మంచి గృహంలో మంచి శరీరం, మంచి శరీరంలో మంచి మనస్సు, మంచి మనస్సులో మానవత్వం. ఇవన్నీ లోక కళ్యాణానికి ఆధారాలు.

Pleasures of flesh are to be set aside when pleasure of mind calls forth. Pleasures of mind are to be set aside when pleasures of intellect call forth. Pleasures of intellect are to be shunned when the spirit of joy, and when the bliss of joy calls forth అంటారు డాక్టర్ సంజీవదేవ్.

ఆకలి అందరికీ ఉంటుందట. కాని అన్నం అందరికీ ఎందుకుండదంటూ ప్రశ్నిస్తాడు మతం కొద్దిమందికి వర్తిస్తే, సంస్కృతి అన్ని మతాలవారికి వర్తిస్తుంది.

మానవుడు తన జీవితాన్నీ అలక్ష్యం చేయకూడదు.

మానవుడు తన జీవితాన్ని అలక్ష్యం చేయకూడదు. ప్రతి విషయంలోనూ రాజీ పడకూడదు. బుద్ధభగవానుని ఆర్య చతుఃసత్యాలను లక్ష్మీగారికి రాసిన లేఖలో తనదగు బాణిలో రాసి ఆమె దుఃఖార్తిని తొలగించిన ప్రబోధకుడు శ్రీ సంజీవదేవ్.

ఆర్య సత్యాలు .

సర్వం దుఃఖం
సర్వం దుఃఖమయం
సర్వం దుఃఖ నిరోధం
సర్వ దుఃఖ నిరోధమార్గం

దుఃఖానికి శారీరక మానసిక కారణాలనేకం ఉంటాయి. ప్రకృతిని చూచి మనస్సును ఉత్సాహవంతం చేసుకొంటే దుఃఖోపశమనం కలుగుతుంది. ఆకులో, మొగ్గలో, పూవులో, కాయలో, రెమ్మలో, వృక్షాకృతిలో సౌందర్యాన్ని చూడవచ్చు. వనదేవత ఆనందం అన్నింటి కన్నా బాగా ఉంటుంది. మానవుడు రెంటిని శీఘ్ర గతిని వదిలించుకోవాలంటాడు. అవి 1. విషాదం, 2.విషం. ఇవి చాల ప్రమాదకరమైనవిట.

స్త్రీ హృదయాన్ని ఒక రసికుడుగాను, తాత్త్వికుడుగాను, చిత్రకారుడిగాను అర్థం చేసుకొని, పురుషుల స్వభావం కంటే స్త్రీల స్వభావం సహజంగా మృదువైనదని అంటాడు.

అవసరమైతే పురుషుడు కన్నా ఎక్కువ కాఠిన్యాన్ని ప్రదర్శించగలరట స్త్రీలు. అందుకే ఆర్యోక్తినే ఈ సందర్భంలో ఉటంకించి దానికి తనదైన భాష్యాన్ని చెప్పినాడు.

'కోమలం కుసుమాదపి కఠోరం వజ్రాదపి'

పూవుల కంటే స్త్రీలవి కోమల హృదయాలు. వజ్రాని కంటే కఠిన హృదయాలు.

సామాజిక కట్టుబాట్లు మానవుడికి ఇబ్బందిని కలిగించేవిగా ఉండరాదు. అవి ఆహ్లాదాన్ని కలిగించేవిగా ఉండాలి. దంపతులు ప్రేమతో జీవించాలి. ఆనందంతో జీవించాలి. సుఖంగా జీవించాలి. సన్నిహితంగా జీవించాలి. సౌందర్య భావాల మధ్య జీవించాలి. విషాదరహితంగ జీవించాలి. పరస్పరం గాఢమైత్రీ భావంతో జీవించాలి. పరస్పర వాంఛితులై జీవించాలి. సెక్సుకై జీవించరాదు. ద్వేష క్రోధాదులతో జీవించరాదు. అత్యంత సన్నిహితులై, మనస్సు, శరీరం, అవయవాలు పెనవేసుకొనిపోయి వారిద్దరూ ఒక్కటేనా అనేట్లు జీవించాలి. అంతేగాని 'నాకేల' అని ఏ దంపతులు జీవించరాదు. అట్లా జీవిస్తే వారు దంపతులు కారు. స్నేహితులు అసలేకారు.

కొందరి ఉత్తరాలు సిరాతో రాసినా అవి కన్నీటిని కలిగిస్తాయట. కొందరి ఉత్తరాలు మనిషినే కదిలిస్తాయట. అటువంటి ఉత్తరాల్లో సంజీవదేవ్‌కు వారి ఆత్మీయత గోచరిస్తుందిట. హేతువాదం, భౌతికవాదం, మార్మికవాదం, భావవాదం మొదలగు వాదాలన్నీ మానవుణ్ణి విపులవంతుణ్ణి చేస్తాయి. ఆయన బుద్ధి వికశిస్తుంది. తద్వారా రసానుభూతి కలుగుతుంది. కనుక ఈ వాదాలన్నీ వాటి వాటి పరిధిలో సమంజసాలేనంటాడు.

మేధస్సు గొప్పదా? సహృదయం గొప్పదా? మేధస్సు విజ్ఞానానికి సంబంధించినది. సహృదయం రసజగత్తుకు సంబంధించినది. మేధస్సు కన్నా సహృదయానికే ఎక్కువ ప్రాముఖ్యాన్నిస్తాడు డాక్టర్ సంజీవదేవ్, హృదయంలేని మేధకన్నా, మేధలేని హృదయం గొప్పది ఆయన దృష్టిలో. కారుణ్యం, అనుభూతి, కన్నీరు ఇవన్నీ రసజగత్తులోని వస్తువులు. కారుణ్యం అంటే ఏమిటో తెల్పుతుంది ఆలోచన. కారుణ్యం ఎట్లా ఉంటుంది అనే చేసి చూపుతుంది అనుభూతి. కన్నీరు అంటే ఏమిటో విశదీకరిస్తుంది ఆలోచన. కాని అది కన్నీరును అన్ని వేళలా సృష్టించలేదు. కన్నీరుని సృష్టిస్తుంది అనుభూతి. అనుభూతి లేని జీవితాలు నిరర్థకమే.

పూర్వం కవులు తమ కావ్యాల్లో ఋతువర్ణన చేసేవారు. వర్షఋతువు, శిశిర ఋతువు, హేమంత ఋతువు, శరదృతువు గ్రీష్మ ఋతువు వీటన్నింటిలో ప్రకృతి మార్పు చెంది

ప్రతిస్పందిస్తుంటుంది. క్రిమి కీటకాదులతో సహా ప్రకృతిలోని ప్రతిప్రాణి ఋతువుల మార్పుతో స్పందిస్తుంటుంది. వర్షఋతువు ఆ గమనంలో ఆకాశం హరివిల్లుగా ఉంటుంది. తొలకరి చినుకులు ప్రాణి కోటికి హాయినిస్తాయి.

స్త్రీ సముద్ధరణ ఎట్లా ఉండాలి? స్త్రీకి అన్ని రంగాల్లోనూ ప్రవేశార్హతతోబాటు, ఆమెకు ఆర్థికంగా, రాజకీయంగా, సామాజికంగా, విద్యాపరంగా, కుటుంబంలో స్వేచ్ఛ స్వాతంత్ర్యము ఉంటే ఆమె రాణిస్తుంది. అవి లేవు కనుక, బహుశా ఉన్నా, నామ మాత్రంగా ఉన్నందువలన ఆమె రాణించటం లేదు.

ప్రతి మానవుడిలో మూడు రకాలైన వ్యక్తులు ఉంటాయి. అవి
1. ఆలోచనా శక్తి, 2. ఇచ్ఛా శక్తి, 3. క్రియా శక్తి.

ఈ మూడు శక్తులు సమ పాళ్లలో ఉన్నప్పుడు మానవ జీవితం సాఫీగా సాగుతుంది. ఇవి ఒడుదుడుకులకు లోనైతే జీవితం కూడా అస్తవ్యస్తంగా ఉంటుంది. ఇచ్ఛా శక్తి మానవుణ్ణి శాసిస్తుంది దాన్ని సక్రమ మార్గంలో ఉంచుకోవడమే అన్ని సాధనాల ఫలితం.

సౌందర్యోపాసన రెండు రకాలు 1. భౌతిక సౌందర్యోపాసన, 2. భావ సౌందర్యోపాసన. ఒక స్త్రీమూర్తిని చూచినపుడు మన మనస్సులో ఆమె రూపలావణ్య వయో విలాసాలు మెదిలితే అది "Worship of the flesh" అవుతుంది. కాముకత్వానికి అది దారితీస్తుంది. అట్లాకాకుండా సర్వసృష్టికి ఆమె మాతృక అనే భావం వచ్చి, ఆ సృజనాత్మక శక్తిని మనస్సులో తలచుకొంటే అది భావపూజ అవుతుంది. అది సెక్సుకు దారితీయదు. మధురమైన మాతృభావనారాదనకు దారితీస్తుంది.

'ఏకంసత్ విప్రా బహుధావదంతి' (ఋగ్వేదం) ఉన్నదంతా ఒక్కటే. విప్రా ఆ విషయాన్ని గురించి తెలుసుకొన్నవారు అది అనేకంగా ఉంటుందని చెప్పిన విషయాన్ని రసాద్వైతి శ్రీ సంజీవదేవ్ ఎంత చక్కగా చెప్పినాడు!

ఉత్తరాలు సుమధురంగా, సుగంధమయంగా, సుద్రూపంగా ఉండాలట. అంతేగాని వ్యవహార సరళిలో ఉండకూడదు. అందుకే ఏకత్వాన్ని దాని తత్త్వాన్ని ఆయన వర్ణించిన తీరు అద్భుతం. ఒకే తార సంధ్యాకాశంలో మెరుస్తుంటుంది. దాని కాంతి అద్భుతం సరోవరంలో ఒకే కలువ విచ్చినా దాని సౌందర్య సౌరభాలు అద్భుతం. ఈ విశ్వమంతా ఒకటిలోనే ఇమిడి ఉన్నదనటం అద్భుతం. ఏకత్వంలో బహుత్వాన్ని చూడటం అద్భుతం. ఏక సితారను మీటినప్పుడు వచ్చే ధ్వనులు అనంతం అద్భుతం కూడా. అనేక భాగాలుగా నిర్మింపబడిన

ఈ శరీరం ఒక్కటే. ఇటువంటి అద్భుతమైన రసాద్వైత భావాలను ఆయన లేఖల్లో మనం ఎన్నింటినో చూడవచ్చు.

డాక్టర్ సంజీవదేవ్ ఆనందోపాసి. ఆయన రసపిపాసి. ఆయన కళాతపస్వి కళాద్రష్ట. కళాస్రష్ట. కళాసామ్రాట్, కళాద్వైత రససంధాత. రసధాత. రసమయ ధన్యజీవి అంటారు శ్రీమతి లక్ష్మి.

కళలను ఎట్లా ఆనందించాలి? ఈరోజు పరిశోధకులంతా Research Methodology in Humanistic Disciplines లో బాగా రూపొందించాలి అని అనుకొంటున్నారు. వారికి శ్రీ సంజీవదేవ్ రచనలు మార్గదర్శకం కాగలవు.

కళలను రెండురకాలుగా ఆదరించి, ఆనందించవచ్చంటాడు సంజీవదేవ్.

1. రసాత్మక ఆదరణ ఆనందం
2. సమీక్షాత్మక ఆదరణ ఆనందం.

Creative Analysis is different from aesthetic appreciation.

డాక్టర్ సంజీవదేవ్ ఒక 'అభ్యాస యోగి' భగవద్గీతలో చెప్పిన రీతిగా, వేదాలు, ఉపనిషత్తుల్లో చెప్పిన రీతిగా ఈయన నిత్య అభ్యాసయోగి. నిరంతరం అన్వేషణ, పరిశోధన, అన్వయం, సమన్వయం ఈయన సాధనాంశాలు. అట్లా లభ్యమైన వాటిని హృదయానుభూతికి తెచ్చుకొంటాడు. దాన్ని తాత్త్విక దృష్టిలో మననం చేసుకొంటాడు. అట్లా లభ్యమైన ఆనందాన్ని నిరంతరం, అనుక్షణం హృదయంలో ఎట్లా ఉంచుకోవాలా అని కళా తపస్సు చేస్తుంటాడు.

మనకు శత్రువులు రెండు రకాలుగా ఉంటారు. బాహ్య శత్రువులు, అంతర్గత శత్రువులు. ఈర్ష్య, అసూయ, ద్వేషము, పగ, క్రౌర్యము, కుళ్లు, క్రూరత్వం, మన అంతర్గత శత్రువులు, వీటిని జయిస్తే మన జీవితం మూడు పువ్వులు ఆరు కాయలు. వీటిని జయించకపోతే జీవితమనే వృక్షానికి పూలు పూయవచ్చును కాని అవి కాయలుగా మారకముందే రాలిపోయే అవకాశం ఉన్నది.

గృహాలంకరణ అన్ని కాలాల్లోను ఆదరించిన కళ అయితే అందరికీ అది లభ్యం కాదు. లభ్యం కానివారు దాన్ని నిరాదరిస్తారు. గృహాన్ని చిందరవందరగా ఉంచుకొంటారు. 'ఇంటిని చూచి ఇల్లాలిని చూడు' అనే సామెతలో అర్థం ఉంది. ఇంటి పరిసరాలు, ఇంట్లో వస్తువులు, ఇంటిని పరిశుభ్రంగా ఉంచుకోవటం ఇంట్లో వారందరి బాధ్యత. ఇల్లాలు Supervisor

గృహస్థులంతా Superintendents కానక్కరలేదు. వారిలో గల Workmanship బయటికి రావాలేకాని, కేవలం manship మాత్రం కాదు.

శ్రీ వేంకటేశ్వర యూనివర్సిటీ వారు, ఆంధ్ర యూనివర్సిటీ వారు అట్లాగే అనేకమైన విద్యా సంస్థలు, కళాశాలలు, విద్యాపీఠాలు, కళానికేతాలు, జాతీయ అంతర్జాతీయ విశ్వ విద్యాలయాలు ఆయనలోని కళామృతాన్ని ఉపన్యాసాలనే కలశాలతో అందుకొన్నాయి. M.N. Roy, Aristotle, Upanishadic idealogy, Naturalism, Samkhya Philosophy, Chines Art and Philosophy, Ravindranath Tagore, Nature Poets of 17, 18, 19th Centuries of Europe, ఒకరేమిటి! ఎందరో మహానుభావుల జీవితాలను, జీవించడమనే కళను పుణికి పుచ్చుకొని, పాత కొత్తలను మేళవించి రానున్న తరంవారికి నిత్యనూతన వెలుగును చూపుతున్న కళాజ్యోతి డాక్టర్ సంజీవదేవ్.

(రచయిత – డాక్టర్ జి.సుందరరామయ్య ఆంధ్ర యూనివర్సిటీలో ఫిలాసఫీ ప్రొఫెసర్‌గా పనిచేశారు. ప్రస్తుతం ఆఫ్రికాలో వుంటున్నారు.)

# మనోవైజ్ఞానికుడిగా సంజీవదేవ్

పి.వి. కృష్ణారావు

మనోవిజ్ఞాన శాస్త్రంలో సంజీవదేవ్‌కి ఉన్న పరిచయం అపారం. ఆ శాస్త్రాన్ని గురించి ఆయన రాసిన వ్యాసాలు, ఆయన మిగతా రచనల్లో సైతం స్పష్టంగా గోచరించే ఆలోచనా ధోరణి, జీవనశైలి ఆయన్ని ఒక మనోవైజ్ఞానవిశ్లేషకుడిగా పాఠకుడి ముందు నిలబెడతాయి.

మనోవిజ్ఞాన శాస్త్రం మనిషి తత్వాన్ని శాస్త్రీయ పద్ధతుల్లో అధ్యయనం చేస్తుంది. దాని ఆధారంగా మానవ స్వభావాన్ని సూత్రీకరించటంతోపాటు జీవితాన్ని మెరుగుపరచుకొనేందుకు కొన్ని మార్గదర్శకమైన ప్రతిపాదనల్ని చేస్తుంది. పద్ధతుల్ని, ప్రక్రియల్ని రూపొందిస్తుంది. ఐతే మనిషి ప్రవర్తన అత్యంత క్లిష్టమైంది. జీవన పరిధి ఎంతో విస్తృతమైంది. బహుశా అందుకనే నేమో మనోవిజ్ఞాన శాస్త్రంలో మానవ స్వభావాన్ని గురించి ఎన్నో సిద్ధాంతాలు ఉన్నాయి. వేటికి ఉండే గుర్తింపు వాటికి ఉంది.

డాక్టర్ సంజీవదేవ్ శాస్త్రవేత్త కాదు. రచయిత, కళాకారుడు. సాహిత్యం, కళలు మానవుడి అనుభవానికి ప్రతీకలు. విజ్ఞానానికి అవి సైతం ఒక రూపాన్ని ఇస్తాయి. ఐతే ఆ రూపం వైజ్ఞానిక పద్ధతి (Scientific method) అనే చట్రంలో ఇమడక పోవచ్చు. ఉదాహరణకి షేక్స్‌పియర్, డాస్టవస్కీల సాహిత్య ప్రక్రియల్లో మానవ స్వభావాన్ని గురించిన వర్ణనలు, వివరణలు, ఏ మనోవిజ్ఞాన శాస్త్ర గ్రంధానికి తీసిపోతాయి గనుక!

సంజీవదేవ్ మామూలు రచయిత కాదు. మేధావి. ఆయన పరిశీలనా దృష్టి, శాస్త్ర విజ్ఞానం పట్ల ఆయనకుగల గురి, ఆయనలోని సాహిత్యవేత్తని, కళాకారుణ్ణి అధిగమించి, విజ్ఞానిని

చేస్తాయి. మనస్తత్వ శాస్త్రం ఆయనకెంతో అభిమానపాత్రమైన విజ్ఞాన శాస్త్రం. మనిషి నైజం పట్ల గల జిజ్ఞాస ఆ శాస్త్రాధ్యయనానికి ప్రేరణ. మనో విజ్ఞాన సంబంధమైన ఆయన వ్యాసాలు తనకున్న విజ్ఞానాన్ని ప్రదర్శించటానికి రాసినట్టుగాక, ఆ విజ్ఞానాన్ని అందరికీ అందించాలన్న తపనతో రాసినట్లనిపిస్తుంది.

డాక్టర్ సంజీవదేవ్ దృష్టిలో మనోవిజ్ఞానం శరీర విజ్ఞానంతో ముడిపడి ఉంది. ఐనా మనసు అంటే కేవలం మెదడు కాదు. మెదడును ఆధారంగా చేసుకొని ఉన్న భౌతికం కాని ఒక స్వతంత్ర సత్తా. మనోవిజ్ఞానం ద్వారా మనిషి తన గురించి తాను తెలుసుకోగలుగుతాడు. జీవితాన్ని తీర్చిదిద్దుకోగలుగుతాడు. ఇతరుల్ని సైతం అర్థంచేసుకో గలుగుతాడు. మనిషి తనలోని దానవత్వాన్ని అధిగమించి మనిషిగా, మహా మానవుడిగా ఎదగటానికి మనస్తత్వ శాస్త్రం ఉపకరిస్తుంది అని ఆయనకు ఒక గొప్ప నమ్మకం. అయినా, మనోవిజ్ఞాన శాస్త్ర పరిమితుల్ని ఆయన గుర్తిస్తారు. మిగతా శాస్త్రాలకి మల్లే కాక, మనో విజ్ఞానం చాలావరకు వ్యక్తిగత విజ్ఞానమని, భౌతిక, రసాయన శాస్త్రంలో ఉండే నిబద్ధత ఈ శాస్త్రంలో ఉండదనీ, దర్శన స్థాయి నుండి విజ్ఞానం వికసిస్తున్నా ఈ శాస్త్రం చాలా లేతదనీ ఆయన గుర్తిస్తారు మనోవిజ్ఞానం విశ్వ విద్యాలయాల్లోని విషయం కాక, పుస్తకాలకు మాత్రమే పరిమితమై వుండక, మనిషి నిత్య జీవితంలో ప్రతిబింబించాలనీ, అలా జరిగినప్పుడు, మానవజీవితం లోని చాలా చీకట్లు పటాపంచలై ఎన్నో సజీవ కాంతులు ప్రత్యక్ష మవుతాయని సంజీవదేవ్ విశ్వసిస్తారు. ఆయన అన్ని వృత్తుల వారికి మనో విజ్ఞాన పరిజ్ఞానం అవసరం అంటూ సాంస్కృతిక వృత్తి గలవారికి అది ప్రత్యేకంగా అవసరం అంటారు. తన వృత్తి ముఖ్యంగా మూడు పనులు - రచన, చిత్రరచన, ఉపన్యాసాలు - చెయ్యటమని వాటికి మనోవిజ్ఞానం అవసరమని ఒకచోట చెప్పుకున్నారు.

మనోవిజ్ఞానశాస్త్ర ప్రాముఖ్యాన్ని వివరిస్తూ మరోచోట 'తన మనసు గురించి, ఇతరుల మనసులు గురించి తెలుసుకోలేనపుడు తనకు బయటున్న ప్రపంచాన్ని గురించి ఎంత తెలుసుకొన్నా జీవితం అసమగ్రంగానే ఉండిపోతుంది' అంటారు. మనిషిలో మార్పుకు, సమాజంలో మార్పుకి కూడా మనోవిజ్ఞాన శాస్త్రాన్ని ఒక ఉత్కృష్టమైన సాధనంగా సంజీవదేవ్ పరిగణిస్తారు. డాక్టర్ సంజీవదేవ్ మనోవిజ్ఞాన శాస్త్రంలో వివిధ సాంప్రదాయాలను తన రచనలో ప్రస్తావిస్తారు. నిబంధన (conditioning) నుంచి సామూహిక అచేతన (collective unconscious) దాకా ఆయన ఎన్నో విషయాల్ని వివరిస్తారు. ఫ్రాయిడ్, యూంగ్, యాడ్లర్ సిద్ధాంతాల్ని

ఒప్పుకుంటారు. ప్రవర్తనావాదాన్ని, గెస్టాల్ట్ మనోవిజ్ఞానాన్ని గౌరవిస్తారు. అందువల్ల ఆయన మిశ్రమ, సమ్మేళనవాది (eclectic) అనిపిస్తారు. నిజానికి సంజీవదేవ్ దృక్పథం, సైకాలజీలోని మానవతా ధోరణులకు అతి సన్నిహితం. ఆయన తన రచనల్లో ఫ్రాయిడ్, యూంగ్, యాడ్లర్, వాట్సన్ మొదలైన సైకాలజిస్టుల సిద్ధాంతాల్ని, ప్రతిపాదనల్ని చక్కగా, సామాన్య పాఠకుడికి సైతం బోధపడేలా వివరిస్తారు. ఫ్రాయిడ్, యూంగ్‌ల స్వప్న సిద్ధాంతాల్ని పోల్చుతూ యూంగ్ అంటే తనకెంతో అభిమానం అని చెప్పుకున్నారు. యూంగ్ లోని ఆధ్యాత్మిక ధోరణులు, మనిషి జీవితంలో సంస్కృతికి ఆయన ఇచ్చిన ప్రాముఖ్యత దానికి కారణం అనిపిస్తుంది.

డాక్టర్ సంజీవదేవ్ రచన, జీవితం వేరుకావు. తనకు పరిచయమ్మైన వ్యక్తులు, స్నేహితులు, చదివిన పుస్తకాలు, తనకు తెలిసిన రచయితలు, కళాకారులు, చూసిన ప్రదేశాలు, తన ఆదర్శాలు, జ్ఞానసంపదా ఇవన్నీ ఆయన రచనల్లో – ఆ రచన వ్యాసం కావచ్చు, స్వీయ చరిత్ర కావచ్చు, ఉత్తరాలు కావచ్చు – కలసిపోయి ఆయన ఒక సంయమనమూర్తి (integrated personality) అనిపిస్తుంది. ఆయన పుస్తకాలతో సరైన పరిచయం లేనివాళ్ళు, ఆయన్ని ఏ కొద్దిగానో చదివినవాళ్ళు, ఏమిటీ స్వోత్కర్ష అనుకోవచ్చు. అందుకు కారణం ఆయన జీవితమే రచన, రచనే జీవితం. ఆ రెండూ సంపన్నాలే. విజ్ఞానశాస్త్రం జీవితానికి ఒక డైరెక్షన్ ఇవ్వాలి. దానంతట అది ఇవ్వలేదు కాబట్టి మనిషికే ఆ డైరెక్షన్ వుండాలి. సైన్సు ఒక పరికరం మాత్రమే. మనిషి తన విలువల్ని తనే ఎంచుకోవాలి. అది ప్రతి మనిషి బాధ్యత, అవశ్యకత.

డాక్టర్ సంజీవదేవ్ మానవతావాదం, మనోవిజ్ఞానం ఆయన్ని వైజ్ఞానికుణ్ణిచేస్తే, ఆయన సైకాలజీలోని హ్యూమనిస్టిక్ సాంప్రదాయానికి చెందుతారు. ఆయనకి మనిషి అంటే గొప్ప కన్సర్న్. బెర్ట్రాండ్ రెస్సెల్ తన జీవితాన్ని నడిపించాయని వ్రాసుకున్న మూడు సూత్రాలు – లవ్, నాలెడ్జ్, కన్సర్న్ ఫర్ హ్యూమన్ సఫరింగ్ – సంజీవదేవ్‌కి కూడా అన్వయిస్తాయనిపిస్తుంది. విజ్ఞానం అన్నా, మనిషి అన్నా సంజీవదేవ్‌కి ఒక passion. స్వార్థచింతనని, వైయక్తిక పరిధుల్ని అధిగమించిన వాళ్ళకే అది సాధ్యం. అయితే సంజీవదేవ్ యాక్టివిస్ట్‌గా కన్పించరు. ఆయన మానవతావాది. 'నథింగ్ హ్యూమన్ ఈజ్ ఏలియన్ టు మి', అదీ సంజీవదేవ్. ఆయనకి మనిషి అంటే అపారమ్మైన ప్రేమ, గౌరవం. వ్యక్తుల్లోని తేడాలని ఆయన ఎంతగా గమనిస్తారో అంతగా ఒప్పుకుంటారు. సంజీవదేవ్ హేతువాది. ఐతే వైట్ హెడ్ అన్నట్టుగ 'ది ఫంక్షన్ ఆఫ్ రీజన్ ఈజ్ టు ప్రమోట్ ది ఆర్ట్ ఆఫ్ లైఫ్'. అదీ ఆయన మానవతా మనోవైజ్ఞానిక దృక్పథం.

మనోవిజ్ఞాన శాస్త్రంలోని భౌతిక, ఆదర్శవాద వైరుధ్యాలను ఆయన క్రమపరిణామ

దృక్పథంలో అధిగమిస్తారు. జడం-ప్రాణం-మనసు. ఇదీ పరిణామక్రమం. మానసిక క్రమ వికాసమే మానవక్రమ పరిణామం. ఆధ్యాత్మికత గురించి ఆయన భౌతిక పీఠంపై నిలబడి మాట్లాడతారు. మనస్సుకి ఆధారం శరీరం అనీ, ప్రాణానికి ఆధారం జడమనీ గుర్తిస్తారు. ఆయనలోని శాస్త్ర దృష్టికి ఇంతకంటే నిదర్శనం అఖ్ఖరలేదు.

ఒకచోట 'I am a materialist for matter is sprit, I am a spiritualist for sprit is matter' (నేను జడవాదిని, కారణం జడం అనేది చేతనమే. నేను చేతనావాదిని కారణం చేతన అనేది జడమే) అంటారు. ఇదే తన రచనలకు వర్తిస్తుందని చెబుతారు.

మనిషి గురించిన సమగ్రమైన భావన, శరీర ధర్మాల పట్ల, సంస్కృతిపట్ల, సామాజిక రాజకీయ పరిస్థితులపట్ల, వైయక్తిక జీవన పరిస్థితులపట్ల సరైన అవగాహన వున్నపుడే సాధ్యం. అదే సంజీవదేవ్ వైఖరి. అందుకే ఆయన తత్త్వశాస్త్రాన్ని, చరిత్రని, కళలని సంస్కృతిని, విజ్ఞానశాస్త్రాల్ని, వ్యక్తుల్ని అధ్యయనం చేస్తారు. ఆయన ప్రపంచ దృక్పథం వీటన్నిటి మీదా, తన వాస్తవ జీవనానుభవాలమీద, ఆదర్శాలమీద ఆధారపడి వున్నదనిపిస్తుంది.

మనుషుల్లో మారణ మనస్తత్వానికి కారణం నేటి రాజకీయ, నైతిక, సాంఘిక, ఆర్థిక, కౌటుంబిక పరిస్థితులని, స్వార్థం, పోటీ, భయం, వీటివల్ల మనుషుల్లో దానవత్వం పెరుగుతున్న దని, ఇటువంటి మనస్తత్వాలు మారాలంటే పునాదుల దగ్గర నుండీ, అంటే రాజకీయ, నైతిక, ఆర్థిక, సాంఘిక, కౌటుంబిక విదాల నుండి మరమ్మతులతోపాటు మనోవైజ్ఞానికంగా కూడా ఈ సమస్యని ఎదుర్కోవాలనీ సూచిస్తారు.

నిరంతర ప్రయత్నం ద్వారా, నిత్యసాధన ద్వారా, తనలో నిద్రాణమైవున్న మానసిక శక్తులను మేల్కొలపటం ద్వారా మనిషి మనీషిగా రూపాంతరం చెందుతాడనీ సంజీవదేవ్ అంటారు.

మానవతా మనోవైజ్ఞానికుడు కారల్ రోజర్స్ మనోచికిత్స (psychotherapy)కి ముఖ్యం క్లయింట్ - థెరపిస్టుల మధ్య ఏర్పడే సంబంధం అంటారు. థెరపిస్టుకి తన క్లయింట్ పట్ల అన్‌కండిషనల్ పాజిటివ్ రిగార్డ్ ఉండాలి. ఎంపతిక్ అండర్‌స్టాండింగ్ ఉండాలి. అది క్లయింట్‌కి కమ్యూనికేట్ చెయ్యగలగాలి. క్లయింట్ అనుభవాల్ని, అనుభూతుల్ని తనూ జీవించగలిగి, అతన్ని సంపూర్ణంగా, అంక్షారహితంగా ఒప్పుకోగలగాలి. ఈ బంధంలో క్లయింట్‌ని అర్థంచేసుకొని అనుభూతించటం తప్ప జడ్జ్ చెయ్యటం వుండదు. అప్పుడే చికిత్స సఫలమౌతుంది. మానసిక

చికిత్సకి ముఖ్యసాధనం థెరపిస్టు వ్యక్తిత్వమేననీ, థెరపిస్టుకు అన్నింటినీ మించి ఇంటెన్షన్ టు హెల్ప్ (సాయపడాలన్న సంకల్పం) వుండాలనీ సైకాలజీలోని మానవతా చికిత్సకులు ప్రతిపాదించారు.

డాక్టర్ సంజీవదేవ్‌తో నాకు పరిచయం లేదు*. (* ఈ వ్యాసం రాసినప్పటికి) ఐనా, ఆయన రచన్లో ముఖ్యంగా కొన్ని ఉత్తరాల్లో సైకోథెరపిస్టుగా గోచరిస్తారు. ఉదాహరణకు సంజీవదేవ్ శ్రీమతి లక్ష్మికి వ్రాసిన ఉత్తరాల్లో ఒకచోట 'మీ ఉత్తరం అందిది. ఎంతో భారమైన హృదయంతో మీ భారమైన భావాల్ని అనుభూతించాను' అంటారు. ఆయన స్నేహం థెరప్యూటిక్ అవుతుంది ఆ అవకాశం లభించిన వాళ్ళకి, అవసరం ఉన్నవాళ్ళకి. ఆయన్నుంచి లబ్ధిపొందిన లక్ష్మి 'లోపాల్ని విస్మరించి విశేషాల్ని ఎత్తిచూపే ఔదార్యం' సంజీవదేవ్ ప్రత్యేకత అంటూ, 'సంజీవదేవ్ గారితో నా పరిచయం ఒక అద్భుత సంఘటన; నా జీవితంలో జరిగిన ఒక బాధవలన జీవితంపట్ల నేను కోల్పోయిన మమకారాన్ని, చల్లని వారి పరిచయపు వెలుగులే తిరిగి నాకు ప్రసాదించాయి. ఆయన స్నేహసౌరభమే నా బుద్ధిని, హృదయాన్ని మేల్కొలిపి జీవన మాధుర్యాన్ని నా అందుబాటులోకి తెచ్చింది' అని వివరిస్తారు. ఆమె 'ప్రతిభా సంపత్తికంటే మనిషిలోని మమతకు, మానవత్వపు విలువలకు ఆయన అత్యంత సన్నిహితుడు' అని సంజీవదేవ్‌ని వర్ణిస్తారు.

మానవతా మనోవిజ్ఞానం మనిషికి కేవలం మానసికారోగ్యం ఒనగూర్చటంలో ఆగిపోదు. మనిషి తనలో నిబిడమైన శక్తులన్నిటికీ రూపం ఇవ్వాలి. అబ్రహాం మాస్లో అన్నట్టుగ మనిషి ఆత్మసిద్ధి (self actualization, స్వయం సిద్ధి) పొందాలి. డాక్టర్ సంజీవదేవ్ దృక్పథమూ అదే. ఆయన మనిషికి పరిమితులుండకూడదని భావిస్తారు కాబట్టే మానసిక శక్తుల్ని అధ్యయనంచేసే పేరాసైకాలజీ అంటే ఆయనకెంతో గౌరవం. తెలుగులో మొదటిసారిగా పేరా సైకాలజీ అన్న మాటని పరామనోవిజ్ఞానశాస్త్రంగా తెనిగించింది, ఆ శాస్త్రాన్ని గురించి విపులంగా రాసింది నాకు తెలిసినంతవరకు ఆయనే. పరామనోవిజ్ఞానంతో మానవుని పరిమిత శక్తులు అపరిమిత శక్తులుగా రూపాంతరం చెందగల్గితే ఆ శాస్త్రం ధన్యమైనట్లనీ సంజీవదేవ్ అంటారు. తనకు పరిచితులైన వ్యక్తులను అర్థంచేసుకోవటానికి, వారి సమస్యల్ని వివరించటానికి సంజీవదేవ్ తరచుగా మనోవైజ్ఞానిక భావనలను ఉపయోగిస్తారు. ఉదాహరణకు ఆల్డస్ హాక్స్‌లీని ఉభయముఖి (ambivert)గ వర్ణిస్తారు. రాహుల్ సాంకృత్యాయన్ గురించి అతనంత మహాపండితుడై ఉండీ కూడా తాను పండితుణ్ణి అని చెప్పుకోవటంలో కంటే కమ్యూనిస్టునని, భౌతిక వాదినని చెప్పుకొని గర్వించేవాడు అని చెబుతూ అందుకు కారణాన్ని మనోవైజ్ఞానికంగా విశ్లేషించి రాహుల్‌జీ

అవచేతనలో దాగివున్న హైన్య మానసిక స్థితి (inferiority complex) కి అది ప్రతిక్రియ అంటారు. రాహుల్‌జీ బాల్యంలో అందుకు కారణాలు వెతుకుతారు.

డాక్టర్ సంజీవదేవ్‌లోని మానవత, ఆధ్యాత్మిక ధోరణి అవాంఛనీయాలు. ఇంద్రియాతీత విషాయలు ఎక్కువ భాగం వైయక్తిక విశ్వాసాలకు సంబంధించిన విషయాలనీ, వాటి అస్తిత్వాన్ని తేల్చటానికి objective criteria అంటూ ఏమీ వుండవని ఆయన గుర్తిస్తారు. మారణ మనస్తత్వం మీద, మారుతున్న విలువలమీద, సంస్కృతిమీద, ఆధునిక జీవితం మీద, మానవతమీద, మతం మీద, ఉన్నతమైన విలువలమీద, ఆదర్శాలమీద, సంజీవదేవ్ అభిప్రాయాలు సుప్రసిద్ధ మనో వైజ్ఞానికుడు ఎరిక్ ఫ్రామ్‌ని తలపింపజేస్తాయి. ఫ్రాయిడ్‌నీ, మార్క్స్‌నీ ఔపోసనబట్టి, సంస్కృతికి వ్యక్తి జీవితానికి గల అవినాభావ సంబంధాన్ని దృష్టిలో పెట్టుకొని ఆధునిక సమాజాన్ని డయాగ్నైజ్ చేసి, సేన్ సొసైటీ (Sane Society), ఆర్ట్ ఆఫ్ లవ్ (Art of Love), రివల్యూషన్ ఆఫ్ హోప్ (Revolution of Hope) మొదలైన పుస్తకాల్లో ఎరిక్ ఫ్రామ్ మనిషికి ఏది ఆదర్శం అని ఎలుగెత్తి చాటారో, అవే విలువలు సంజీవదేవ్ రచనల్లో ప్రత్యక్షమౌతాయి అయితే ఎరిక్ ఫ్రామ్ పేరు సంజీవదేవ్ రచనల్లో నాకెక్కడా తారసిల్లలేదు. ఎరిక్ ఫ్రామ్‌కి మల్లే ప్రతి మనిషి కరుణ, మైత్రి, ధైర్యం, ఆశావాదం, నిస్వార్థత, సహిష్ణుత మొదలైన గుణాల్ని పెంపొందించుకోవాలని సంజీవదేవ్ ఆశిస్తారు. మారణాసక్త (death-loving) విధానాల్ని విడనాడి జీవనాసక్త (life-loving) విధానాల్ని అనుసరించినవాడే మానవాళికి మనుగడ, మహనీయత అని ఎరిక్ ఫ్రామ్ చెప్పిన మాటలు సంజీవదేవ్‌ని చదివినప్పుడు గుర్తొస్తాయి.

ప్రతిభకి, సృజనాత్మకతకి ఎంతో విలువ ఇచ్చే సంజీవదేవ్ మానవత్వంలేని మేధావికంటే, మేధలేని మానవత్వం మంచిది అంటారు. మనుషులు సగటు మనుషులైనా, ప్రతిభావంతులైనా, సృజనాత్మకులైనా కొన్ని విలువలకు కట్టుబడి వుండాలి. అప్పుడే వారిలో వున్న దానవత్వాన్ని అధిగమించి మానవులై మహామానవులవుతారు. విలువలు మారేవీ మారనివీ వుంటాయి. విశ్వప్రేమ, జీవకారుణ్యం, నిస్వార్థత మొదలైన మారని విలువలు, వాటివి దేశకాలాతీతమైన నైతిక విలువలుగా ఆయన గుర్తిస్తారు. వైజ్ఞానిక యుగంలో కొన్ని విలువలు మారకుండా వుండటం ఎంత అవసరమో కొన్ని విలువలు మారటం కూడా అంతే అవసరమంటారు. ఆధునిక జీవితంలో లైంగిక విలువలు మారటానికి గల కారణాల్లో ఒకటిగా ఫ్రాయిడ్ ప్రతిపాదనలకి విలువ ఇస్తారు. మానసిక స్వేచ్ఛ, సామాజిక నిషేధాల మధ్య నలగటంతో మనుషులు దెబ్బతిని మానసిక రుగ్మతకి లోనవ్వటం జరుగుతుందన్న ఫ్రాయిడ్ సిద్ధాంతాన్ని వివరిస్తూ లైంగికతకి ఫ్రాయిడ్ ఇవ్వవలసిన ప్రాధాన్యత కంటె ఎక్కువ ఇచ్చాడని అంటారు.

'భావాలు-స్వభావాలు' అనే వ్యాసంలో మానసిక శక్తుల్ని ఆలోచన, అనుభూతి, ఇచ్ఛ, సహజాతం అని వర్గీకరించి, భావం వీటన్నిటి సమ్మేళనం అంటారు. సాంప్రదాయ మనోవిజ్ఞానంలో అలాంటి వర్గీకరణ మనకు తటస్థించదు. ఈ వ్యాసంలోనే శాడిజమ్ గురించి మాసోచిజమ్ గురించి ప్రస్తావించారు. స్వభావాలు మనుషుల్ని సృష్టిస్తాయంటూ స్వభావాన్ని సృష్టించుకోవటమూ, మార్చుకోవటమూ కష్టమని గుర్తిస్తారు. స్వభావాలు పుట్టుకతో వస్తాయంటూ స్వభావం మారటమంటే మనిషి పూర్తిగా మారటమే అంటారు. అనువంశికత, పరిసరాలు, బాల్యానుభవాలు మనిషి స్వభావాన్ని ఎంతగా నిర్ధారిస్తాయో ఆయన చక్కగా అర్థం చేసుకొని వివరించారనిపిస్తుంది.

వర్తమానంలో జీవించటం అనే భావన సైకాలజీలో ఇటీవలి కాలంలో ఎంతో ప్రాచుర్యం పొందింది. 'ప్రజంట్ మూమెంట్ ఫుల్‌ఫిల్‌మెంట్, లివింగ్ ఇన్ ది ప్రజంట్, లివింగ్ వన్ డే ఎట్ ఎ టైమ్' అనే అంశాలపై ఎంతో సాహిత్యం వెలువడింది. ఆ వైఖరి మనుషులు సంతోషంగా జీవించటానికి, మానసిక ఆరోగ్యాన్ని, అనాసక్తతని ఎదుర్కొనటానికి ఎంత అవసరమో వైన్ డయ్యార్ లాంటి మరెందరో విశదీకరించారు. చిత్తవృత్తి పట్ల సంజీవదేవ్‌కి గల అవగాహనకి వర్తమానంలో జీవించటం అన్న ఆయన వ్యాసం ఒక ఉదాహరణ మాత్రమే. వర్తమాన కాలంలో జీవించటమంటే మనిషి ఆధునికుడిగా జీవించటం, సమానతను గుర్తించటం, హేతువాదపు వెలుగును దర్శించటం, నూతన సమాజ నిర్మాత కావటం, తాను ప్రేమలో జీవిస్తూ ఇతరులను ప్రేమలో జీవించనీయటం అని ఆయన వివరణ ఇస్తారు. మనో వైజ్ఞానిక పరిధుల్ని అధిగమించే ఆయన దృష్టికి 'అయిదు మజిలీలు' 'సత్యం-శివం-సుందరం' 'మారణ మనస్తత్వం' అనే వ్యాసాలు మరికొన్ని ఉదాహరణలు. తత్త్వవేత్త, వైజ్ఞానికుడు, కళాకారుడు అయిన వ్యక్తులకే అలాంటి పరిశీలన, అవగాహన సాధ్యం. ప్రాక్ దేశాల ఆధ్యాత్మిక విజ్ఞానం. పట్ల నేడు ఎంతో మంచి వైజ్ఞానికులు ఆసక్తి కనబరుస్తున్నారు. స్వామి అఖిలానంద, స్వామి రామ లాంటి ఆధ్యాత్మిక వేత్తలు ప్రాచీన గ్రంథాల్లోని మనోవిజ్ఞాన సంబంధమైన విషయాలకి ఆధునిక మనోవిజ్ఞాన పరంగా వివరణలు ఇస్తున్నారు. వీటిలో ఉపనిషత్తులలో వివరింపబడ్డ పంచకోశ సిద్ధాంతం, తంత్ర శాస్త్రంలో చక్ర సిద్ధాంతం ప్రముఖమైనవి. సంజీవదేవ్ 'అయిదు మజిలీలు', 'మూడు మానసిక దశలు' అన్న వ్యాసాల్లో పంచకోశాలకి, సత్యం, శివం, సుందరంకి ఇచ్చే వివరణలు సమకాలీన మనోవిజ్ఞాన శాస్త్రంలోని వికాస దశలు, చేతనావస్థలు, అస్థిత్వస్థాయి అనే భావనలకి ఎంతో దగ్గరగా వస్తాయి.

బోధి (intution) సృజనాత్మకత, స్మృతి, విస్మృతి, ఇచ్చు మొదలైన వాటికి ఎన్నోచోట్ల ఆయన తనదైన వివరణ ఇస్తారు ఇంట్యూషన్‌ని ఇంటలెక్చువలైజ్‌డ్ ఇన్‌స్టింక్ట్ అంటారు. మనిషి సృజనాత్మకతకి జోహారులర్పిస్తారు

సంజీవదేవ్ వ్యాసాలు – 2కి పీఠికలో సంజీవదేవ్ ఔన్నత్యానికి కారణం 'జీవితాన్ని విమర్శాత్మకంగా, విచక్షణా జ్ఞానంతో అనుభవంచడం' అని సంపాదకులు (వి. కొండలరావు, డాక్టర్ ముదిగొండ వీరభద్రయ్య) అంటారు. వారిని స్థిత ప్రజ్ఞులంటూ ఆ స్థిత ప్రజ్ఞత్వానికి సైతం వారు చేసిన సాధనల్లా జీవితాన్ని విచక్షణాత్మకంగా అనుభవించటమే, అన్నారు. ఆయన రచనల్లో వ్యక్తమయ్యే మానవ సంబంధాల్లో, ఆయన స్పందనలో అది నాకు ప్రస్ఫుటంగా గోచరించింది. ఆయన అభిమాని శ్రీమతి లక్ష్మి ఒకచోట సంజీవదేవ్‌ని మనోమయ మర్మాలు తెలుసుకొన్న మనస్తత్వ శాస్త్రజ్ఞుడని వర్ణిస్తారు. అది అక్షరాలా నిజం.

(రయిత – శ్రీ పి.వి. కృష్ణారావు, విశాఖపట్నం లోని
యొగవిద్య మరియు చైతన్య సంస్థకు డైరక్టరుగా వున్నారు.)

# జీవన శిల్పి సంజీవదేవ్

*–సరోజినీ ప్రేమ్‌చంద్*

జీవిత తత్వాన్ని తరచి తరచి చూసేవాడు తాత్వికుడు. అసలు జీవితం అంటే ప్రాణంతో ఉండటమేనా, మరణం కూడా జీవితమేనా? మరణం తర్వాతది జీవితమా, కాదా? మనిషి తన మనసు ద్వారా పొందుతున్న అనుభవాలలో పూర్తిగా మునిగిపోయి, వాటి వలన కలిగిన అనుభూతులనే సుఖాలనీ, దుఃఖాలనీ, బాధలనీ, వ్యధలనీ, గెలుపు, ఓటమి, ద్వేషం, ఆగ్రహం అనీ అనుకుంటూ మనసు పోయే పోకడలతో వూగిపోతూ ఉంటాడు. ఒక అడుగు ప్రక్కకు వేసి ఇవన్నీ పరిశీలిస్తాడు. తాత్వికుడు మళ్ళీ తానే ఈ పరిశీలకుడు ఎవరు అని ప్రశ్నించుకుంటాడు. పరిశీలన కింద ఉన్నది తానే కదా అనీ ఆలోచిస్తాడు. ఇదంతా తానొక్కనితోనే కాదు, మానవకోటి మొత్తంలో జరిగేది అని తెలుసుకొంటాడు. చుట్టూవున్న ప్రకృతికి కూడా ఈ సుఖదుఃఖాలపైన, ఉల్లాసాలు, వైఫల్యాలు, నిస్పృహలపైన ఎందుకు ప్రభావం ఉన్నదని మధన పడతాడు. మనిషికోసమని ప్రకృతిని సృష్టించడం జరిగిందా? లేదూ మనిషిలోని స్వార్థమే, తోటి మనిషిని స్వప్రయోజనం కోసం దోపిడీ చేసే స్వార్థమే ప్రకృతిని కూడా స్వార్థ దృష్టితో పరికింపచేస్తున్నదా? ఈ ప్రకృతి సౌందర్యానికి అర్థం ఏమిటి? సుందరంగా కనబడేదే సౌందర్యమా? కారుమబ్బుల్లో, మేఘగర్జనలో, తుఫానులో కూడా సౌందర్యం లేదా? తాత్వికుడు తనలో తలెత్తే ఇటువంటి అన్ని ప్రశ్నలను ప్రోత్సహిస్తాడు. ఈ ప్రశ్నలకు సమాధానాలు అన్వేషించిన తీరు తాత్వికుడు సత్యశోధనకై వేసిన బాటను చూపుతుంది. అదే ఆ తాత్వికుని తత్వచింతన.

ప్రగాఢమైన తమ చింతనా ప్రవంతిని హృద్యమైన శైలిలో, స్థిరమైన తర్కంలో

'బయోసింఫనీ'లో ఆవిష్కరించారు సంజీవదేవ్. ఆయనలో హేతువాదం, సృజనాత్మకత, ఆస్వాదనాత్మకత సమపాళ్ళలో సమ్మిళితమై ఉండటం వల్ల ఒక విశిష్టమైన చింతనాపరునిగా రూపొందారు.

సంజీవదేవ్‌కి చూస్తే ప్రతీదీ అందంగా కనబడుతుంది. ఆలోచిస్తే అంతా ఆనందంగా తోస్తుంది గీసినది సుందర రూపం దాలుస్తుంది. రాసినది పరిమళ భరితంగా ధ్వనిస్తుంది. ప్రకృతి, మానవ జీవితమూ ఒక జీవరాగ సమ్మేళనమై భాసిస్తాయి.

సృష్టిలోని విభిన్న జీవరాగాలను, ఆలాపనలను మనోజ్ఞంగా, మహోదాత్తంగా సమ్మేళవించి, తనని తానొక మురళిగా మలచుకొని సౌందర్యం, ప్రేమ, కరుణ సందేశాలను పొదుగుకొన్న మాతృగీతికను మ్రోగిస్తూ జీవిత మధురిమ, జీవన సాఫల్యత తన బ్రతుకులో చూపిన ఆనందజీవి సంజీవదేవ్.

ఆయనకు లోకమంతా ఉల్లాసమయంగా ఆగుపిస్తుంది. ఆ ఉల్లాసపు కెరటాలు ఎగసి పడటానకి కారణం సౌందర్య దీప్తులు. సౌందర్యం ఎక్కడ ఉందీ అంటే రాగంలో ఉంది, వాదంలో ఉంది, రూపంలో ఉంది, రంగులో ఉంది, నేత్రంలో ఉంది, హృదయంలో ఉంది, హృదయం రసమయంగా ఉంటే ప్రకృతిలో, మానవ ప్రకృతిలో, క్షణంలో, కణంలో, కన్నీటిలో, పన్నీటిలో, పథంలో, పథకునిలో, సౌందర్యం అవగతమవుతుంది అంటారు సంజీవదేవ్. ఇదంతా గాఢతతో అవలోకన చేసిన మనిషి తత్త్వ విచారణ చేసి తాత్త్వికుడవుతాడు. అతడే ఈ మనిషి సంజీవదేవ్.

జీవించడమే ఒక కళగా సాధన చేస్తూ జీవితాన్నే ఒక కళగా జీవిస్తూ 'రస సందేశం' ప్రసారం చేస్తూ ఉండేవారు, సంజీవదేవ్

'అన్ని కళలకంటే జీవితం మహోన్నతమైనట్టి, లలితమైనట్టి కళ. సందేహం లేదు. అయినా ఇతర కళలు లేనప్పుడు జీవితం తన స్వంత కళను ఆనందిచజాలదు'.

అందుకని చిత్రలేఖనం, సాహిత్యం, సంగీతాలలో సృజనాత్మక నైపుణ్యం సంపాదించి రస జగత్తులో విహరిస్తూంటారు. ప్రకృతిని పరికిస్తూ చిత్రిస్తూ తాత్విక విచారణలో వినోదిస్తున్నట్లుగా కనబడతారు. కానీ సామాన్యుల ఊహకు అందని లోతులకు, శిఖరాలకు షికారుగా వెళ్ళిరాగల గంభీరుడు.

'మన మేధకింత కాంతీ మన హృదయాని కింత శాంతీ కలిగించడానికి మన జీవన

విధానం తోడ్పడగలిగితే మనమంతా ధన్యులం'. వినయంతో అని ఆవిధంగా జీవన విధానం మలచుకున్నారు.

జీవితం సుఖదుఃఖాల మయం. ఆశానిరాశలకు ఆలవాలం. గెలుపూ-ఓటమి, పగలూ - రాత్రి లాగా వస్తూపోతూ ఉంటాయి. ప్రేమా, విషాదం చుట్టూరా కనబడుతూ ఉంటాయి. వీటన్నింటిలో శాంతి ఎట్లా?

'బాధని బోధ' చేసుకున్నప్పుడు మేధ కాంతివంతమవుతుంది. హృదయానికి శాంతి లభిస్తుంది. బాధ గాఢాంధకారం వంటిదవుతే ఆనందం అగ్గిపుల్ల గీచిన వెలుగు. బాధ దీర్ఘమైనదీ, ఆనందం క్షణికమైనది. ఎక్కువ సేపు ఉన్న బాధకన్నా తక్కువ సేపు ఉన్న ఆనందమే శాశ్వతమైనది. అభ్యాసం ద్వారా వివేచన ద్వారా ప్రయత్నం ద్వారా, సాహసం ద్వారా తక్కువ కాలం బాధ ఉండేటట్లూ ఎక్కువకాలం ఆనందం ఉండేటట్లు మానసాన్ని మలచుకోవచ్చు అని ఆయన అభిప్రాయం.

మనిషిలో మూడు ప్రధానమైన మానస శక్తులు ఉన్నాయి. ఒకటి ఆలోచనా శక్తి (Thought); రెండవది ఇచ్ఛాశక్తి (Will Power); మూడవది అనుభూతి శక్తి (Feeling), వీటిలో బలమైన శక్తి ఇచ్ఛాశక్తి. ఇచ్ఛాశక్తి మేల్కొనివుంటే మనిషి ఏదైనా సాధించగలడు. ఇచ్ఛాశక్తి సశక్తంగా ఉంటే మిగిలిన రెండూ శక్తులూ సక్రమంగా పనిచేయగలవు.

మానసం ఒక ముడి పదార్థం. ఇచ్ఛాశక్తి ప్రభావంతో దక్షతగల మానవజీవి దాన్ని తన ఇష్టమైన రూపంలోకి రూపాంతర పరచుకోవచ్చును. అటువంటి వ్యక్తి జీవనశిల్పి. జీవన శిల్పియే ఆనందజీవి.

ఒక్కొటొక్కటిగా ఇటుకలు పేర్చి కట్టడం కట్టినట్లుగా ఆలోచనలను క్రమ శ్రేణిలో పేర్చుతూ జీవన తత్వాన్ని నిర్మించుతారు సంజీవదేవ్.

మానవుని చింతనలో ప్రధానభాగం సత్యాన్ని తెలుసుకోవాలనే లక్ష్యంతో కొనసాగుతుంది. ఏది సత్యం, ఏది కాదు అని తెలుసుకోవడం ఎట్లా? ఇంద్రియాల ద్వారా సాధ్యమవుతుందా? కళ్ళకి కనిపించేది నిజమేనా? ఒక్కొక్కసారి ఎత్తు పల్లంగానూ, పల్లం సమతలంగానూ కనబడటం లేదూ? చేతితో తాకి చూస్తే తప్పు గ్రహించ లేకపోవచ్చును కూడా. నక్షత్రం చంద్రుని కంటే చిన్నదిగా కనబడుతుంది. అంతమాత్రాన అది సత్యమా? అద్వైతం ప్రపంచమంతా మాయ అని అంటుంది. అందుకు దృష్టాంతంగా రజ్జుసర్పభ్రాంతిని చూపుతుంది. ఈ మాయావాదం తిరుగులేని సత్యంకాదు అంటారు సంజీవదేవ్. అది

సాపేక్షిక సత్యం మాత్రమే అంటారు. తాడుని పాము అనుకోవడం భ్రాంతి సరే పాము అని అనుకోవడమనేది భ్రాంతిలో ఉన్నవాడికి, ఇతరులకు అది తాడు లాగానే కనబడుతున్నది. కొందరి దృష్టిలో అది పాము, కొందరి దృష్టిలో అది తాడు. తాడు అనుకుంటున్న వారి దృష్టిలో పాము లేదు. పాము అనుకుంటున్న వారి దృష్టిలో తాడు లేదు కాబట్టి ఒకే ఒకరి దృష్టిలో రెండూ ఉండటం అన్నది సాధ్యం కాదు అని తర్కిస్తారు. ఎవరి దృష్టి భ్రాంతి, ఎవరిది సత్యమనేది ఎట్లా నిర్ణయించడం? ఒకటి సత్యం అని నిర్ధారించినప్పుడే మరొకటి అసత్యం అని చెప్పగలుగుతాం. అందువల్ల మాయావాదం అనేది తిరుగులేని సత్యం కాదని సంజీవదేవ్ అంటున్నారు.

'సాగిపోతున్న ప్రతి క్షణం హృదయంలోనూ జీవనజ్వాల ప్రజ్వలిస్తూంటుంది' అన్న జెన్ ఆచార్యుల ప్రవచనంలోని నిత్య సత్యాన్ని ఆలంబనగా చేసుకొని తన జీవితం నడిపిస్తున్నారు సంజీవదేవ్ అనిపిస్తుంది. ఆ జ్వాలను అందుకోవడంలోనే మానవుడి లక్ష్యసిద్ధి దాగివుంది అని విశ్వసించినా, దానిని అందుకోవడంలో వైఫల్యం సంభవించినా ఆ వైఫల్యమే ఒక గొప్ప కార్యసిద్ధి అని భావించే వాస్తవవాది కూడా. అపజయాలనేవి మానవ జీవితంలో కాంతిరేఖలు'

'వ్యక్తి నిత్యజీవితంలో సుఖశాంతులతో జీవించాలంటే కంటికి కనిపించే భౌతిక రూపాలనూ, చెవికి వినిపించే వాటి రమణీయతను అనుభవించాలి. మొదటిది భౌతిక సౌందర్యం, రెండవది భావ సౌందర్యం. ఈ రెండు సమాన విలువగలవే'.

హృదయం రసమయంగా ఉంటే పచ్చని ఆకుల ఒడిలో ఒదిగిన తెల్లని మల్లె మొగ్గ కంటికి ఆహ్లాదాన్నివ్వడమే కాకుండా వినిపించని సంగీతం కూడా ప్రసారం చేస్తుంది. ఆకాశం సుగంధాలు వెదజల్లుతుంది. పాటలో ఇంద్రధనస్సులు ప్రత్యక్షం అవుతాయి. 'మనిషి తన వ్యావహారిక జీవితం నుండి దూరమ్మై పోనవసరంలేదు. వ్యవహారిక జగత్తునే రసజగత్తుగా అనుభవించాలి. కూలిపని చేసే కార్మికుడు మట్టిని త్రవ్వే తన గడ్డపలుగునే వీణగా చూడాలి. ఆ పలుగు చేసే ధ్వనిలోనే వీణారాగాన్ని వినాలి. అనురాగాన్ని గ్రోలాలి. అది గొప్ప రస జీవితం'.

'ఆనందం కొరకు ఏ బాహ్యా వస్తువు పైనా ఆధారపడకుండా అంతఃశక్తి పైనే ఆధారపడి ఆనందాన్ని అందుకోగల సాధన వుంది'. దీనికి మనసులోని ఆలోచనలను, భావనా స్రవంతులను పరిశీలించి, విశ్లేషించుకునే శక్తిని సాధించడం అవసరం. సాధారణంగా మనిషి తన కాలాన్ని ఈవిధంగా గడిపివేస్తూ ఉంటాడు. నిరీక్షణ, ఘటన, జ్ఞాపకం. కనపడని దాన్ని

చూడటం నిరీక్షణ అవుతే, కనపడుతున్న దానిని చూడటం ఘటన, కనపడి పోయిన దానిని చూడటం జ్ఞాపకం మొదటి దానిలో ఆతృత, రెండవదానిలో ఆవేశం, మూడవదానిలో ప్రశాంతి వుంటాయి అని అంటారు సంజీవదేవ్.

ఈ విధంగా మనసులో స్రవించే భావనలను ఒక పరిశీలకుని వలె దర్శించడం కృష్ణమూర్తి తత్వాన్ని సంజీవదేవ్ ఆకళింపు చేసుకున్న తీరును చూపిస్తుంది. అంతేకాదు,

'అసలైన అంతరార్థంలో జీవించడం అనేది ఆలోచించడానికంటే, అనుభూతి చెంద డానికంటే, సృజించడానికంటే మహత్తరమైనట్టి కష్టతరమైనట్టి ప్రతిభ'. అన్నప్పుడు కృ ష్ణమూర్తి తత్వసారాన్ని సంపూర్ణంగా అభివ్యక్తీకరించినట్లూ తోస్తుంది.

ఉద్వేగాలతోనే జీవించడం పాశవిక లక్షణం. ప్రేమ, దయ, కరుణ, సానుభూతి వంటి ఉన్నతమైన అనుభూతులను కలిగివుండటం మానవత్వపు సహజ లక్షణాలు. వివిధ ఇంద్రియాల ద్వారా మనస్సులో కలిగే అనుభూతులు విభిన్న రకాలకు చెందినవిగా ఉంటాయి.

రుచి, స్పర్శ, కలిగించేవి ఎక్కువ ఉద్వేగ పూరితమైనవి. దృష్టి, శ్రవణేంద్రియాల ద్వారా కలిగిన అనుభూతులను కళారూపంలో అభివ్యక్తీకరించడానికి సాధ్యమవుతుంది. నేను ఆలోచిస్తున్నాను. కాబట్టి నేను ఉన్నట్లు అంటాడు డెకార్ట్. మనసు చేసే ఈ ఆలోచనలన్నీ పాక్షికమైనవి మాత్రమే అనీ, మనసును అధిగమించి చూడగలిగిన శక్తి మనిషికి ఉన్నదనీ జిడ్డు కృష్ణమూర్తి అంటారు. సంజీవదేవ్ నేను జీవించి ఉన్నాను కాబట్టి నేను ఆలోచిస్తున్నాను అంటూ మనిషి అస్తిత్వంలో ఆలోచనకు ఉన్న స్థానం చాలా పెద్దది అంటారు. ఇది మానవుని ప్రత్యేకత. ఈ ఆలోచనకు ఉన్న స్థానం చాలా పెద్దది అంటారు. ఇది మానవుని ప్రత్యేకత. ఈ ఆలోచన ద్వారానే మానవుడు అత్యున్నత స్థాయిని అందుకోగలడు. ఎన్నో ఊహించి సృష్టించగలడు. చివరకు దైవాన్ని కూడా. మనిషి తనను తాను ఇంకా పూర్తిగా తెలుసుకోలేదనే అంటారు. సంజీవదేవ్. మనిషి పరిపూర్ణత్వాన్ని సాధించడానికి అనంతంగా ప్రయాణిస్తూనే ఉన్నాడని అంటారు. 'మార్గమే గమ్యం' అని కృష్ణమూర్తి అంటారు; సంజీవదేవ్ దృష్టిలో మనిషి లక్ష్యం మహోన్నత మానవత్వం.

ఆలోచనకు అందనిది ఏదీ లేదని అంటారు సంజీవదేవ్. ఇంద్రియాల ద్వారా తెలుసుకున్న వాటిని గురించి మాత్రమే మనసు ఆలోచించగలుగుతుందా? అతీంద్రియమైన కొన్ని శక్తులు ESP Instinct వంటివి ఉండటం అసత్యం కాదు, వాటిని గురించి మనిషి మేధ

ద్వారా ముందు ముందు ఇంకా వివరంగా తెలుసుకోబోతున్నాడని సంజీవదేవ్ విశ్వాసం మెదడులో పేర్చి పెట్టిన గత అనుభవాల స్మృతులు మొదలైనవి ఈ అతీంద్రియమని మనం అనుకుంటున్న శక్తులకు ప్రేరకమై ఉండవచ్చునా? మెదడులోని కణాలలో వంశపారం పర్యంగా వస్తూవున్న ముద్రలు, చిహ్నాల వంటివి ఆలోచనలను ఏవిదంగా రూపుదాల్చినవో అనేది 'బయోసింపనీ' పరిధిలోకి తీసుకొని రాదలుచుకోలేదు సంజీవదేవ్.

ప్రేమించడం కొరకే జీవితం అని వాదించే రొమాంటిసిస్టుల సిద్ధాంతం జీవితాన్ని ఒక సంకుచిత పరిధిలో బంధించినట్లు అనిపించినా బుద్ధుని నాటినుండి ఈ రోజు వరకూ ఆలోచనా శీలురందరూ 'ప్రేమించడమే' మానవుడిని ఉన్నతుడిని చేస్తుందని వక్కాణిస్తూనే ఉన్నారు.

సంజీవదేవ్‌కి జీవించడం అంటే ప్రేమించడమే. మళ్ళీ జీవించడాన్ని ఇట్లా నిర్వచిస్తున్నారు. తను జీవించడం మాత్రమే జీవించడం కాదు. ఇతర్లను జీవింపచేసినప్పుడే నిజంగా తను జీవించడం అవుతుంది అప్పుడే జీవించడం అంటే ప్రేమించడం అనే మాట నిజమవుతుంది. అని తను విశ్వసించడమే కాదు. ఆచరణలో కూడా చూపారు సంజీవదేవ్ ప్రతి మనిషికి జీవితం మీద ప్రేమ ఉంటుంది. కానీ ప్రేమగల జీవితం ప్రేమ కంటే గొప్పది ప్రేమగల జీవితం జీవించడమే అతని లక్ష్యం. అందులోనూ భౌతిక ప్రేమ, ఆత్మిక ప్రేమ రెండూ అవసరమే అని నమ్ముతారు

'ఈ వ్యవహార జగత్తులోని ఈర్ష్యలనూ, ద్వేషాలనూ, కుళ్ళునూ, క్రౌర్యాలనూ మరచి మానవులంతా ఏక కుటుంబంవారమని నమ్మి పరస్పరానురాగంతో కొంతసేపైనా ప్రేమించుకో గలిగితే వ్యక్తులకు ఎంత ఆనందమో, లోకానికి ఎంత కల్యాణమో' అనీ కలలు కంటారు

ప్రేమకి స్వేచ్ఛ ఊపిరి వంటిది. సమాజంలో వేళ్ళూనుకున్న ఆచారాలు, నియమాలు, నిబంధనలూ, కట్టుబాట్లు, సంకోచాలు వ్యక్తిని సంకుచితమైన బంధనాలలో బిగిస్తాయి. వీటిని అధిగమిస్తే తప్ప నిజమైన ప్రేమ స్వచ్ఛంగా ప్రకాశించదు. కీర్తి కాంక్ష, ధన సంపాదన, అధికార వ్యామోహం మొదలైనవెన్నో వ్యక్తికి వ్యక్తకీ మధ్య స్వచ్ఛమైన ప్రేమకు ఆటంకాలుగా నిలబడతాయి. అట్లాగే దాంపత్యంలో భార్యాభర్తల ప్రేమలో స్నేహానికి కూడా చోటున్నప్పుడే ఆ బాంధవ్యం మధురంగా వుంటుంది. కామంలో ఆసక్తి, విరక్తి రెండూ వుండటంవలన కామనాత్మకమైన ప్రేమ మాత్రమే దాంపత్యాన్ని సార్థకవంతంగా చేయలేదు.

'లోకంలో మైత్రికి మించిన వైచిత్రి లేదు. మైత్రికి మించిన మాధురి లేదు. మైత్రికి మించిన

పరిమళం లేదు'. ప్రేమ, మైత్రి రెండూ గాలి, నీరూ వలె జీవిత సుమాన్ని నవనవోన్మేషంగా కళకళలాడిస్తాయని సంజీవదేవ్ నమ్ముతారు. 'నా జీవిత లక్ష్యం మానవుణ్ణి ప్రేమించడం నేర్చుకోవడమే'.

స్థూలంగా చూస్తే మన దుఃఖాలకు కారణం మూడు అంశాలుగా తోస్తాయి. అందులో ఒకటి ఏమిటంటే మనకు ఇష్టమైనవి ఎప్పటికీ అట్లాగే కొనసాగాలనుకోవడం. అట్లా కొనసాగడం అసాధ్యం అని తెలుసు కాబట్టి ఎప్పుడు ఆగిపోతుందో అనే భయం. ఈ శాశ్వతంగా ఉండాలనే ప్రీతి నశిస్తే తప్ప విముక్తి లేదు అంటారు సంజీవదేవ్. 'అశాశ్వతం మీద భయం అంతరిస్తే జీవితం ఒక నిరాటంకమైన స్వచ్ఛందక్రీడ అవుతుంది. శాశ్వతం అనే వరకు భద్రత వుద్భవిస్తుంది. లోకంలోని శోకాలన్నింటికి మూలం భద్రతయే'.

రెండో అంశం మనిషి ఎదుర్కొనవలసిన అపజయాలు "Life's real greatness is in its incompleteness, in its imperfection, in its unfulfilled inspirations and in its repeated failures'. అని సంజీవదేవ్ సిద్ధాంతం.

మానవుడికి అపజయం అనేది లేదు. అపజయాలు అతని పెరుగుదలకు, అనుభవాలకు తోడ్పడతాయి. అతను జీవించి వుండటానికి అవి చిహ్నాలు. పడిపోయిన మానవుడు నూతనోత్సాహంతో తిరిగి లేచి నిలబడటంలోనే అతని మహత్వపూర్ణమైన శక్తి ఉన్నది ఓటమిని స్వీకరించడంలో గొప్ప సాహసం ఉన్నది. సమర్థులు జీవన పరీక్షలో ప్రతి క్షణం పెరిగినట్లే భావిస్తారు.

ఇక మూడవ అంశం మరణం. 'ఉత్తమంగా జీవించిన వారికి ఉత్తమంగా మరణించడం కూడా తెలుసు'. జీవితాన్ని కానీ, మరణాన్ని కానీ భయంతో ద్వేషంతో ఎదుర్కొనలేము. మనకి రెండూ ప్రియతమమైనవే అని గుర్తుంచుకోవాలి అని అంటూ చూడగలిగిన వారికి ఎడారిలోనూ, పచ్చిక బయలులోనూ కూడా సౌందర్యం కనబడుతుంది; అని చిత్రాన్ని గీసి చూపినట్లు చెప్పారు.

శరీరంలో జీవిస్తూనే శరీరాన్ని మరచి జీవించడం అభ్యసించిన వారికి నిజమైన ఆధ్యాత్మిక జీవనం కరతలమవుతుంది. మనిషి మరణాన్ని అధిగమించలేడు కానీ మరణ భయాన్ని, శోకాన్ని అధిగమించవచ్చును. బాధకు భయపడకుండా ఉండటం సాధించవచ్చును. ఐతే వెలుగు నీడల జగత్తులో నివసిస్తున్నన్నాళ్ళూ పూర్తిగా బాధనుంచి బయటపడటం జరగదని' కూడా సంజీవదేవ్ భావిస్తారు. వస్తువు లేనిదే నీడ ఉండనట్లే నీడ లేనిదే వస్తువు లేదు. వస్తువు ఎల్లప్పుడు దాని నీడతో కూడే ఉంటుంది. నీడ అనేది మాయ కాదు, భ్రమ కాదు. ఈ విధమైన హేతువుతో శోకాన్ని

ముఖాముఖంగా ఎదురుకోవడమే మన కర్తవ్యం. 'సంపూర్ణ సుఖంలో అనిబద్ధ స్వేచ్ఛలో ఉంటున్నట్లు నమ్మే వారికి కూడా విషాదఛాయలు ఉంటూనే ఉంటాయి'. గౌతముడు సుజాతకి ఉపదేశించినట్లు దుఃఖోపశమనానికి ఆయన చూపిన మార్గం అనుసరించి వేదనను వాడిన పొగడపూల దండగా మార్చి ధరించి జీవనయానాన్ని సాగిస్తున్నవారు ఉన్నారు.

వస్తువుకు ఛాయ ఉన్నట్లే, జీవితాన్ని వస్తువగా తీసుకుంటే లోకం దాని చాయ. లోకం అనేది వస్తువు కింద తీసుకుంటే దాని చాయలు అస్తిత్వం అనే మహాసముద్రం పైన పరచుకొని ఉంటాయి. అస్తిత్వం అంటే ప్రత్యక్ష ప్రపంచంలో ఉన్నదీ, ఆవలగా ఉన్న అస్తిత్వమూ అని వివరిస్తారు. దీనిని తెలుసుకోవడానికి మానవుడు తన అంతర్జగత్తులోనే వున్న వూర్ధ్వచేతనను అందుకోవాలి. అది నీడల్లేని మహా తేజస్సు. విషాదం లేని విశుద్ధానందం అంటారు సంజీవదేవ్.

అసలు మనసు అంటే ఏమిటి? మెదడూ, మనసూ ఒకటేనా అనే ప్రశ్న జటిలమైనది సంజీవదేవ్ ఆలోచన ఈ విషయంలో ఇట్లా ఉంటుంది. మెదడు ఒక జీవాంగం. ప్రాణంతో ఉన్న, అత్యంత సున్నితమైన, రకరకాల సహజ ధర్మాలు గల కణాలతో కూడిన ఒక జీవాంగం. మెదడు ఒక జనరేటర్ వంటిది అనవచ్చు. ఆ జనరేటర్‌లో జనించిన విద్యుచ్ఛక్తి వంటిది మనసు. మెదడులో పన్నెండు వందలకోట్ల నాడీకణాలు ఉంటాయి ఇటువంటి మెదడులో ఉద్భవించినది మనసు. ఈ మనసులో పుట్టినవే అనుభూతులు, ఆలోచనలు, ఊహలు, కోరికలు మొదలైనవి. ఐతే భౌతికమైన ఒక అవయవం, రూపంలేని అంటే నైరూప్యమైన అనుభూతులను, ఆలోచనలను ఎట్లా సృష్టించ గలుగుతున్నది? ఇవి భౌతికమైనవి. అవి అభౌతికమైనవి అనే స్పష్టమైన విభజన అనేది లేదు. మెదడులోని ఒక భాగమైన 'సెరిబ్రమ్'లో పుట్టిన అనుభూతిని భౌతికమైన పదార్థం అని అనడానికి అభ్యంతరం ఉండకూడదంటారు సంజీవదేవ్. పదార్థం, మనసు, మనసుకు అతీతమైనది లేక ఉన్నత మానసం – ఇవన్నీ చైతన్యం లోని వివిధ దశలుగా వర్ణిస్తారు. రకరకాల ప్రక్రియల ప్రభావాల కారణంగా ఈ వివిధ దశలు ఏర్పడుతున్నాయని అంటారు.

మనసుకు మొట్టమొదట కలిగిన అనుభూతి, ఆలోచన. అంటే మనసుకు ప్రధానమైనది, తద్వారా జీవితానికి ప్రాణప్రదమైనది అనుభూతి. ఈ అనుభూతులే మానవునిలో సృ జనాత్మకతకూ, రసజ్ఞతకూ కారణభూతమౌతున్నాయి. ఇవి లేనినాడు మానవ జీవితం నిస్సారమవుతుంది.

ఇక మానవుని అంతర్జగత్తులో ఉంటాయి అచేతన (Unconscious), అవచేతన (Sub-conconscious), చేతన (Conscious), వూర్ధ్వచేతన (Super Conscious) ఊర్ధ్వచేతనను

అందుకోవడంలో సఫలీకృతుడవుతాడు సంపూర్ణ మానవుడు. ఊర్ధ్వచేతన అంటే నీడలేని మహాతేజస్సు, విషాదం లేని విశుద్ధానందం. అది సగం రసమయం, సగం హేతుమయం. ఈ మహా తేజస్సును అందుకోవడానికే సాధన. సాధన సాధారణ ప్రయోగాలతో కూడుకొని ఉండటమే కాకుండా కొంత అతీంద్రియ అనుభూతులతోను, అనుభవాలతోను సంపాదించిన జ్ఞానం కూడా అయివుండవచ్చును. ఐతే అతీంద్రియ సాధనలతో ఆనందాన్ని అన్వేషిస్తూ, విముక్తుడైన వ్యక్తిలో స్వార్థం ఉండదా; స్వీయ విమోచన కొరకు, సాఫల్యం కొరకేగా అతని తపస్సు? అని ప్రశ్నించే వారికి సంజీవదేవ్ సమాధానం సిద్ధంగా ఉంచుకున్నారు.

గౌతముడు బోధిసత్వుడయాక చేసినదేమిటి? తోటి మానవులందరనూ ఆ దివ్యానంద పథం వైపుగా మార్గనిర్దేశం చేయలేదా? ఉత్తమ మానవుడు మానవ సమాజం అంతటినీ తన వెంట నడిపించి లేమి, దుఃఖం నిర్మూలించి శాశ్వతానంద ప్రతిష్ఠ చేసి కళ్యాణ ప్రదమైన నూతన లోకానికి ఆహ్వానిస్తాడు.

జ్ఞానసిద్ధి, విమోచన, ఊర్ధ్వచేతన అందుకోవడం – వీటన్నింటికి ఒకటే అర్థం. ఇవన్నీ సంపూర్ణ మానవుని స్వభావ గుణాలే. ఇటువంటి వారితో కూడుకున్న భావి సమాజపు తీరునే సైకో హ్యూమనిజం అన్నారు సంజీవదేవ్.

ప్రస్తుతం మనం ఏవైతే మానవత్వపు విలువలు అనుకుంటున్నామో అవన్నీ సైకో హ్యూమనిజంలో కూడా ప్రాముఖ్యం కలిగి ఉంటాయి. వాటితో పాటుగా మనిషి అంతర్ జీవితానికి కూడా ప్రాధాన్యం ఉంటుంది. భౌతిక జీవనం ఎంత ప్రధానమో మనిషి ఆత్మిక జీవనం కూడా అంతే. ఆధ్యాత్మిక, తాత్విక, రసమయ అనుభూతులకు, ఆలోచనలకు తగిన స్థానం ఉంటుంది. వీటన్నింటినీ సమన్వయపరచిన సంపూర్ణ తత్వమే అతని వ్యక్తిత్వం.

మనిషి శరీరంలోని కణ కణాన్ని ప్రాణశక్తితో నడిపించేది చేతన. మనిషి భౌతిక జీవనాన్ని నడిపించేది చేతన. మనిషి వేదననూ, హృదయగత అనుభూతులనూ పాలించేది చేతన. అటువంటి చేతనలోని అడుగు పొరలైన అవచేతననూ అచేతననూ మానసిక శాస్త్రం విశ్లేషించి చూపిందే తప్ప మానవుని చేతనలోని పై పొరలలో ఉన్న వూర్ధ్వచేతనను గురించి సక్రమ పరిశీలన జరగనే లేదు. సైకో హ్యూమనిజం మనిషి వూర్ధ్వచేతన ద్వారా అందుకోగలిగిన ఔన్నత్యం గ్రహిస్తుంది.

ఇటువంటి సమాజం పాన్ హ్యూమన్ సంస్కృతి (Pan human culture) ని స్థాపించి నప్పుడు, ప్రపంచమంతా ఒకే మానవజాతిగా విలసిల్లి విశ్వశాంతి, సౌహార్ద్యము, సౌభ్రాతృ

త్వము వికసిస్తాయి. అటువంటి సమాజంగా మానవజాతి పరిణతి సాధించగలదు అని గాఢంగా విశ్వసిస్తున్నారు సంజీవదేవ్.

ఒక్క విజ్ఞాన సముపార్జనే జీవితలక్ష్యంగా ఉండటం వలన సంపూర్ణత్వం సిద్ధించదు అజ్ఞాని ఎంత అంధకారంలో ఉంటాడో విపరీతమైన జ్ఞానాభిలాష మనిషిని అంతటి అంధకారంలోనూ ముంచేస్తుంది బెట్రాండ్ రసెల్ తన లక్ష్యంగా పెట్టుకున్న మూడు అంశాలు ఆమోదయోగ్యమైనవని సంజీవదేవ్ సూచిస్తారు. 'ప్రేమకై తీవ్రాభిలాష, జ్ఞానాన్వేషణ, మానవాళి పడే వేదన ఎడల అపరిమిత సానుభూతి' అవి మూడూనని చెప్పుకుంటాడు రసెల్. ఇవి మూడూ సత్యం, శివం, సుందరం కోసం మనిషి చేసే అన్వేషణ తెలుపుతాయి. సౌందర్యారాధన లేక రసజ్ఞతే, సత్యాన్వేషణ, ప్రజల శ్రేయోభిలాష – ఇవే అవి.

రవీంద్రుడు అంటాడు 'ఈ ప్రపంచోత్సవానికి నాకు ఆహ్వానం వచ్చింది. నా బ్రతుకు సఫలమైంది నా కళ్ళు చూశాయి. నా చెవులు విన్నాయి. ఈ ఉత్సవంలో నా వాయిద్యం వాయించడం నా వంతు. నా శాయశక్తులా నా విధిని నెరవేర్చుకున్నాను'.

(రచయిత్రి – **శ్రీమతి సరోజినీ ప్రేమ్‌చంద్** చెన్నైలో వుంటారు.)

# సంజీవదేవ్ జీవన సరాగం

– ఏటుకూరి బలరామమూర్తి

సౌందర్య శాస్త్రంలోను, రసశాస్త్రంలోను, చిత్రలేఖనంలోను తనదంటూ ఒక ప్రత్యేకమైన పద్ధతిని ఏర్పరచుకొని ఆయా శాస్త్రాల అభివృద్ధికై నిరంతరం కృషి చేస్తున్న జీవశిల్పి డాక్టర్ సంజీవదేవ్. వివేకానంద స్వామి రచలన చేతను, జిడ్డు కృష్ణమూర్తి రచనల చేతను ఈయన ప్రభావితుడైనాడు. ఆయన రచనల్లో 'Biosymphony' అనే గ్రంథం చాలా రసవత్తరమైనది. మానవుని జీవన ఆవిర్భావాన్ని గురించి అనేక శాస్త్రాల్లో చెప్పిన విషయాలను ఒక సమగ్రమైన దృష్టిలో ఆకళింపు చేసుకొని, తనదైన ధోరణిలో ఆ భావాలను తిరిగి స్పష్టం చేసినాడు.

మనకు తెలిసి జరిగే సమస్తమైన క్రియలకు, తెలియకుండా జరిగే క్రియలకు, ఈ విశ్వాన్నంతా ఒక క్రమమైన పద్ధతిలో జరిపించే ప్రక్రియకు ఏదో మహత్తరమైన 'సూత్రం' ఒకటి ఉంటుందని వేదకాలం నాటి ఋషులు భావించారు. దాన్ని వారు 'ఋత' అని అన్నారు. అందుకే 'ఋతం వదిష్యామి' 'సత్యం వదిష్యామి' అనే సూక్తులు అను వాక్యాలుగా నేటికి కూడా ఆచరణలో ఉన్నాయి. 'ఋత'లో ఏదైనా లయయుతమైన సంగీతం ఉన్నదో లేదో మనకు తెలియదు. కాని సామవేదాన్ని అధ్యయనం చేయడానికి కావలసిన రాగాలను నిర్మించడం జరిగింది. కాలక్రమేణ ఈ రాగాలను కూడా ఒక రకమైన పదార్థాలుగా భావించి వాటిని కూడా ఆదరించి, గౌరవించి, పూజనీయమైనవిగా భావించడం జరిగింది. ఈ రాగాలాపనల నుంచి ఒక వెయ్యి సంవత్సరాల తర్వాత గాంధర్వ విద్య ఉద్భవించింది. గాంధర్వ విద్య, నాట్య శాస్త్రం, పరస్పరం ఆధారపడి అభివృద్ధి చెందినాయి.

ఈ విధంగా భరతుని నాట్యశాస్త్రం అభివృద్ధి చెందింది. ఆధునిక కవి ఒకరు ఈ విషయాన్నంతా ఈ విధంగా చెప్పినాడు -

'అవధరింతువు ప్రతి దివనాంతమందు
నిత్యనూతన తాండవ నృత్యకేళి
ఓయ్ నటరాజ, తలలైన ఊపలేక
భవనములు నిర్భరానందమున మునగంగ'

అసలు నటరాజమూర్తి స్వరూపాన్నే ఈ విశ్వంగా భావించడం జరిగింది.

అందుకే అభినయ దర్పణకర్త నందికేశ్వరుడు అంటాడు -
'ఆంగికం భువనం యస్య
వాచికం సర్వ వాఙ్మయం
ఆహార్యం చంద్రతారాది
తం వందే సాత్వికం శివం'

ఈ విధంగా సంగీతం, నాట్యం విశ్వంలోని కాలగతిని, గతిని, పరిభ్రమణాన్ని సూచించే విద్యలు గాను, వేదాల్లో చెప్పబడిన విశ్వక్రమాన్ని తెలిపే విద్యలుగాను గుర్తించాయి. ఈ విషయాలను అంగీకరిస్తూ, తన 'బయోసింఫనీ' గ్రంథంలో కొన్ని మార్పులను ప్రవేశపెట్టారు సంజీవదేవ్. ప్రాణం కంటే పదార్థం ఉనికి ముందుగానే ఉన్నదని, పదార్థంలో నుంచే ఆలోచనంతా వచ్చిందని చెబుతారు. ఈ భావం సాత్రే చెప్పిన భావానికి దగ్గరగా ఉంది. భౌతిక పదార్థానికి, మనస్సుకు మధ్య జీవం ఉంటుంది. భౌతిక పదార్థంలో నుంచి జీవం ఉత్పన్నమవుతుంది. జీవం రెండు రకాలుగా భాసిస్తుంది. 1. భౌతికంగాను, 2. చైతన్యంగాను. అది భౌతిక పదార్థంలో నుంచి వచ్చింది కనుక అది భౌతికంగా ఉంటుంది. అది మనస్సుకు ఆధారభూతం కనుక అది చైతన్యంగా ఉంటుంది. ఈ రెండూ దాని లక్షణాలు. అందుకే ఐతరీయ ఉపనిషత్ ఈ విధంగా ప్రశ్నిస్తుంది.

'కథం అసతః సజ్జీయతే'

సత్త పదార్థం అసత్త పదార్థంలో నుంచి వస్తుందా? లేక అసత్తు సత్ పదార్థంలో నుంచి వస్తుందా? అసత్తులో నుంచే సత్త పదార్థం వస్తుంది. సత్త అసత్తలో సూక్ష్మాంకురంగా ఉంటుంది. దేశకాల పరిస్థితులు అనుకూలించినపుడు అది బహిర్గతమవుతుంది. దానికి మరొక కారణం అనవసరం. ఈ భావాలను సాంఖ్య దర్శనకర్త కపిల మహర్షి ప్రోక్తమైన సంఖ్యా సూత్రాల్లో మనం

చూడవచ్చు. సత్వ, రజస్సు, తమస్సు – అనే గుణాల కలయిక వలన ఈ విశ్వం పరిణతి చెందుతూ ఉంటుంది. ఈ మూడు గుణాలు సామాన్య స్థితిలో ఉన్నప్పుడు విశ్వంలో ఏ విధమైన మార్పు ఉండదు. కాని ఈ త్రిగుణాల్లో అస్తవ్యస్థ స్థితి ఏర్పడ్డప్పుడు మహత్ బుద్ధి, అహంకారం, మనస్సు పంచ జ్ఞానేంద్రియాలు, పంచ కర్మేంద్రియాలు, పంచ మహాభూతాలు, పంచ తన్మాత్రలు పరిణామ క్రమంలో ఏర్పడుతాయి.

భౌతిక పదార్థం ఎప్పుడైనా నిశ్చలస్థితిలో ఉంటుందా? ఉండదు. అది ఎల్లప్పుడూ మారుతూనే ఉంటుంది. గతి, స్థితి – ఈ రెండూ ప్రకృతి ధర్మాలు. కనుక సామ్యం, అసామ్యం లేక సమానత, అసమానత అనేవి సాపేక్ష భావాలు. సాంఖ్య దర్శనంలో రెండు శాఖలు ఉన్నాయి. 1. నిరీశ్వర సాంఖ్య దర్శనం, 2. సేశ్వర సాంఖ్య దర్శనం. మొదటి దానిలో భగవంతునికి తావులేదు. భౌతిక పదార్థం అన్నింటికంటే ముందున్నది. జీవం, చైతన్యం తర్వాత వచ్చినాయి. సేశ్వర సాంఖ్య దర్శనం భగవంతుని అంగీకరిస్తుంది. ఇందులో భౌతిక పదార్థం, జీవం, చైతన్యం సమంగా ఉత్పన్నమైనాయి. వీటికి సమాన స్థితిగతి ఉన్నది. 'పురుష సన్నిధి మాత్రేన ప్రకృతి ప్రవర్తతే' అని అంటాడు సాంఖ్యకారిక రచయితయైన ఈశ్వర కృష్ణుడు. మత సంబంధంగా శైవ వైష్ణవ సాంప్రదాయాలను సమ్మిళితం చేస్తుంది సాంఖ్యదర్శనం.

ఈ విషయమంతా కార్యకారణ సంబంధం దృష్ట్యా చూస్తే సాంఖ్యదర్శనం. సత్కార్య వాదాన్ని అంగీకరిస్తారు. చార్వాకులు అసత్కార్య వాదాన్ని అంగీకరిస్తారు. హేతుబద్ధంగా చెప్పబడిన ఈ వాదాలన్నీ మతవాదం ముందు అణగారిపోయినాయి. చార్వాక వాదాన్ని నిరశించడం జరిగింది. సాంఖ్యదర్శన వాదాన్ని అస్తవ్యస్తం చేయడం జరిగింది. న్యాయదర్శనం మతవాదంతో రాజీపడింది. ఈ విషయాలు ఎందుకు చెప్పటం జరిగిందంటే మతవాదం ముందు తాత్త్వక ఆలోచన మరుగున పడిపోయిందనే విషయాన్ని గుర్తుచేయడం కోసం మాత్రమే.

మానవుని మేధస్సు ప్రతి విషయాన్ని గురించి తరచి తరచి ప్రశ్నించి సహేతుకంగా తెలుసుకోవాలనుకొంటుంది. ఆ ప్రయత్నంలో మానవ మనస్సు వేసే ప్రశ్నలన్నింటికీ సమాధానం చెప్పే స్థితికి మానవ మేధస్సు పెరుగలేదు. అటువంటి ప్రశ్నలను అవానకృత ప్రశ్నలన్నాడు బుద్ధుడు. అందుకే కొన్ని ప్రశ్నలకు తనకు సమాధానం తెలియదన్నాడు. కాని అద్వైత వేదాంతం అట్లాకాదు. జ్ఞానికి అన్నీ తెలుస్తాయని చెబుతూ మత మౌఢ్యానికి తల వొగ్గింది. గత చరిత్రనుండి ముఖ్యంగా మనం తెలుసుకోవల్సిన విషయం ఒకటి ఉన్నది. మానవుని ఆలోచన సరళమైన మార్గాన వెళుతున్నదా? లేక తప్పు త్రోవన పడుతున్నదా? ఈ విధంగా ప్రశ్నించుకొంటుంటే కొంత మేరకు అభివృద్ధిని సాధించవచ్చు.

డాక్టర్ సంజీవదేవ్ విషయానికి వస్తే, ఆయన దృష్టిలో ఇతర గ్రహాల్లో ప్రాణమే కాకుండా బుద్ధి కూడా ఉంటుందంటాడు. జీవం, బుద్ధి ఒకటి కాదు. జీవమంతా ప్రాణం కాదు కాని, ప్రాణమంతా జీవమేనట. కాని యదార్థంగా ఆలోచించి చూస్తే ఇది కొంత మటుకు సంశయించదగ్గ విషయమే. ఎందుకంటే ఇతర గ్రహాల్లో ప్రాణముందో లేదో తెలియని సంక్లిష్ట పరిస్థితిలో పరిశోధన అంతా ఉంటే అక్కడ జీవం ఉన్నదని, బుద్ధి కూడా ఉన్నదని చెప్పటం అంతగా వైజ్ఞానిక దృష్టితో చెప్పిన విషయంగా గోచరించదు. అంతేగాకుండా, భౌతిక పదార్థం, జీవం, మనస్సు, అధిబుద్ధి, అన్నీ కూడా చైతన్యం అనేక రూపాంతరాలంటాడు. అసలు అధిబుద్ధి, అంటే ఏమిటి? అది ఆత్మా? శరీరం పతనం చెందిన తర్వాత కూడా అది ఉంటుందా? ఈ శబ్దాలను సరిగ్గా అర్థం చేసుకోవాలంటాడు. ఇవన్నీ ఆధ్యాత్మికతతో కూడి లేవు. ఇవి పరలోక సంబంధిత పదాలు కావు.

సృష్టికర్తయైన భగవంతుడు ఉన్నాడని సంజీవదేవ్ అంగీకరించడు. జన్మజరా మరణాదులు లేని ఆత్మలో ఆయనకు విశ్వాసం లేదు. కాని మనం జీవించి ఉండగానే, కొన్ని సమయాల్లో ఆత్మ శరీరాన్ని వదిలివేసి, మళ్ళీ తిరిగి శరీరంలో ప్రవేశిస్తుందా అనే ప్రశ్నకు ఆయన వద్ద సమాధానం లేదు. ఉన్నా నిశ్శంసయంగా చెప్పలేమంటాడు. కాని కొందరు అటువంటి అనుభూతిని పొందుతున్నామని చెబుతారు అటువంటి అధిమానసిక విషయాలు ఇంకా పరిశోధనా పరిధిలోనే ఉన్నవి. సహజ ధోరణిలో చూస్తే ఈ విషయాలన్నీ చాలా అసంబద్ధంగా కనిపిస్తాయి.

**'యావంతః లోకః తావతః దేహః'**

ఈ లోకంలో, ఈ విశ్వంలో ఏదైతే ఉన్నదో, అది మానవ దేహంలో ఉన్నది. అందువలన ఈ విశ్వవిపంచీ నాదం ప్రతి శరీరంలోను ప్రతిధ్వనిస్తుంటుంది.

## రసశాస్త్రం - తత్త్వశాస్త్రం

'రసరేఖలు' అనే గ్రంథంలో డాక్టర్ సంజీవదేవ్ తన భావాలను స్పష్టంగా చెప్పినాడు. చిత్రలేఖన ద్వారా, ఉపన్యాసాల ద్వారా, లేఖల ద్వారా తన రసభావాలను ఆయన స్పష్టం చేసినాడు. ప్రతిమాచిత్రం ప్రతిబింబం లాంటిది. చిత్రలేఖనం సృజనాత్మకమైనది. కెమేరాను మార్చడం వలన ప్రతిబింబంలో మార్పు వస్తుంది. కెమేరాను నడిపే వ్యక్తి ప్రతిభను బట్టి ప్రతిబింబంలో అనేకమైన అద్భుతాలను చూపగలరు. కవి, చిత్రలేఖకుడు - ఇద్దరూ సృజనాత్మకులే. కాని వారి పద్ధతులు వేరు. చిత్రకారుడూ ఎక్కువగా బాహ్య ప్రపంచం మీద

ఆధారపడతాడు. కవి అంతర్గతమైన బాహ్య ప్రపంచం మీద ఆధారపడతాడు. బాహ్యజగత్తులో నుంచి గ్రహించిన విషయాన్ని అంతర్బుద్ధితో సమ్మేళవించి కావ్య వస్తువును, కావ్య శిల్పాన్ని, కావ్య తత్త్వాన్ని రూపొందిస్తున్నాడు కవి. అట్లా నిర్మింపబడిన కావ్యాన్ని చదివిన ప్రతివారికి రసానుభూతి కలుగుతుంది. ఈ రసజగత్తులోని ఆనందం అతీతం. సంస్కృతి, తర్కము, నీతి, రసము అన్ని సమ్మిళితమైనపుడు జీవన జ్యోతిలో కొత్త వెలుగు కన్పిస్తుంది. కరుణ, సంస్కారం, మానవతా దృక్పథంతో కూడిందీ సంజీవదేవ్ తాత్త్విక సందేశం. జాతీయవాదాన్ని అంతర్జాతీయతగా మార్చగలిగింది. మానవతా దృక్పథాన్ని మానవాతీత దృక్పథంగా మార్చ గలిగింది సంస్కృతి. మిత్రత, సఖ్యత, సహోదరత, అనేవి కేవలం మాటలు కావు. అవి మన చర్యలను ఆదేశించే సూత్రాలు, విశ్లేషణ, సమన్వయం, ఈ రెండూ ఆయన రచనలో కనిపిస్తాయి. వస్తుగతమైన ప్రపంచం నిమిత్తం లేకుండగనే రసోత్పత్తి జరుగుతుంది. ఇంద్రధనుస్సును చూచి మనం ఆనందిస్తాం. మంచినీరు త్రాగగానే మన దప్పిక తీరిపోయి ఆహ్లాదం కలుగుతుంది. ఈ విధంగా వస్తు ప్రపంచానికి, ఆత్మ ప్రపంచానికి సంబంధం ఉంటుంది. ఐతే ఇదంతా బాగానే ఉన్నది. కాని ఇక్కడే ఆయన పొరపడ్డాడు. జీవితతత్త్వాన్ని గురించి ఆయన చేసిన వ్యాఖ్య సరైనది అనుకోను. జీవం లేకుండా జగత్తు ఉత్పత్తి కాదంటాడు. కాని ఇది వైజ్ఞానిక దృక్పథం ముందు నిలబడలేదు. ఇటువంటి పొరపాటు భావవాదులందరూ చేస్తారు. ఉపనిషత్తుల కాలం నుంచీ జీవం ముందు ఉన్నదని, ఆ తర్వాత భౌతిక పదార్థం ఏర్పడిందనే భావం ప్రబలంగా ఉంది. భావవాదమంటే నాకు నిరసన లేదు. కాని వారు జీవాన్ని ప్రాథమికాంశంగా తీసుకొని చెప్పే సిద్ధాంతమంటే నాకు అంతగా గిట్టదు. ఎందుకంటే ఈ సృష్టి అంతా ఏదో ఒక పరమ ప్రయోజన సిద్ధికై ఉన్నదని, ఆ ప్రయోజనం వెనుక దాన్ని అందించే సృష్టికర్త, ఒకరు ఉన్నారని భావవాదం చెబుతుంది. ఆ విధంగా భావవాదం మతంలోనికి పోయి, భగవంతుని అంగీకరిస్తుంది. అంత మాత్రాన నాకు భావవాదులంటే అభిమానం లేకపోలేదు.

స్థితప్రజ్ఞుని స్థితి అన్ని స్థితులకంటే గొప్పది. శ్రీ సంజీవదేవ్ సంస్కృతి ద్వారా, చిత్రలేఖనం ద్వారా, ప్రకృతి సౌందర్యోపాసన ద్వారా ఇటువంటి స్థితిని పొందవచ్చంటాడు.

(రచయిత – ఏటుకూరి బలరామమూర్తి
చరిత్ర పరిశోధకులు, విశాలాంధ్ర సంపాదక మండలి సభ్యులు, విజయవాడ.)

# సంజీవదేవ్ చిత్రకళాభిజ్ఞత

*-కొండపర్తి శేషగిరిరావు*

సంయమన మనస్వియైన సంజీవదేవ్ మూడు దశాబ్దాలకు పైగా చిత్రకళా జగత్తులో రూపరచనా, అంతకన్నా ఎక్కువగా రంగుల గచనలూ చేశారు.

సంజీవదేవ్ కళా సమీక్ష నుండి సంయమన తత్త్వంతో సాధనలోకి ప్రవేశించి చిత్రకారులుగా రూపొందారు. అందుకనే వారి చిత్రకళలో శుద్ధ చిత్రకారుల తత్త్వం ఉన్నది. శుద్ధ సమీక్షాకారుల తత్త్వం ఉన్నది. ఈ రెంటినీ దాటిన సంయమన పరిజ్ఞానమూ ఉన్నది.

సంజీవదేవ్ గారి చిత్రాలను పరిశీలిస్తే - సంజీవదేవ్‌గారి చిత్రాలలో రూపం నిమిత్తమాత్రంగా ఉంటే, రంగు ప్రధానంగానూ, రూప చిత్రం తీరు భావానుబంధంగానూ ఉంటుంది. ఆయన వర్ణ రచన సర్వస్వతంత్రంగా ఉంటుంది.

ఆయన సాధారణంగా రూపాలకు రంగులను దిద్దరు. ఆయన చిత్రాలలో రంగులు రూపాలను దిద్దుకొంటాయి. భావనలోని రూపాలను బట్టే వారి చిత్రాలలో రంగులు పాకుతుంటాయి, లేక పూయబడుతుంటాయి.

చిత్రకళా ప్రవీణులైన చిత్రకారులు డ్రాయింగు వేయకుండా నేరుగా కుంచెనే పెన్సిలుగానూ కుంచెగానూ ఉపయోగించి చిత్రాలు వేస్తారు. అలానే సంజీవదేవ్ నేరుగా చిత్రాలను చిత్రిస్తారు. ఇది ఎలా వీరికి అబ్బింది? ఈ స్థాయికి ఎలా చేరుకోగలిగారు? అని పరిశీలిస్తే చిత్రకళలో గల రూప పరిజ్ఞానం, రంగు పరిజ్ఞానం, పరికర పరిజ్ఞానం అన్నవి అన్నీ వీరు చిత్రాలు గీయటానికి రెండు దశాబ్దాల ముందునుండే వీరిలో చొరబడి జీర్ణమైనాయి. కాకపోతే అప్పుడు అవి అక్షర

రూపం దాల్చి వ్యాసాల రూపంలో వ్యక్తమౌతూ వచ్చాయి. ఇప్పుడు అవి అసలైన చిత్రకళా రూపంలో వ్యక్తమౌతూ వచ్చాయి. అందుకనే సంజీవదేవ్ నేరుగా కుంచెతో చిత్రాలను చిత్రించగలిగే స్థాయిని అందుకోగలిగారు.

ఇంత బలమైన పరిజ్ఞానాన్ని సంతరించుకోటానికి, దేవ్ జీవన గమనం ప్రసిద్ధ చిత్రకారులైన నికొలస్ రోరిక్ హసిత్ కుమార్ హల్దార్‌ల రూప నిర్మాణ కర్మాగారంతోను, రంగుల మిశ్రమ పరిశోధనాశాలతోను అనుమేళవింపబడి ఉండటమే కారణం.

అయితే, సంజీవదేవ్ ఎప్పుడూ ఎవరి వద్దా చిత్రకళా శిక్షణను పొందలేదు. వారి చిత్రకళా జ్ఞానం దర్శన సంచితమే కానీ శిక్షణా సంచితం కాదు.

ఇక్కడ ఓ విచిత్రమైన మర్మము దాగి ఉన్నది.

చిత్రకళలలోని చిత్రకళా రచనలోని సాంకేతికాంశాలు ఓ ప్రక్క సంజీవదేవ్‌లో జీర్ణ మౌతున్న సమయంలోనే, వారు పర్యటనలు చేస్తుండటం జరిగేది. అది ఆయన సంతరించు కున్న పరిజ్ఞానానికి ప్రేరణాత్మకమూ అయింది. ఆ పర్యటనలు అందమైన దృశ్య ప్రకృతులను ప్రాకృతిక చిత్రాలుగా వివిధ ఫ్రేముల్లోనుంచి సంజీవదేవ్‌కు అందివ్వటం జరిగింది. ఇది అంతా వారి రస జగత్తులో చిత్రాలు రంగు పూవుల్లా పూయటానికి తోడుపడ్డాయి. సంజీవదేవ్ చిత్రకారులు అవటానికి చిత్రకళలో పరిజ్ఞానమూ, పర్యటనలూ సమకాలీనాలు అవటమే ముఖ్యమైన కారణము.

సంజీవదేవ్ యొక్క చిత్రాలు మొదట్లో ప్రయత్నపూర్వక రూపరచనను కలిగి ఉండేవి. రూపాలకు రంగులను వేయటం కూడా కాంతివంతంగా సామాన్యమైన కంటిని ఆకట్టుకొనే విధంగా ఉండేవి. అప్పటికి వారి చిత్రాలలో రూపం పూర్తిగా నైరూప్యం అవలేదు. కాకపోతే చిత్రంలోని రూపరచనా, వర్ణరచనా ఆధునిక చిత్రరచనా విధానంలో ఉండేది. శ్రీ దేవ్‌కు మొదటినుంచి వాస్తవ, అధివాస్తవ చిత్రకాంశాలమీద పాక్షికమైన దృష్టి లేకపోవటంలో సమదృష్టి ఉండటంతో, ఇవి రెండూ సమతుల్యతతో ఆయన చిత్రాలలో చోటు చేసుకున్నాయి. అందుకని ఆయన చిత్రాలు, దృష్టికి కొంత సారూప్యంగాను, భావానికి, రచనా రీతికి నైరూప్య రీతిని కలిగి ఉండేవి, వారు మొదటి నుంచి స్వతంత్ర సత్తాను అధికంగా ప్రేమిస్తూ ఉండటంతో, ఆయనలోని ఆలోచనా ధోరణులూ, అన్వేషణారీతులూ, శైలీ స్వేచ్ఛాయుతంగా ఉండటంతో, చిత్రకళలోనూ అలాగే స్వేచ్ఛాయుతంగా సృజనము చేస్తూ వచ్చారు ఆయన.

సంజీవదేవ్ చిత్రరచనా సంచయంలో అర్ధ నైరూప్య చిత్రాలతో బాటు శుద్ధనైరూప్య చిత్రాలూ ఉన్నాయి. ఆ శుద్ధ నైరూప్య చిత్రాలను చూస్తూ ఉంటే, సారూప్య చిత్రణలో

పండిపోయి నైరూప్య చిత్రణలోకి వచ్చి ఎలాంటి బావపాండిత్యంతో, రచనా పాండిత్యంతో, చిత్రకారులు, చిత్రాలను చిత్రిస్తారో అలాంటి స్థాయితో సంజీవదేవ్ నైరూప్య చిత్రాలు ఉంటాయి

ఈ చిత్రకారుడు రూపరచనకు భూమికగా ఈ పదార్థం వాడవచ్చు ఈ పదార్థం వాడకూడదు అనే నియమం లేకుండా వాడతారు. అలానే కుంచెకన్నా ప్యాలెట్ నైఫ్‌ను అధికంగా వాడతారు. ట్యూబ్‌టిప్‌తోనూ చిత్రిస్తుంటారు. సంజీవదేవ్ వాటర్ కలర్స్ మాధ్యమంలో అధికంగా చిత్రాలు వేశారు. ఆ సమయంలో పేస్టల్స్‌తోనూ చిత్రించారు. ఆ తరువాత అక్రిలిక్ పెయింట్స్‌ను అధికంగా వాడారు అవి ఉపయోగించటానికి వాటర్ కలర్స్ మాదిరిగా సుకుమారంగా ఉంటాయి. వేసిన తరువాత అవి వాటర్ కలర్స్ మాదిరిగా ఉండక, ఆయిల్‌కలర్స్ మాదిరిగా ఉండి స్థిరత్వాన్ని కలిగి ఉంటాయి. కనుక వాటిని దేవ్ అధికంగా ఉపయోగించారు. ఆయన తన చిత్రరచనకు ఒకే మాధ్యమం ఎన్నుకోలేదు తాను చిత్రించ దలచుకున్న భావానికి, ఆ భావరూప నైరూప్య వ్యక్తీకరణకూ ఏది అనువుగా ఉంటుందని తోస్తే ఆ మీడియమ్‌ను ఆ సమయంలో తీసుకున్నారు. ఒకోసారి అందుబాటులో ఉండే మాధ్యమాన్ని కూడా వాడారు.

మొదటలో సంజీవదేవ్ తనలో పుట్టిన భావదృశ్యాన్ని, చిత్రదృశ్యంలోకి తర్జుమా చేసుకొని చిత్రించటానికి రంగుల ముందు కూర్చునేవారు. తరువాత వారు శూన్యమైన మనస్సుతో చిత్రించటానికి రంగుల ముందు కూర్చునేవారు.

అంటే సంజీవదేవ్‌గారిలో మొదట చిత్రాన్ని చిత్రించబోయే ముందు వారిలో ఓ భావనారూపం ఉండేది, దానిని చిత్రించ ప్రయత్నించేవారు. అప్పుడు ఆయన ప్రయత్న చిత్రకారులుగా ఉండేవారు.

తర్వాత వారు పరిణితిలో కలర్ అండ్ ఇన్‌స్ట్రుమెంటు చెప్పే టెక్‌నిక్ లోనూ, వాటిలో ప్రవహించే రచనా రీతులలోకి ప్రవహించి వాటిని చిత్రించారు.

అంటే దేవ్ చిత్రాలు చిత్రించబోయే ముందు సబ్‌జెక్ట్ అండ్ ఆబ్జెక్ట్ అన్నదాంతో కాకుండా టెక్‌నిక్ అన్న ప్రెడికేట్‌తో చిత్రరచనకు సిద్ధమౌతారన్నమాట.

అంటే, టెక్‌నిక్ అన్నది రసహీనమూ, సౌందర్య విహీనమూ, అభావాత్మకమూ, అనుభూతి రహితమూ ఐనది కాదు. టెక్‌నిక్ అన్నది వాటన్నిటినీ తనలో ఉంచుకొనే, ముందుగా తాను ప్రత్యక్షమౌతూ, ఆ తరువాత వీటన్నిటినీ తనలో నుంచి ప్రకాశింపజేస్తూ

ఉంటుంది. చిత్రకళా ప్రకృతిలో గల ప్రకృతిని సాహితీదృష్టితో చూస్తే చాలా విచిత్రంగా ఉంటుంది. పైగా ఇది కళా వ్యతిరేక స్థితి అనికూడా అనిపించవచ్చు.

కానీ, ఈ ప్రకృతి, చిత్రకళా సృజనకూ చాలా అనువైనది. అందునా ఆధునిక చిత్రకళా రచనా రీతిలో ఇది చాలా ప్రేరణాత్మకం. నిజానికి హస్తకళల సహజాత ప్రకృతులలో ఇది ఓ ప్రకృతి అని ఆయా కళాపండితులకు తెలుస్తూ ఉంటుంది. అందుకనే సారూప్య చిత్రకారులు కూడా అలవోకగా ఎప్పుడూ ఏదో ఒకటి గీస్తూ ఉంటారు. నైరూప్య చిత్రకారులు కూడా అంతే. ఈ శూన్యమనస్సు నుంచి ముందు ఓ గీతో లేక ఓ రంగుపూతో ఉంటుంది. ఆ తరువాత అది అలా అలా అల్లుకుంటూ పోతూ ఉంటుంది ఆ అల్లికలో భావమూ, ఆతరువాత రసమూ, అనుస్యూతంగా లతారచనవలె అల్లుకొనిపోతూ ఉంటాయి.

సంజీవదేవ్ ప్రకృతి చిత్రాలలో ప్రకృతిని యధాతధంగా చిత్రించరు. అసలు వారు ప్రకృతి ముందు కూర్చుని శుద్ధ చిత్రకారునివలె చిత్రించరు. వారు వారి 'రసరేఖలో' కూర్చుని చిత్రాలను చిత్రిస్తారు. ఆయన ఎన్నో దశాబ్దాల నుండి తమ పర్యటనల కిటికీలలో నుంచి, రంగు రంగుల రూపాలలో వెలుగుతూ వెళ్ళిన ఎన్నో దృశ్య రూపాలను తిరిగి తన రసరూప హృదయంలోనికి రప్పించుకొని ప్రకృతి చిత్రాలను చిత్రిస్తుంటారు. అప్పుడు వాస్తవ రూపంలోని అపశృతులను తీసివేసి చిత్రిస్తుంటారు. ప్రకృతి కేవలం కంటికి కనిపించే వాస్తవ ప్రకృతికి ప్రతికృతిగా ఉంచకుండా, సృజనాత్మక రీతిలో ఆ ప్రకృతి రూపాలను ఏ విధంగా రూపాంతర పరిస్తే బాగా రసాత్మకంగా ఉంటాయో అని ఆలోచించి చిత్రించారు.

అందుకనే ఆయన 'వాస్తవం అన్నది నా అభిప్రాయంలో పూర్తి వాస్తవం కాకుండా పూర్తి నైరూప్యం కాకుండా ఉండునది. అందుకని నేను పూర్తి వాస్తవం కాకుండా పూర్తి నైరూప్యం కాకుండా చిత్రిస్తాను; నా చిత్రాలను' అని అంటారు.

సాధారణంగా సాంప్రదాయకంగా వస్తున్న ప్రకృతి చిత్రాలలో మూడు ఆయతనాలు (త్రీ- డైమెన్షన్స్) ప్రధానంగా ఉంటాయి. కానీ సంజీవదేవ్ నేడు ప్రపంచమంతా అనుసరిస్తూ ఉన్న ఆధునిక చిత్రకళా విధానమైన రెండు ఆయతనాలనే వాడుతున్నారు. ఈ విధానం గురించి దేవ్ అంటారు -

'దూరాన్ని ప్రదర్శించటానికి మూడు ఆయతనాలు వాస్తవదృష్టి ప్రకారము అవసరము. కానీ భారతీయ విధానంలోనూ, దూరప్రాచ్య చిత్రవిధానంలోనూ దూరాన్ని చూపటానికి కూడా. రెండు ఆయతనాలనే ఉపయోగిస్తూ వచ్చారు. నేడు విశ్వజనీనమైన ఆధునిక చిత్రకళ అనబడేది మూడు ఆయతనాల ప్రభావాన్ని కూడా రెండు ఆయతనాలలోనే చూపిస్తున్నారు.

దీన్ని ఒక రకంగా వాయు దృష్టి క్రమం (ఏరియల్ పర్స్పెక్టివ్) అని అంటారు అసలు చిత్రం అనేదానికి భూమిక రెండు ఆయతనాలనే కలిగి ఉంటుంది. కానీ మూడు ఆయతనాలను కలిగివుండదు. కనుక ఆధునిక చిత్రకారులు ప్రకృతిలోని ఈ వాస్తవాన్ని తమ చిత్రాలలో ప్రయోగిస్తున్నారు.

ఈ సత్యాన్ని గుర్తించే సంజీవదేవ్ తమ చిత్రాలలో రెండు ఆయతనాలనే ప్రయోగిస్తుంటారు.

నిజానికి చిత్రకళా పరిణామంలో మొదటలో పర్స్పెక్టివ్ లేదు తరువాత తరువాత వాస్తవ దృష్టీ, వాస్తవ రచనా నిర్మాణం అధికమై అభివృద్ధియైనకొద్దీ పర్స్పెక్టివ్ మూడు పువ్వులూ, ఆరు కాయలుగా చిత్రకళా జగత్తులో పూసింది. రూపంలో, రంగులో వచ్చిన ఆధునిక పర్స్పెక్టివ్‌లోనూ రావటంతో ఈనాడు చిత్ర కళలో రూపాల పర్స్పెక్టివ్ ఉండేది. కానీ రంగులలో చూపించే ఏరియల్ పర్స్పెక్టివ్ అంత ఆధునికంగా వృద్ధి చెందింది. నిజానికి రూపాల మధ్య దూరాన్ని రూపాల పరిమాణంతో కాకుండా వర్ణాలతో వర్ణ ఛాయలతో రూపాల మధ్య దూరాన్ని నియంత్రణ చేస్తూ ప్రదర్శించటం చిత్రకళా మర్మజ్ఞత తెలిసిన వారికి కొంత క్లిష్టమైన, నూతనమైన విషయమే. అలాంటి దానిని ఈనాడు చిత్రకళ వృద్ధిచేసుకొంటూ ఉన్నది. ఒకనాడు చిత్రకళలో పర్స్పెక్టివ్ లేదు. ఆధునిక చిత్ర కళలోనూ నేడు లేదు అప్పుడు ఆ పరిజ్ఞానం లేకపోలేదు. ఇప్పుడు ఆ జ్ఞానం పరిపూర్ణమై వర్ణాల పాండిత్యం వైపు ఆధునికమై ప్రవహించింది.

అందుకనే శ్రీ సంజీవదేవ్ ప్రధానంగా ప్రకృతి చిత్రకారులు – రంగుల ప్రకృతి చిత్రకారులు ఐనారు.

ఇలా ఎప్పుడైతే రూపాల పర్స్పెక్టివ్ నుండి కలర్ పర్స్పెక్టివ్‌లోకి చిత్రకారుడు పరిణతి చెందుతాడో అప్పుడు ఆ చిత్రకారుడు కలరిస్టు అవుతాడు. అందునా సంజీవదేవ్ సాంప్రదాయ చిత్రకళను జీర్ణింపచేసుకొని, ఆధునిక చిత్రకళను జీర్ణింపజేసుకొని చిత్రకళలో చిత్రించటానికి ప్రవేశించినారు. కాన, ఆయన ప్రధానంగా సెమీ ఆబ్‌స్ట్రాక్ట్ ల్యాండ్ స్కేప్ చిత్రాలలో చిత్రకళను ప్రారంభించారు. అందువలననే అతి త్వరలో ఆయన కలరిస్ట్ అయినారు.

ఈ విషయం మీద సంజీవదేవ్ అంటారు 'ఇదివరకు చిత్రాలలో వస్తురూపాలు అధికంగా ఉండేవి. చెట్ల రూపాలు సెలయేళ్ళు అదికంగా ఉండేవి. ఇప్పటి వాటిల్లో రూపపు స్థానాన్ని వర్ణం ఆక్రమించింది' అని.

దేవ్ చిత్రాలలో వస్తువుయొక్క డిటేల్స్ అధికంగా ఉండవు. వీరు చిత్రకళ ప్రారంభించిన తొలిదశలో కొద్దోగొప్పో వస్తు చిత్రణలో డిటేల్స్ ఉండేవి. క్రమక్రమేణా ఆయన కలరిస్ట్ అవుతున్నకొద్దీ అవి వెనకపడిపోయాయి. అందుకు కారణం దేవ్ అంటారు 'వస్తువు యొక్క డిటేల్స్‌ను చూపక దాని సమగ్ర భాగాన్ని ఒకటిగా చూపటం ప్రధానం అయింది. అప్పుడు ఆ చిత్రంలో ఏమున్నది అన్నది ప్రధానం కాకుండా అది ఎట్లా ఉన్నదీ అన్నది ప్రధానంగా ఉంటుంది'. అటువంటి చిత్రాలలో ఇతివృత్తానికి రూప నిర్మాణం ఎక్కువ ప్రాధాన్యం వహిస్తుంది.

దూర ప్రాచ్య చిత్ర విధానాలను సంజీవదేవ్ ఎక్కువ అభిమానిస్తారు. జపాను ప్రకృతి చిత్రకారులైన ఒకోసాయి, హీరోషిగే మొదలైన వారి చిత్రాలపై ఎక్కువ మక్కువ.

అంతేకాదు ఆయన అభిప్రాయంలో –

'ల్యాండ్ స్కేప్స్ ప్రధానంగా రెండు భాగాలుగా ఉంటాయి. అందులో ఒకటి టొపోగ్రఫీ (స్థల వివరణ) కి సంబంధించినది. రెండవది అట్మాస్ఫియర్ (వాతావరణము)కు సంబంధించినది. చిత్రకళలో ప్రముఖ చిత్రకారులలో కాన్‌స్టేబుల్ యొక్క ల్యాండ్‌స్కేప్స్ ప్రధానంగా టొపోగ్రఫీకి సంబంధించినవి. అలాగే ప్రముఖ చిత్రకారుడైన టర్నర్ చిత్రాలు అట్మాస్ఫియర్‌కు సంబంధించినవి.

సంజీవదేవ్ అట్మాస్ఫియర్ చిత్రణ విధానానికి సంబంధించినవారు. అందుకనే ఆయన ప్రకృతి చిత్రణ విధానంలో దూరప్రాచ్య విధానంలో రూపాలకు సంబంధించిన పర్స్‌పెక్టివ్ మాత్రమే కాకుండా, ఆధునిక చిత్రణరీతిలోని రెండు ఆయతనాల (టూ–డైమెన్షనల్స్)లో కలర్ పర్స్‌పెక్టివిటీ చూపిస్తూ ఉండటంతో అట్మాస్ఫియర్ విధానంలో చిత్రిస్తూ ఉండటంతో శుద్ధ నైరూప్యచిత్రకారులు ఐనారు ఈనాడు డాక్టర్ సంజీవదేవ్.

చిత్రకళా పరిజ్ఞానం నుంచీ, సమీక్షా పరిజ్ఞానం నుంచీ, చాలా ఆలస్యంగా తన నలభై సంవత్సరాల వయస్సులో చిత్రకళలోకి ప్రవేశించిన దేవ్ మొదట అకాడమిక్ లక్షణాలతో కూడిన వర్ణాలనే తన రూపాలకు దిద్దేవారు. కానీ అది పరిణతి పొందుతూ వచ్చి, వారి వర్ణ విధానమే మారిపోయింది. సంకీర్ణమైన న్యూట్రల్ ఛాయలు అధికంగా గల, వర్ణ మిశ్రమాలతోనూ, ఆ వర్ణ సామరస్యాలతోను చిత్రాలను రూపొందిస్తున్నారు. వర్ణ లేపనంలో రసాన్ని బట్టీ రూపాన్ని బట్టీ, రూప భావాన్నిబట్టీ, టెక్‌నిక్‌ను బట్టీ, లైట్స్‌ను ఉపయోగిస్తుంటారు. ఇదివరలో వీరి ప్రకృతి చిత్రాలలో భూభాగం అధికంగా ఉండేది. కానీ తదుపరి చిత్రాలలో ఆకాశము, మబ్బులు అధికంగా ఉన్నాయి. వాటిని స్కై స్కేప్స్ అని అనవచ్చు. స్థూల దృష్టితో చూచి నప్పుడు కానీ

ఇంకా సూక్ష్మ దృష్టితో వాటిని పరిశీలిస్తే, అందులోనే కొంచెం ఓబేదంలో భూభాగం కూడా ధ్వనిస్తూ కనిపిస్తూ ఉంటూ అది ప్రకృతి చిత్రమేను అనిపిస్తుంది

ఇంకా సంజీవదేవ్ చిత్రాలను రూపారూపాల దృష్టితో పరిశీలిస్తే వారి చిత్రాలలో జామెట్రికల్ ఏరియాస్, బ్లాకులు అక్కడక్కడా కనిపిస్తూ ఉంటాయి ఇది ఆదునిక చిత్రకళలో ఓ పురోగమన మార్గం.

చిత్రకళలో రూపాల కూర్పులు ఎలాంటి రసబావాత్మకములుగా ఉన్నా, చిత్రములోని రూపాల కూర్పునంతనూ బంధించి ఐక్యపరచి ఏకముఖంగా ప్రదర్శించేది చిత్రము యొక్క ఆవరణ లేక చిత్రము యొక్క ఫ్రేమ్. అది సాదారణంగా దీర్ఘ చతురస్రంగా ఉంటుంది. దీర్ఘ చతురస్రంగా ఉన్నది నిలువుగానూ, అడ్డంగానూ ఉంటుంది. అవి ఒకోచోట చిత్రములోని కాంపోజిషన్‌ను బట్టి ఎక్కువ దీర్ఘంగానూ, సమదీర్ఘంగానూ, ఉంటాయి. ఇవి చిత్రకళ పుట్టినప్పటి నుండి ఈనాటి వరకు, చిత్రకళలో ఎన్ని పరిణామాలు వచ్చినా అలానే ఉంటూ వచ్చాయి

ఏ భావానికైనా, ఏ రసానికైనా, ఏ రూపానికైనా, ఏ రూపాలకూర్పుకైనా, ఏ వర్ణకూర్పు సామరస్యానికైనా చిత్రం యొక్క ఆవరణ దీర్ఘచతురస్రంగా ఉంటే అది బాగా నప్పుతుంది. ఇది సాంప్రదాయ చిత్రకారుల తలంపు.

చిత్రకళలోని రూపంలో రంగులో రచనా తీరుతెన్నులలో ఎన్నో పరిణామాలు వచ్చాయి. ఆ పరిణామాలన్నీ కేవలం దీర్ఘచతురస్రంలో ఉండాలని అనుకుంటే, ఆధునికంగా ఎలా ఇమడగలవు? అందుకని చిత్రము యొక్క ఆవరణ కూడా పరిణామ పరిణతిని ఎన్నో రకాలుగా పొందుతూ వచ్చింది.

గతంలో సంజీవదేవ్ దీర్ఘ, సుదీర్ఘ చతురస్రాలలో నిలువుగా అడ్డంగా చిత్రాలను చిత్రిస్తుండేవారు. అందునా వీరి చిత్రాలు ప్రకృతి చిత్రాలు అవటంలో అవి తప్పనిసరిగా దీర్ఘ, సుదీర్ఘచతురస్రాలలోనే ఉండవలసి వచ్చేవి. ఐతే, ఆధునికతను ఎప్పటికప్పుడు ఆహ్వానించే దేవ్, ఆధునిక రూప వర్ణాలతోబాటు వాటి చుట్టూ ఉన్న ఆవరణ రేఖనూ, సాంప్రదాయం నుండి తెంచేసి చతురస్రంలో తమ ఆధునిక ప్రాకృతిక చిత్రాలను వేయ ప్రారంభించారు.

నిజానికి దీర్ఘచతురస్రాలు చిత్రరచనకు చాలా అనువుగా ఉంటాయి. చతురస్రం బ్యాలెన్స్ దృష్టిలో చాలా జటిలమైనది. ఐనా దేవ్ అటు పరిణతి చెందారు. అందులో ఎంతో కృషి చేశారు

ఆకృషిలో నుంచి సంజీవదేవ్ అంటారుగదా –

చిత్రాలు ప్రధానంగా మూడు విధాల ఆకృతులను కలిగి ఉంటాయి.

హారిజాంటల్, వెర్టికల్, స్క్వేర్ అంటూ

చతురస్రాన్ని గురించి - "Square is the synthesis of horizontal and vertical" అని అంటారు. అంతేకాకుండా - "Now a days the Modern paintings are in square. Because Square has the vertical and horizontal" హారిజాంటల్ ప్రశాంతతకు, సాత్విక తత్త్వానికీ, నారీత్వానికీ ప్రతీకగా ఉంచబడుతూ వచ్చింది. వెర్టికల్‌చిత్రంలో శక్తికీ, అభివ్యక్తికీ, పురుషత్వానికీ ప్రతీకగా ఎంచబడుతున్నది. హారిజాంటల్ వైశాల్యాన్ని చూపిస్తుంటే, వెర్టికల్ ఎత్తునూ, లోతునూ చూపిస్తూంటుంది.

ఇక ఈ రెంటి సమ్మేళమైన చతురస్ర చిత్రములో అటు హారిజాంటల్‌కు గానీ, ఇటు వెర్టికల్‌కు గానీ ప్రత్యేక ప్రాధాన్యము ఇవ్వక రెంటి యొక్క భాగస్వామ్యమైన దృశ్య సమ్మేళనాన్ని చూపుతుంది.

జీవితంలో రెండు దశలు కూడా, వెర్టికల్ మరియు హారిజాంటల్ ముఖ్యమే కనుక స్క్వేర్ జీవితములోని ప్రాముఖ్యతను ప్రదర్శిస్తుంది' అని అంటారు.

శ్రీ సంజీవదేవ్ రచించిన చిత్రాలు ఎక్కువగా నిలువుగానూ చతురస్రంగానూ ఉన్నాయి. ఇలా దేవ్‌గారి చిత్రాలు ఓ వ్యక్తిత్వాన్ని కలిగియున్నాయి.

శ్రీ సంజీవదేవ్ గారి చిత్రాలను గురించి చెప్పుకొనేటప్పుడు మరో విషయాన్ని కూడా చెప్పుకోవాలి. సంజీవదేవ్ ప్రసిద్ధ చిత్రకారులైన నికొలస్ రోరిక్, అసిత్ కుమార్ హాల్దార్ సహచర్యంలో ఉన్నప్పుడు, వారు కుంచెనూ, రంగునూ పట్టుకోలేదు. నిజానికి చిత్రాలు గీయాలనే ధ్యాసే ఉన్నట్లు వారికి లేదు. వారికీ వీరికీ ప్రదేశమూ, కాలమూ దూరమైన తరువాత 1960లో సంజీవదేవ్ కళాజీవితంలోకి రంగునూ, కుంచెనూ ఆహ్వానించారు. అయినా దేవ్ చిత్రాలలో నికోలస్ రోరిక్ చిత్రాలలోని ఫిగరెటివ్ ప్రభావం పడలేదు. అందుకు ఓ కారణం ఉండవచ్చు. శ్రీ దేవ్ మొదటినుంచి కొంత ఆధునిక చిత్రకళలో ఎంత అవగాహనను కలిగి ఉన్నారో, అంతే అవగాహనను సాంప్రదాయ వాస్తవ చిత్రకళలోనూ కలిగి ఉన్నారు. కాకపోతే చిత్రకళా పరిణతి వైపు పయనిస్తున్నారు.

ఆయనలో సహజంగా ఉన్న 'రచన' అనే పారవశ్యం ఆయనతో రచనారూపాలతో బాటు రూపరచనలనూ అనునిత్యం చేయించింది.

(రచయిత – శ్రీ కొండిపర్తి శేషగిరిరావు, డ్రాఫ్ట్స్‌మన్‌గా నాగార్జునసాగర్ డామ్‌లో పనిచేసి పదవీ విరమణ చేశారు)

# సంజీవదేవ్ 'లలిత కళా సమీక్ష'

డా. అత్తలూరి నరసింహారావు

లలిత కళా సమీక్ష అనే పుస్తకంలో సంజీవ్‌దేవ్ గారు ముందు కళని నిర్వచించారు తర్వాత కళ–ప్రకృతి, కళ–జీవితం, శుద్ధకళ–నైతిక కళ, కళలు – శాస్త్ర దర్శనాలు, కళ–చరిత్ర, కళ–విజ్ఞానశాస్త్రం, కళ–కల్పన, కళ–ప్రయోజనం అనే విభాగాల్లో ఆయా విషయాల్ని వివరించారు. సౌందర్యతత్వంలో భావనా పరిణామరీతి, సృజనాత్మక చింతన, సౌందర్యానుభూతి, రససిద్ధాంతం, తూర్పు ఆసియాలో సౌందర్య భావన గురించి వివరంగా రాశారు కళల వర్గీకరణలో లలితకళలలోముఖ్యమైన వాస్తు, శిల్ప, చిత్ర,సంగీత, నర్తన, నాటక కళల గురించి, పుష్కలంగా చర్చించారు. చివరగా యాంత్రిక కళల గురించి, చేతిపనుల గురించి వివరించి, కళామర్మం ఏమిటో విపులీకరించారు.

స్థితిశీలమైన భావాన్ని గతిశీలమైన భావముగా రూపొందించటమే కళ అని సంజీవ్‌దేవ్ గారు నిర్వచించారు. మళ్లీ స్థితి, గతి, భావము, భవము అనే పదాలకున్న అర్థాల్ని వివరించారు. బాహ్య ప్రకృతి, అంతర్జగత్తు ఈ రెండింటి కలయిక కళ అనీ, ఈ కళ కల్పన, వాస్తవాల సమ్మేళనమని అన్నారు. కళ వాస్తవవాదంలో ఆరంభమై, ఆదర్శవాదంలో అభివృద్ధి చెంది, కల్పనావాదంలో పరిణతి చెందుతుందన్నారు. కళలేని జీవితం నిస్సారంగా వుంటుందనీ, కళ మానవుడికి మంచీ చెయ్యగలదు, చెడూ చెయ్యగలదు అని అర్థవంతంగా వివరించారు. తర్వాత శుద్ధ కళా, నైతిక కళావాదాల గురించి రాస్తూ వాటి స్వరూపాల్ని ఆవిష్కరించారు. రసానందాన్ని కలిగించటమే శుద్ధ వాదాలలో వున్న అసంపూర్ణతను కూడా వివరించి, రసానందం కలిగిస్తూ నీతిబోధ చెయ్యటమే కళల ఆశయమని సంజీవ్‌దేవ్‌గారు

సమన్వయిస్తారు. కళోపాసన అనే అర్ధవంతమైన, గంభీరమైన పదం వ్యంగాన్ని కలుపుకుని కళాపోసన అయిన సమాజంలో దానికి పరిమిత అర్ధమే స్థిరపడిపోయింది. కాని కళోపాసన అంటే కళాకృతుల్ని సృష్టించడం అనీ, వాటిని వినటం, చూడటం, ఆనందించటం అనీ స్పష్టం చేశారు కష్టసాధ్యమే అయినా కళలకి ప్రయోజన దృష్టి, సౌందర్య దృష్టి రెండూ ఉండా లంటారు. ఇలాంటి కళ మానవ జీవితాన్ని మహిమాన్వితం చేస్తుందని, మానవ చైతన్యాన్ని మహోన్నత శిఖరాలకు చేరుస్తుందని, జీవితాన్ని సుందర బృందావనంగా మారుస్తుందని కళకున్న ప్రయోజనాల్ని వివరించారు.

తర్వాతి కళలకి, శాస్త్ర దర్శనాలకి వున్న తేడాల్ని విశ్లేషించారు. సౌందర్యోపాసన చేసేది కళ అనీ, సత్యానుసంధానం చేసేది శాస్త్రం అనీ స్పష్టం చేశారు. కళల దృష్టి సంశ్లేషణ అని, శాస్త్రాల దృష్టి విశ్లేషణ అని వాటి పనులను వివరించారు. అలాగే కళకీ, చరిత్రకీ, మధ్యవున్న తేడాల్ని, వాటి స్వరూప స్వభావాల్ని వివరించారు. చరిత్రకు శాస్త్రీయ దృక్పథం, కళకు రసాత్మక దృక్పథం, ఎక్కువగా వుంటుందని స్పష్టం చేశారు. తర్వాత కళకీ, విజ్ఞాన శాస్త్రానికీ మధ్య వున్న విభేదాల్ని వివరించారు. అయినా కళలకి భౌతిక శాస్త్రంతోను, రసాయన శాస్త్రంతోను వున్న సన్నిహిత సంబంధాన్ని అంగీకరించారు. ఇలా మొత్తం మీద దర్శన శాస్త్రం, చరిత్ర, విజ్ఞాన శాస్త్రం మొదలైన వాటికి ఒక పరిధిలో కళతో సంబంధం లేకపోయినా మరో పరిధిలో సన్నిహిత సంబంధం వుందని సంజీవ్‌దేవ్ గారు స్పష్టం చేశారు. కాబట్టి కళ, శుద్ధకళగా వుండటానికి అవకాశం లేదని ఆయన సమాధానం.

పాశ్చాత్య దర్శన శాస్త్రంలో ఒకటైన సౌందర్య తత్వానికి ప్రాచ్య, పాశ్చాత్య సంస్కృతుల్లో వున్న విలువని వివరించారు. ఈ సౌందర్య తత్త్వం మానవుడి రసచేతనమీద ఆధారపడిందనీ, ఇది వస్తువులోని సౌందర్యాన్ని, మానవునిలోని రసచేతనను సమ్మిళితం చేస్తుందనీ చెప్పారు. సౌందర్యం నైరూప్యమైందని చెప్పి అది వ్యక్తిగతమా, వస్తుగతమా అని చర్చించి, చివరికి అది ఉభయగతం అని సమన్వయిస్తారు.

సంజీవ్‌దేవ్ గారు ఈ సౌందర్య తత్త్వం యొక్క చరిత్రను వివరిస్తూ 18వ శతాబ్దం నుంచి ఒక ప్రత్యేకతను సాధించిందనీ, దీనికి అలెగ్జాండర్ గాడ్ లీచ్ బామ్ గార్డెన్ కారణమనీ చెప్పారు. అలెగ్జాండర్ 1750 లో 'ఈస్తటికా' అనే పుస్తకంలో సౌందర్య తత్త్వ వివరణ కోసం రాశారు. 'ఈస్తటికా' అనే గ్రీకుపదం నుంచి 'ఈస్తటిక్' అనే పదం రూపొంది ఈస్తటిక్స్ పేరుతో ప్రాచుర్యంలోకి వచ్చింది. ఈ సౌందర్య తత్త్వంలో కళలకు చెందిన మనోవిజ్ఞానం, కళా సమీక్ష

అనేవి వున్నాయి. ఈ మనోవిజ్ఞానం ఇంద్రియానుబవ వాదం మీద ఆధారపడి ఆరంభమైంది కళాకృతుల వలన కలిగే అనుభవరీతుల్ని అన్వేషించటమే ఇందులో ప్రధాన విషయం. మొత్తం మీద కళా మనోవిజ్ఞానం రసానుబూతిని విశ్లేషించటానికి, కళాసమీక్ష కళా స్వభావాన్ని, ప్రయోజనాన్ని నిర్వచించటానికి ఉపయోగిస్తాయి. సౌందర్య తత్వ వివేచనా చరిత్రలో అనుకరణ, కల్పన, అభివ్యక్తి అనేవి ముఖ్యపాత్ర నిర్వహిస్తాయని చెప్పారు మళ్లీ వీటిని వివరిస్తూ నాటక, చిత్ర, శిల్ప కళల్లో అనుకరణకున్న స్థానాన్ని వివరించారు అయినా సరే ఏ కళలో అయినా పూర్తి అనుకరణకి అవకాశం లేదని తేల్చి చెప్పారు. ఈ అనుకరణ విషయంలో అరిస్టాటిల్ తీసుకొచ్చిన మార్పునీ, ఫిలోస్ట్రేస్ చెప్పిన లోపాల్నీ సవివరంగా చెప్పారు. చివరిగా కళ అంటే సృష్టే గాని ప్రతిసృష్టి కాదని, కళాకారుడు సృష్టి కర్త గాని అనుకరణ కర్త కాదని స్పష్టం చేశారు ఈ పరిశీలన కారణంగా సౌందర్య తత్త్వ చరిత్రలో 'కల్పన' అనే పదం ప్రవేశించింది ఈ కల్పన అనే దాని స్వరూప స్వభావాల్ని చర్చించి, సమాజగతమైన కళకి, వ్యక్తిగతమైన కల్పన ఆధారం అవటానికి అవకాశం లేదని చెప్పారు. చివరికి కళ అనేది అటు అనుకరణా కాదు ఇటు కల్పనా కాదు అది కేవలం అభివ్యక్తి మాత్రమే అని విమర్శకులు చెప్పిన దానిని అంగీకరించారు. ఈ వాదనను ప్రతిపాదించిన మొదటివారు గ్రీకు ఆలంకారికులు అభివ్యక్తి అంటే వెల్లడించటం అంతవరకూ వెల్లడి కాకుండా వున్న దాన్ని వెల్లడించటమే అభివ్యక్తి. ఈ కారణంగా కళ అంటే అభివ్యక్తి అని సిద్ధాంతం చేశారు.

కళాకారుడు సృజనకు ముందు నాలుగు రకాల దశలకు లోనవుతాడనీ, అవి అయోజనము, ఉద్భవనము, సందీపనము, సత్యాపనము అని భారతీయులు చెప్పిన విషయాన్నే చెప్పి వాటిని వివరిస్తారు. ఇక చిత్రకళలో మూడు రకాల సృజన పద్ధతులుంటాయని, అవి ప్రత్యక్ష, స్మృతి, పరోక్ష నిర్మాణ రీతులని వివరిస్తారు. ప్రత్యేక పద్ధతి పాశ్చాత్య దేశాల్లోను, స్మృతి పద్ధతి తూర్పు ఆసియా దేశాల్లోనూ, పరోక్ష పద్ధతి భారత దేశంలోను కనపడుతుందని చెప్పారు.

రసానుభూతికి హేతువాద, వివేచన, సౌందర్య తత్వ పరిజ్ఞానం అవసరంలేదని స్పష్టం చేస్తారు. అందుకే మనవాళ్లు మంచి రసపట్టులో శాస్త్ర చర్చ కూడదంటారు రసానుభూతి అంటే సౌందర్యానుభూతి అనీ, ఇది ఇంద్రియాల వల్ల కలుగుతుందనే సామాన్య సత్యాన్ని తెలియ జేస్తారు. ఈ ఇంద్రియాల కారణంగా మనకు ఆనందం కాని, విచారం కాని కలుగుతాయని, అదే రసానుభూతి అని చెప్పారు. ఈ అనుభూతులు వ్యక్తికి సన్నిహితంగా వుండేవి కొన్ని, దూరంగా వుండేవి మరికొన్ని అని వివరిస్తారు.

రస సిద్ధాంత విభాగంలో రసము, భావము, ఒకటి కాదని, రసము అంటే అనుభూతి అనీ, భావము అంటే ఆవేశం అనీ స్పష్టం చేస్తారు. ఇంకా భరతుని నాట్యశాస్త్రంలోని రసానికి సంబంధించిన వివరణ అంతా ఇచ్చి చివరకు భారతీయ సౌందర్య తత్త్వ చర్చకు రసం ప్రాణమని చెబుతారు. ఈ విషయంలో భారతీయులకు పాశ్చాత్యులకు మధ్యవున్న తేడాని గమనించి, సౌందర్యతత్త్వ చర్చలో కొత్తదశ కోసం మనం పాశ్చాత్య భావనపైనే ఆధార పడవలసి వుంది అని చెబుతారు.

ఇక తూర్పు ఆసియాలో సౌందర్యభావన గురించి చెబుతూ చైనా, జపాన్‌దేశాల వారి సౌందర్యానుభూతిలోని సున్నితమైన తేడాల్ని వివరిస్తారు. వారి సౌందర్యతత్త్వం మీద వున్న వివిధ ప్రభావాల్ని విపులంగా వివరిస్తారు.

కళల వర్గీకరణలో దృశ్య, శ్రవ్య, మిశ్ర కళల్ని పేర్కొని, మొత్తం 64 కళల పట్టికని ఇచ్చారు. వాటిని రసప్రధానాలని, ఉపయోగప్రధానాలని రెండుగా విభజించారు రస ప్రధానాలు లలితకళలని, ఉపయోగ ప్రధానాలు చేతిపనులని వివరించారు. ఇవికాక యంత్ర ప్రధానాలు యాంత్రిక కళలని మరో వర్గీకరణ చేశారు.

లలితకళల గురించి చెబుతూ ఉపయోగ, రసాత్మక కళల మధ్య వంతెనగా వాస్తు కళని పేర్కొన్నారు. ఇది ఒక పక్క ఉపయోగమైంది. మరోపక్క రసాత్మకమైంది. అందువల్లే అన్ని కళలకి తల్లిలాంటిది వాస్తుకళ అంటారు. ఇది ఎక్కువగా వస్తుగత నిర్మాణమనీ, ఏ భావాన్నీ వ్యక్తపరచని శుద్ధరూపమనీ, దీనిలో వైవిధ్యం తక్కువనీ వివరించారు. వాస్తుకళ తర్వాత చెప్పుకోదగింది శిల్పకళ అనీ, దీనిలో ఏ భావమైనా అభివ్యక్తం అవుతుందనీ, త్రీడైమెన్షన్స్ వుండటం ప్రధాన లక్షణమనీ దాని విశిష్టతను వివరించారు. ఇక శిల్పకళ చరిత్రకు, దానిలోని వివిధ రీతుల్ని వివరిస్తారు. శిల్పకళలో భారతీయులు సాధించిన దాన్ని గురించి చెబుతూ ధ్యానబుద్ధమూర్తి, నటరాజ విగ్రహం ఈ రెండూ విశ్వకళా ప్రపంచానికి మన కానుకలని గర్వంగా చెబుతారు. ఒకటి ప్రశాంతికి, స్థిరభావనకు, రెండోది గతిశీలతకు, లయ విన్యాసానికీ ప్రతీకలని పేర్కొంటారు.

చిత్రకళ దృశ్యకళలలో మూడవ స్థానం ఆక్రమిస్తుంది. చిత్రాలలో రేఖాచిత్రం, వర్ణ చిత్రం అని ప్రాధాన్యాన్ని వివరించారు. చిత్రకళలో వచ్చిన ఆధునిక రీతుల్ని, వాటి లక్ష్యాల్ని వివరించారు.

శ్రవ్యకళల్లో సంగీతం ముఖ్యమైంది జంతువుల అరుపుల అనుకరణే సంగీతానికి మూలమని వివరించారు. దృశ్య కళలు స్థల ప్రధానాలైతే, సంగీతం కాల ప్రదానమైందని వర్గీకరించారు. సంగీతం ధ్వన్యాత్మక, వర్ణాత్మకం అని రెండు రకాలని, జంత్ర సంగీతం ధ్వన్యాత్మకమని, గాత్ర సంగీతం వర్ణాత్మకమని విభజించారు. సంగీతంలోని సప్తస్వరాలను గురించిన భారతీయుల భావనను వివరించారు

సంగీతం శాస్త్రరూపం పొందకముందు వున్నది జానపదరూపమే అని స్పష్టం చేశారు. సంగీతం నిశ్శబ్దంలో ఆవిర్భవించి నిశ్శబ్దంలోనే అంతమగును అనే వాక్యాన్ని విశ్లేషించారు. భారతీయ సంగీతం రాగప్రధానమని, పాశ్చాత్య సంగీతం స్వరమేళన ప్రధానమని, మన సంగీతం వైయక్తికమని, పాశ్చాత్యులది సామూహికమని షరిశీలన చేశారు బారతీయ సంగీత చరిత్రను వివరించి, కర్ణాటక, హిందుస్తానీ, జానపద సంగీతాల ప్రత్యేకతలను, స్వరూప స్వభావాల్ని చెప్పారు.

ఇక నర్తన కళలో, భరతుడు చెప్పిన విషయాలను విపులీకరించారు నృత్తం, నృత్యం, నాట్యం అనేవాటి మధ్య వున్న భేదాన్ని వివరించారు. భారతీయ నృత్యంలోని విధానాలను, సంప్రదాయాలను, రీతుల్ని వివరించారు. వీటితో పాటు పాశ్చాత్య బ్యాలే గురించి, తూర్పు ఆసియా నృత్యాల గురించి వివరించారు.

నాటకాన్ని మిశ్ర కళగా భావిస్తూ, నాటక పరిణామంలో రచన, ప్రదర్శన అనే రెండు దశలు వున్నాయని చెప్పారు. నాటక చరిత్ర గురించి రాస్తూ ప్రాచీన భారతీయ నాటకాల, గ్రీకు విషాదాంత నాటకాల ఆవిర్భావం వాటి మధ్య వున్న దృష్టి భేదం వివరించారు. సంస్కృత నాటకాల్లో మొదటిదైన శూద్రకుని మృచ్ఛకటిక నాటకంలోని విశేషాల్ని వివరించారు. నాటకంలో పంచసంధుల వివరణ. పాత్రల వర్గీకరణ లాక్షణికంగా చెప్పారు. భారతీయ, గ్రీకు నాటక ప్రదర్శనల్లోని తేడాల్ని విశదీకరించారు. ఆధునిక కాలంలో నాటకాల్లో వచ్చిన మార్పుల్ని వివరంగా చెప్పారు.

యాంత్రిక కళల విభాగంలో సినిమా, రేడియో, టి.వి. ఫోటోగ్రఫీ, గ్రాఫిక్స్ కళల ఆవిర్భావ వికాసాల గురించి, వాటి స్వరూపస్వభావాల గురించి, వాటి ప్రయోజన పరిమితుల గురించి వివరించారు. చేతిపనుల విభాగంలో దాని ప్రాధాన్యాన్ని వివరించారు. కొన్ని కళలు రసాత్మకాలైతే చేతిపనులు ప్రయోజనాత్మకాలని వివరించారు. వాటిలో ముఖ్యంగా కుమ్మరి పనితనం గురించి, నగల పనితనం గురించి విపులీకరించారు. ఉపయోగం, సౌందర్యం రెండూ కలగలసిన కళలుగా చేతి పనుల్ని గుర్తించారు.

చివరిగా కళామర్మం ఏమిటో స్పష్టం చేశారు లలితకళలు కాని, చేతిపనులు గాని మానవ జీవితం నుంచి, మానవ జీవితం కోసం ఏర్పడ్డాయని చెప్పారు. ప్రతి కళ ఉపయోగం గురించి ప్రత్యేకంగా ప్రస్తావించారు. కళల మధ్య సన్నిహిత సంబంధం వుందని, వుండాలని విష్ణు ధర్మోత్తరంలోని కథను సందర్భోచితంగా చెప్పారు. మొత్తం మీద కళల పరమార్ధం ఆనంద మంటారు.

'లలిత కళా సమీక్ష' పుస్తకంలోని విషయం విస్తృతమైంది. సంజీవదేవ్ గారు స్థూలంగా, సూక్ష్మంగా లలితకళలకు సంబంధించిన సమాచారాన్ని సమర్ధవంతంగా అందించారు. ఆయా కళల పట్ల అభిరుచి కలగటానికి, అవగాహన పెరగటానికి ఈ పుస్తకం ఉపయోగపడుతుంది పుస్తకంలోని భాషా సంబంధం అయిన సుగుణం ఏమంటే ఇంగ్లీషు మాటలు వాడకుండా తెలుగు పాఠకులకు తెలుగులోనే రాశారు. కాని ఈ పుస్తకంలోని భాష గ్రాంధిక వేషాన్ని వదిలేస్తే మరికొంతమంది పాఠకులకి కూడా అందుబాటులోకి వచ్చి వుండేది.

సంజీవదేవ్ గారు చిన్న వాక్యాలు రాయటంలో నేర్పరి. అయినా ఈ పుస్తకంలో అక్కడక్కడా సుదీర్ఘ వాక్యాలు రాశారు. విషయ వివరణ కోసం ఆయన వాటిని రాసి వుండొచ్చు. కాని ఆ విషయాన్ని చిన్న వాక్యాల్లోనే రాయటానికి ఎక్కువ అవకాశం వుంది. ఈ విషయం వివరణ కూడా అక్కడక్కడా మోతాదు మించి వుంది. పాఠకుడికి ఎక్కడ అర్థం కాదేమోనని అనుమానంతోనో, అలవాటుతోనో, చెప్పిందే మళ్లీ చెబుతూ వుంటారు ఉదాహరణకు 'కళ-జీవితం, విభాగంలో ఒక చోట కళ అనునది మానవ జీవితానికి మహోపకారము చేయునది, అదే విధముగా అపకారమును సైతము చేయునది' అని అంటారు. అక్కడే రెండో పేరాలో 'కళ అనునది నిర్మాణాత్మకమును నిర్మూలనాత్మకమును కూడా. అది మానవ జాతికి కీడును చేయగలదు. మేలును చేయగలదు' అని అంటారు.

సంజీవదేవ్‌గారు కళల మధ్య సన్నిహిత సంబంధాన్ని అంగీకరిస్తారు. అలాగే కళలకి విజ్ఞాన శాస్త్రాలకి కూడా వున్న సంబంధాన్ని ఆమోదిస్తారు. అందుకే ఆయన విజ్ఞాన శాస్త్ర పరిజ్ఞానాన్ని లలితకళావివరణకోసం చక్కగా అన్వయించుకున్నారు.

సంజీవదేవ్ గారి కొన్ని అభిప్రాయాలతో ఏకీభవించ లేని పరిస్థితి కూడా ఉంది. సౌందర్యానుభూతి గురించి రాస్తూ 'కళాకారునకు ప్రాప్తించునది రసానుభూతి. తక్కినవారలు వారి వారి వృత్తులను అనుసరించియు, దృక్పధములను బట్టియు వేరు వేరు అనుభూతులకు లోనగుదురు. ఉదాహరణకు మేఘముల మీది ఇంద్రధనుస్సునే గ్రహించుదము. కళాకారుడు దానిని చూచి దాని సౌందర్యమునకు ముగ్ధుడై రసానుభూతిని పొందును. ఆ ఇంద్రధనస్సునే

రైతు చూచి వర్షము రాబోవుచున్నదనియు పంటలు బాగుగ పండగలవనియు బావించి సంతృప్తి రూపకమగు అనుబూతిని పొందును' అని అంటారు అలాగే ఓ వైజ్ఞానికుడు, ఓ దార్శనికుడు వారి వారి పరిధుల్లో అనుభూతిని పొందుతారనీ ఆయన అంటారు ఇక్కడ ఆయన కళాకారుణ్ణి ప్రత్యేక వ్యక్తిగా గుర్తించినట్టు కనిపిస్తుంది. అందరూ కళాకారులు కాకపోవచ్చుగానీ, సానుభూతి అందరిలోను కలుగుతోంది కాకపోతే కొందరు వ్యక్తం చేస్తారు మరికొందరు చెయ్యరు ఇంద్రధనుస్సును చూసిన ప్రతివారూ మొదటి క్షణంలో, దశలో పొందేది రసానుభూతే. ఆ తర్వాతే సంజీవదేవ్ గారు రాసినట్టు వారి వారి పరిధిలో భావన చెయ్యటానికి అవకాశం వుంది

మరో సందర్భంలో 'నిజమునకు ఏ కళాకారుడును ఇతరుల నిమిత్తము కళాకృతులను సృష్టించడు తన ఆనందము నిమిత్తము వానిని సృష్టించుకొనును' అని అంటారు సార్త్రె రాసిన వాట్ ఈజ్ లిటరేచర్ అనే పుస్తకంలోని సారాంశాన్ని వెల్చేరు నారాయణారావు గారు తన సిద్ధాంత గ్రంథంలో ఇలా రాశారు. 'రచయిత చేసిన రచనకి పాఠకుడు లేనిదే అస్తిత్వం లేదు కాగితం మీద అక్షరాలుగానే వుండే ఆ వస్తువు పాఠకుడు చదివేటప్పుడే రచన అవుతుంది. రచన చేసిన రచయిత, రచయితగా తన రచన చదువుకోలేడు రచన పూర్తి అయిన తరువాత అది విని అప్పటికప్పుడే అతను పాఠకుడు అయిపోతాడు. రచయితగా వుండడు. ఆ రచనని రచయిత పరవస్తువుగా చూడగలిగే స్థితిలో అతనికి ఆ రచన చెయ్యగలిగేశక్తి వుండదు. అందుచేత నేను నా కోసం రచన చేసుకుంటాను అనడం అబద్ధమే కాదు, అసాధ్యం 'రచనకు సంబంధించిన ఈ అభిప్రాయాలు ఏ కళాకృతికైనా వర్తిస్తాయనుకుంటాను.

మొత్తం మీద కళల విషయంలో సంజీవదేవ్ గారిది సమన్వయ దృష్టి, భావవాద, భౌతికవాద ధోరణుల్లో సంజీవదేవ్‌గారిది భావవాద ధోరణి.

తెలుగులో కళాకారులున్నారుగాని కళా విమర్శకులు లేరు. ఆ లేని లోటుని సంజీవదేవ్ గారిలాంటి ఒకరిద్దరు మాత్రమే పూరిస్తున్నారు. లలితకళాసమీక్ష అనే పుస్తకం దానికి నిదర్శనం.

(రచయిత – డా. అత్తలూరి నరసింహారావు, ఆంధ్ర విశ్వవిద్యాలయం,
విశాఖపట్నం, తెలుగు శాఖలో ప్రొఫెసర్‌గా ఉన్నారు.)

# మేధావిగా సంజీవదేవ్

డా.ఎన్. ఇన్నయ్య

సంజీవదేవ్ స్వేచ్ఛగా ఆలోచిస్తారు. తమ ఆలోచనల్ని ఇతరులకు అందిస్తారు. ప్రవాహంలో కొట్టుకుపోకుండా జీవితాన్ని గురించి మననం చేస్తారు. ఎక్కువ మంది గుడ్డిగా నమ్మే వాటిని విధిగా నమ్మాలనే ధోరణి ఆయన పాటించరు. విచక్షణలో బేరీజు వేసి యుక్తాయుక్తాలు చూసి నిలబడగలవాటినే స్వీకరిస్తారు. లేనివాటిని తోసిపుచ్చకుండా, పరీక్షకు నిలిస్తే ఒప్పుకుందాం అంటారు. ఇవన్నీ ఆధునిక మేధావి లక్షణాలే. అందుకే సంజీవదేవ్ మేధావి.

భారతదేశంలో పూర్వం ఉద్దాలకుడు వంటి బహుకొద్దిమంది ఆలోచించి ఇతరులను ఆలోచింపజేశారు. ప్రశ్నించడాన్ని ప్రోత్సహించారు. కాని అలాంటి వారు మైనారిటీగానే నాడు మిగిలిపోయారు. ఆ కోవకు సంజీవదేవ్ చెందుతారు. ఇందుకు భిన్నంగా యాజ్ఞవల్క్యవంటి వారు పెత్తందారీ తనంతో ఆలోచనా రంగాన్ని పరిపాలించారు. ప్రశ్నిస్తే సహించలేదు తాము చెప్పింది 'వేదం' అనే ధోరణి కనబరచారు. భారత దేశం యాజ్ఞవల్క్య సంప్రదాయాన్ని అనుసరించింది. మన వెనుకబడిన తనానికి అదొక ప్రధానకారణం. వారి సంఖ్య అత్యధికంగా ఉంది. నియంతృత్వాలకు దారితీసిన ధోరణులు యాజ్ఞవల్క్య ఆలోచనలలో ఉండగా స్వేచ్ఛను ప్రోత్సహించే విధానాలు ఉద్దాలకుడులో కనిపించాయి. సంజీవదేవ్ రెండో మార్గాన్ని అనుసరించిన మేధావి. ఇది ప్రవాహానికి ఎదురీదడమే. అయితే సంజీవదేవ్ చెప్పే ధోరణి ప్రసన్నంగా, లాలిత్యంగా వుండడం వలన, కాఠిన్యం పైకి కనిపించదు. అందుకు ఆయన అనుసరించిన శైలి, భాష బాగా తోడ్పడినాయి.

ఆదునిక భారతదేశంలో యాజ్ఞవల్క్య సంప్రదాయాన్ని పాటించిన గాంధీ మహాత్ముడుగా స్వీకరించబడినాడు. ఉద్దాలకుని పద్ధతిని పాటించిన మానవేంద్రనాధ్ రాయ్, రామ మనోహర్ లోహియా, బి ఆర్. అంబేద్కర్ వంటి వారు మేదావులుగా మైనారిటీ వర్గంలో మిగిలిపోయారు. సంజీవదేవ్ యీ రెండో వర్గంతో అంతర్లీనంగా పయనం సాగించారు

మేదావులు ఆలోచించి, చెప్పినట్లు, జీవితంలో అనుసరించాలా అనేది పెద్ద సమస్య. ప్రపంచ మేధావులుగా కీర్తిపొందిన వారిలో వైవిధ్యం కనిపిస్తున్నది. కారల్ మార్క్స్, బెర్టోల్డ్ బ్రెట్, విక్టర్ గోలాంజ్, ఛాంస్కీ, హెల్‌మన్, షెల్లీ, రూసో, సాత్రే, హెమింగ్ వే, టాల్‌స్టాయ్ వంటి మేధావులు ఎందరినో ప్రభావితం చేశారు. కాని వారి జీవితాలు పరిశీలిస్తే కొన్నిసార్లు ఆశ్చర్యపరచే సంఘటనలు కనిపిస్తాయి. చెప్పిందానికి విరుద్ధంగా ప్రవర్తించిన విషయాలు మనల్ని దిగ్భ్రాంతుల్ని చేస్తాయి. వీరి భావాలు మాత్రమే తెలుసుకొని, వారి జీవితం గురించి కళ్ళు, చెవులు మూసుకొంటే మంచిదనిపిస్తుంది అయితే, ఆయా మేదావులు చెప్పింది స్వీకరించాలి గాని వారేం చేశారో మనకు అనవసరం అనే వాదన లేకపోలేదు. ఇది చర్చనీయాంశం సంజీవదేవ్ ఇలాంటి మేధావి కాదు జీవితాన్ని ఒక కళగా, విలువగా పరిగణించి, పాటించిన మేధావిగా సంజీవదేవ్ జీవితం ఉంటుంది. అది పెద్ద విశేషం అంటే మేధావులలో కూడా సంజీవదేవ్ మైనారిటీ వర్గానికి చెందిన వాడేనన్నమాట. అలాంటి మేధావి ఆలోచనలు, భావాలు ఎలాంటివో చూచాయగా చూద్దాం. విడమరచి పరిశీలించటం పాఠకులకు వదిలేద్దాం.

## మిస్టిక్ లక్షణాలున్నాయా?

నా మిస్టినిజం, నార్లవారి రేషనలిజం అంటూ సంజీవదేవ్ రూపారూపాలలో (1969) ప్రస్తావించారు దీనినిబట్టి సంజీవదేవ్ మిస్టిక్ అని నిర్ణయానికి వస్తే కష్టం తాత్వికంగా మిస్టిసిజానికి రూఢి అర్ధం వున్నది. దైవంతో ప్రత్యక్ష సంబంధం ఏర్పరచుకుంటున్నట్లు అదే అసలైన వాస్తవమనీ, మిగిలిందంతా కాదనీ మిస్టిక్స్ ప్రవర్తించారు. అన్ని మతాల్లో మిస్టిక్స్ ఒకలాగే వున్నారు. వీరి ధోరణి విశ్లేషణకు అందదంటారు. కొంతకాలం నిరాశ నిస్పృహలతో బ్రతికి, చివరకు 'వాస్తవాన్ని' లోతుపాతులలో ప్రత్యక్షంగా కనుగొన్నట్లు మిస్టిక్స్ చెబుతారు. అలాంటి వాస్తవం అనిర్వచనీయం అంటారు. కాలాన్ని వీరు త్రోసిపుచ్చారు. జెన్ (ధ్యాన) బౌద్ధం, తావోయిజం, యూదుల కాబలిస్టులు, హసిడిం, ఇస్లాంలో సూఫీలు, క్రైస్తవులలో క్వేకర్స్ హిందువులలో కొందరు మార్మిక సాధువులు మిస్టిక్ కోవకు చెందినవారు. సంజీవదేవ్ యీ మతపరమైన, సంప్రదాయ మిస్టిసిజానికి చాలా దూరం కనుక రూపరూపాలలో తనను

మిస్టిక్‌గా పేర్కొన్నప్పుడు ప్రకృతిని 'ఆరాధించే' మిస్టిక్స్ అనుకోవాలేమో. కొన్ని సందర్భాలలో ఆయన ఖచ్చితంగా అరమరికలు లేకుండా తనను నిర్వచనాలలో యిరికించడాన్ని తృణీకరించారు. తాను ఆస్తికుడిని, నాస్తికుడిని, ఇంకా అలాంటివేవీ కాదని స్పష్టం చేశారు. మేధావిగా ఆయన ప్రతిదీ విడమరచి, తరచిచూచిన తీరు గమనిస్తే మిస్టిసిజపు అనిర్వచనీయ ధోరణికి ఎదురీదారు కనుక సంజీవదేవ్ మిస్టిక్ అని భ్రమించడం అనవసరం. బహుశా పరిణామ క్రమంలో తాను మిస్టిక్‌ను కాదని కూడా సంజీవదేవ్ వెల్లడించారు. (1972 తపస్వికి లేఖ)

## మేధావి లక్షణాలకు ఉదాహరణలు :

లింగం వీరభద్రయ్య చౌదరి పుస్తకాన్ని సమీక్షిస్తూ సంజీవదేవ్ 'సమీక్షా రేఖలు' అనే చిన్న గ్రంధంలో 'చౌదరిగారు నాస్తికులందు అయిష్టత వ్యక్తపరచారు. ఇది యుక్త వైఖరి కాదు. ఎందరో గొప్ప గొప్పవారంతా విశ్వసించారు. కనుక ఆ సత్యాన్ని మనం కూడా విశ్వసించాలనడం ఒక విధంగా భావ దాస్యమే అవుతుంది. అధిక సంఖ్యాకులు నమ్మింది మాత్రమే సత్యం, గొప్పవారు నమ్మింది మాత్రమే సత్యం అని నమ్మడం సత్యానికి దూరం కాకూడదని ఎక్కడా లేదు' సంజీవదేవ్ ఇలా రాయడంలో శాస్త్రీయ దృక్పథాన్ని అనుసరించారు. పదుగురాడు మాట పాటియై ధర చెల్లుతున్న రోజుల్లో, ప్రవాహానికి ఎదురీది, తాను నమ్మింది, శాస్త్రీయం అనుకున్నది చెప్పడం మేధావి లక్షణం.

నేడు పదిమందీ గుడ్డిగా అనుకరిస్తూ, ఆరాధిస్తూ, నినదిస్తున్న జాతీయవాదం కూడా సంజీవదేవ్ తృణీకరించారు. మనకు కావలసింది రేషనలిజం అని చెప్పారు. (1965 అరుణకు లేఖల్లో) సంజీవదేవ్. అంతటితో ఆగక మానవత కావాలని అన్నారు. ఆయన రచనల్లో అంతర్లీనంగా యీ ధోరణి బాగా కనిపిస్తుంది. మన దేశంలో జాతీయవాదానికి స్వాతంత్ర్యానంతరం కాలదోషం పట్టింది. ఈ విషయాన్ని గ్రహించి ఎం.ఎన్. రాయ్ తన రచనల్లో, జీవితంలో జాతీయవాదాన్ని ఖండించి, దాని ప్రమాణాలను చూపి, మానవత ఆవశ్యకత, నొక్కి చెప్పారు. అలాంటి మేధావులు మన దేశంలో అరుదు. జాతీయవాదానికి వ్యతిరేకంగా మాట్లాడితే దేశద్రోహి అనుకునే ఉద్రేక వాతావరణం ప్రబలి వున్నది. ఇది క్రమేణా సడలి, పూర్తిగా పోవాలి. సంజీవదేవ్ వంటివారు చెప్పే సరళి యిందుకు తోడ్పడవచ్చు.

దేవుడు వున్నాడా లేడా అని చర్చించే బదులు, చారిత్రకంగా వాస్తవాన్నే సంజీవదేవ్ అరమరికలు లేకుండా బయట పెట్టారు. దేవుడు అనేది ఉనికిలో రుజువుకు నిలబడే తీరులో ఎక్కడా జాడ లేదన్నారు. కాగా, ఆయా ప్రవక్తలు, ఋషులు, వ్యక్తులు, తమ దైవాన్ని

సృష్టించి జనం మీదకు వదిలారు. వాటిని వాస్తవాలని సామాన్య జనం నమ్మి ఆరాధిస్తున్నారు. సంజీవదేవ్ అవగాహన చక్కగా వుంది. (బయోసింఫొనీ)

ఇలా వివిధ అంశాలను, విషయాలను హేతుబద్ధంగా ఆలోచించి, మన ముందుంచిన సంజీవదేవ్ అంటారు –'ఆలోచించక పోవడం చాలా కష్టమైన పని. ధ్యానం అంటే నిత్య జీవితాన్నుంచి వేరుపడి ఏ కొద్ది క్షణాల్లో అనుభవించేదిగా వుండకూడదు' యోగం పేరిట చిత్తవృత్తి నిరోధం చేసి, ఆలోచన చంపి, మనుషుల అమాయకత్వాన్ని వాడుకొని, ఆ జ్ఞానం వ్యాపారం చేయాలనే వారికి మేధావిగా సంజీవదేవ్ చెంపపెట్టు ఇంతకంటే ఏం కావాలి ? (తేజోరేఖలు) స్వేచ్ఛ కంటే మానవుడికి అత్యుత్తమ విలువ లేదంటూ, సాపేక్షికంగా బాధల నుంచి విమోచన పొందడం కావాలని అల్డస్ హక్స్‌లీకి రాసిన లేఖలో పేర్కొన్నారు.

ప్రపంచంలోని అనేకమంది మేధావులను సంజీవదేవ్ పరిశీలించి వారి గురించి లోకానికి చెప్పారు. బెర్ట్రాండ్ రసెల్, రామ మనోహర్ లోహియా, నరేంద్రదేవ్, రాహూల్ సాంకృత్యాయన్, ఆనంద కుమారస్వామి, ఎం.ఎన్. రాయ్, రవీంద్రనాథ్ ఠాగూర్, జిడ్డు కృష్ణమూర్తి – ఇలా సంక్షిప్త జాబితా ఉన్నది.

ప్రకృతి, మానవుడు పట్ల స్పష్టమైన అవగాహన, ఆలోచన ఉండడం మేధావి మరో లక్షణం. ఆ దృష్ట్యా అనేక శాస్త్రీయాంశాలను సంజీవదేవ్ పరిశీలించారు. భిన్న కోణాలనుండి మానవుడిని అధ్యయనం చేశారు. మానవుడిని అర్థం చేసుకోడానికి ఆధునిక మనోవిజ్ఞానం అవసరం. సంజీవదేవ్ యీ శాస్త్రాన్ని ఎప్పటికప్పుడు గమనించారనడానికి ఆధారాలు వున్నాయి.

## సైకాలజీ :

ఫ్రాయిడ్, ఏడ్లర్, యూంగ్‌ల సైకాలజీ పట్ల దృష్టి పెట్టి చూచిన సంజీవదేవ్ నిర్దుష్టమైన అభిప్రాయాలు వెల్లడించారు. ఫ్రాయిడ్ సైకాలజీని తమోగుణ ప్రధానంగా, ఏడ్లర్ రజో గుణంతో వున్నట్లూ, యూంగ్ సత్వ గుణాధిక్యతతో వున్నట్లు జడ్జిమెంట్ ఇచ్చారు.

సైకాలజీలో ఫ్రాయిడ్ ప్రతిభ గురించి, దోషాల్ని గురించి ఎరిక్ ఫ్రాం రాశారు. ఇంకా అనేక పరిశీలనలు వెలువడ్డాయి. ఫ్రాయిడ్ గొప్పతనంతో స్వప్నాల విశ్లేషణ, వాటి ప్రభావం, వాటిని చైతన్యావస్థలోకి తెచ్చి చూడడం అనేవి గొప్ప పరిశీలనలుగా గుర్తించారు. జ్ఞాపక శక్తి విషయంలో అంతకు ముందున్న సిద్ధాంతాలను కాదని, ఫ్రాయిడ్ చేతన, అచేతనావస్థల్ని

చెప్పాడు. కావాలని అణచి వేసిన అనేక విషయాలు స్వప్నాల రూపేణా, ఇతరత్రా ఎలా ప్రభావితం చేస్తాయో ఫ్రాయిడ్ చెప్పాడు. మోహనిద్ర ద్వారా అణచివేసిన కోరికలను బయటకు తెచ్చి, చికిత్స చేయవచ్చని కూడా ఫ్రాయిడ్ పేర్కొన్నాడు. ఇందులో లైంగిక పాళ్లు అధికంగా చూపాడు కూడా. ఫ్రాయిడ్ విధానం వైద్య రంగంలో మనో విశ్లేషణగా పాతుకుపోయి, అనేక మార్పులు తెచ్చింది. తొలుత ఫ్రాయిడ్ అనుచరులుగా ఆరంభించిన ఏడ్లర్, యూంగ్‌లు క్రమేణా విభేదించి, వేరే పద్ధతులు అనుసరించారు. ఫ్రాయిడ్ సెక్స్‌కు యిచ్చిన ప్రాధాన్యతను కాదని, ఏడ్లర్ మనిషిలో అధికార శక్తి అతడిని నడిపిస్తుందన్నాడు. తాను తక్కువ అనే లోపాన్ని పోగొట్టుకోడానికి చిన్నతనం నుండి పెద్దయ్యే వరకు వ్యక్తి అనేక విధాల ప్రయత్నిస్తున్నట్లు ఏడ్లర్‌చూపాడు. ఇలా చేయలేని వ్యక్తి మానసిక రుగ్మతలకు గురౌతున్నాడన్నమాట. ఆ విషయాలు విడమరచి చికిత్స చేయడాన్ని ఏడ్లర్ స్కూలు అనుసరించింది. వీరిద్దరికీ భిన్నంగా యూంగ్ విశ్లేషణాత్మక సైకాలజీ పెంపొందించారు. ఫ్రాయిడ్ పేర్కొన్న సెక్స్ బదులు, జీవన శక్తికి యూంగ్ ప్రాధాన్యత ఇచ్చాడు. మనుషుల్ని బాహ్య, అంతర్ముఖులుగా ఆయన వర్గీకరించారు. అణచివేసిన వాటిలో కేవలం తీరని కోర్కెలే గాక, గర్భిత ప్రతిభలు ఇంకా ఉన్నాయన్నాడు. ఇందులో సమిష్టి మనస్తత్వానికి యూంగ్ చాలా ప్రాముఖ్యత యిచ్చాడు. ఈ దశలో యూంగ్ దయ్యాలు, భూతాలు, దైవాలు, ప్రకృతి శక్తులు. పునర్జన్మలు యిత్యాదుల్నీ పేర్కొన్నాడు. అయితే యూంగ్ చెప్పేవి చాలామటుకు శాస్త్రీయ పరిశోధనలకు నిలువలేదు. అతీంద్రియ శక్తులు, జ్యోతిషం వంటివి యూంగ్ పేర్కొని జనాకర్షణ పొందినా, అవి రుజువుకు నిలవలేక, క్షీణించాయి.

సైకాలజీలో స్కూల్సు తగ్గుముఖం పట్టగా, అన్ని స్కూల్సు చెప్పిన వాటిల్లో నిలిచేవి ఏరి సంజీవదేవ్ స్వీకరించారు. సత్వ, రజో, తమో గుణాలుగా సంజీవదేవ్ వర్గీకరించినవి ఆయనే మళ్ళీ రాస్తే, మార్చేస్తారనుకుంటాను. కాని ఆధునిక సైకాలజీ విషయాలు అవలీలగా సంజీవదేవ్ చెప్పడం వారి మానసిక స్పష్టతకు గీటురాయి.

## అతీంద్రియ విజ్ఞానం :

పరా మనోవిజ్ఞానం పేరిట కొంత ప్రచారం, మరికొంత నమ్మకం, ఇంకొంత పరిశోధన జరిగింది. సంజీవదేవ్ యీ రంగాన్ని కూడా ప్రస్తావించారు. ఆరో ఇంద్రియ శక్తి ఉన్నట్లు ఆయన గట్టిగా నమ్మాడనజాలం. కాని అలాగని నిర్ధారణగా తృణీకరించనూలేదు. సైకాలజీ పరిశోధన శాస్త్రీయంగా చేసి, గౌరవం ఆపాదించే ప్రయత్నం 1927 లో డా. జె.బి. రైన్ ఆధ్వర్యాన అమెరికాలోని డ్యూక్ యూనివర్శిటీలో మొదలైంది. ఇంద్రియాతీయ జ్ఞానం

ఖచ్చితంగా కనుగొన్నట్లు 1940 నాటికి చెబుతూ ప్రచారం చేశారు. శాస్త్రీయ పరిశోధనలో ఒకసారి రుజువైతే, ప్రపంచ వ్యాప్తంగా ఎక్కడ అలాంటి పరిశోధన జరిపినా అలాంటి ఫలితాలు వస్తాయి. 1965లో రైన్ రిటైర్ అయ్యే నాటికి  అతీంద్రియ శక్తులపై శాస్త్రీయాధారాలు లభించలేదు. సోవియట్ యూనియన్ జరిపిన పరిశోధనలకు సైతం ఆధారాలు, రుజువులు రాలేదు. కనుక యీ విషయం యింకా గాలిలోనే ఉన్నదని చెప్పాలి.

విజ్ఞానం తనకు అన్నీ తెలుసు అనడం లేదు. సంపూర్ణత సాధించాననలేదు. తెలిసినంత వరకు నిర్ధారణగా పేర్కొని, తెలియని దానిని పరిశోధిస్తున్నది. తెలియని రంగంలో నిర్ధారణగా చెబుతున్నది మతం, నమ్మకాలు, జోతిషం వగైరాలు.

తెలుసుకోవడం ఇంద్రియాల ద్వారా మెదడుకు చేరే అంశాలపైనే ఆధారపడి ఉంటుంది. ఒకసారి మెదడులో రికార్డు అయిన తరువాత, భావాలకు, స్వతంత్ర ప్రతిపత్తి ఏర్పడుతుంది. ఆ భావాల ఆధారంగా కొత్త ఆలోచనలు చేయడం సాధ్యమే జ్ఞానార్జన విషయమై సైన్స్ పేర్కొంటున్న యీ విషయాలను సంజీవదేవ్ చక్కగా విడమరచారు. (బయోసింఫొనీ, పే -103)

## సంజీవదేవ్ మానవత :

సంజీవదేవ్ తన రచనలన్నింటిలో మానవుడు కేంద్రంగానే ఆలోచనలు సాగించారు. మానవతకు అడగడుగునా ప్రాధాన్యత యిచ్చారు. అయితే వివేచన ఒక వైపు వికసిస్తుండగా, రామణీయకతపై శీతకన్ను పడినట్లు ఆయన భావించారు. కనుక రమణీయతను కలుపుకు పోయి, అలాంటి మానవతను మనో (వికాస) మానవత అందాం అంటున్నారు. బహుశ యీ విషయంలో ఆయనతో వివాదం ఉండే ఆస్కారం లేదేమో.

కొన్ని మాటలకు విపరీతార్థాలు రూఢిగా వచ్చాయి. అందులో 'సూపర్' అని తగిలించడం ఒకటి. మన పూర్వికుల గురించి ముఖ్యంగా, రుషులు, యోగుల గురించి ఆధారాల కంటే, నమ్మకాలు, గాథలే ఎక్కువగా ప్రచారంలో ఉన్నాయి. మన యోగులు ప్రత్యేక మానసిక శక్తులు ప్రదర్శించినట్లు న్యూరాలజిస్టులు ప్రస్తావించారని సంజీవదేవ్ రాశారు. ఇందుకు ఆట్టే నిదర్శనలు లభించడం లేదు. కాని సాధారణ మానవులకు భిన్నంగా విపరీత మేధస్సు లక్షణాలకు వివిధ రంగాలలో వివిధ కాలాలలో చూపిన, చూపుతున్న వారున్నారు. అవి కూడా మానవశక్తులే గాని, మానవాతీతాలు కావు గదా. ఇందుకు ఎన్నో ఉదాహరణలు ఉన్నాయి.

రమణీయకతకు ప్రాధాన్యత యిచ్చి మానవతకు పరిపుష్టి చేకూర్చాలని సంజీవదేవ్ ఉద్దేశించినపుడు ఒకే ఒక జాగ్రత్త వహించాలేమో ననిపిస్తున్నది. ఇన్నాళ్ళుగా కళలు, రామణీయకతా రంగమంతా దైవ ప్రాధాన్యతతో, మత ప్రాతిపదికలతో సాగింది. అవి లేకుండా రామణీయకత లేదనేటంతవరకూ తీసుకెళ్లారు. వాస్తవానికి అన్ని కళల్ని మతం, దైవం పేరిట భ్రష్టు పట్టించారు. మనిషి మానసికంగా బానిసగావడానికి కళల్ని ప్రయోగించారు. ఈ ప్రభావం నుండి బయట పడడానికి కూడా సంజీవదేవ్ సూచించిన ప్రత్యామ్నాయ పద్ధతి అనుసరణీయం. మానవ విలువలతో కూడిన కళలు, రామణీయకత నేటి అవసరం కూడా.

సంజీవదేవ్‌ను ఎవరితోనూ పోల్చదలచలేదు. కాని ఆయన రచనలు పరిశీలించిన తరువాత, రామణీయకత, కళలు, మనోవిజ్ఞానం, వ్యక్తుల అంచనా, అనుభవాలు, జ్ఞాపకాలు అవలీలగా అవగాహన చేసుకొని మనకు మంచినీళ్ల ప్రాయంగా అందించడంలో ఎరిక్ ఫ్రాంతో సంజీవదేవ్‌ను పోల్చడం ఔచిత్యంగా ఉంటుందనిపిస్తున్నది. తెలుగులో సంజీవదేవ్ చెప్పిన చాలా విషయాలిందుకు నిదర్శనాలు.

(రచయిత డా. ఎన్. ఇన్నయ్య, ప్రముఖ మానవవాది,
జర్నలిస్ట్, హైదరాబాద్ నివాసి.)

# మానవవాదం నుండి సైకోహ్యూమనిజానికి

-ఆవుల సాంబశివరావు

సంజీవదేవ్‌గారి 'బయోసింఫని' గ్రంథాన్ని గురించి ఒక మిత్రుడు అన్నారూ. . 'దేవ్‌గారి ఈ ఆలోచన అద్వైత తత్వానికి దగ్గరగా వుంది కదూ' అని.

'ఆ మాట అంటే సంజీవదేవ్‌గారికి కూడని అన్యాయం చేసినట్లవుతుంది' అన్నాను నేను.

'ఎందుకని?' అన్నాడు ఆయన.

'దేవ్‌గారు చెప్పే మహోన్నత చైతన్యం సర్వత్రా వ్యాపించలేదు. అది మానవునిలో ఉన్న ఒక ఉన్నత లక్షణశక్తి. అన్నిటిలోనూ వ్యాపించి ఉంటే పరమాత్ముడు కాదు. సంజీవదేవ్ గారికి మానవుడు, ఈ విశ్వం అనుమానించరాని సత్యాలు. భ్రమలూ, మిధ్యలూ కావు. ప్రతి మానవుడూ, ప్రతి పదార్థం ఒక విశిష్టమైన సత్యం. విశిష్ట వ్యక్తిత్వం గల మానవుడు, తనచుట్టూ ఉన్న విశ్వంలో లయబద్ధమైన సాన్నిహిత్యాన్ని సాధించగలడు. ఆ సమ్మేళనం నుంచి మధురమైన విశ్వ సంగీతాన్ని పుట్టించగలదు. దానికి మానవుడు లయబ్రహ్మ విశ్వ సంగీత వాగ్గేయకారుడు.

అదిన్నీకాక, తన పుస్తకానికి ఏరికోరి బయోసింఫని అని నామకరణం చేశారు. లయ బద్ధమైన భౌతిక, సమ్మేళనం ఇది. ఆ పేరే దేవ్ గారి అభిప్రాయాన్ని నిర్దిష్టంగా చెబుతున్నది.

నేటి మానవ వాదాన్ని మరింత ముందుకు తీసుకు పోయే మార్గాల్ని ఆయన సూచిస్తున్నారు. ఇదంతా అద్వైతానికి ఆమడదూరం కాదా' అన్నాను నేను.

అది నేను వాదం కోసం చెప్పింది కాదు. బయోసింఫని చదివి, సంజీవదేవ్ గారికి నా

దృక్పథం నుండి అవగాహన చేసుకొని వెలిబుచ్చిన అభిప్రాయం.

బయోసింఫని 1985 అక్టోబరులో మొదటిసారిగా అచ్చయింది. కనక సంజీవదేవ్ గారి ఈనాటి అభిప్రాయం అదేనని మనం భావించవచ్చు.

సంజీవదేవ్ గారు ఆలోచనలలో ఎప్పుడూ ఆగిపోలేదు. స్తబ్దత పొందలేదు. జ్ఞానం, విజ్ఞానం పెరుగుతున్న కొద్దీ, వారి ఆలోచనా సరళి విశాలమవుతున్నది. దాని స్థాయి పెరుగుతున్నది.

ఇందులో నిర్దిష్టత హెచ్చుతున్నది. మానవ వాదాన్ని ఒంట బట్టించుకున్న మేధావుల లక్షణం ఇది.

దేవ్‌గారికి మానవవాదం ఎడల గౌరవం మెండు. బయోసింఫనిలో దాన్ని గురించి ఏమంటారో చూడండి.

'మానవ మేథస్సుకు మానవ వాదం ప్రాముఖ్యత ఇచ్చింది. రామణీయకతకు ప్రాధాన్యత ఇస్తుంది సైకోమానవవాదం. మేధస్సుకు తోడుగానే ఇది ఉంటుంది. మానవ మేధస్సుపై శీతకన్ను వేయకుండానే మానవ జీవితంలో రామణీయకతను విస్మరించని ధోరణిలో సాగిపోవడం, సమైక్య జీవన తీరుగా భావించాలి. మానవవాదాన్ని సైకో మానవవాదం అశ్రద్ధ చేయదు, ఆమోదిస్తుంది.

మానవవాదం నేడు మానవాళికి ఎంతో సేవ చేసింది. మానవుడి స్థితిని ఉన్నత స్థాయికి తీసుకెళ్లింది. మానవుడిలో మేధస్సు ప్రాధాన్యతను పెంచింది. హేతువాద ఉచ్ఛ దిశను స్థాపించింది. మూఢ నమ్మకాలను ఎదుర్కొన్నది. మానవ సమాజంలో అవాంఛనీయ సాంఘిక ధోరణుల్ని నిర్మూలించే ప్రయత్నం చేసింది.

మానవవాదం సాధిస్తున్న ఈ విజయాన్ని ఆయన మెచ్చుకొంటాడు. అంతవరకు వారు మానవవాదాన్ని ఆమోదిస్తున్నట్లుగా మనం భావించడం సమంజసమే.

అయితే అందులో ఒక పరిమితి. లోటు ఉన్నట్లు వారు ఎత్తిచూపారు.

'మానవుడిలో అదృశ్యంగా ఉన్న లోకాన్ని మానవవాదం పట్టించుకోలేదు. ఈ లోకం వాస్తవం. బాహ్యప్రపంచం వలే ఇదీ నిజమైంది. నేటి మానవవాదం మానవ చైతన్యతపై అట్టే దృష్టి సాధించలేదు.

నేటి మానవవాదంలోని ఈ లోటును భర్తీ చెయ్యడం ఎలా? సైకోహ్యూమనిజం అందుకు సరైనదా? మానవుడితో పాటు, మానవవాదం, అశ్రద్ధ చేసిన అదృశ్యశక్తిని సైకోమానవవాదం పట్టించుకుంటుంది.

అప్పుడు సైకోహ్యూమనిస్టు సమాజం ఏర్పడటానికి నిండు అవకాశం ఏర్పడుతుంది. అది ఒక కల కాదు. ఒక ఆదర్శం మాత్రమే కాదు. నిండు రూపాన్ని, తేజాన్ని సంతరించుకోగల వాస్తవిక భావన.

సైకోహ్యూమనిస్టు సమాజంలో మానవులు, కళా,కాంతులతో, భయమెరుగని స్వేచ్ఛా జీవులుగా జీవితాలనుకొనసాగిస్తారు. పేదరికం అంతరిస్తుంది. వ్యాధులు నామరూపాలు లేకుండా పోతాయి. క్షీణదశ ఉండనే ఉండదు. ఇంతేకాదు. ఇతర గోళాల, గ్రహాలలోని జీవులతో, విశ్వంలోని చిత్రవిచిత్రాలతో సంబంధ, బాంధవ్యాలు ఆ మానవులు, నిర్మించుకోగలరు. విశ్వ సంగీతాన్నే వారు వినగలరు. ఆస్వాదించగలరు.

ఇది ఎలా సాధ్యం? మానవునిలోని ఉన్నత చైతన్యశక్తిని ప్రజ్వలింప చేయగలిగినప్పుడు, సైకోహ్యూమనిస్టు మానవుడు తయారవుతాడు. ఉన్నత చైతన్యస్ఫూర్తిని సంతరించుకున్న మానవుడు దేనికి బానిస కాని స్వేచ్ఛాజీవిగా, మహనీయ మానవమూర్తిగా (Superman ) వికసిస్తాడు.

పై ఆలోచనలు అందిస్తున్న సంజీవదేవ్‌గారు సిసలైన మానవవాదిగా నిరూపితమౌతాడు. తన జీవితాన్ని, చరిత్రను సృష్టించుకోగల శక్తి మానవునకున్నదనే భావన మానవ వాదానికి మూల భూమిక. ఆ కాలమానం ప్రకారం దేవ్‌గారు అక్షరాలా మానవవాది, అరమరికలు లేని మానవవాది.

అయితే ఇప్పుడు అమలులో ఉన్న మానవవాదం కొంత సాధించినా, అది సాధించ వలసింది మరెంతో ఉంది అని సంజీవదేవ్‌గారు అంటున్నారు తాను నిర్వచించిన రాడికల్ మానవవాదం కాంతిమయ నిర్ణయమని, దానిని దాటి మరేదీ తగని మానవేంద్రనాథ్ రాయ్ అనలేదు. ఇతర మానవవాదులెవ్వరూ అనలేదు. అలా అని ఉంటే వారు నిజమైన మానవ వాదులుకారు. మానవుడు తన విజ్ఞానయాత్రలో, జీవిత గమనంలో ఎన్నడూ, ఎక్కడా ఆగిపోడు. కొత్త విషయ పరిజ్ఞానం కొత్త ఆలోచనలు తెచ్చి పెట్టడం సహజం. మానవవాది అయినవాడు నూతన పరిజ్ఞానానికై అర్రులు చాస్తూ ఉంటాడు. అతడు నిరంతర జిజ్ఞాసాపరుడు, జిజ్ఞాస జ్ఞానానికి దారితీయగా జ్ఞానం మానవుణ్ణి కొత్త అందాలూ, అందలాలూ, ఎక్కిస్తుంది కనుక మానవుడు విశ్రాంతి నెరుగని పథికుడు, ఇప్పుడున్న మానవ భావాన్ని మరింత ముందుకు

తీసుకు వెళ్లగలిగిన, మరింత పెద్ద స్థాయికి పెంచగలిగిన పద్ధతులు ఉంటే మానవవాదులు వాటికి స్వాగతం పలుకుతారు. సంజీవదేవ్‌గారు ప్రవచించే సైకో హ్యూమనిజాన్ని ఎలా సాధించడం? దేవ్‌గారి ప్రతిపాదన ప్రకారం, మానవుడే తన ప్రజ్ఞవల్ల దాన్ని సాధించగలడు. అది పూర్తిగా మానవ ప్రయత్నం మీదే ఆధారపడి ఉంటుంది. తనలోని ఉన్నత చైతన్యశక్తిని గుర్తించి దాన్ని ప్రజ్వలింపజేసి, తన ఔన్నత్యానికి బాటలు వేసుకోగల అవకాశం, శక్తీ - రెండూ మానవుడివే. అది మానవవాద ప్రక్రియ.

(రచయిత - శ్రీ ఆవుల సాంబశివరావు, ప్రముఖ మానవవాది,
ఆంధ్రప్రదేశ్ హైకోర్ట్ చీఫ్ జస్టిస్‌గా పదవీ విరమణ చేశారు)

# సంజీవదేవ్ వ్యక్తిత్వం-భావాలు

-పి. కవికుమార్.

ప్రతి వ్యక్తికీ తన స్వీయ వ్యక్తిత్వం ఉంటుంది. ఐతే కొందరి వ్యక్తిత్వాలు వాంఛనీయాలుగా ఉంటే మరికొందరివి అవాంఛనీయాలుగా ఉండవచ్చు. అదే మాదిరిగా ఉంటాయి భావాలు కూడ. వ్యక్తిత్వానికీ భావాలకూ భేదం ఎక్కడంటే వ్యక్తిత్వం కనపడుతుంది. భావాలు కనపడవు.

సంజీవదేవ్ వ్యక్తిత్వం, భావాలు కూడ ఎక్కడో ఎప్పుడో తప్ప వాంఛనీయాలుగానే ఉంటాయి. ఆయనది ఉజ్జ్వల వ్యక్తిత్వం అనే చెప్పవచ్చు. వ్యక్తిత్వం అనేది బయటి ఆచరణ మీద కొంత, లోపల ఆలోచనలమీద కొంత ఆధారపడి ఉంటుంది. ఆచరణ అనేది కొంతవరకు ఆలోచనల ప్రతిబింబమైనప్పటికీ కొందరి ఆచరణలు వారి ఆలోచనలకంటే భిన్నంగా ఉంటాయి.

సంజీవదేవ్ వ్యక్తిత్వం ఆయనతో సన్నిహిత పరిచయం ఉన్న వారికే తెలుస్తుంది కాని ఆయన భావాలు ఆయనతో సాన్నిహిత్యంలేని వారికి కూడా తెలుస్తాయి. ఆయన రచనల ద్వారా, ఆయన ప్రసంగాల ద్వారా, ఆయన వ్యక్తిత్వాన్ని తెలిసినవారు అల్పసంఖ్యలో ఉంటే ఆయన భావాల్ని తెలిసినవారు అధికసంఖ్యలో ఉంటారు. సంజీవదేవ్ రచనల్ని చదివినవారు, ప్రసంగాన్ని విన్నవారు చాలామంది ఉంటారు కనుక ఆయన భావాలు చాలామందికి అవగతం.

భావాలకు భావసౌందర్యం ఉంటే సరిపోతుంది కాని వ్యక్తిత్వానికి రూపసౌందర్యం కూడా అవసరం. వ్యక్తి అనే ఒక అస్తిత్వం ఉన్నది కనుకనే దానికి సంబంధించింది వ్యక్తిత్వం. వ్యక్తి అంటే శరీరం, మనసూ కూడా కలిసే వ్యక్తి. కనుక వ్యక్తిత్వం అంటే సుందరమైన మనసుకు తోడు సుందరమైన రూపం కూడ ఉంటే ఎక్కువ రక్తి కడుతుంది. రూపసౌందర్యం ప్రధానంగా రెండు

విధాలు - లలితరూప సౌందర్యం, గంభీరరూప సౌందర్యం. సంజీవదేవ్‌ది గాంభీర్య ప్రధానమైన రూపసౌందర్యం. ఆయన గుణసౌందర్యం కూడ అంతే కనుక ఆయన రూపసౌ దర్యం, గుణసౌందర్యం సాదృశ్యం కలిగి ఉంటాయి. అందువల్ల ఆయన వ్యక్తిత్వం ఒక విలక్షణరీతిలో ఉంటుంది. వాడుకలో ఉన్న సాధారణ సౌందర్యభావనతో పోలిస్తే ఆయన సుందరరూపి కాకపోవచ్చు. కాని ఉన్నత స్థాయికి చెందిన సౌందర్య దృష్టితో చూస్తే ఆయన సుందరుడే.

సంజీవదేవ్ అంటాడు సౌందర్యం మూడు రకాలని – సామాన్య సౌందర్యం, సగం సామాన్య సౌందర్యం, ప్రత్యేక సౌందర్యం అని. సామాన్య సౌందర్యం జన బాహుళ్యానికి నచ్చుతుంది. ఇక ప్రత్యేక సౌందర్యం చాలా కొద్దిమందికి మాత్రమే నచ్చుతుంది. యింతకూ వ్యక్తిత్వం అంటే రూపం, గుణం, ప్రవర్తన అనే మూడిటి సమ్మేళనం. ఈ సమ్మేళనం మనకు సంజీవదేవ్‌లో కనిపిస్తుంది. అంటే ఆయన వ్యక్తిత్వం ఉన్నతస్థాయికి చెందిందని అర్థం. సంజీవదేవ్ అంటాడు, వ్యక్తిలోని వ్యక్తిత్వాన్ని కొలవటానికి సరైన కొలతబద్ద ఆ వ్యక్తి ఏమి ఆలోచిస్తున్నాడు అనేది కాదు. ఏమి మాట్లాడుతున్నాడు అనేది కాదు, ఎట్లా ప్రవర్తిస్తున్నాడు అనేది. తనలోని ఆలోచనలు తనలో మాత్రమే ఉంటాయి. తన మాటలు కొంతవరకు ఇతర్ల వరకూ అందుతాయి. ఇక తన ప్రవర్తన ఎక్కువగా ఇతర్లతో ముడిపడి ఉంటుంది. అంటే, ఆలోచనలు పూర్తిగా వైయక్తికం, మాటలు సగం వైయక్తికం, ఇక ప్రవర్తన సామాజికం పూర్తిగా అని అంటాడు ఆయన. ఒకరి ఆలోచనలకంటే, మాటలకంటే, ప్రవర్తన ఇతర్లమీద ఎక్కువ మెరుగైన ప్రభావాన్ని ఎక్కువ ప్రత్యక్షంగా చేస్తుందని.

ప్రవర్తన అంటే నిత్యజీవితంలో తనపట్లా, ఇతర్లపట్లా వ్యవహరించే తీరు అంటాడు ఆయన. ఒకే వ్యక్తి ఇంటిలో ఒక విధంగా బయట మరో విధంగా సంచరిస్తారు. కొందరు యింటిలో ఎంతో మృదువుగా సంచరిస్తూ బయట కఠినంగా ప్రవర్తిస్తారు. అది సరైన ప్రవర్తన అని పించుకోదు. సంజీవదేవ్ ప్రవర్తన ఇంటా బయటా ఒకటిగానే ఉంటుంది. అయిన వాళ్ళ పట్ల అతి ఆదరణ కాని, కానివాళ్ళ పట్ల నిరాదరణగానీ చూపడు. అందుకని సమాజ విద్రోహులను ప్రోత్సహిస్తాడనీ కాదు. ఎవరిని ప్రోత్సహిస్తే మానవాళికి శ్రేయమో, ఎవరిని నిరసిస్తే సమాజానికి హాని తగ్గుతుందో అది ఆయనకు బాగా తెలుసు. అటువంటి విషయాల్లో ఆయన సక్రమ పంథానే అనుసరించి సామాజిక శ్రేయాన్ని స్థాపించటంలో వెనకాడరు.

గొప్ప వ్యక్తిత్వానికి గుర్తు ఏమంటే ఒక వ్యక్తి దగ్గరకు ఎవరైనా పోయినప్పుడు ఆ వ్యక్తిలో ఎంత ఆకర్షణ గోచరిస్తుందో ఆ వ్యక్తితో కొంత కాలక్షేపం చేసి తిరిగిరాబోయే సమయంలో కూడా ఆ మొదటి ఆకర్షణ కాని అంతకంటే మించిన ఆకర్షణ కాని నిలచి ఉండటం. సంజీవదేవ్‌ను

చూడబోయిన వ్యక్తులు ఆయన నుంచి తిరిగి రాబోయే ఘడియల్లో ఆయన్ను వదిలి రాలేక బాధపడతారు. ఇంకొంతసేపు ఆయనతో గడిపితే బాగుండునని ఆరాటపడతారు. గొప్ప వ్యక్తిత్వం అంటే అది.

ఆయన్ను చూడబోయిన వారు ఆయనకు ఎంత విలువ ఇస్తారో అంత విలువ తనను చూడవచ్చిన వారికి ఇస్తారాయన. ఆ వచ్చిన వారు పండితులా పామరులా, రసజ్ఞులా, అరసికులా, చిన్నవయసువారా, పెద్దవయసువారా, స్త్రీలా, పురుషులా అనే తారతమ్యాన్ని చూడక అందరిని సమాన దృష్టితో గౌరవించి వారు అడిగే వివిధ ప్రశ్నలకు చిరునవ్వుతో సమాధానాలిచ్చి పంపుతారాయన. కొందరు చేసే ఒక పని మాత్రం చేయరు ఆయన. అదేమంటే తనకు తెలియని విషయాలను గురించి తెలిసినట్లు నటించి జవాబులివ్వడు. తెలియని విషయాలను గురించి తనకు తెలియదని స్పష్టంగా సంతోషంగా చెప్పివేస్తాడాయన. నిజం చెప్పాలంటే ఆయనకు తెలియని విషయాలు చాలా తక్కువ ఉంటాయి.

వచ్చినవారి సాహితీ విషయాలను మాత్రమే గాక వారి కుటుంబ విషయాలను, వైయక్తిక విషయాలను కూడా తెలుసుకోటంలో ఆయన ఎంతో ఆసక్తి కనపరుస్తారు. పెళ్లి అయిన యువతీ యువకులు వస్తే వారి పుట్టిల్లెక్కడ, అత్తవారిల్లెక్కడ, ఆమె ఎంతవరకు చదివింది, ఆయన ఎంత వరకు చదివారు అనే విషయాలను అడిగి తెలుసుకొంటాడు. పెళ్లికానివాళ్లు వస్తే అవివాహిత జీవితంలోని కష్టసుఖాలు, వివాహిత జీవితంలోని కష్టసుఖాలు వారికి విశదీకరిస్తాడు. కొందరు అతిథులు వచ్చి అంటారు, మేము మిమ్మల్ని ప్రశ్నలడగటానికి రాలేదండీ, ఊరకనే చూచి పోదామని వచ్చాం అని. అందుకాయన నవ్వుతూ నేను ఏ సినిమాల్లో నటించి పేరు తెచ్చుకొన్నానని నన్ను చూడటానికి రావటం. వచ్చిన వారిలో చమత్కారి వ్యక్తి ఉంటే అంటాడు, మీ జీవితమే ఒక సినిమా, అయితే అది నటించని సినిమా అని. ఆ లెక్కలో అయితే, నా జీవితం మాత్రమే ఏమిటి, మీ అందరి జీవితాలు కూడా సినిమాలే. నేటి యుగంలో సినిమాకానిది ఏముంది, జన్మించటం సినిమా, జీవించటం సినిమా, చివరకు మరణించటం సినిమా అని.

సంజీవదేవ్ దగ్గరకు కొంచెం వయసు ముదిరిన వ్యక్తులు వచ్చినపుడు ఆయన వ్యక్తపరచిన కొన్ని గంభీర విషయాలు శ్రద్ధగా విన్న తరువాత ఆవలిస్తూ వళ్లు విరుచుకొని అనేవాళ్లు, మీ చిన్నప్పటి విషయాలు మీ స్వంత నోటి ద్వారా వినాలని ఉన్నది అని. ఆయన పెద్దగా నవ్వి అనేవాడు, రక్షించారు. నా చిన్నప్పటి విషయాలు నా పెద్దతనంలో చెప్పమని కోరారు. ఆవిధంగా కాక నా పెద్దతనపు విషయాలను చెప్పమని నా చిన్నతనంలోనే కోరలేదు. ఆవిధంగా నా చిన్నతనంలో నేను కోరబడి ఉన్నట్లయితే ఏమిటనే వాడినో ఊహించలేకుండా ఉన్నాను. నోటితో

చెపితే ఎన్నని చెప్పగలను? ఆ వివరాలన్నీ నా స్వీయచరిత్ర మొదటి భాగమైన 'తెగిన జ్ఞాపకాలు' లో ఉన్నాయి. వాటిని మీరు తీరికగా చదువుకోండి అని. ఆయన తనకంటే చిన్నవారి ఎదుట గంభీరంగా మాట్లాడేవాడు. తనకంటే పెద్దవారి ఎదుట గాంభీర్యాన్ని తగ్గించి మాట్లాడేవాడు. ఇక తనకంటే పెద్దవారి ఎదుట గాంభీర్యాన్ని పూర్తిగా విడనాడి తాను నవ్వుతూ, వారిని నవ్విస్తూ చమత్కారాలు విసిరేవారు

ఎపుడైనా ఒక్కొక్క అతిథి అనేవారు, మేము వచ్చి మీ విలువైన కాలాన్ని నష్టపరుస్తున్నాం అని. ఆయన జవాబు చెప్పేవాడు, లేదు అదేమీ లేదు. నా విలువైన కాలాన్ని ఎవరూ నష్టపరచలేరు. కారణం మీరు నష్టపరచామని నమ్మే నా కాలం ఎంత విలువైనదంటే మీ చెంత నష్టపరచబడేంత దుర్బలమైనదికాదు. నిజం చెప్పాలంటే నేను వ్రాసుకోటం. చదువుకోటం, చిత్రించుకోటం మొదలైన పనుల కాలపు విలువ మీ వంటి మిత్రులతో గడిపే కాలానికంటే ఎక్కువ విలువ అయిందేమీ కాదు. మీతో గడిపే కాలం నా కాలానికి నష్టం అనుకోను. లాభమే అనుకొంటాను. కనుక నాకు లేని నష్టాన్ని మీరు ఊహించుకొని బాధపడవద్దు. మీరాకకు నేను సంతోషిస్తాను. మీరు ఇక్కడ ఉండటానికి నేను సంతోషిస్తాను. కాని నేను సంతోషించని తరుణం ఒకటి ఉంటుంది. ఇది మీరు పోబోయే సమయం. ఆది మధ్యలను ఆనందించ గలుగుతున్నాను. కాని అంతాన్ని ఆనందించలేక పోతున్నాను, ఇప్పటి వరకు. ఇక ముందు దాన్ని కూడ ఆనందించే సాధన చేసి సఫలత పొందగలనని ఆశిస్తున్నాను.

అటువంటప్పుడు మీకు బాధకలిగించకుండా ఉండే నిమిత్తం మేము మీ ఇల్లు వదలి పోకుండా ఇక్కడే ఉంటాంలెండి అని అనేవారు కొందరు చతురులైన అతిధులు. అందుకు ఆయన తధాస్తు అనేవాడు.

సంజీవదేవ్ వ్యక్తిత్వం చాలా విలక్షణం కలదని ఇది వరకే చెప్పుకున్నాం. ఆ విలక్షణం ఆయన దైనందిన జీవితపు ప్రతి చిన్న పనిలోను ప్రతిబింబిస్తుంటుంది. ఆయన నడకలోను, పడకలోను, రచించటంలోను, వచించటంలోను, ఆలోచించటంలోను, విలోకించటంలోను, ఇతర్లకు మర్యాద చేయటంలోను, ఇతర్లనుంచి తాను మర్యాద పొందటంలోను, ఇంకా ఎన్నిటిలోనో ఆయన సహజ వ్యక్తిత్వం తొంగి చూస్తూంటుంది. నెమలిని చూచి ఆనందించినంత గాఢంగా ఒకే ఒక నెమలీకెను చూచికూడ ఆనందిస్తాడు. పచ్చి ఆకును చూచి తన్మయుడైనట్లే పండుటాకుని చూచి, ఎండుటాకుని చూచి కూడ తన్మయుడవుతాడు. రాజనైతిక విప్లవం, ఆర్థిక విప్లవం, సామాజిక విప్లవం గొప్పవే సందేహం లేదు. వీటన్నిటిలోకీ భావవిప్లవం గొప్పది అంటాడు ఆయన. కారణం మిగతా విప్లవాలన్నీ కూడా భావవిప్లవం నుంచి పుట్టినవేనట. తిరిగి

మరో మాట కూడ అనటం మరువడు ఆయన బాహ్యావిప్లవాలన్నీ భావ విప్లవం నుంచి ఉద్భవించినట్లే కొన్ని భావ విప్లవాలు కూడా బాహ్యావిప్లవాల వత్తిడి ద్వారా ఉద్భవిస్తాయని.

సంజీవదేవ్ జీవితంలో బాల్యం నుంచీ ఎన్ని విధాల భావవిప్లవాలో ఉదయించి తమ ప్రభావాలను ఆయన జీవన స్రవంతి మీద ప్రభావం చేసినాయి. ఆయన అంటాడు తన భావాలు ఇతర్ల జీవితాలను, ఇతర్ల భావాలు తన జీవితాన్ని ఎంతవరకు ప్రభావితం చేసినాయో స్పష్టంగా తెలియదు కాని తన భావాలు తన జీవితాన్ని మాత్రం ఎంతగానో ప్రభావితం చేసినట్లు తనకు స్పష్టంగా తెలుసు అని. తన భావాలు తన జీవితాన్ని మలచినట్లే తిరిగి తన జీవితం కూడా తన భావాలను తగినంతగా మలచటంలో సఫలమైంది

భావాల వ్యక్తరూపం జీవితం, జీవితపు అవ్యక్తరూపం భావాలు అంటాడు ఆయన. సంజీవదేవ్ భావధార వివిధ రంగాల్లో జలజల ప్రవహించింది. లయాత్మకంగా ఒకోసారి వేగంగా, మరికొన్ని సార్లు కనపడని కదలికతో మొదటిగా ఆయన భౌతిక భావాలేమిటో చూడాలి. ఆయన తన్ను తాను ఒక చేతనాభౌతిక వాదిని అని చెప్పుకుంటాడు. ఆయన బాల్యజీవితం ఆదిదైవికంగా ప్రారంభమై చాలా కాలం వరకు ఆ విధంగా సాగి తరువాత ఆయన మానసం వికసించిన కొద్దీ తన జీవితం కొంతకాలం పాటు ఆధ్యాత్మిక వాతావరణంతో కప్పబడి తరువాత మేధ పెరిగిన కొలదీ మళ్ళీ ఆదిభౌతిక భావన ఆయనలో ప్రవేశించిందంటాడు సంజీవదేవ్. అయితే ఆ ఆదిభౌతిక భావన స్థూలమైన జడభౌతికం కాదనీ, సూక్ష్మమైన చేతనా భౌతికం అనీ ఆయన తలంపు. 1979 లో ఒక మిత్రునికి వ్రాసిన లేఖలో ఆయన అంటాడు -

"On the concept of the existence of God you have mistaken me to a greater extent, if not to the fuller extent. If am not a person believing that there is nothing beyond reason. Every belief is not a truth in the same way as every belief is not a falsehood. I am aware of the existence of higher planes of consciousness which quite form the commonsense Belief in God is a matter of personal faith. For myself, I do not believe in a personal God, I believe in divinity - a state of highest conseiousness after attaining which human self feels unafraid, liberated from the clutches of sorrow and suffering".

'భగవంతుని అస్తిత్వాన్ని గురించిన నా భావనను మీరు పూర్తిగా కాకపోయినా, చాలా వరకు అపార్థం చేసుకున్నారు. హేతువుకు ఆవల మరేమీ లేదని నమ్మే వ్యక్తిని కాను నేను, ప్రతి నమ్మకమూ సత్యంకాదు, అదేవిధంగా ప్రతి నమ్మకమూ మిధ్యకూడా కాదు. చైతన్యపు ఊర్ధ్వస్తరాలు ఉంటాయనీ, అవి మామూలు తెలివి కంటే భిన్నంగా ఉంటాయనీ నేనెరుగుదును.

భగవంతుని మీది నమ్మకం ఒక వైయక్తిక విశ్వాసం. స్వయంగా నేను వ్యక్తిరూపంలోని భగవంతుడున్నాడని నమ్మను. దైవత్వంలో ఉన్నది నాకు నమ్మకం. అదొక అత్యున్నతమైన చైతన్యపు స్థితి. దాన్ని అందుకున్న తరువాత మానవుడు తాను నిర్భయుడుగాను, బాధలు, వ్యధల నుంచి విముక్తుడైనట్లుగాను అనుభూతి చెందుతాడు'.

పై విషయాలను రాసేంతవరకు సంజీవదేవ్‌లో కొంత ఆధ్యాత్మిక వాతావరణం అలముకొని ఉన్నట్లు తెలుస్తుంది. వ్యక్తి రూపంలో ఉన్న భగవంతుని యందు కాక ఒక దైవిక స్థితిలో ఆయనకు నమ్మకం ఉన్నట్లు చెపుతాడు. 1963 లోని ఒక లేఖలో అంటాడు – 'నేను నాస్తికుడనా ? కాదు పరమ ఆస్తికుడను. అందుకని మతం పేరుతో, భక్తి పేరుతో జరిగే బాహ్య కర్మకాండలు నాకు నచ్చవు. నాది 'గౌణభక్తి' కాదు, నాది 'పరాభక్తి' నాకు నిర్గుణోపాసన ఎక్కువ ఇష్టం' పై వాక్యాలను బట్టి చూస్తే ఆ కాలంలో ఆయన ఒక సూక్ష్మమైన ఆధ్యాత్మిక దశలో సాగిపోతున్నట్లు తెలుస్తుంది.

తరువాతి కాలంలో ఆయనలో ప్రవేశించిన భావవిప్లవం ఆయన్ను పూర్తిగా ఆ దశ నుంచి మార్చివేసి చైతనాభౌతిక వాదిగా తయారుచేసింది. ఈ తరువాత దశలో సగుణం లేదు, నిర్గుణం లేదు, ఉన్నదల్లా చైతన్యమే. అందుకే ఆయన తనను తాను Atheist నే కాని psycho-atheist ను అని చెప్పుకోసాగేడు. మానవతయే తన మతమని, హేతువాదమే తన నినాదమనీ అంటుండే వాడు. అయితే ఇవి జడమయాలుగా ఉండక చైతన్యమయాలుగా ఉండాలి, అంటాడు ఆయన. కనుకనే దీన్ని Psycho-humanism అన్నాడు ఆయన.

ఆయన ఎందరెందరికో ఉజ్జ్వలంగా జీవించటానికి ఉత్సాహాన్నీ, ప్రోత్సాహాన్నీ ఇస్తుంటాడు తన లేఖల ద్వారా రచనల ద్వారా, వేదికల మీది ప్రసంగాల ద్వారా 'లేఖల్లో సంజీవదేవ్' అనే దానిలో ఒకరికి జవాబు వ్రాస్తూ అంటాడు 'అవును, నేను సంజీవ్‌నే, ప్రపంచంలో మరణించే వాళ్లను మరణించనీయను, బాధపడేవాళ్లను బాధపడనీయను, వార్ధక్యం మీద పడుతున్న వాళ్లను పడనీయను, వియోగబాధను అనుభవించే వాళ్లను అనుభవించనీయను, నిరాశ చెందేవాళ్లను చెందనీయను. మరి వీటన్నింటినీ చేయక ఏమి చేస్తానంటే పై పనులన్నిటికి వ్యతిరేకం చేస్తాను. పైవన్నీ చీకటికి చెందినవి. వాటికి వ్యతిరేక మైనవన్నీ వెలుగుకు చెందినవి'.

ఈ విధంగా ఆయన ఎన్నెన్నో ఉజ్జ్వల భావాలను ఇతర్లకు పంచి ఇస్తుంటాడు. ఎంత మందికి రాసినా ఆ ఉత్తరాలలో పునరుక్తి తక్కువగానే ఉంటుంది. సరికొత్త పరిమళం వ్యాపిస్తూనే ఉంటుంది. పూవుల పరిమళం ఎక్కువ కాలం నిలచి ఉండదు, కాని ఆయన భావాల పరిమళం

చాలాకాలం వరకూ గుభాళిస్తూనే ఉంటుంది. పుష్పపరిమళం పుష్పంతో బాటు నశిస్తుంది కాని భావ పరిమళం భావాలు నేపథ్యంలోకి పోయినా కూడా ప్రత్యక్షమౌతూనే ఉంటుంది. పుష్ప పరిమళాన్ని జ్ఞాపకం ఉంచుకోజాలం, భావపరిమళం నిరంతరం స్మృతిఫలకం మీద మేల్కొనే ఉంటుంది.

మీకు ఇటువంటి కమనీయ భావాలు ఎట్లా వస్తాయని అడిగితే ఆయన జవాబు చెపుతాడు 'భావాలు రావటమేమిటి? భావాలు వాటంతటి అవి మనను వెదుక్కుంటూ రావు, మనమే వాటిని వెదుక్కుంటూ వెళ్లి పట్టుకోవాలి. భావాలను సృష్టించుకోవాలి కాని వాటంతట అవి సృష్టి అయి ఉండవు. ఆ భావంలో నుంచి భావాన్ని సృష్టిస్తాడు భావుకుడు. భావాన్ని సృష్టించక ముందు ఉన్న ఆ భావం అంతా శూన్యంగా ఉంటుంది. భావసృష్టితో శూన్యం పూర్ణంగా రూపొందుతుంది. ఆ భావం చీకటి, భావం వెలుగు, భావాల వెలుగు ఆ భావపు చీకటిని వెలుగు చేస్తుంది'.

అంటే నిస్తేజంగా కూచొని రచనకు కాని మరో దానికి కాని ప్రేరణ జనించటం లేదనటం క్రియా రాహిత్యానికి లక్షణం, ప్రాణస్పందనకు వ్యతిరేకం. సృజన కార్యానికి వస్తు జగత్తు అవసరం లేదనటం అబద్ధమే అవుతుంది కాని అంతకంటే పెద్ద అబద్ధమవుతుంది, వ్యక్తి జగత్తు అవసరం లేదనటం. సృజన కార్యంలో వస్తుమూల్యం, వ్యక్తి మూల్యం రెండూ అవసరమే కాని వ్యక్తి మూల్యం ప్రధానావసరం అంటాడాయన.

ప్రయోజనీయమైన మనోవైజ్ఞానిక సత్యాలెన్నో ఆయన జీవితంలో జీర్ణించి ఉన్నాయి. వాటిని తనలో జీర్ణింప చేసుకోవటంలో మాత్రమే ఆయన సంతృప్తి చెందక అటువంటి ఉజ్జ్వల సత్యాలను ఇతర్లకు పంచిపెట్టడంలో ఆయనకెంతో సంతృప్తి, సంతుష్టి. తానుబాధపడుతూ ఇతరులను సంతోష పెట్టాలనటం ఆయన ఆదర్శం కాదు తాను సంతోషపడుతూ ఇతర్లను కూడా సంతోషపెట్టాలంటాడు ఆయన. తన బాధ ఇతర్ల సంతోషానికి కారణం కాకూడదనీ తన సంతోషమే అందుకు కారణం కావాలనీ ఆయన ఆదర్శం. ఇతర్లు బాధపడటం తనకు ఎంత బాధాకరమో తాను బాధపడటం కూడా అంత బాధాకరమే తనకు. బాధ అనేది ఎవరికైనా బాధాకరమే. ఎవరికీ సుఖకరం కాదు కనుక తానూ ఇతర్లూ కూడా బాధపడరాదని అంటారు తన రచనల్లో. ప్రతిపుటలో మాటల కంటే భావాలే ఎక్కువ ఉంటాయని చాలా మంది పాఠకులు అంటుంటారనీ, అది వాస్తవమే అని ఆయన అంగీకరిస్తూ తాను మాటల ద్వారా భావాలను అభివ్యక్తం చేయననీ, భావాల ద్వారానే మాటలను అభివ్యక్తం చేస్తాననీ చిరునవ్వుతో ఆయన నెమ్మదిగా వచిస్తాడు. తాను రచించే దాన్నంతటినీ గురించీ వచించాలంటే తాను

వచించేదానికంటే తాను రచించేది తక్కువై ఉండాలట. ఒక గీతను పెద్దదిగా చూపాలంటే దాని క్రింద ఒక చిన్న గీత గీయాలట. ఒక గీతను చిన్నదిగా చూపాలంటే దానికి పైన ఒక పెద్ద గీత గీయాలట. ఆయన మాటలు, భావాలు పైవిధంగా, వైచిత్రితో రూపం దాలుస్తుంటాయి.

'నా చేష్టలను కొన్నిటిని చూచి కొందరు నన్ను anti-social అని అంటారు. నిజం చెప్పాలంటే నేను anti-social ని కాను, నేను super-social ని' అంటుంటాడు దేవ్ మీరు ఎక్కువగా ప్రకృతి చిత్రాలను రచిస్తారు కాని మానవమూర్తుల జోలికి పోరు ఎందుకని అని అడిగితే ఆయన జవాబిస్తారు – ప్రకృతిని, ఎంత వికృతంగా చిత్రించినా కూడా ఆ ప్రకృతి చిత్రకారుని మీద కోప్పడదు, ఆయనకు చిత్రకళ తెలియదని నిందించదు. చిత్రకారుని చేతిలోని చిత్రాన్ని లాగి చించి వేయదు, కాని అటువంటి కృత్రిమ చిత్రం ఏ మానవునికైనా చెందింది అయితే ఆ మానవుడు ఆ చిత్రకారునిపై కోపగించుకోవటమే కాదు, నిందించటమే కాదు, ఆ చిత్రాన్ని చించివేయటమే కాదు, ఆ చిత్రకారునికి దేహశుద్ధి చేయటానికి కూడా వెనుకాడడు. అందుకే తాను తన చిత్రరచనలో మానవమూర్తుల జోలికి పోను అంటాడు నవ్వుతూ.

జన్మించటం అందరివల్ల అవుతుందట, మరణించటం కూడా అందరివల్ల అవుతుందట, కాని జీవించటం అందరివల్ల కాదట. పుట్టినప్పుడు అందరూ సంతోషిస్తారు, మరణించినప్పుడు అందరూ దుఃఖిస్తారు. కానీ జీవిస్తున్నప్పుడు దుఃఖం, సంతోషం రెండూ ఉంటాయి. జీవిస్తున్న వ్యక్తి దుఃఖ సమయంలోను కన్నీరు కారుస్తాడు. సంతోష సమయంలోను కన్నీరు కారుస్తాడు. సంతోష సమయంలో దుఃఖిస్తున్నాడా, దుఃఖ సమయంలో సంతోషిస్తున్నాడా అని తెలియదు. జీవించటంలో ఉన్న మరో ఇబ్బంది ఏమంటే జన్మించటం అనేది కొన్ని నిమిషాల్లోనే అయిపోతుంది. మరణించటం అనేది కూడా కొన్ని నిమిషాల్లోనే అయిపోతుంది. కాని జీవించటం అనేది సంపత్సరాలకు సంవత్సరాలు పడుతుంది. ప్రతి సంవత్సరానికి పన్నెండు నెలలు ఉంటాయి. నెలకు ముప్పయి రోజులుంటాయి. ఆ ముప్పయి రోజుల్లో పదిహేను రోజులు మాత్రమే వెన్నెల ఉంటుంది. మిగతా పదిహేను రోజులు చీకటిలోనే గడపాలి. ఈ తారతమ్యాలు కాలంలో మాత్రమే కాక జీవితంలో కూడా ప్రత్యక్షమై కొంతసేపు జీవితానికి బాధ కలిగించి మరికొంత సేపు సుఖం కలిగిస్తాయి. మనిషి తన సుఖాన్ని సంతోషంతో ఓర్చుకోగలడే గాని బాధను ఓర్చుకోలేడు. కనుక తన సుఖాన్ని గురించి అంతగా పట్టించుకోక బాధను గురించే ఎక్కువగా పట్టించుకొని జీవితాన్ని చీకటిమయం చేసుకుంటాడు. సుఖం కలగబోతున్నదనే సంతోషం మనిషిని భయపెట్టదు కాని బాధ రాబోతున్నదనే దుఃఖం ఎంతో భయపెడుతుంది. భయానికంటే మించిన బాధ ఏముంటుంది ? అందుకే జన్మించటం కంటే మరణించటం కంటే

జీవించటం కష్టమైన పని అంటాడు ఆయన. ఐనా మనిషి జీవించటానికే ఇష్టపడతాడు. కారణం, పదిహేను రోజులు చీకటి కంటే మిగతా పదిహేను రోజుల వెన్నెలనే ఎక్కువ ప్రేమిస్తాడు. ఎక్కువ రోజుల వియోగంకంటే తక్కువ రోజుల సంయోగాన్నే ఎక్కువ ప్రేమిస్తాడు. పదిగ్రాముల చేదుకంటే ఒక గ్రాం తీపినే ఎక్కువ ప్రేమిస్తాడు. తన జీవితంలో సంవత్సరం అంతా బాధ ఉండి ఒక్కరోజు మాత్రమే ఆనందం ఉంటే ఆ సంవత్సరం బాధ కంటే ఆ ఒక్కరోజు ఆనందాన్నే ఆ వ్యక్తి ప్రేమిస్తాడు. బాధామయమైన ఆ సంవత్సరం అంతా ఆ వ్యక్తి ఎందుకు జీవించాడంటే ఆనందమయమైన ఆ ఒక్కరోజు నిమిత్తమే. ఇదీ సంజీవదేవ్ జీవనవాదం. తన ప్రియతమ సంవత్సర దీర్ఘ వియోగాంతంలో ఒక్కరోజు ప్రత్యక్షమైనా ఆ సంవత్సర కాలపు వియోగ బాధను మరచి ఆ ఒక్కనాటి సంయోగంలో అనంతానందాన్ని పొందుతాడు. ఎవరి జీవితమూ శూన్యం కాదు. దుఃఖంతో, సుఖంతో నిండే ఉంటుంది. ఈ రెంటిలో ఏదీ కూడ క్రియాత్మకంగా లేనప్పుడు అనిపిస్తుంది జీవితం శూన్యంగా. ఆ రెంటిలో కొందరిలో ఒకటి ఎక్కువ ఉంటే మరికొందరిలో రెండవది ఎక్కువ ఉంటుంది. ఆదర్శమేమంటే దుఃఖ భాగాన్ని తగ్గించుకొని ఆనంద భాగాన్ని ఎక్కువ చేసుకోటం, సంజీవదేవ్ ఇందుకు సజీవ సాక్ష్యం.

ప్రేమించటం, ద్వేషించటం అనేది పరస్పర వ్యతిరేకాలు. మొదటిది గొప్పదని, రెండవది హీనమని భావించబడుతున్నాయి. ప్రేమించటమే కాదు, ప్రేమించబడటం, ద్వేషించటమే కాదు, ద్వేషించబడటం కూడా ఉంటుంది. ఈ రెండు పనులూ కూడ యోగ్యుల వల్ల అయోగ్యుల వల్ల కూడా జరుగుతాయి. మనకు ఇష్టమైన వాళ్లను ప్రేమిస్తాం, అయిష్టమైన వాళ్లను ద్వేషిస్తాం ఈ విధంగా అంటూ సంజీవదేవ్ మరో విధంగా త్రిప్పుతారు దాన్ని. మనం యోగ్యులను మాత్రమే ప్రేమించినా మనం ప్రేమించబడతాం అయోగ్యుల చేత కూడా. యోగ్యులను ప్రేమించటంలో ఆనందం ఉంటుంది. వారి చేత ప్రేమించ బడకపోవటంలో బాధ ఉంటుంది. అయోగ్యులను మనం ప్రేమించినా బాధగానే ఉంటుంది, వారిచేత ప్రేమించబడినా బాధగానే ఉంటుంది. ప్రేమ అనేది ఒకటే అయిన స్థల కాలాలను బట్టి అది మారుతుంటుంది. ఒక ప్రేమ అనేదే ఏమిటి? స్థలకాలాలను అనుసరించి మారనిదిలేదేమో? స్థలాన్ని అనుసరించి కాలం, కాలాన్ని అనుసరించి స్థలం కూడ మారుతుంటాయి. ఇటువంటి మాటలు ఆయన నోటి నుంచి, కలం నుంచి కూడా అప్రయత్నంగా జారిపడుతుంటాయి.

సంజీవదేవ్ వస్తు ద్రష్ట అయినట్లుగానే స్వప్న ద్రష్ట కూడా. ఆయన నిద్రలో ఎటువంటి స్వప్నాలను దర్శిస్తాడో తెలియదు గాని మేల్కొని దర్శించే స్వప్నాలేమిటో మనకు తెలుస్తాయి. ఆయన మనకు వాటిని తెలుపుతున్నందువల్ల. అవే దివాస్వప్నాలనబడతాయి. ప్రతి స్వప్నమూ

అది నిశా స్వప్నమయేది దివా స్వప్నమయేది, సర్రియలిస్టిక్/ అధివాస్తవ / రూపమే. స్వప్నంగా రూపొందే వాస్తవ రూపాలు అరుదుగా మాత్రమే ఉంటాయి. వాస్తవ జగత్తులోని ఏ మానవునికీ కొమ్ములుండవు. మొదళ్లు పైకీ కొమ్మలు క్రిందకూ ఉన్న చెట్లుండవు. రెండు కాళ్లూ రెండు చేతులూ కలిగిన పాములుండవు, ఆకసంలో ఎగురుతూ పోతున్న పులులూ, సింహాలు ఉండవు. ఆకుపచ్చని గుర్రాలుండవు, ఇంకా ఎన్నో ఇటువంటి వింత రూపాలుండవు. కాని స్వప్న జగత్తులో సర్రియలిస్టిక్ లోకంలో ఇవన్నీ ఉంటాయి. ఆధునిక రూపకళల్లో, ప్రత్యేకించి బాలల చిత్ర కళలో ఇవన్నీ ఉంటాయని ప్రత్యక్ష పరుస్తాడు దేవ్. వాస్తవానికి దూరమైనదంతా అధివాస్తవికమే మరి.

ఆయనవి కొన్ని చిన్న మాటలుంటాయి ఎంతో పెద్దవిగా –

'నేను ఎండు వేదాంతిని కాదు, వ్యక్తుల జీవితాల్లోని ఎండ, నీడల్ని తెలుసుకోటంలో నాకెంతో అభిలాష, ఆనందం'. 'అదేమిటి, దేశమంటే మట్టికాదోయ్ దేశమంటే మనుషులోయ్ అనటం? దేశమంటే ప్రధానంగా మట్టి. మట్టి పుట్టిన తరువాతే మట్టి మీద మనుషులు పుట్టారు'.

'ప్రతి మనిషీ తన జీవితంలోని అంతిమ లక్ష్యం ఏమిటో నిర్ణయించుకొని, దాని కిరణాల వెలుగులో నడిస్తే జీవితం ఎంతో సుఖంగా ఉంటుంది. లక్ష్యాన్ని నిర్ణయించుకోని జీవితం, స్టీరింగ్ లేని కారు వంటిది, చుక్కాని లేని పడవ వంటిది'.

'జీవితంలో పతనం కాకుండా ఎవరూ ఉండరు. కాని ఒకసారి పతనమైతే వాళ్లకు తిరిగి లేవబుద్ధికాక ఆ పతనావస్థనే సాగిస్తూ ఇక అందులోనే లేవలేక ఉండిపోతారు. ఇది ఆదర్శం కాదు. పతనం అయినపుడల్లా తిరిగి నూతనోత్సాహంతో పైకి లేవ ప్రయత్నించాలి'.

'జీవితం అపజయాన్ని పొందటం అసమర్ధత కాదు. జయం పొందలేనపుడు అప జయాన్ని పొందటమైనా గొప్ప సాహసకృత్యం. అపజయాన్ని పొందలేకపోవటం గొప్ప అసమర్ధత. కొన్ని అపజయాలు కలిసి ఒక జయాన్ని సాధించగలవు'.

'ఆత్మాభివ్యక్తి సెల్ఫ్– ఎక్స్‌ప్రెషన్‌కి లావణ్యాన్ని చేకూర్చేది భాషమాత్రమే కాదుగా, భావ గంభీరత అవసరం కదూ, సుందరమైన భావావళిలేని సుందరమైన పదావళి పాఠకుని హృదయం పై అంతగా ముద్రవేయజాలదు. కాని ఇందుకు వ్యతిరేకంగా, సుందరమైన పదావళిలేని సుందరమైన భావావళి పాఠకునిపైన మంచి ప్రభావాన్ని వేస్తుంది'.

'ఒకోసారి మనకు ఇష్టం లేని ప్రతికూల పరిస్థితులు అనేకం వస్తుంటాయి. వాటికి మనం చింతిస్తూ కూచుంటే లాభం లేదు. పరిస్థితులు మనకు అనుకూలంగా మారనపుడు వాటికి

అనుకూలంగా మనం మారాలి. లేనిచో సంఘర్షణ తప్పదు'.

జీవితంలో చింత అనేది మానవుడిని ఎంతో దుఃఖపెడుతుంది. చింత అంటే దుఃఖం, చింత అంటే ఆలోచన కూడ. చింత అనేదాన్ని ఎక్కువగా దుఃఖం క్రిందనే వాడతారు. దీన్ని గురించి బహుశా శంకరాచార్యుడో, లేక మరెవరో కాని అందమైన శ్లోకం రచించాడు.

'చింతాయాశ్చ చితాయాశ్చ బిందుమాత్రం విశిష్యతే

చితాదహతి నిర్జీవం చింతాదహతి జీవినమ్

చింత అనే పదానికీ చిత అనే పదానికీ సున్నా మాత్రమే భేదం కనపరుస్తుంది. చితి నిర్జీవులను దహిస్తే చింత దహిస్తుందట సజీవులను. ఈ శ్లోకం సంజీవ దేవ్‌కు చాలా ఇష్టమైనదట. ఆయన సంస్కృత విద్వాంసుడు కాకపోయినా కొన్ని విశిష్టమైన సంస్కృత శ్లోకాలు ఆయన నోటికి వచ్చు.

సంజీవదేవ్‌దృష్టిలో జీవితమనేది ఒక మహాపరీక్ష. ఆ విషయాన్ని గురించి కొన్ని మాటలంటాడు – 'జీవితంలోని అన్ని పరీక్షల కంటే జీవితమే స్వయంగా ఒక గొప్ప పరీక్ష. మిగతా పరీక్షల్లో ఉత్తీర్ణులు కావటం సులభం, కాని జీవన పరీక్షలో ఉత్తీర్ణులు కావటం మాత్రం అంత సులభం కాదు. మిగతా పరీక్షలు ఒక నాటికి ముగిసిపోతాయి. కాని జీవన పరీక్ష మాత్రం ఏనాటికీ ముగియని పరీక్ష. అది మరణంతో పాటే ముగిసే పరీక్ష. మరణానంతర జీవితం ఉన్నదని నమ్మేవాళ్లకు అది మరణంతో కూడా ముగియదు'.

'సమర్థులైన వాళ్లు జీవన పరీక్షలో ప్రతి క్షణం నెగ్గినట్లే భావిస్తారు. అసమర్థులైనవాళ్లు ప్రతిక్షణం విఫలు లైనట్లుగా భావిస్తారు. ఇక సమర్థులకూ అసమర్థులకూ మధ్య ఉన్న సగం సమర్థులూ సగం అసమర్థులూ జీవన పరీక్షలో జయాన్నొకసారి, అపజయాన్నొక సారి వరిస్తూ జయాపజయాల మధ్య నలుగుతూ జయం వైపుకు పురోగమించే సాధనలో సతమతమవుతూ ఉంటారు. జయాన్ని అందరూ భరించగలరు కాని అపజయాన్ని అందరూ భరించలేరు. అపజయాన్ని చిరునవ్వుతో భరించగలవారు వీరులు, ధీరులు'. మరి సంజీవదేవ్ జీవితపు అగ్ని పరీక్షలో ఎంతవరకు నెగ్గటం జరిగిందో స్వయంగా ఆయనకు తెలుసునో లేదో ఆయనకే తెలియాలి. అది మనకు తెలుసుననుకోటం మిధ్య అవుతుందేమో.

శక్తి అశక్తి ఈ రెండూ కూడ మనిషిలో దాగుడుమూత లాడుతుంటాయి. ఇటువంటి వ్యతిరేక శక్తులను అనుశీలించి వాటి సత్యాసత్యాలను ఇతర్లకు అందించటంలో దేవ్ చతురుడు–

'మానవునిలో అనంతశక్తి ఇమిడి ఉంది. మనిషికి సాధ్యం కానిదంటూ లేదు. అయితే ఏమి, మానవునిలో అనంత బలహీనత కూడ ఇమిడి ఉంది. అందుకని ఆయనకు అంతా అసాధ్యమే. అయితే, ఈ రెంటినీ ఉపయోగించుకోటం మానవుని ఇష్టం మీదనే ఆధారపడి ఉంది. బలహీనాన్ని అణగద్రొక్కి బలాన్ని మాత్రమే చేపట్టితే ఏ పనీ అసాధ్యం కాదు. విజయ సాధనకు ఆంతరిక వీరత్వమే ప్రధానం. వీరత్వం సమసితే భీరుత్వం తన వేయి పడగల నెత్తుతుంది. అటువంటి అవకాశమివ్వకుండా మేల్కొని ఉండటంలోనే ఉన్నది కార్యసిద్ధి'.

సంజీవదేవ్‌తో వ్యక్తిగత పరిచయం ఉండి, ఆయన సమక్షంలో కొంత సమయం గడప గలిగినవాళ్లకు ఆయన వ్యక్తిత్వాన్ని కాకపోయినా వాని ఛాయలనైనా తెలుసుకునే వీలుంటుంది. ఆయన భావాలతో మాత్రమే పరోక్షంగా పరిచయం ఉన్నవారికి ఆయన వ్యక్తిత్వం తెలియరానంత అస్పష్టంగా తెలుస్తుంది. చివరిలో ఆయనవి మరికొన్ని మాటలను చెప్పి ఈ రచనను ముగిస్తాను.

'మానవుడు జన్మించినపుడు వ్యావహారిక జీవికాదు, ఆహార జీవి మాత్రమే. కొంత పెరిగిన తరువాత ఆహారానికి తోడు విహారం కూడా సమ్మిళితమవుతుంది. ఇంకా పెద్ద అయిన తరువాత ఆహార విహారాలకు తోడు వ్యవహారం కూడా కలుస్తుంది'.

'వ్యవహారజగత్తులో జీవిస్తున్నాం కనుక వ్యవహార జోక్యం లేకుండా ఏ వ్యక్తీ జీవించలేడు. అందుకనే ఎక్కువగా వ్యవహారిక జీవితాన్ని గడిపితే వ్యక్తిలోని రసానందం, హృదయానుభూతి, ప్రాణస్పందన మొదలైనవి పల్చబడిపోతాయి. కనుక వ్యక్తి సాధ్యమైనంతవరకు వ్యవహారిక జగత్తునుంచి ఎల్లప్పుడూ కాకపోయినా, అప్పుడప్పుడు బయటపడి ఆలోచనా జగత్తులో, అనుభూతి జగత్తులో నివసించితేనే జీవితానికి కాంతీ, శాంతీ లభ్యమయేది'.

(రచయిత –పి. కవికుమార్, విశాఖపట్నంలోని
డ్రెడ్జింగ్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా లిమిటెడ్‌లో అసిస్టెంట్ మేనేజర్ (మెటీరియల్స్)
పదవిలో ఉన్నారు.)

# రసభావకుడు-డాక్టర్ సంజీవదేవ్

*డా. కొండలరావు వెలిచాల*

"Transformation of (aesthetic) impression into (aesthetic) expression is Art" అంటారు సంజీవదేవ్.

'రసదృష్టి ముదిరితే యోగదృష్టి' అంటారు

సంజీవదేవ్ 'రసజీవి'.

సంజీవదేవ్ జగత్తు 'రసజగత్తు'.

సంజీవదేవ్ భావన 'రసభావన'.

సంజీవదేవ్ అభివ్యక్తి 'రసాభివ్యక్తి'.

సంజీవదేవ్ కళ 'రసకళ'.

ఆయన ఏది మాట్లాడినా రసవత్తరంగా మాట్లాడతారు. ఏది రాసినా రసవత్తరంగా రాస్తారు. ఏది సమీక్షించినా రసవత్తరంగా సమీక్షిస్తారు. ఏ చిత్రం గీసినా రసవత్తరంగా గీస్తారు. ఆయన నివాసం ఓ కళ, ఆయన జీవితమే ఓ కళ. ఆయన చింతనే ఓ కళ. అందుకే ఆయన 'కళల్లో కల్లా అతి ఉత్తమమైన కళ 'జీవితకళ'. జీవితాన్ని కళాత్మకంగా జీవించేవాడే నిజమైన కళాకారుడు. 'సృజనాత్మకంగా జీవించడమే అన్ని కళల్లోకల్లా అతిగొప్ప కళ' అని అంటారు.

ఆయన సాహిత్య ప్రక్రియలు రంగులకు బదులు, రేఖలకు బదులు అక్షరాలతో అమర్చిన చిత్రాలు, విచిత్రాలు.

రసవత్తరంగా చెప్పడమంటే ఏది చెప్పినా, ఏ విషయం గురించి చెప్పినా, అద్భుతంగా, అమోఘంగా, ఆశ్చర్యకరంగా చెప్పడమని మనమనుకుంటే సంజీవదేవ్ ఏ విషయం చెప్పినా రసవత్తరంగా చెప్పారని అనక తప్పదు. తుదకు మృత్యువు గురించి చెప్పినా ఎంతో మృదువుగా చెప్పారని అనక తప్పదు.

ఆశ్చర్యం! ఎన్నెన్ని విషయాల గురించి చెప్పారు? చెప్పిందల్లా ఎంత అందంగా, ఎంత అర్థవంతంగా చెప్పారు! సంజీవదేవ్ గారి శైలి హృదయశైలి. వారు ఏదీ ఏదో ఒకటి చెప్పవలెనని చెప్పరు పండిత ప్రతిభా ప్రకర్ష కొరకై చెప్పరు. ప్రవాహం వలె వచ్చిన అనుభూతితో ఆలోచనా అంతర్వాణితో చెబుతారు. ప్రతీది నిత్యజీవితంలో వారు అనుభవించిన, చూచిన, చదివిన, ఎందరో మహనీయుల జీవితాల నుండి గ్రహించిన విషయాల నుండి, వారూహించిన, భావించిన ఎన్నో కళా జగత్తుల నుండి ఉటంకించి చెబుతారు.

అందరూ పెదవులతో మాట్లాడితే సంజీవదేవ్ హృదయంతో మాట్లాడతారు. అందరూ మేధతో ఆలోచిస్తే సంజీవదేవ్ హృదయంతో ఆలోచిస్తారు.

ఆయన సహజజీవి, సహృదయజీవి, సౌమ్యజీవి, సౌహార్ద్రజీవి.

ఆయన నిరాడంబరుడు, నిత్య సత్యాన్వేషి, నిగర్వి, నిండుమనిషి, నిష్కాముకుడు, నిర్భయుడు, నిశ్చల మనస్కుడు. దానికితోడు ప్రతిభాశాలి, పండితుడు, సహృదయుడు, విశాల హృదయుడు కళనే తన ఆరాధ్య దైవంగా ఆరాధించి ఆవిష్కరించేవాడు. ప్రేమనే కళగా, కళనే ప్రేమగా భావించేవాడు, భాషించేవాడు. అందుకే సోదరి సరోజినీ ప్రేమ్ చంద్ 'సంజీవదేవ్ కు జీవించటమంటే ప్రేమించడమే' అని అంటుంది.

చిత్రమేమంటే సంజీవదేవ్ ఆనందాన్నెంత ప్రేమిస్తాడో దుఃఖాన్నీ, బాధను కూడా అంతే ప్రేమిస్తాడు, సంతోషాన్నెంత ప్రేమిస్తాడో విషాదాన్ని కూడా అంతే ప్రేమిస్తాడు. అతడి దృష్టి యోగదృష్టి, వాక్కు ఋషి వాక్కు, చింతన తాత్త్విక చింతన, అతడి దృక్పథం రస దృక్పథం. అతడు అందంతో స్పందించి ఆనందంతో తాదాత్మ్యం చెందే దార్శనికుడు. అతడి మతం 'మనీషిమతం' . అతడి దైవం మానవత్వం అందుకే అతడు "I don't believe in personal god. I believe in divinity-state of highest consciousness after which humanself feels redeemed, liberated from the clutches of sorrow and suffering" అని అంటాడు.

'జీవితాన్ని దుఃఖమయం చేసుకోవడం, ఆనందమయం చేసికోవడం మానవుని ప్రవర్తనలో ఉంది. అలవాటుకు బానిస కావడంలో దుఃఖం ఉంటుంది, అలవాటును బానిస చేసుకోవడంలో

ఆనందం ఉంటుంది'. 'జన్మించడం అందరి వల్ల అవుతుంది, మరణించడం అందరివల్లా అవుతుంది, కాని జీవించడం అందరి వల్లా కాదు' అంటాడు. ఎంత అందంగా ఉన్నాయా భావాలు? ఎంత అందంగా ఉంది ఆ చెప్పిన తీరు! ఒక విషయాన్ని రసవత్తరంగా చెప్పడమంటే ఇదే. భావం రసవంతంగా ఉండడం, భాష రమ్యంగా కుదరడం. సంజీవదేవ్ ఏది చెప్పినా తాత్విక, ఆధ్యాత్మిక వాక్యాల్లోనే చెబుతాడు, మనస్సును మేధను తన సుమాక్షరాలతో పులకరింప చేస్తాడు. భావం ఎపుడైతే దార్శనిక శక్తి కలిగి ఉంటుందో దాని అభివ్యక్తి మధురమూ మార్దవమూ అవుతుంది. భావం తాత్వికం కావడం, తద్వారా భాష మధురం కావడమే విషయం రసాత్మకం కావడం. ఎపుడైతే హృదయమూ మనస్సూ రెండూ పరవశిస్తాయో పదాలు నదాలై పారతాయి, అక్షరాలు ఆలాపనలై తొణుకుతాయి, అభివ్యక్తి వచనం కాక కవనమవుతుంది.

భావం ఉద్వేగాన్ని పుంజుకొని తద్వారా భాష లయమయం కావడాన్నే మనం అభివ్యక్తి రసాత్మకం కావడం అంటాం. అది కళాకారుని దృష్టి, దృక్పథ ప్రతిభా సంస్కారానికి, పాండిత్య సూక్ష్మతకి చెందిన విషయం. విషయమెపుడైతే దార్శనిక దృష్టితో, తాత్విక దృక్పథంతో, తాదాత్మ్యంతో చెప్పబడుతుందో అది అప్పుడు భావ సూక్ష్మతని సంతరించుకొంటుంది.

అలాంటి భావం చెప్పడానికి మామూలు భాష సరిపోదు. సూక్ష్మమైన సుతారమైన సున్నితమైన భాష కావలసి వస్తుంది. అలాంటి భాష రసరాగ రూపం దాలుస్తుంది. ఆలోచనా ఆందోళనా ఆవేదనా ఉద్వేగాలు అపుడు అక్షర రశ్మిలై అవతరిస్తాయి. ఇది, భావమూ భాషావచనం నుండి కావ్యం, కావ్యం నుండి సంగీతం కావడంలాంటి స్థితి. ఇలాంటి స్థితిలో చెప్పే భావం, చెప్పే భాష రెండు వీనులకు వీణల్లా వినిపిస్తాయి. మనస్సును తరంగాలై కదలిస్తాయి.

రసమయమైన భావం రసమయమైన రూపాన్ని దాల్చడం ప్రతిభావంతుని చేతిలో దానంతటదే జరుగుతుంది. ఈ భావం, ఈ రూపం, ఏ విషయానికి చెందిందైనా ఏ కళకు చెందిందైనా కావచ్చు. అందానికి నైతికతకి ఏమీ సంబంధం లేదు. అందం వేరు, నైతికత వేరు. ఒకటి కౌశలానికి చెందిందైతే, ఇంకొకటి గుణానికి చెందింది. అందమైన మనిషి అందమైన గుణం కలవాడు కావచ్చు కాకపోవచ్చు. 'గుణం', 'అందం' రెండూ చాలావరకు మనకు మనుషుల్లో వేరువేరుగా తటస్థిస్తాయి. సంజీవదేవ్ రసమయ భావనల్లోంచి కొన్ని భావాలు చూద్దాం. ఈ సందర్భంగా అందమైన రసకల్పన తన అనుభవానికి తాను జీవం పోయడం.

'జీవితం సంతోషంగా జీవించుటకు మార్గాలు కొన్నే కాని జీవితాన్ని దుర్భరంగా జీవించుటకు మార్గాలు ఎన్నో'.

'ఎపుడైతే వ్యక్తి అనేకుల్లో ఆనందాన్ని పొందలేక ఏకాంతానికి పరుగుతీస్తాడో అపుడు తన ఏకాంతం వలన ఏకాంతం తన ఏకాంతాన్ని కోల్పోయిందని గ్రహిస్తాడు'.

'రసం ఉంటేనే మనిషి సరసుడు, రసం లేనప్పుడు నీరసుడు.'

'పుష్పం మామూలుగానే అందంగా ఉంటుంది. మొగ్గగా మరెంతో అందంగా ఉంటుంది. చిగురాకుగా మరెంతో అందంగా ఉంటుంది. కాని అన్ని అందాల్లో కల్లా పువ్వును మొగ్గను విడిపోయిన కాడది అద్వితీయమ్మైన అందం. అది అందాన్నిచ్చి అదృశ్యమైపోతుంది. తనకు తాను తనువు చాలించి కృశించిపోతుంది'.

'శక్తి ప్రేమను కల్పించలేదు కాని ప్రేమ శక్తిని కల్పించగలుగుతుంది'.

'పవిత్రమ్మైన దుఃఖం ఆనందానికంటే శ్రేష్టం'.

'ఆలోచించడమంటే మాట్లాడకపోవడం, రాయకపోవడం కాదు. తన లోపల తాను నిశ్శబ్దంలో శబ్దం కావడం'.

'శబ్దాలు ఎప్పుడూ మన భావాలను పూర్తిగా ప్రతిధ్వనించవు. ఒకప్పుడు భావాలు పరిభ్రమాలు. శబ్దాలు పరిమళాలు. ఒకప్పుడు శబ్దాలు పరిమళాలు భావాలు పరిభ్రమాలు!'

'కనబడేవన్నీ వాస్తవానికి ప్రతీకలు కావు, అలా అని అవి ఎండమావులూ కావు'.

'మనిషి మనిషి కావడానికి 'ఆత్మ' ఎంత అగత్యమో కళ కళ కావడానికి 'అందం' అంత అగత్యం'.

'ప్రేమంటే తనకంటే వేరైన మరొకరికొరకు పడే తీరని ఆవేదన, ఆకాంక్ష.

'మరణం ఒక మహా రహస్యమ్మైతే జీవనం ఒక మహత్తర రహస్యం. జీవితం కాంతి అయినప్పుడు మరణం శాంతి అవుతుంది'.

'మనం భావాలను సృష్టించం, భావాలే మనని సృష్టిస్తాయి. నిన్నటి సూర్యుడు నేటి సూర్యుడా? కాడు. ఆకాశం పాతదే అయినా ఆంతర్యం మాత్రం కొత్తదే. నది ఎప్పటికీ పాతదే అయినా అది ప్రతి క్షణం నూతనమే'.

'దయలేని తెలివి వల్ల ఇతరులకు హాని కలుగుతుంది, తెలివిలేని దయవల్ల తనకే హాని కలుగుతుంది'.

'విద్య యొక్క లక్ష్యం కేవలం ప్రజ్ఞానాన్నివ్వడమే కాదు. లాలిత్యాన్ని ఇవ్వడం కూడా.'

'సూక్ష్మాతి సూక్ష్మమైన భావం కఠినాతి కఠినమైన శ్రమ ద్వారా కాని రూపొందదు.'

'గద్యం భూమి లాంటిది, పద్యం మేఘం లాంటిది, సంగీతం ఇంద్రధనుస్సు లాంటిది.'

'కవితలో icon భావంలో మారుతుంది, చిత్రకళలో భావం icon లో మారుతుంది.'

'సౌందర్యం రసానుభూతి కలిగించడానికి బహిరంగ వస్తువు ఆంతరంగ చైతన్యం రెండూ అవసరం. మొదటిది ఉద్దీపనం కలిగిస్తే, రెండవది ప్రతిస్పందన చెందుతుంది.'

'సౌందర్యాన్ని అనుభవించే సమయాన కలిగే అనుభూతినే 'రసం' అంటాం.'

'సౌందర్య ప్రయోజనంలో సమాజ ప్రయోజనం కూడా ఇమిడి ఉంది. అది సౌందర్యానుభూతి ద్వారా వ్యక్తి సంస్కారవంతుడు కావడం. ప్రేయం ద్వారా శ్రేయం.'

'సౌందర్యమూ, ఆనందమూ ఒక్కటే. వస్త్వాశ్రయంగా ఉద్దీపన పొంది ఆవిష్కారమయ్యే ఆనందం వస్తువులో సౌందర్యమవుతుంది. వస్తువు రసికుల మధ్య అభేదం కుదిరితే ఆనందానుభూతి అవుతుంది.'

'సమాజానికి ప్రాణం అనే కార్మికుడు, తన తల మీద దీపాన్ని మోస్తుంటాడు. చుట్టూరా ఉన్నవారికి దాని వెలుగు అందుతూ ఉంటుంది. కాని ఆ దీపాన్ని మోస్తున్న వాడు మాత్రం ఆ దీపపు క్రింది చీకటిలోనే ఉండిపోతాడు.'

'సైన్సు ఒక క్రాంతి అయితే కళ ఒక శాంతి'

'ఎప్పుడైతే ఒక వస్తువు దాని పరిపూర్ణత ద్వారా అనంతమైందిగా, అత్యంత అర్థవంతమైందిగా, అద్భుతమైందిగా మనని ప్రభావితం చేస్తుందో అప్పుడు అది అందమైనదవుతుంది. కళాకారుని ఒకే ఒక లక్ష్యం పరిపూర్ణత గల దానిని సృష్టించడమే. పరిపూర్ణత కల దానిని సృష్టించాలంటే కళాకారుడు తనకు తాను స్వేచ్ఛను అనుభవించాలి.'

'కొంతమందికి కాంతి (క్రాంతి ద్వారా) multitude ద్వారా కలిగితే మరికొంతమందికి కాంతి (శాంతిద్వారా) solitude లో కలుగుతుంది.'

'వ్యక్తులు సాధారణంగా వారి జ్ఞానం గురించే గర్వపడతారు, వారి అజ్ఞానం గురించి సిగ్గుపడతారు. కాని అది తప్పు. తనకు తెలిసిన దానికంటే తెలియందే ఎప్పుడూ ఎక్కువ కదా

మరి. ఏది తనలో తక్కువో దాని గురించే ఎందుకు గర్వపడటం, ఏది ఎక్కువో దాని గురించే గర్వపడాలి కాని. ఆ విధంగా ఆలోచిస్తే జ్ఞానిపై అజ్ఞాని గర్వపడాలి.'

'ఎప్పుడైతే మనిషి తన జీవితాన్ని కళగా మార్చుకుంటాడో అప్పుడతని హృదయం అతనికి మేధ అవుతుంది.'

'నేత్ర దృష్టి భౌతిక రూపాన్ని చూస్తుంది, తాత్విక దృష్టి ఆత్మిక రూపాన్ని చూస్తుంది. కాని రస దృష్టి ఆత్మిక రూప కాంతిలో మెరుస్తున్న భౌతిక రూప కాంతిని దర్శిస్తుంది.'

'మానవుని గొప్పతనం ఎప్పటికి పడకుండా ఉండటంలో లేదు, పడినప్పుడల్లా తిరిగి లేవడంలో ఉంది, కాని దేవుడు మానవునిగా మారాల్సిన అవసరం అంతగా లేదు కాని మానవుడు దేవునిగా మారాల్సిన అవసరం ఎంతైనా ఉంది.'

'వ్యక్తి సచేతనంగా బ్రతికితే జాతి మొత్తం సచేతనంగా బ్రతుకుతుంది. కళాదృష్టి ఏ రకమైనదైనప్పటికీ అది ఈ జగత్తు యొక్క రహస్యాన్ని వెలికి తీసేదిగా ఉంటుంది. ఆధ్యాత్మిక దృష్టి ప్రయోజనం కూడా అదే. కనిపిస్తున్న జగత్తు యొక్క లోపలి విషయాన్ని గ్రహించి జ్ఞానవంతం చేస్తుంది దృష్టి. కాబట్టి పైకి రెండుగా కనిపించే కళాదృష్టి, ఆధ్యాత్మిక దృష్టి రెండూ కూడా అంతరంగంలో ఏక దృష్టులే. ఆధ్యాత్మిక దృష్టి వలన తాత్విక దృష్టి ఏర్పడుతుంది. ' తాత్విక దృష్టి వలన దార్శనిక దృష్టి ఏర్పడుతుంది. దార్శనిక దృష్టి వలన రసదృష్టి ఏర్పడుతుంది. రసదృష్టి వలన కళాసృష్టి ఏర్పడుతుంది.'

Whatever endeavours to triumph, to l'berate man from sorrow and suffering is the highest culture-any art, poetry, painting, music, dance, drama etc. That which fails to liberate man from the thraldom of sorrow and suffering is not an ideal art."

"Life, light and love make us rise above."

"Logic in the absence of music annihilates the magic of life."

"A man should so look as to be like a poem and a thing should so look as to be like a picture."

"Life is a desire unfulfilled, a dream unrealised and a pilgrimage uncompleted (and this makes humanity work after perfection)."

"What distinguishes the artists from other human beings is the aesthetic creative approach to phenomenal world in which the multifarious forms, colours, sounds and worlds exist and are perceived by the senses."

"Love is the highest bliss that man can attain to, for through it alone he truly knows that he is more than himself and that he is one with all."

ఇలాంటి వాక్యాలు సంజీవదేవ్ గారి సాహిత్యంలో కోకొల్లలు. ఇలా భావభాషా నిర్మాణం చేయడం చాలా కష్టమైన పని. సముద్రమంత అనుభవం, ఆకాశమంత భావుకత, ప్రపంచమంత జ్ఞాన, విజ్ఞాన, పాండిత్యం ఉంటే తప్ప ఇలా వ్రాయడం చెప్పడం కుదరదు. ఇది ఒక రసమయ 'హృదయం' ఒక తాదాత్మ్యం పొందిన 'ఆత్మ' చేయగలిగిన పనే కాని మరొకరు చేయగలిగినది కాదు.

సంజీవదేవ్ పలికిన ప్రతి పలుకులో 'తత్వం' ఒలుకుతుంది. 'అందం' చిలుకుతుంది. ఆయన భాషా భావనంతా రసమయం, ఆయన దృష్టి దృక్పథమంతా విశ్వమానవ కళ్యాణం, సౌభ్రాతృత్వం. కళ ఆయనకు మనిషిని సంస్కారవంతునిగా, సౌశీల్యునిగా తీర్చిదిద్దే సాధనమే కాని తన పాండిత్య ప్రకర్ష చాటుకొనుటకు చేబట్టిన ఆడంబరం కాని, వృత్తి ప్రవృత్తి కానీ కాదు.

సంజీవదేవ్ గారు చెప్పినట్లు రసదృష్టి కలవాడే రససృష్టి చేయగలడు. అతడే యోగి, అతడే త్యాగి. అతడే కారణజన్ముడు. ఎందుకంటే అతని వలననే జీవనం పావనమవుతుంది, పవిత్రమవుతుంది, సృజనాత్మకమవుతుంది.

అతని వలననే చీకటి వెలుగులోకి మారుతుంది, దృష్టికి దృక్పథమేర్పడుతుంది, చూపుకు రూపు ఏర్పడుతుంది. జీవితానికి అందం, ఆనందమంటే ఏమిటో తెలుస్తుంది, క్రాంతి అంటే ఏమిటో, శాంతి అంటే ఏమిటో విదితమవుతుంది. అతడే సంస్కృతికి, సంస్కారానికి, నిజమైన నాగరికతకు ప్రతీక అవుతాడు. ప్రతిబింబమవుతాడు.

అందమైన దృష్టితో అందమున్న వాటిలోనే కాక అందం లేనట్లు కనిపించే వాటిలో కూడా అందాన్ని పుణికి పట్టుకోవడమే రసదృష్టి. అందమైన విషయాల గురించి, అందంగా, అర్థవంతంగా చెప్పగలగడమూ, భావ సొగసును, భాషా సొగసుతో రాయగలగడమే రస సృష్టి. అందమైన భావాలు ఆకాశం నుండి అట్టే ఊరకే ఊడిపడవు. అందమైన దృష్టిని, అందమైన దృక్పథాన్ని అలవర్చుకుంటేనే, నిత్యం నిత్య నూతన భావం కొరకు శ్రమిస్తేనే, నిత్యం నిత్యనూతన అభివ్యక్తి కొరకు పరిశ్రమిస్తేనే అందమైన భావాలు, అందమైన భాషాభివ్యక్తి మనలో ఊటలై ఉవ్వెత్తుతాయి.

సౌందర్యోపాసన ఒక యాగం. ఒక తపస్సు. నిత్యం అందాన్ని చూచే, వినే, చదివే, రాసే, మాట్లాడే ప్రయత్నం చేస్తేనే కాని అది సాధ్యం కాదు. దీనికి అందంగా ఆలోచించడమే కాదు, జీవించడం కూడా కావాలి.

ఒకడు అందంగా జీవించడు, కాని అందంగా ఆలోచిస్తాడు. అందంగా జీవించకుండా అందంగా ఎలా ఆలోచించకలడు? అను ప్రశ్న ఉద్భవిస్తుంది. ఆలోచించడం కూడా జీవించడంలో ఒక భాగమే అని అనుకుంటే జీవించడం మనకు రెండు విధాలుగా కనిపిస్తుంది. ఒకటి ఆదర్శంలో జీవించడం, రెండవది ఆచరణలో జీవించడం. ప్రతి మనిషికి రెండు జీవితాలుంటాయి. ఒకటి తాను జీవించేది, ఇంకొకటి తాను ఆశించేది. ఈ రెండింటికి ఎంతో కొంత వ్యత్యాసం ఉంటుంది. ఈ వ్యత్యాసం ఎంత తక్కువుంటే జీవితం అంత సంపూర్ణ మవుతుంది, ఎంతెక్కువ ఉంటే అంత అసంపూర్ణమవుతుంది. ఆలోచించినట్లు జీవించకపోవడం దృష్టి ఉండి సృష్టి లేని లాంటిది. అంటే, వ్యక్తి చదవగలడు, రాయగలడు, వినగలడు, చూడగలడు, అనుభూతి చెందగలడు, అనుభవించగలడు కాని ఆచరించలేడన్నమాట. జీవితంలో ఎందరిలోనో మనకు ఆలోచనా సౌందర్యం కనబడుతుంది కాని ఆచరణా సౌందర్యం కనబడదు. మనిషికి మంచి ఏమిటో తెలుస్తూనే ఉంటుంది కాని దానిని పాటించలేడు, సౌందర్యమేమిటో తెలుస్తూనే ఉంటుంది కాని సౌందర్యోపాసన చేయలేడు. సంస్కారమేమిటో తెలుస్తూనే ఉంటుంది కాని సంస్కారోపాసన చేయలేడు. జ్ఞానమేమిటో తెలుస్తూనే ఉంటుంది కాని జ్ఞానోపాసన చేయలేడు. ఇక్కడే మనిషికీ మనిషికీ తేడా. చాలా మంది మనుషుల్లో ఆలోచన ఉంటుంది కాని ఆచరణ ఉండదు. కనుక వారు వట్టి మనుషులుగానే నిలచిపోతారు. చాలా తక్కువ మనుషుల్లో ఆలోచనలతో పాటు ఆచరణా ఉంటుంది. మహా మనీషులుగా చిరకాలం నిలచిపోతారు. ఏ బుద్ధుడో, శంకరాచార్యుడో, రామకృష్ణుడో, వివేకానందుడో, అరవిందుడో, గాంధీయో చెప్పినవి చాలా మందికి తెలియక కాదు వారికీ ఇతరులకూ తేడా, వారు చెప్పినవి వారే పాటించలేకపోవడం.

అందుకే ఒకడు ఋషి కాందే కవి కాలేడు అన్నారు. అది ఒక కవికే కాదు. ప్రతి కళాకారునికి వర్తిస్తుంది. ప్రతి పరిపాలకునికి, పరిశోధకునికి వర్తిస్తుంది. కేవలం ఆలోచన మాత్రమే యుండి ఆచరణ లేనివాడు ఆలోచించ గలగచ్చు కాని నిజమైన కళ సృష్టించలేడు. ఆచరణ లేనివాడు సృష్టించినది ఆచరణ ఉన్నవాడు సృష్టించినట్లు ఎన్నటికీ ఉండబోదు. ఎందుకంటే సృజనకు, సృష్టికి ప్రాణమైన 'సహజత' అతడు సృష్టించిన దానిలో ఉండదు, ఉండజాలదు కనుక.

నటనలో మనకు అసలుకు చెందిన అభాస ఎంతోకొంత కలుగుతుంది, కాని అది అంతటితోనే ముగుస్తుంది. నటన ఒక గారడి లాంటిది. నటన తదుపరి మనకు మరేమీ మిగలదు. నటనకు ఒక స్థిరముద్ర అంటూ ఉండదు. 'సహజత' లేని సృష్టి నటన లాంటిది.

సహజత లేని సృష్టి వలన కలిగే అనుభూతి అప్పటిదే. అది ఎప్పటిదీ, ఎల్లప్పటిదీ కాదు, కాజాలదు. ఎందుకంటే దానికి ఆలోచనానుభూతి తప్ప అనుభవానుభూతి ఉండదు కనుక. ఆచరణానుభూతి లేనందు వలన సృష్టించిన దానిలో నిజాయితీ ఉండదు కనుక సృష్టించినది నటన లాంటిదవుతుంది కనుక. అందుకే అన్ని సృజనలలో కొన్ని సృజనలు మాత్రమే మన మనస్సుపై స్థిరముద్ర వేస్తాయి. అవే సహజమైన సృజనలు, సహజానుభూతితో సృష్టించబడిన సృజనలు. అవే రసభరితమైన సృజనలు, కళలు కూడా.

డాక్టర్ సంజీవదేవ్ ఆలోచన, ఆచరణ రెండూ కూడా సమతులంగా ఉన్న మనిషి. అందుకే అతడు ఏది చెప్పినా, ఏది రాసినా, ఏది గీసినా ఎంతో సహజంగా ఉంటుంది. ఎంతో నిజంగా వినిపిస్తుంది, కనిపిస్తుంది. ఆయన రసదృష్టి అమోఘం, రససృష్టి అద్భుతం, అద్వితీయం. సంజీవదేవ్ చూపులకు ప్రతీదీ అందంగా కనబడుతుంది. ఆలోచనకు అంతా ఆనందంగా తోస్తుంది. అందుకే గీసినది సుందర రూపం దాలుస్తుంది. రాసినది పరిమళ భరితంగా ధ్వనిస్తుంది. ప్రకృతి మానవ జీవితం ఒక జీవనరాగ సమ్మేళనమై భాసిస్తుంది. ' సృష్టిలోని విభిన్న జీవనరాగాలను మనోజ్ఞంగా మనోహరంగా, మహోదాత్తంగా సమ్మేళవించి తనని తానొక పిల్లనగ్రోవిగా మలచుకొని, సౌందర్యం, ప్రేమ, కరుణ సందేశాలను వాటిలో పొదిగి జీవిత మధురిమను, జీవన సాఫల్యతను జీవితంలో చూపే ఆనందజీవి సంజీవదేవ్. జీవించడమే ఒక కళగా సాధన చేస్తూ, జీవితాన్నే ఒక కళగా జీవిస్తూ రస సందేశం ప్రసారం చేస్తున్నారు సంజీవదేవ్' అని సోదరి సరోజనీ అన్నమాటలతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను.

'ఒక భావకుడుగా, ఒక నిరంతర పరిశోధకునిగా, పరిశీలకునిగా, ఒక నిత్య పాఠకునిగా, ఒక మహామనిషిగా, మహా యోగిగా కనిపిస్తాడు' సంజీవదేవ్. అని అన్న ఆచార్య సుందర రామయ్యగారితో నేను సంపూర్ణంగా ఏకీభవిస్తున్నాను.

రూపజగత్తు, భావ జగత్తు రెండింటిని గురించి వ్యక్తీకరించిన సంజీవదేవ్ భావాలు సంజీవినీ భావాలు. అయితే ఆయన కేవలం భావశబలుడు మాత్రమే కాదు. నిర్మాణాత్మక క్రియాశీల గాఢాలోచనా భరితుడైన మేధావి, దగ్గరలోని అడ్డంకులను దాటి అవతలికే కాదు అనంతంలోకి చూడగల దూరదర్శి, పారదర్శి' అని మిత్రుడు కవికుమార్ అన్న భావాలతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను.

చాలామంది లోకోత్తరమైంది, లౌకికమైంది, ఆత్మికమైంది, భౌతికమైంది, ఐహికమైంది, ఆముష్మికమైందని అనబడే వాటి మధ్య ఒక సరిహద్దు గీత గీయాలని చూస్తారు. ఇటువంటి సరిహద్దు గీత అంత సమంజసమైంది కాదు. ఆనందమయ, ధ్యానమయ, జ్ఞానమయ జీవితాన్ని

గడపటానికి భౌతిక ఆత్మిక సమన్వయ సత్తాను గ్రహించే ఒక సమగ్ర దృష్టి. అపరోక్షానుభూతి. ప్రాణమయ సాధన అవసరం. తనకు ఆనందం ఇవ్వని వాటిల్లోంచి కూడా ఆనందం పొందటం నేర్చుకోవడమే అపరోక్షానుభూతి, ప్రాణమయ సాధన' అని అంటారు సంజీవదేవ్ అలాంటి ప్రాణమయసాధన చేస్తున్నవారు సంజీవదేవ్ అందుకే అతడు వట్టి సాంకేతిక కళాకారుడు కాడు. తాత్విక కళాకారుడు, దార్శనిక కళాకారుడు, ఆధ్యాత్మిక కళాకారుడు. 'మనిషికి శరీరం ఒక జైలు. ఆ జైలు నుండి బయట పడటానికి అనేక వేదాంతాలు, అనేక సాధనలు, శరీరంలో జీవిస్తూనే శరీరాన్ని వదలి ఆకాశంలో స్వేచ్ఛగా మేఘాల మీద తిరుగుతున్నట్లు తీవ్రంగా భావించి ఆనందాన్ని అనుభవించవచ్చు. అటువంటి అశరీర స్థితిలో చైతన్యం ఆనందమయమై బాధలేమీ తట్టవు. శరీరంలో ఉండి కూడా లేనట్లుగా ఆనందంతో జీవితయాత్ర సాగించవచ్చు. దేహానందంతో కాక ఆత్మానందంతో జీవిత యాత్ర సాగించవచ్చు. దేహం ఉండి కూడా విదేహిగా జీవించే సాధన చేయవచ్చు. దేహంలో జీవిస్తున్నప్పటికీ దేహ చైతన్యంతో కాక ఆత్మచైతన్యంతో జీవించడమే విదేహిగా జీవించడం. అప్పుడే దేహ బాధలు మనో బాధలు అన్నిటికీ దూరమై ఆత్మానందంతో జీవించడం జరుగుతుంది' అని అంటారు సంజీవదేవ్ అలాంటి విదేహిగా ఏక ధ్యానంతో జీవిస్తున్నవారు సంజీవదేవ్.

'జీవన కళలేంది మిగతా సమస్త కళలు ఒక నటన మాత్రమే అవుతాయి. బాగా జీవించటం భోగంలో కాని యోగంలో కాని జీవించడం కాదు, త్యాగంతో నిండినదీ, రాగంతో జీవించడం. రాగం అంటే రంగు. రాగం అంటే నాదం. రాగం అంటే అనురాగం. రాగం లేని జీవితం రోగంతో నిండిన బ్రతుకే' అంటారు సంజీవదేవ్ అలాంటి త్యాగంతో నిండిన రాగంతో జీవిస్తున్నవారు వారు.

రసమూ అందమూ ఒకటేనా ? కావు.
'అందం' లక్ష్యమైతే 'రసం' లక్షణం.

రసమంటే ఒకానొక విషయం, పదార్థం, వ్యక్తి, అభివ్యక్తిలోని చమత్కారం, వింత, విచిత్రత. రసమంటే ఒకానొక వ్యక్తి తన వ్యక్తిత్వం తన శోభ ద్వారా శక్తి సామర్థ్యాల ద్వారా ప్రతిభా ప్రావీణ్యతల ద్వారా కలిగించే విస్మయం, వినూత్నత.

రసమయత అంటే ఒకానొక విషయం, పదార్థం, వ్యక్తి, అభివ్యక్తిలోని లయమయత, అద్భుతం, ఆశ్చర్యం, అద్వితీయం, చైతన్యం.

'ఏదిభావాత్మక రూపమో అదే రసాత్మక రూపం. 'రసం' భావ వైచిత్రి ద్వారా భాసిల్లే భాషారూపం (మరింకే కళారూపమైనా కావచ్చు).

'రూపం' స్థితి రమ్యత, 'రసం' గతిరమ్యత'.

రసవత్తరమ్మైన భావం రసవత్తరమ్మైన రూపంగా అభివ్యక్తీకరించబడడమే 'అందం'.

''జీవంలోని 'శక్తి' 'రసం', జీవంలోని 'రశ్మి' 'రూపం' జీవమంటే రాగ-రశ్మిల కలయిక''.

'జీవం అంటే రాగము - రశ్మి కలసి 'చైతన్యం' గా 'శక్తి' గా మారడం'.

'రూపం', 'చైతన్య' భావాత్మకం కావడం'.

'రసం' భావం వలన రూపంలో కలిగే 'ప్రత్యేకత', 'నవ్యత', 'వ్యక్తిత్వత'.

కళంటే 'అందం'. అందమంటే రసవంతం. రసవంతమంటే చైతన్యవంతం. చైతన్య వంతమంటే జీవం సజీవం కావడం. అనస్తిత్వం, అస్తిత్వం కావడం, వ్యక్తి వ్యక్తిత్వం కావడం, ఆనందం అందం కావడం అని నిర్వచిస్తారు సంజీవదేవ్.

వారి వాక్యాలన్నీ నిర్వచనాలే. పరవశమందించే ప్రవచనాలే. ఎలా దొరుకుతారు ప్రవక్తలాంటి అలాంటి మనషులు. ఎన్నో జన్మలకు కాని బహుశ రూపొందరు అలాంటివారు.

'ఒక గులాబీ నిర్మాణానికి ఇంతకాలం పడితే ఇక గులాబీ లాంటి మనిషిని రూపొందించ డానికి దైవానికి ఎంత కాలం పడుతుందో' అని ఆశ్చర్యాన్ని వ్యక్తపరుస్తాడు ఒక పాశ్చాత్య రచయిత.

(రచయిత - డా. కొండలరావు వెలిచాల,
మాజీ సంచాలకులు - తెలుగు అకాడమి, హైదరాబాదు.)

# డాక్టర్ సంజీవదేవ్ లేఖా సాహిత్యం

*వేగుంట కనక రామబ్రహ్మం*

సంజీవదేవ్ ఒక మహా కళాతపస్వి , జీవనశిల్పి, ఆయన జీవితమే ఒక కళ. నిరాడంబరత, నిష్కల్మష ప్రవర్తన, శాంత స్వభావం ఆయనకు జన్మతోనే వచ్చాయి. ఎంత సంతోషం వచ్చినా పొంగిపోకుండా, ఎంత విచారం సంభవించినా కృంగిపోకుండా కష్ట సుఖాలను ఒకే రకంగా స్వీకరించగల ప్రాక్టికల్ వేదాంతి. నిజమైన మానవతావాది. కోపం అనేది ఆయన నిఘంటువులో లేదు. సత్యాన్వేషణ, సౌందర్యోపాసన, శుభచింతన ఆయన జీవితాచరణాలు.

ఈయన ఉత్తరాలు మానసిక వ్యాధులతో చికిత్సలు పొందుచున్న రోగులకు టానిక్కులుగా ఉపయోగపడ్డ సందర్భాలు కూడా ఉన్నవంటే చాలామందికి ఆశ్చర్యం కలుగవచ్చు. ఆయన ఉత్తరం అవతలివారిని పలకరిస్తుంది. పరామర్శిస్తుంది. వారి కష్ట సుఖాలకు ప్రతిస్పందిస్తుంది. వెన్నుతట్టి ఓదార్పునిస్తుంది. ధైర్యాన్నిస్తుంది. మానసిక బలాన్ని పెంచుతుంది. జీవితం పట్ల సద్భావనను కలిగిస్తుంది. కళలను గురించి, సాహిత్యాన్ని గురించి రసజ్ఞులను చేస్తుంది. అవతలి వారికి అంతగా పట్టని అనేక అందాలను, ఆనందాలను, ఎత్తి చూపుతుంది. నిత్యజీవితంలో మళ్లీ మళ్లీ మననం చేసుకుని ఆచరించదగిన జీవన ధర్మాలనూ సూక్తులనూ చెపుతుంది. గంభీరమైన విషయాలతో పాటు గిలిగింతపెట్టి మందస్మితం రప్పించే చమత్కారపు చెణుకూ ఉంటుంది.

ఇంకా ఆ ఉత్తరాలు అతడి ఆలోచనలనూ, అభిరుచులనూ వివరిస్తాయి. అతడి జీవన సరళిని గురించి, మనిషితనాన్ని గురించి తెలుపుతాయి. ఒక్కమాటలో చెప్పాలంటే, దేవ్ఉత్తరాలు

ఆయన సంపూర్ణ వ్యక్తిత్వానికి అద్దం పడతాయి. ఉత్తరాలలో హృదయనాదమే తప్ప మరొకటి ఉండటానికి వీలు లేదు కనుక.

పేజీలకు పేజీల చాటభారతపు ఉత్తరాల కంటె చిన్న ఉత్తరాలే ప్రాణవంతంగా, లయ మయంగా ఆత్మీయంగా తనకు గోచరిస్తాయని అంటాడు. అల్పంలోనే అనల్ప జీవలక్షణాన్ని చిత్రించనేర్చిన కళాస్రష్ట దేవ్. ఇట్లా చిరకాలంగా, సంజీవ్ దేవ్ మిత్రులకు వ్రాస్తూ ఉండిన కొన్ని ఉత్తరాలలోని కొన్ని అందాలను రేఖామాత్రంగా ఎత్తి చూపడమే ఈ వ్యాసానికి ప్రధాన ఉద్దేశ్యం. ఈ లేఖల మాటున ప్రకాశమానం అవుతుంది ఉజ్జ్వలమైన ఆయన వ్యక్తిత్వ విశేషం.

డాక్టర్ సంజీవదేవ్ అడిగిన వారి సంశయనివృత్తికి వివరంగా సమాధానాలు, ప్రకృతి రమణీయతను రమ్యంగా వర్ణించటం, ఆసక్తిపరులందరినీ వారింటికి అతిధులుగా ఆహ్వానించి మంచి ఆతిధ్యమివ్వటం ఆయనకు పరమానందం. ఆయన అర్ధాంగి సులోచనగారు అపర అన్నపూర్ణ. ఆయన సన్నిధి నిండు పూర్ణిమ. ఇంక ఉత్తరాల వివరాలలోకి వెళదాం.

'సంజీవ్‌దేవ్ లేఖలు' లో సోదరి కృష్ణాబాయికి రాస్తూ 'మీ కాంతివంతమైన ఉత్తరం... మీ ఉత్తరం వచ్చేముందు నేను Green Music అనే ఆంగ్ల కవితను రాసి ముగించాను. మీ ఉత్తరంలో కూడా ఆకు పచ్చదనమే గోచరించింది. ఆలాంటి భావసమన్వయం కుదిరినందుకు ఆశ్చర్య పోయాను. మనిషికి మనిషికి మధ్య కొన్ని Invisible Psychic Currents ప్రసారం అవుతూ వుంటాయి. మనం వాటిని అందుకోలేకపోవచ్చు 'ఎటువంటి ఆహ్లాదకరమైన సమన్వయం'.

బుచ్చిబాబుగారికి రాస్తూ 'శరీర బాధ దేహానికి వేదన కలిగించినా జీవితంలో మాత్రం ఒక నూతన చైతన్యాన్ని నిద్ర లేపుతుంది. శరీరం ఒక వైపు బాధపడుతూ ఉంటే రెండవ వైపున మనకు తెలియకుండానే మన ప్రాణ స్పందనపు లయతో కలిసి నర్తించ ప్రారంభిస్తుంది. అది జీవన జ్వాలలో కలిసి మెలుగుతుంది అంటారు'. నిజంగా ఆ జీవన జ్వాలను అందుకో వటంలో పరమ ఆనందం ఇమిడి ఉంది. ఎంతటి చక్కని విశ్లేషణ.

శ్రీమన్నారాయణమూర్తిగారి జాబుకు జవాబుగా 'గురువులు, స్వాములు, ఉపదేశాలు, ఇలాంటివేమి అవసరం లేదు'.

జీవితాన్ని.అర్థం చేసుకోవడం ప్రధానం. అన్ని తత్వాలకంటె జీవనతత్వం శ్రేష్టమైనది. Philosophy of life జీవనతత్వాన్ని అర్థం చేసుకోగలిగితే జీవితమంతా ఒక తెంపులేని ఆనందరాగంగా ధ్వనించగలదు. అందులో విషాదచ్ఛాయలు గోచరించవు. The flame of life

lies in the each passing second అని అంటారు. ప్రాణజ్వాలను అందుకోందే ప్రాణభయమే లేదు. ఆ వెలుగులో చీకట్లే ఉండవు. 'ఇంతకంటె జీవన రహస్యం ఎవరు చెప్పగలరు'.

ఒక లేఖలో ఆనాటి వాతావరణాన్ని ఎంత హృద్యంగా చిత్రీకరించారో చూడండి. 'చల్లగా ఉన్న వాతావరణం అంతా మళ్లీ మూడురోజుల నుండీ రౌద్రరూపం దాల్చింది. ఇలా ఎండలు కాస్తుంటే నాకు ఏమీ వ్రాయబుద్ధి కాదు. సృజనశక్తి అంతా కరిగి చెమటలుగా సెలయేళ్లు పారితే ఇంక వ్రాసేందుకు ఏమి మిగులుతుంది మరి. అయితే ఈ వాక్యం పూర్తి చేయకముందే మాన్‌సూన్ మేఘ ఖండాలు ఘనీభవించసాగుతున్నాయి. అవిగో సాగినవి కూడా. ఎండిన మట్టి మీద పడిన ప్రథమ వర్షబిందువులు ఏదో ఒక అలౌకిక సుగంధాన్ని లేపినవి. ఏం మెరుపులండీ? ఏం ఉరుములండీ? మానవుడి నిత్యజీవితం మీద ప్రకృతి తన ప్రభావాన్ని ఎంతగానో చూపుతుంది. ప్రకృతిలోని ఒక్కొక్క మార్పు మానవ హృదయంపై ఒక్కొక్క విచిత్రానుభూతి కలిగిస్తుంది. అయితే ప్రకృతికి లోబడి పోవటం మానవుని ఆశయం కాదు'.

ఉత్తరంలో హాస్యం ఎలా చిప్పిల్లచేశారో ఈ వాక్యాలు వివరిస్తాయి. 'మీరు నన్ను మా ఆవాసంలో చూచేదానికి ముందే మిమ్మల్ని మీ తావున చూస్తానేమో నేను. ఇది ఎంతవరకు సంభవమో ఇంకా నిర్ణయించలేదండీ. మరి నేను వస్తే మీరు స్టేషనుకు పూలదండలు, బ్యాండు, కప్పులేని కారు తీసుకువస్తారా? వీటితో మాత్రమే కుదరదు. మరి ఖరీదైన పర్సు కూడా సమర్పించుకోవాలి. పర్సు అంటే తోలు పర్సు గాని ప్లాస్టిక్ పర్సుగాని కాదండోయ్.. కరెన్సీ కుటుంబమున వున్న పర్సు, అది తీసుకొని నేను అట్లా ప్రపంచ పర్యటన చేసి వస్తా. మీకేమండీ మోర్టగేజ్ బ్యాంకు మీ స్వంతం. (నేను అప్పుడు బ్యాంకు జనరల్ మేనేజరును) కావలసినంత డబ్బు, ఎంతయినా వాడవచ్చు. తరువాత సంగతంటారా, గోల్కొండలోని రామదాసు గాథయే ఆదర్శం'.

ఆ సంపుటిలోనే రంధి సోమరాజుగారికి వ్రాస్తూ 'ప్రతివాళ్లు ప్రకృతి నారాధిస్తూ వ్యవహారిక కార్యక్రమాలు మానేసి సౌందర్య నిషాలో మైమరచి ఉంటే ఎలా కుదురుతుంది. లోకంలో కర్మణ్యం జీవితం, బ్రతకటం ఎలా మరి? అందుకే బాహ్య జగత్తులోని కర్మమయ జీవితానికి, అంతర్జగత్తులోని మర్మమయ జీవితానికి ఒక రకమైన సంధి ఏర్పడాలనేది, వాస్తవంలోని సుఖదుఃఖాల కల్పనలే వెలుగు నీడలతో ఐక్యమవ్వాలి. అప్పుడు ఫోను గణగణల మధ్య, టైపు టపటపల మధ్య విరామం లేకుండా నడుస్తూ మీ యాంత్రిక జీవితానికి హిమాలయాల మానస సరోవర తీరంలో ఏకాంతంగా లోకోత్తర సౌందర్యాన్ని అనుభవిస్తున్న మరో వ్యక్తి యొక్క యాంత్రిక జీవితానికి అట్టే పెద్ద తారతమ్యం ఉండదు. అయినా

అంతఃబహిరుల మధ్య ఒక సుదృఢమైన భారసామ్యాన్ని నిర్మించుకోగలిగితే అప్పుడే సకాలంలో వారికీ మీకు మధ్య ఒక భావస్వామ్యం కుదురుతుంది'. ఇది ప్రతివారు గమనించవలసిన ముఖ్య విషయం.

చలసాని వసుమతిగారికి ఆధ్యాత్మిక, భౌతిక వాదాలపై చక్కటి వివరణ ఈ విధంగా ఇస్తాడు. ఇక సమగ్రవాదం ఏమంటే ఇటు భౌతిక జగత్తు సత్యమే. అటు ఆధ్యాత్మిక జగత్తు సత్యమే. ఒక దాన్ని అనుభవించటానికే మరొకదాన్ని విసర్జించాల్సిన పనిలేదు. భౌతిక ప్రేమతో జీవించటం ఆధ్యాత్మిక జీవితానికి ఏ మాత్రం అడ్డు రాదు. శారీరక ప్రేమ కూడా చాలా పవిత్రమైంది కనుక అది ఆధ్యాత్మిక ప్రేమకు ఏ విధంగాను ప్రతికూలత కల్పించకపోగా ఎంతో అనుకూలత కలిగిస్తుంది. సాంసారిక జీవితం విరాగం అవసరం లేదు. ఇప్పుడున్న వానికంటే ఎక్కువ ఇంకా ఎక్కువే అనురాగముండాలి. సంసారమందు, భౌతికమయినట్టి అనురాగం ద్వారానే మానవులు ఆధ్యాత్మిక ముక్తి పొందాలి. నివృత్తి మార్గం అనేది అవసరం లేదు. ప్రకృతి ద్వారానే పరమాత్మను చేరవచ్చు'. ఇది ఎంతయినా నిజం.

సంజీవదేవ్ చెల్లెలు భారతీదేవికి రాస్తూ 'సుందరం కాని వస్తువు కంటే సుందరమైన వస్తువుల్ని సేకరించటం కష్టం. సుందరమైన వస్తువుల కంటె సుందరమైన ఆలోచనలను సేకరించటం ఇంకా కష్టం. Beautiful things కంటె Beautiful thoughts ని సేకరించటం నేర్చుకోవటం ఎంతో శ్రేయస్కరం. సుందర వస్తువులు ఎల్లప్పుడూ మనసును అంటిపెట్టుకొని ఉండవు. వాటిని మనం పోగొట్టుకోవచ్చు కూడా. కాని సుందర ఆలోచనలను మాత్రం ఎల్లప్పుడు మనలోనే ఉంటాయి. వీటిని మనం పోగొట్టుకోలేము. మనము ప్రేమించే వస్తువును కాని, వ్యక్తిని కాని పోగొట్టుకుంటే మనకు దుఃఖం తప్పదు. కాని ఆలోచనల్ని అనగా భావాన్ని ప్రేమించటం అభ్యాసమైతే అది నశించదు. గనుక దుఃఖం అనేది ఉండదు. నశించే వస్తువును ప్రేమించే వారికి దుఃఖం తప్పదు'. అందరు విధిగా అనుసరించదగిన సలహా.

శ్రీరమణకు వ్రాసిన ఒక ఉత్తరంలో ఇది ఎంతటి ఉదాత్త భావనో గమనించండి. 'కురుస్తున్న వర్షాన్ని చూస్తుంటే అనేక భావాలు వస్తున్నాయి. దివి కంటె భువి ఎక్కువ విలువైంది కాబోలు. అందుకే వర్షం దివిలో స్థిరనివాసం చేసుకొనక దివి నుండి భువికి దిగి వస్తుంది. మనం ఒక రాయిని దివికి పంపాలని పైకి విసిరితే అది దివికి పోవడానికి ఇష్టపడక తిరిగి భూమి మీదకే వస్తుంది. దివి కంటె భువికి ఎక్కువ విలువ ఉందనే సత్యాన్ని శ్రీ అరవిందులు కూడా గ్రహించి తన సావిత్రి కావ్యంలో ఈ విధంగా అన్నాడు.

"She made earth her home
for whom heaven was too small"

ఎంత రమణీయ భావన. ఆమెకు స్వర్గం చాలా చిన్నదిగా తట్టినందున భూమిని తన నివాసంగా చేసుకొన్నదట అందుకే అనిపిస్తుంది మిన్ను కంటె మన్ను ఎక్కువ ప్రధానమైనదని. స్వర్గంలో ఆనందం తప్ప బాధలుండవట. అదే స్వర్గంలో ఉండే గొప్పలోపం. అసలు బాధ లేకపోవటమే గొప్ప బాధ. బాధ లేనిచోట ఆనందపు విలువ ఏమి తడుతుంది? ఎండలేని చోట నీడ విలువ తెలియదు అదే భూమి మీది గొప్పతనం. భూమి మీద ఆనందానికి తోడు బాధలు కూడా ఉంటాయి. స్వర్గంలో మృత్యువు కంటే ఎక్కువ భయంకరంగా తడుతుంది జీవితం. భూమి మీద ఆ ప్రమాదం లేదు. జీవితానికి తోడు మృత్యువు కూడా ఉన్నది. అందుకే దివికంటె భువి శ్రేష్టమైనదనేది'.

అదే సంపుటిలో తపస్వికి వ్రాసిన ఒక లేఖలో నా జీవితలక్ష్యం ఏమిటి అని మీరు ప్రశ్నించారు. మరణ పర్యంతం శాంతితో, ఆనందంతో నేను జీవిస్తూ ఇతరులను జీవింపజేయటం నా జీవిత లక్ష్యం' అని అంటాడు ఎంతటి మహత్తర ఆశయం.

ఇంక 'లేఖా స్రవంతి' ఇది కేవలం లక్ష్మీ సంజీవుల మధ్య జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలు. 'ఒక్కక్షణం' అనే పరిచయ వాక్యాలలో లక్ష్మిగారు ఇలా అంటారు 'జీవన గమనంలో మనకు ఎందరో వ్యక్తులు తారసపడుతూ ఉంటారు. వీరిలో కొందరు మాత్రమే తమ ప్రభావాన్ని మనపై బలంగా ప్రసరింపజేసి మన సాదా జీవితాన్ని ఉన్నత మార్గాలకు మలిపే శక్తి గలవారై ఉంటారు. జీవిత వెలుగులకు ఆనందాలకు మన కళ్లు తెరిపించి జీవితపు వైవిధ్యాన్ని మన జ్ఞానానికి అందించి మమతా మానవతా జ్యోతులను మనలో వెలిగించే వారు తటస్థించటం ఒకవరం. ఆకారానికి అందరూ మానవులే అయినా మానవులలోనే మానవోత్తములు ఉంటారనే విషయాన్ని మనకు స్ఫురింపజేసే వ్యక్తి డాక్టరు సంజీవదేవ్'. సంజీవదేవ్ తో పరిచయం గల ప్రముఖులు దేశ విదేశాల్లో ఎందరో ఉన్నారు. వారి ప్రభావం సంజీవదేవ్ పై ఆయన ప్రభావం వారిపై ఎంతవరకు పడిందో నేను చెప్పలేనుగాని, సంజీవదేవ్ ప్రభావం ఏ పరిస్థితులలో నన్ను బయటవేసిందో, నా జీవితాన్ని ఎటు మలిపిందో తెలియజెప్పేవే ఈ లేఖలు. ఆయన పరిచయస్తుల్లో ఎందరో కళాకారులు, మేధావులు, ప్రతిభా సంపన్నులు ఉన్నారు. అన్నిటికంటె ఆయన విలువనిచ్చేది హృదయం మేల్కొని ఉన్న వ్యక్తులకే. ప్రతిభా సంపత్తి కంటె మనిషిలోని మమతకు, మానవత్వపు విలువలకు ఆయన అత్యంత సన్నిహితుడు, స్పందించే సరససున్నిత హృదయాలకు, జాతి లింగ వయోభేదాలు పాటించకుండా తమ స్నేహ సుమాలను అందించ గలరు. ఆ సుగంధ స్నేహమాలను అందుకొన్న వ్యక్తి ధన్యం. చలంగారి లేఖలలో హృదయంతో పాటు మేధ ప్రకాశిస్తుంది. చలం లేఖల్లో ఆనందసౌధపు ఉపరితలాన్ని మన కళ్లెదుట నిలబెడితే

సంజీవదేవ్ లేఖలు ఆ సౌధాన్ని చేరుకొనే మార్గాన్ని నిర్దేశిస్తాయి'. ఈ మాటలో ఏమీ అతిశయోక్తి లేదు. సరిగదా సంజీవదేవ్ లేఖలు పొందిన ప్రతివారు ఈ మధురానుభవాల్ని పొందుతున్నవారే'.

సంజీవదేవ్ లేఖల్లో ప్రస్ఫుటమవుతున్న జీవనదార్శనికత, తాత్విక విశ్లేషణ ఏ కొందరి మనోవికాసానికైనా తోడ్పడగలిగితే ఈ ప్రచురణ ప్రయోజనం నెరవేరినట్లే 'అంటారు లక్ష్మిగారు. వారాశించిన ప్రయోజనం తప్ప కొంత వరకైనా నెరవేరగలదని నా నమ్మిక. సంజీవదేవ్ ఒక మహా కళాతపస్వి. జీవనశిల్పి, ఆయన జీవితమే ఒక కళ. నిరాడంబరత, నిష్కల్మష ప్రవర్తన, శాంత స్వభావం ఆయనకు జన్మతోనే వచ్చాయి. ఎంత సంతోషం వచ్చినా పొంగిపోకుండా, ఎంత విచారం సంభవించినా కృంగిపోకుండా కష్టసుఖాలను ఒకే రకంగా స్వీకరించగల ప్రాక్టికల్‌వేదాంతి. నిజమైన మానవతావాది. కోపం అనేది ఆయన నిఘంటువులో లేదు సత్యాన్వేషణ, సౌందర్యోపాసన, శుభచింతన ఆయన జీవితాచరణాలు.

పాశ్చాత్య చిత్రలేఖనా పద్ధతులను చక్కగా అవగతం చేసుకొన్న గొప్ప కళా విమర్శకుడు పేరు పొందిన అనేక ఆంధ్ర, ఆంగ్ల పత్రికలలో ఈయన కవితలు, వ్యాసాలు ప్రచురితమయ్యాయి. ఎన్నో గ్రంధాలకు పీఠికలు వ్రాశాడు. ఇంతవరకు పుస్తకం రూపంలో వచ్చినవి రస రేఖలు, తేజోరేఖలు, సమీక్షారేఖలు, రూపారూపాలు, దీప్తిధార, తెల్లమబ్బులు, తెగిన జ్ఞాపకాలు, స్మృతిబింబాలు, గతంలోకి, కాంతిమయి, Grass and green, Biosymphony ఇవి గాక లేఖా సాహిత్యంగా సంజీవ్‌దేవ్ లేఖలు, లేఖల్లో సంజీవదేవ్, లేఖా స్రవంతి, అచ్చులో వచ్చాయి. సంజీవదేవ్ కొన్ని వేల సంఖ్యలో ఎంతోమందికి లేఖలు వ్రాసినప్పటికీ ఇంతవరకూ అచ్చులో వచ్చినవి పై నాలుగు మాత్రమే.

దస్తూరిని బట్టి ఒక వ్యక్తి స్వభావం తెలుసుకోవచ్చునంటారు కొంతమంది పెద్దలు మిగతా వారి విషయంలో ఏమో గాని, సంజీవదేవ్ విషయంలో అది అక్షరాల నిజం. ముత్యాల కోవలాంటి ఆ అక్షరాలు, ముచ్చటైన ఆ Embossing letter leads, వాటికి సరిగ్గా అమిరే అందమైన ఆ Envelopes ముద్దులు మూటగట్టే ఆ అడ్రసు ఎంతటి రసహీనుణ్ణయినా రసరంజితం చేస్తాయి. ఆ పదపొందిక, ఆ అభ్యుదయ భావ పరంపర సరాసరి అందరినీ మంత్రముగ్ధులను చేస్తాయి. ఈయన ప్రతి లేఖ ఒక వికాస వీచిక, ప్రతి పదము ఓ రసగుళిక. ప్రతి అక్షరం ఒక శిల్ప శిఖరం అంటే అతిశయోక్తి కాదు. ఇన్ని సుగుణాలుండటం వల్లనో ఏమో ఆయన నుండి ఉత్తరాలు పొందటం మహాభాగ్యంగా తలచిన వ్యక్తులు చాలామంది ఉన్నారు. ఆ పొందిన భాగ్యాన్ని తమ తమ మిత్రులకు కూడా పంచటం జరుగుతూ ఉంటుంది. ఎంతటి చిన్నవారయినా రెండు పంక్తులు గెలికి ఆయనకొక జాబు వ్రాశాడంటే చాలు రెండో నాటికల్లా చక్కటి జవాబు

రావాల్సిందే. ఒక్కొక్కప్పుడు ఆ జవాబుతో బాటు ఒక ప్రకృతి చిత్రం కూడా ఉంటుంది. అందులో పసివాళ్లే గాక పండు ముదుసళ్లు కూడా ఉండటం విశేషం. స్త్రీలు – పురుషులు, పేద–ధనిక, పండిత–పామర అనే బేధం లేదు. ఎవరి స్థాయికి తగ్గట్టు వారి స్థాయిలో జాబులు వ్రాయటం ఆయన ప్రత్యేకత. వంటావార్పు మొదలు వేదాంతం వరకు, సాహిత్యం, సంగీతం, చిత్రలేఖనం, శిల్పం, నాట్యం మొదలగు ఎన్నో విషయాలు చోటుచేసుకుంటాయి. అప్పుడప్పుడు గిలిగింతలు పెడుతూ మంచి హాస్యం కూడా తొంగిచూస్తుంది. ఎక్కువగా మనఃశాస్త్ర మర్మాలు (వాటినే తుమ్మల సీతారామమూర్తిగారు మనోవ్యాకరణ సూత్రాలన్నారు) వివరించటం జరుగుతుంది. సంజీవదేవ్ లేఖా సాహిత్యాన్ని వియత్తలానికి ఎత్తి, విశ్వవిస్తృతికి కొనిపోయి ఒక అద్భుతమైన సంపూర్ణ స్థాయిని వానికి కల్పించారు. ఈయన లేఖలు సమన్వయ సంపూర్ణాలు. హృదయ మనస్సంబంధం సమానంగా కలవి. ఆయన హృదయం శాంత గంభీర తటాకం. ఆయనదెప్పుడూ సమన్వయ దృష్టే. ఈ లేఖల ద్వారా ఆ మహామానవుడు ఆది మానవులకు, జిజ్ఞాసువులకు అపారమైన ఆలోచనా ధారనందించి లోకానికి మహోపకారం చేశారు.

(రచయిత – శ్రీ వేగుంట కనకరామబ్రహ్మం, వట్లూరు నివాసి.)

# లేఖా సంజీవనం

సి. వేదవతి

సామాన్యంగా కనిపించే అసామాన్య జీవి శ్రీ సంజీవదేవ్.

ఆయన రచయిత, చిత్రకారుడు, విమర్శకుడు, ఉపన్యాసకుడు, తత్త్వవేత్త, రసవేత్త, మనో వైజ్ఞానిక శాస్త్రవేత్త, కవి – కళాతపస్వి – మేధావి.

ఆయనది బహుముఖమైన ప్రజ్ఞాతత్త్వం.

అద్భుతంగా అనిపిస్తుంది కానీ – అందుకు కారణం ఆయనలోని స్వయం భవమైన ఉపజ్ఞాతత్త్వం. నిత్య చైతన్యశీలమైన స్వయం కృషీవలత్వం.

ఆయన మనస్సు జిజ్ఞాసామయం. ఆయన ప్రవృత్తి నిరంతర చేతనాత్మకం.

పుట్టుకతోనే మేధావి సంజీవదేవ్. మ్రొక్కుబడి చదువుల్లో అందుచేతనే ఇమడలేక పోయాడు. మేధావులందరికి మల్లేనే ఆయన జీవన విశ్వవిద్యాలయంలోనే చదువుకుని, విజ్ఞానం గడించాడు.

ప్రకృతి దృశ్య నికేతనంలోనే ఆయన అద్భుత కళావైభవ సౌందర్యాన్ని దర్శించి ఆరాధించడం నేర్చుకొన్నాడు. మేధోమయ మానస భావనా ప్రపంచం నుంచే ఆయన ఒక మహా జీవన శిల్ప లక్షణాన్ని అందుకొని, జీవన వ్యాపారాన్ని సుందరమూ, సుసంపన్నమూ చేసుకొన్నాడు.

మొదటినుంచీ ఆయనను వెన్ను తట్టి నడిపించింది అంతులేని విజ్ఞాన జిజ్ఞాస. ఆ జిజ్ఞాసతోనే చిన్నతనంలోనే ఆయన ఇల్లు వదలి హిమాలయ ప్రాంతాలకు ఒంటరి పయనం సాగించాడు.

ఆ స్వయం అధ్యయన యజ్ఞంలో ఆయనకు అపారమైన మిత్ర సంపద లభించింది అనేకానేక లౌకిక, అలౌకిక, తాత్త్విక, కళాత్మక విషయాల గురించి ఆ హిమాలయ సానువుల్లో, ప్రకృతి ఒడిలో, మిత్రుల సాంగత్యంలో అవలోకనం చేసుకుని, ఆయన ఔపోసన పట్టాడు. ఆలోచనలతో, అధ్యయనంతో ఆయన మానస క్షేత్రం పండి పరిపుష్టమైంది.

కుంచెతో, కలంతో ఆయన చేసిన అద్భుత కళాసృష్టి – రాశిలోనూ, వాసిలోనూ, హిమాలయ మంత ఎత్తుకు ఎదిగింది. ఆయన రచన ఒక రసభాండం. ఆయన చిత్ర రచన ఒక దృశ్య గీతం.

మనస్వి సంజీవదేవ్ నిత్య తపస్వి. ఆయనది ఋషివంటి జీవితం. ఆయన సృజనాత్మక కార్యకలాపాలన్నిటికీ వేదిక, భూమిక – ఆయన నివసించే పల్లెటూరు – తుమ్మపూడి.

సభలూ, సమావేశాలకూ ఎవరైనా పిలిచినప్పుడు వెళుతుంటాడు. ఉపన్యాసాలు ఇస్తుంటాడు. కాని, ముఖ్యంగా ఆయన కార్యక్షేత్రం తుమ్మపూడిలోని స్వగృహం.

ఆయనకు చాలా ఇష్టమైన నిత్య కర్మానుష్ఠానం ఒకటి ఉంది. అది మిత్రులకు ఉత్తరాలు వ్రాయడం - వారి నుంచి ఉత్తరాలు అందుకోవడం.

దేశ విదేశాల నుంచీ ఆయనకు ఉత్తరాలు వస్తుంటాయి. అన్నిటికీ ఆయన వెంటనే సమాధానం వ్రాస్తాడు.

పరిచితులూ, మిత్రులే కాక, అపరిచితులు కూడా ఆయనకు అసంఖ్యాకంగా ఉత్తరాలు వ్రాస్తుంటారు. ఆయన దగ్గర నుంచీ వచ్చే బదులు ఉత్తరం కోసం వేయి కళ్లతో ఎదురు చూస్తుంటారు.

ఎవరి ధోరణి వారిదే. భిన్న ప్రకృతుల వాళ్లు, భిన్న పద్ధతుల వాళ్లు, భిన్న ధోరణుల వాళ్లు – ఎవరి సంస్కారాన్ని బట్టి వారు – రకరకాలుగా ఆయనకు ఉత్తరాలు వ్రాస్తుంటారు. వారి వారి చిత్తవృత్తికి సరిపడేటట్లుగా – ఆ ఉత్తరాలకు సమాధానం వ్రాయడం సంజీవదేవ్‌కు అభ్యసించని కళ.

అవును, ఉత్తరం వ్రాయడం ఒక కళ. కమ్మని కమ్మను అందుకోవడం ఒక అనుభవం. దూరదూరాలలో ఉన్న ఇద్దరు మిత్రుల మధ్య పూల వంతెనలు కడతాయి ఉత్తరాలు. మనసు ఊసులు మోసులు కట్టి మోసుకువస్తాయి. మనసును చందన శీతలం చేస్తాయి. ఆత్మీయ రాగాలెన్నిటినో స్వరళిస్తాయి.

ఉత్తరాలు ఎన్నో రకాలు! వ్యవహార సంబంధమ్మైనవి, వ్యాపారానికే పరిమితమ్మైనవి ప్రక్కన పెడితే – మిత్రుల మధ్య నడిచే ఉత్తరాలు కూడా ఎన్నో రకాలుగా కనిపిస్తాయి. కుశల ప్రశ్నలకు పరిమితమయేవి కొన్ని, ముక్తసరిగా, మ్రొక్కుబడిగా, తప్పక వ్రాస్తున్నట్లుగా ముగించబడతాయి ఇవి. వాటిని ఒక్కసారి క్రీగంట చూచి ఆవల పడవేసినా చాలు, అటువంటిదే పొడి అక్షరాలతో జవాబు గీకివేసినా చాలు.

ప్రేమికుల మధ్య నడిచే ఉత్తరాలు ఆ ఇద్దరి మనో వ్యాపారానికే సంబంధించినవి అయి ఉంటాయి. ప్రేమావేశాన్ని వ్యక్తం చేసుకోవడమే అటువంటి ఉత్తరాల ప్రధాన లక్ష్యం. స్నేహశీలత మనోవృత్తిగా గల కొందరి మధ్య నడిచే ఉత్తరాలు మాత్రం సమార్ద్రంగా ఉంటాయి. పన్నీటి చిలకరింపులా ఉంటాయి !

లేఖా రచనంలో సంజీవదేవ్ శైలి అనితర సాధ్యం! ఆయన ఉత్తరాలు వ్రాయడం అనే పనిని ఒక అపురూపమ్మైన కళగా తీర్చిదిద్దాడు. అందుకే ఆయన ఉత్తరాలన్నీ ఒక్కొక్కటీ ఒక రసఖండిక!

లేఖలతో నడిపించే సాహిత్య ప్రక్రియ ఒకటి ఉంది. అది తెలుగు భాషలో చాలా తక్కువనే చెప్పాలి. ప్రచురణ కోసం – ఆ దృష్టితో వ్రాసిన సాహిత్యం అది. అందుచేత దాని తీరే వేరు!

కొందరి ఉత్తరాలు మాత్రం – అవి వ్యక్తుల మధ్య నడిచినవే అయినా, విశ్వజనీనమ్మైన విలువలు సంతరించుకొని ప్రచురణార్హం అయిపోతుంటాయి.

అందులో సంజీవదేవ్ లేఖలు అగ్రస్థానంలో ఉంటాయి. ఆయన ఉత్తరాలు ఇప్పటికే కొన్ని సంకలనాలుగా ప్రచురితం అయ్యాయి. మరింకా ఎన్నో ప్రచురణ కోసం ఎదురుచూస్తున్నాయి.

ఆయనతో ఉత్తరాల ద్వారా మైత్రిని పెంపొందించుకొనేవారిలో స్త్రీలూ, పురుషులూ, విద్యార్థులూ, విఖ్యాతులూ, అనామకులూ, అన్ని వయసులవారూ, అన్ని మానసిక స్థాయిల వారూ ఉన్నారు.

తాను వ్రాసే ఉత్తరాలే – తన సాహిత్య వ్యవసాయంలో ముఖ్య భాగంగా పరిగణిస్తారు సంజీవదేవ్.

ఆయనే అంటాడు ఇలా –

'వేరే సాహిత్య రచనలకు బదులు ఉత్తరాలు వ్రాయడమే నా సాహిత్య రచనలుగా సాగినాయి. మంచి మంచి పదావళీ, ఉన్నత భావావళీ ఉపయోగించే వాణ్ణి నా ఉత్తరాలలో. ఈ ఉత్తరాల రచన – తరువాత నా వ్యాసరచనకు పరోక్షంగా చాలా సహకరించింది'.

చిన్నతనంలోనే ఆయన హిమాలయ ప్రాంతాలకూ ఉత్తర భారతానికీ ఒంటరి పయనం సాగించి - అక్కడి మేధావులతో, సాంస్కృతిక జీవులతో పరిచయాలు పెంపొందించుకోగలగటం ఒక గొప్ప అనుభవం! ఆయనకు మొదటగా ఏర్పడిన మిత్రులు ఆ ప్రాంతీయులే! అందుచేత తొలినాళ్లలో ఆయన సాగించిన ఉత్తర ప్రత్యుత్తరాలు బెంగాలీ, హిందీ, ఆంగ్లభాషల్లో ఉండేవి

ఆయన రాస్తాడు ఉత్తరాలని - అందమైన భాషలో, ఇంకా అందమైన అక్షరాలతో! అందమైన కాయితాల మీద అచ్చొత్తినట్లు వ్రాసిన ఆ ఉత్తరాలని మరీ అందమైన కవర్లలో ఉంచి పంపడం ఆయనకు ఇష్టమైన పని.

ఈ ఉత్తరాల ప్రవాహాన్ని గురించి ఆయనే ఒకచోట ఇలా అంటాడు -

'ప్రతి నెలలో ఒక అపరిచిత వ్యక్తి దగ్గర నుంచి ఉత్తరం వస్తూనే ఉంటుంది. ఆ ఉత్తరానికి నేను జవాబు వ్రాయడంతో ఆ అపరిచిత వ్యక్తి పరిచిత వ్యక్తిగా మారిపోతుంటాడు. పరిచితులుగా మారిన అపరిచితులు నన్ను చూడడానికి వచ్చిపోతుండటంతో వారితో సాన్నిహిత్యం ఏర్పడుతుంటుంది. వారు కొంతకాలం ఉత్తరాలు వ్రాసి వ్రాసి నేపథ్యంలోకి వెళ్లిపోతుంటారు. మళ్లీ వారి స్థానాన్ని కొత్తవారు తీసుకొంటుంటారు!'.

ఆయనకు ఉత్తరాలు వ్రాసే వ్యక్తులు మారుతుండినా, ఉత్తరాల వెల్లువ మాత్రం తరగదు. ఎవరు ఏమి వ్రాసినా, ఆయనకు చిన్న చూపు ఉండదు. అన్ని ఉత్తరాలనూ అంతే ఆదరంతో అందుకొని తగిన రీతిలో సమాధానం వ్రాస్తుంటాడు ఆయన!

గుంటూరు జిల్లా తుమ్మపూడి - అనే మారుమూల గ్రామానికి - బయటి ప్రపంచానికి మధ్య నడిచే ఆ ఉత్తరాలు ఒక పరమాత్మీయమైన సేతువును నిర్మించాయి. అందుకే, ప్రతి ఉదయమూ, పోస్టు వచ్చే వేళకు - ప్రపంచమంతా తుమ్మపూడిలోని సంజీవదేవ్ గవాక్షం నుంచి తొంగి చూస్తున్నట్లు అనిపిస్తుంది.

ఎప్పటికప్పుడు కొత్తవారూ అపరిచితులూ అయిన వారి నుంచీ ఉత్తరాలు అందుకొంటూ ఉండడమూ ఆయనకు గొప్ప ఆనందాన్ని ఇస్తుండే విషయమే. ఆయన అంటారు కదా - 'ఈ నూతనంగా సాగుతున్న ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా, సరికొత్త మానవ మనస్తత్వాలను అనుశీలనం చేసే అవకాశం ఏర్పడుతున్నందుకు చాలా ఆనందం కలుగుతుంది'.

ఒకరినొకరు చూచుకోకుండా, ఎరగకుండా, ఉత్తరాలు వ్రాసుకోవడంలో కొంత ఆకర్షణ, నూతనత్వం, నిరీక్షా మాధురీ - నిండి ఉంటాయని అంటారాయన ! ఇది ఎంత నిజమో అంత అనుభవైక వేద్యం!

ఉత్తరం అందగానే జవాబు వ్రాసే దురభ్యాసం తనకు చిన్నతనం నుంచీ ఉన్నదని ఆయనే చమత్కరిస్తుంటాడు. అవతలివారు ఆలస్యంగా వ్రాసినా, తనకు ఉత్తరం చేరిన వెంటనే బదులు వ్రాయడం ఆయన పద్ధతి. అటు నుంచి వచ్చే ఉత్తరం ఎంత ఆలస్యమైనా ఆయన పట్టించుకోడు.

'ఈ అసీమ జగత్తులో దేనికీ కూడా కాలదోషం లేదు, స్థలం అసీమమైనట్లే కాలం అనంతమైనది. కనుక మీరు ఎంత ఆలస్యంగా వ్రాసినా కూడా తొందరగా వ్రాసినట్లే!' అంటారు ఒక అమితాలస్యపు ఉత్తరానికి బదులు వ్రాస్తూ!

అసలు ఎందుకు ఈ వృధా ప్రయాస? ఈ ఉత్తరాలు వ్రాసుకోవడం. దీనివల్ల కలిగే ప్రయోజనం ఏమిటి ? – అనే వాళ్లూ ఆధునిక యుగంలో కొల్లలుగా ఉన్నారు.

జీవితాన్ని ఒక నిర్దిష్ట పరిధిలో బిగించుకొని, కనులూ, చెవులూ మూసుకొని, మూసిన రైలు పెట్టెలో ప్రయాణంలా జీవితం సాగించేవారికి ఇటువంటి ఆలోచన రావటం సహజం.

కానీ, జీవితమంటే, కేవలం బ్రతికేయటం కాదు. జీవితం బహువిస్తృతమైంది. ఆలోచనలకూ, అనుభూతులకూ ఆలవాలమైనది.

ఆ ఆలోచనలు పంచుకోవటానికీ, ఆ అనుభూతులను ఎరికచేసుకోవటానికీ, స్నేహ స్పర్శలను అనుభవించటానికీ – మనకు నిత్యజీవిత కార్యకలాపాలను మించినదేదో కావాలి. సాంస్కృతిక జీవులైన వారందరికీ అట్టి మహత్తర అనుభవం ఏదో కొంత కావాలి.

దూరతీరాల నుండీ మైత్రీ హస్తం అందించే వారితో చేతులు కలపడానికీ, ప్రత్యక్షంగా చెప్పలేని కొన్ని అనుభూతులను పంచుకోవడానికీ, ఆలోచనాత్మకమైన ఎన్నో విషయాలను తెలియ చేసుకోవటానికీ – ఉత్తరాలకు మించి శరణ్యం లేదు.

సంజీవదేవ్‌లేఖలలో ఈ ఆత్మీయతా స్పర్శలన్నీ కనిపిస్తాయి. ఇదికాక, ఆయన ఉత్తరాల్లో ఎన్నో రసవత్తరమైన, ఆలోచనాత్మకమైన, విజ్ఞానదాయకమైన, మనోవికాస కారకమైన అంశాలు ఉంటాయి.

ఆయన ఉత్తరం పలకరిస్తుంది. అవతలివారిని పరామర్శిస్తుంది. వారి కష్ట సుఖాలకు ప్రతిస్పందిస్తుంది. వెన్నుతట్టి ధైర్యం చెపుతుంది. మనోబలం పెంచుతుంది. ఆత్మవిశ్వాసం కలిగిస్తుంది. జీవితం పట్ల సద్భావనను ఏర్పరుస్తుంది. నొప్పించక, తానొవ్వక ఆనందంగా జీవించే కళను నేర్పుతుంది! కళను గురించి, సాహిత్యాన్ని గురించి రస చర్చలు చేస్తుంది. ప్రకృతిలో, ఋతువులలో కనిపించే సర్వకళలనూ మనోహరమైన రీతిలో ఎత్తి చూపుతుంది. అనేక

జీవితానందాలను, అందాలను అనుభవించడం ఎలాగో నేర్పుతుంది. గంభీరమైన విషయాలెన్నిటినో చెపుతూనే మధ్య మధ్య చమత్కార భాషణంతో గిలిగింతలు పెడుతూనూ ఉంటుంది.

ఈ ఉత్తరాలలో భేషజం ఉండదు! డాంబికం ఉండదు! ఆయన గ్రహించిన జీవన సత్యాలను తిరిగి చెప్పడంలో – ఉత్తరాలలోనే ఆయన ఎవరో, ఏమిటో తెలుసుకునే వీలు కలుగుతుంది! ఒక్కమాటలో చెప్పాలంటే, దేవ్ ఉత్తరాలు ఆయన సంపూర్ణ వ్యక్తిత్వానికి అద్దం పడతాయి!

కావటానికి ఆయన వ్రాసే ఉత్తరాలు చిన్నవిగానే ఉంటాయి అయితేనేమీ? ఆ చిన్న లేఖలలోనే అనంత జీవన సంస్కృతికి సంబంధించిన అనేక విషయాలు ఇమిడివుంటాయి.

పేజీలకు పేజీలు చాట భారతపు ఉత్తరాల కంటే చిన్న ఉత్తరాలే ప్రాణవంతంగా, లయమయంగా, ఆత్మీయంగా తనకు గోచరిస్తవని అంటాడు. అల్పంలోనే అనల్ప జీవలక్షణాన్ని చిత్రించగలిగిన సంజీవదేవ్.

ప్రచురితం అయిన ఆయన ఉత్తరాలు చదివిన కొలదీ చవులూరిస్తాయి! ప్రతి ఉత్తరంలోనూ మనం ఒక కొత్త విషయం గురించి తెలుసుకోవటమో, ఆలోచించటమో జరుగుతుంది! అవి ఆయన ఎప్పుడో ఆయన మిత్రులకు రాసుకొన్న ఉత్తరాలు కదా అన్న భావం మనకు కలగదు సరికదా, ఆయన మనలను ఉద్దేశించే ఆ మాటలు అని ఉంటాడా అన్న అనుమానమూ కలుగుతుంటుంది.

ఆ ఉత్తరాలలోని జీవశక్తి అటువంటిది. అవి ఇతరులకు అందించే వెలుగు అటువంటిది. పట్టి రాసిన రచనలే పేలవంగా తోస్తాయి ఒక్కొక్కప్పుడు. దేవ్ లేఖలు సార్వజనీనమైన, సార్వకాలికమైన విలువలతో – మేధనూ, గుండెనూ కూడా కదిలించి వెలిగించేవిగా ఉంటాయి. కనుకనే అవి గొప్ప సాహిత్య మర్యాదను సంతరించుకొన్నాయి.

సంజీవదేవ్ లేఖలను చదువుతున్నప్పుడు – మనసుకు పట్టే విషయాలు ఎన్నో! అందులో – ఆయన అందించే మైత్రీ సంపద – మనస్సుకు సాంత్వన ఇస్తుంది. తుష్టిని ఇస్తుంది! ముందుగా, ఒక స్నేహ చిత్రం మన కనులముందు కదలాడుతుంది!

## మైత్రి

జీవన వ్యవహారంలోనూ, లేఖా రచనలలోనూ స్నేహశీలతకు ప్రాధాన్యం ఇచ్చే సంజీవదేవ్– స్వచ్ఛమైన మైత్రి ఇలా ఉంటుందని చెపుతాడు –

'జన్మించడం ఒక గొప్ప విశేషం. జీవించడం అంతకన్నా గొప్ప విశేషం. ఇక జీవితంలో యోగ్యమిత్రులను పొందటం అన్నిటికంటే గొప్ప విశేషం. నిస్వార్థమైత్రి – లోకంలో ఉజ్జ్వలంగా, ప్రోజ్జ్వలంగా, మహోజ్జ్వలంగా జ్వలిస్తుంది. ఆ జ్వాల ముందు వ్యక్తిగత స్వార్థాల చీకటి దగ్ధం అయి, మాడి బూడిదైపోతుంది. మిగిలేది విశ్వశ్రేయమే!'

ఇట్లాంటి స్నేహం నిజంగా ఉంటుందా? ఉంటే ఎంత బాగుండును! – అనిపిస్తుంది మనకు.

ఇటువంటి స్నేహం వర్ధిల్లటం సుసాధ్యం కాకపోయినా, అసాధ్యం కాదని అంటాడు ఆయన.

'అవును. స్వచ్ఛమైన, నిస్వార్థమైన మైత్రి లోకంలో అరుదు. అది ఎంతో మృదులం. మధురం, ఉన్నతం. ఇటువంటి మైత్రిలో ఒకరి ప్రగతినీ, వికాసాన్నీ, గొప్పదనాన్నీ చూచి మరొకరు అసూయపడక, హృదయపూర్వకంగా ఆనందిస్తారు. ఇటువంటి మైత్రి చాలా అరుదు కాని, ఏది అరుదో అదే మన ధ్యేయం!'

ఒకరి ఉన్నతికి ఆనందించగలిగినట్లే – వారికి ఏదైనా దుఃఖమో కష్టమో సంభవించినపుడు – అందుకు ప్రతిస్పందించడం కూడా గొప్ప మైత్రికి లక్షణం. సంజీవదేవ్ లేఖలలో దుఃఖోపహతులైన వారికి ఓదార్పు నిచ్చే ఈ మైత్రీ లక్షణం తరచుగా కనబడుతుంది.

**సహానుభూతి**

'నేను ఎండు వేదాంతిని కాదు. వ్యక్తుల జీవితాలలోని ఎండ నీడల్ని తెలుసుకోవడంలో నాకెంతో అభిలాష, ఆనందం. నావి ఇతర్లకు తెలపటంలో కూడ–'

అనటంలో ఆయనలోని మానవీయ గుణం ఎంతటిదో మనకు అర్థం అవుతుంది.

అందుకే – ఆయనకు ఎందరెందరో తమ జీవితాలలోని వెలుగు నీడల గురించి ఉత్తరాలలో తెలుపుతుంటారు. మనసులోని అశాంతినీ, ఆవేదననూ వెళ్లబోసుకుంటారు. ఎవరి మానసిక స్థాయికి తగినట్లు వారికి సాంత్వన వాక్యాలు పలుకుతూ చిత్తస్థైర్యం అందిస్తాడు ఆయన.

ఈ పని చేయడానికి ఎంతో ఓర్పు కావాలి. మనో విజ్ఞానం తెలిసి ఉండాలి. ఈ రెండు లక్షణాలూ దేవ్ వ్యక్తిత్వంలో పుష్కలంగా కనిపిస్తాయి.

ఆయన మనస్తత్వ శాస్త్రాన్ని అధ్యయనం చేసినవాడు. బాధ అంటే ఏమిటో స్వయంగా ఎరిగినవాడు. ఆ బాధను అణచి పట్టుకునే గొప్ప శిల్పం తెలిసినవాడు. ప్రయత్నపూర్వకంగా చీకటిని ప్రక్కకు నెట్టి వెలుతురు ద్వారాలు తెరుచుకొనే సాధనను స్వయంగా అభ్యాసం చేసినవాడు.

'ప్రతి జీవితంలో కొన్ని బాధలూ, దుఃఖాలూ, అసంతృప్తులూ, ఆవేదనలూ, సంవేదనలూ ఉంటేనే కాని మానసానికి పదునెక్కదు. అప్పుడు కాని తోటి మానవుడి వెలుగు నీడలను అర్థం చేసుకోలేము. అందుకే బాధ – జీవితంలోని బోధకు మార్గం అవుతుంది!'

ఇట్లా బాధను బోధగా మార్చుకోవడం సాధ్యమా. బాధ కలిగినప్పుడు కృంగిపోవటం మాత్రమే తెలిసిన వారికి అటువంటి ప్రయత్నం ఎటువంటి ఫలితాన్ని ఇస్తుందో చెపుతాడు దేవ్. తన జీవితంలో తాను చేసిన ఈ ప్రయోగం గురించి నిరాడంబరమైన రీతిలో ఇలా చెపుతాడు.

'నా బాల్య జీవితంలోనే తల్లి చనిపోవటంతో ప్రారంభించిన నా జీవితం ఎన్నో ఆందోళనలను, ఆవేదనలను, పరివేదనలను, సంవేదనలను – అనుభవిస్తూ, అనేక వెలుగు నీడలను చూచి, రాజకీయ సాంఘిక కార్యక్రమాల్లో నీరసత్వాన్ని గ్రహించి, బాహ్య జీవితం కంటే అంతర్ జీవితమే ఎక్కువ ఆనందకరమైనదని అనుభవం ద్వారా గ్రహించి, సాహిత్యమూ, చిత్రలేఖనమూ, ఆత్మ జిజ్ఞాస – మొదలైన వాటిని వరించి, జీవితంలోని వేదనలను ఆనంద జ్యోతికి నివేదనముగా మార్చి, దుఃఖానికి దూరంగా జీవిస్తున్నానని నమ్ముతున్నాను'.

ఇంతకన్నా నిత్యజీవితంలో సాధించగలిగిన పూర్ణయోగం మరేముంటుంది?

ఒక జీవన సత్యాన్ని అరటిపండు ఒలిచి పెట్టినట్లు విశ్లేషించి చెపుతాడు ఆయన. ఆ చెప్పటంలోనే అందులో దాగిన సూక్తి ఒకటి మనకు దీపంలాగా దర్శనమవుతుంది.

"Time is the best healing balm – అని నా జీవితపు అనేక చీకటి ఘడియల్లోని అనుభవాల ద్వారా తెలుసుకున్నాను. మీరు దేనిని గురించీ బాధపడకండి. కాలం దానిని సరిచేస్తుంది'.

'ఒక్కొక్కసారి మనకు ఇష్టం కాని ప్రతికూల పరిస్థితులు అనేకం వస్తుంటాయి. వాటికి మనం చింతిస్తూ కూర్చుంటే లాభం లేదు. పరిస్థితులు మనకు అనుకూలంగా మారనప్పుడు, వాటికి అనుకూలంగా మనం మారాలి. లేనిచో సంఘర్షణ తప్పదు'.

'హృదయంలోని అశాంతి నశించాలంటే, హృదయ కుహరాలలో ఎక్కడో మారుమూలల చీకటి సందుల్లో మనకు తెలియకుండానే దాగి ఉన్న ఏదో అనిర్వచనీయమైన 'భయం' (fear complex) అనేది నశించాలి. ప్రతి వ్యక్తిలో ఏదో విధమైన భయం అధోచేతనలో దాగి ఉండి, దాని వివిధ వికృత ప్రతిబింబాలను సహజ చేతనపైన ప్రదర్శిస్తూ ఉంటుంది. వాటి నుండే చిత్ర విచిత్రమైన ఆందోళనలు, అశాంతులు, చింతలు, చీకట్లు, చికాకులూ అన్నీ బయలుదేరుతవి'.

హితం చెపుతున్నట్లుగా, స్నేహితం చేస్తున్నట్లుగా, వెన్ను తట్టినట్లుగా, తెలివిడి చేస్తున్నట్లుగా – ఉండే మాటలు ఇట్లా ఉత్తరాలలో చదువుకొన్నప్పుడు గహనమైన వేదాంత జ్ఞానమంతా మనకు సువిదితం అయినట్లు అనిపిస్తుంది.

ముఖ్యంగా మానసిక వత్తిడికి ఎక్కువగా గురి కావలసి వస్తున్నది స్త్రీలే. జీవితంలోని అన్ని దశలలోనూ అనేక రకాలుగా మానసిక హింసకు గురికావలసి వస్తున్నది ఆమె. కారణాలు ఏమైతేనేమి – స్త్రీ జీవితం నిరంతరం సమస్యలతో వేధింపబడుతూ ఉన్నమాట నిజం.

ఇటువంటి వారెందరో తమ ఆవేదనలు తెలుపుకొంటూ సంజీవదేవ్ కు ఉత్తరాలు రాస్తారు. ఆయన బదులుగా రాసే ఉత్తరాలు వారికి సంజీవనౌషధాలుగా పనిచేసిన ఉదంతాలు ఉన్నాయి.

ఎక్కువగా మానసిక అశాంతికి స్త్రీలే ఎందుకు గురి అవుతుంటారు?

మనస్తత్వ శాస్త్రం పట్ల సంపూర్ణమైన అవగాహన కలిగిన సంజీవదేవ్ చెపుతాడు – 'స్త్రీలలో ఎంతటి బాధనైనా భరించగలిగిన ఓర్పు ఉంటుంది. బాధకు బొత్తిగా ఓర్చుకోలేని సున్నితత్వమూ ఉంటుంది. ఎంతో శక్తిమంతంగా ఉండే మనస్సు ఒక్కొక్కసారి బలహీనతకు లోనై ఆత్మహత్యలకు కూడా దారి తీసేటంతగా క్రుంగిపోతుంది'.

ఆయన దృష్టిలో – స్త్రీ ప్రధానంగా మానసికి జీవి. ఆ మనస్సుకు ఘాత కలిగితే మానసికంగా క్రుంగిపోతుంది. తీరని కోరికలు, కుటుంబ పరమైన సమస్యలు, ఆందోళనలు, చింతలు, ఆవరించుకొన్నప్పుడు వాటిని తట్టుకొనే మానసిక బలం తగ్గుతుంది. అటువంటప్పుడే భయంకరమైన శూన్యం ఏర్పడుతుంది. అది మరణ భయం కన్నా మించిన బాధ. అట్టి బాధ ఆత్మహత్యకు కూడా దారితీస్తుంది.

ఇట్టి మహా శూన్య మానసిక స్థితి నుండి కొందరు స్త్రీలు – కేవలం దేవ్‌తో ఉత్తర ప్రత్యుత్తరాలు జరపడం వల్లనే బయటపడిన వారు ఉన్నారు.

భయం, ఆందోళన, విషాదం – మొదలైనవి పట్టి పీడించే కొందరు స్త్రీలకు ఉత్తరాల ద్వారా మానసిక చికిత్స చేసి వారికి సహజ మానసిక స్థితిని కలిగించి, వారి మానసాలను మానస సరోవరాలుగా మార్చడమే తనకు ఆనందం కలిగించే విషయం – అంటాడు సంజీవదేవ్.

సానుభూతి పూర్వకమైన ఇట్టి మనో వైజ్ఞానిక ప్రయోగాల ద్వారా ఆయన రాసే ఉత్తరాలకు ఒక అపూర్వమైన ప్రయోజనమూ సిద్ధించడం ప్రత్యక్షర సత్యం.

ప్రతి జీవీ ఏదో ఒక దశలో చింతలూ చికాకులూ అనుభవించక తప్పదు. ఆప్తులెవరైనా భౌతికంగా దూరం అయినప్పుడు మనస్సుకు కలిగే బాధ మరీ దారుణంగా ఉంటుంది. పుట్టుకకు మల్లేనే గిట్టటం కూడా సహజమైన ఘటన. జీవితాన్ని గురించి దేవ్ ఎంత తీవ్రమైన సమాలోచన చేస్తాడో. మరణాన్ని గురించి కూడా అంత వివేకవంతమైన వివేచన చేస్తాడు.

'జీవితంలో తప్పక చేయగలం – అని గట్టిగా చెప్పగలిగిన పని మరణించడమే!' అని చమత్కరిస్తూ – ఇంకా ఇలా అంటాడు :

'మృత్యువు అంటే జీవితంలోని ఒక ఉజ్జ్వలమైన భాగం మాత్రమే. బ్రతికి ఉండడం సగం జీవితం మాత్రమే అవుతుంది. మరణాన్ని కూడా కలుపుకొన్నప్పుడే సంపూర్ణ జీవితం కాగలదు'.

మృత్యువు భయంకరమైనదేమీ కాదనీ, దయామయమైనదేననీ చెపుతూ –ఇలా అంటాడు 'మరణాన్ని గురించి భయాన్నీ బాధనూ కలిగి ఉండరాదు. మరణం పట్ల ఆనంద భావనను పెంచుకొన్న వ్యక్తికి – జీవించడమూ ఆనందమే, మరణించడమూ ఆనందమే !' 'అనంతమైన రాజ్యాలు, సామ్రాజ్యాలూ, శ్రీమంతులూ, సామంతులూ, పండితులూ, పామరులూ, సన్మార్గులూ, దాతలూ, కృపణులూ – ఎందరెందరో జన్మించి అంతరించారు. అటువంటి భూమి మీద నేడు మనం కూడా జీవిస్తున్నాం. కొన్నాళ్లకు ఈ భౌతిక శరీరాలను వీడి తేజో జీవులమై ప్రకాశిస్తాం. అందుకే, జీవించిన రోజులు మృత్యువును అందుకోవటానికి ఎక్కే సోపానాలు!'

విషయం చూడబోతే ఇంత గంభీరమైనది. దానిని ఇంత సున్నితమూ సరళమూ చేసి దేవ్ చేసిన విశ్లేషణంతో గుండె మీద నుంచీ కొండంత భారం దింపినట్లు అనిపిస్తుంది కదా! జటిలమైన వేదాంత బోధల ముందు ఇది ఎంత నవనీతసదృశంగా అనిపిస్తుంది!

**ఆనంద సాధన**

మరణ విషయకమైన భయాలూ ఆందోళనలూ దూరమైనప్పుడు మనిషికి జీవించే సత్తా కలుగుతుంది. ఆ జీవితం ఎట్లా ఉండాలి? విషాదాన్ని దూరం చేసుకునేదిగా ఉండాలి. ఆనందమయంగా ఉండాలి. ఇట్లా జీవితాన్ని దిద్దుకోవటానికి నిశ్చలమైన నియతితో పాటు నిరంతరమైన మనోసాధన కూడా అవసరం.

ఈ సాధన వెనుక ఉండే ముఖ్య సూత్రం ఏమిటో – దానిని జీవితానికి ఎట్లా అన్వయించుకోవాలో – తన ఉత్తరాలలో విడమర్చి చెపుతాడు నిత్యసాధకుడు సంజీవదేవ్. 'అసలు మానవుని మనస్సు సహజంగా ఆనందమయమే. కొన్ని పరిస్థితుల మూలంగా ఆ మనస్సులోని ఆనందం మృగ్యమైపోయి దుఃఖమేఘాలు ఆవరిస్తవి. కాని, వివేక విజ్ఞానాల వల్లా, మనో సాధనవల్లా –

ఆ మేఘాల్ని పారద్రోలి – మళ్లీ మన సహజానందాన్ని పొందగలం. ఇందుకు కొంత మనో ఏకాగ్రత అవసరం'.

దుఃఖాన్ని కూడా ఆనందంగా మార్చుకోవడం సాధ్యమా?
అవునంటాడు దేవ్.

'జీవితాన్ని దుఃఖమయంగా చేసుకోవటమూ, ఆనందమయం చేసుకోవటమూ కూడా మానవుని ప్రవర్తనలోనే ఉంటుంది. అలవాటుకు బానిస కావటంలో దుఃఖం ఉంటుంది. అలవాటునే బానిసగా చేసుకోవటంలో ఆనందం ఉంటుంది'.

బాహ్య జగత్తు ఇచ్చే ఆనందం తాత్కాలికం. అంతర్ జగత్తు ఇచ్చే ఆనందం చిరకాలికం. కనుక ప్రతివారూ అంతర్‌జగత్తుతో సంబంధం ఏర్పరచుకోవాలని అంటాడు ఆయన.

ఆయన ఒకరికి రాసిన ఉత్తరంలో దీనికి వివరణ ఇలా ఇస్తాడు –

'చాలామందికి జీవితం బాధలకూ, వేదనలకూ, కష్టాలకూ నష్టాలకూ చిహ్నం. ఇందుకు బాహ్య పరిస్థితులు కారణం కాదని అనను కాని, అంతరిక పరిస్థితుల్ని ఓ స్థితికి తీసుకువస్తే, బాహ్య పరిస్థితుల ప్రభావం పనిచేయలేదు. పరిస్థితుల వశంలో తాను ఉండటం కాక, తన వశంలో పరిస్థితులను ఉంచుకోగలిగిన స్థితి – మానవులకు కలగాలి'.

సృజన శీలి మానవుడు. సృజనాత్మక సాధన ద్వారా – వ్యతిరేక పరిస్థితులను అనుకూలంగా మార్చుకుని, ఆనందంగా జీవించగలడు – అని చెప్పటమే కాదు – తన జీవితంలో ఆ ప్రయోగాన్ని చేసి నిరూపించినవాడు సంజీవదేవ్.

మనిషికి ఎంత ఆనందం దొరుకుతుంది లలితకళల్లో! సాహిత్యోపాసనలో! సృజనాత్మక సాధనలో! దీనికంతా కారణం, ఆలంబనం – ఈ సృష్టిలోని దివ్య సౌందర్యం కాదూ? మనిషిలోని అంతఃచేతనను కదిలించే ఈ సృష్టి సౌందర్యమంటే దేవ్‌కు పట్టరాని పారవశ్యం!

## ప్రకృతి ప్రియత్వం

ప్రకృతి అతనికి ప్రాథమిక గురువు. ముక్కుపచ్చలారని వయస్సులోనే ఆమె అతనిని ఒడిలోకి తీసుకొని, లాలించి, సౌందర్య లాలసను నేర్పింది. భారత శీర్షంలోని హిమాలయ శ్రేణిని చూచినా, తుమ్మపూడి ప్రక్కనే సాగిపోయే బకింగ్‌హామ్ కెనాల్‌ను చూచినా –ఏదో తన్మయతతో దేవ్ హృదయం కదులుతుంది. ఆ దృశ్యాన్ని కుంచెతోనో, కలంతోనో కాన్వాస్ పైననో చిత్రించు కొనేవరకూ ఆయనకు తృప్తి ఉండదు!

'మానవుడి నిత్యజీవితం మీద ప్రకృతి తన ప్రభావాన్ని ఎంతగానో వేస్తుంది. ప్రకృతిలోని ఒక్కొక్క మార్పు – మానవ హృదయం పైన ఒక్కొక్క విచిత్రానుభూతిని కలిగిస్తుంది. అయితే, ప్రకృతికి లోబడిపోవడం మాత్రం మానవుడి ఆశయం కాదు!' అంటాడు దేవ్. తన రచనలలోనూ, ముఖ్యంగా ఉత్తరాలలోనూ మాటిమాటికీ ప్రకృతి ప్రస్తావన తేవడం ఆయన అపారమైన ప్రకృతి ప్రియత్వానికి నిదర్శనం.

ప్రకృతి ప్రసక్తి వచ్చినప్పుడల్లా – ఆయన చెప్పే మాటలు కవితా స్పర్శ కలిగి ఉండి గొప్ప హృదయానుభూతిని కలిగిస్తాయి.

'మన దేశానికి శరత్ ఋతువు స్వర్ణ రుతువు. అందులో ఎండ ఉండదు, వర్షం ఉండదు, చలి ఉండదు. స్వచ్ఛమైన వెన్నెలకాంతి – మిన్ను మీద, నీటి మీద, బీటిమీద, చెట్టుమీద, పుట్టమీద – ఎటు చూచినా, శారదశ్రీ మిల మిల మెరిసిపోతున్నది'.

'కన్ను తెరిస్తే కనిపిస్తవి ప్రకృతిలోని అనంతమైన రంగులూ, చెవి విప్పితే వినిపిస్తవి ప్రకృతిలోని అసంఖ్యాక రాగాలూ. ఇవన్నీ మానవ హృదయానికెంతో ఆనందాన్ని ప్రసాదిస్తవి. ఎంతో ప్రశాంతిని అందజేస్తవి'.

మామిడి పూతలతో ఘుమఘుమ లాడుతూ వచ్చే వసంతాన్నీ, చండప్రచండంగా మిడిసి పడుతూ వచ్చి శరీరంలోని ప్రాణ స్పందనని నిర్దయగా హింసించే వేసవినీ, మింటినీ మంటినీ ఏకం చేస్తూ కురిసే తాపహర అమృతమయ వర్షధారల్నీ – కవిత్వీకరిస్తూ తన ఉత్తరాలలో నింపి, వాటికి పరిమళ ధూపం అద్దుతాడు సంజీవదేవ్.

మిత్రులకు రాసే ఉత్తరాలలో తాను చిత్రించిన చిన్న ప్రకృతి దృశ్యాలను అపుడపుడూ జోడించి పంపడం ఆయన అలవాటు.

అందుకొన్నవారికి ఆయన ఉత్తరంలోని అక్షర శిల్పమా లేక చిత్రరచనలోని దృశ్య మాధుర్యమా – ఏది ఎక్కువ ఆనందం కలిగిస్తుందనేది చెప్పడం కష్టం.

భౌతిక జగత్తులో, మనం నివసిస్తున్న సమాజ జీవనంలో అనేకానేక అంశాల పట్ల తన ఆలోచనలనూ, అవగాహనలనూ పంచిపెడుతూ దేవ్‌రాసే ఉత్తరాలు అమూల్యమైనవిగా తోస్తాయి.

తిరిగి తిరిగి మననం చేసుకోవలసిన సూక్తులుగా,
మళ్ళీ మళ్ళీ జ్ఞాపకం ఉంచుకోవలసిన ఆదర్శాలుగా,
ఆచరణలో పెట్టి తీరవలసిన జీవన ధర్మాలుగా
మనకు అనిపిస్తాయి , మనసును ఉత్తేజపరుస్తాయి.
అందుకే ఆ ఉత్తరాలు ఒక్కసారి చదివి ఆవల పెట్టేవి కావు.

రసజ్ఞత

ఉత్తరాలలోనూ రసజ్ఞత ఏమిటి? అనిపిస్తుంది కొందరికి. కాని, దేవ్ ఉత్తరాలు చదివిన వారికి అవి ఎంత రసభరితాలో, ఎంత రసోల్లాసం కలిగిస్తాయో అర్థం అవుతుంది. రసతత్వాన్ని గురించి చెప్పడమంటే ఆయనకు ఎంతో ఇష్టం. 'రసరేఖలు' వంటి ఎన్నో గ్రంథాలు రాశాడు. ఉపన్యాసాలలో వివరించి చెప్పాడు. వైజ్ఞానిక దృష్టితో రసతత్వాన్ని సమన్వయపరుస్తూ ఆయన ఎన్నో రసచర్చలు చేశాడు.

జిజ్ఞాస, రసపిపాస,ఆనందోపాసన వ్యక్తులలో మేలుకొలపాల్సిన అవసరం ఎంతైనా ఉన్నదని అంటాడు దేవ్. అందుకే ఆయన తన ఉత్తరాలలోను రసచర్చలు చేసి అవతలి వారిలో కళా దృష్టిని మేలుకొలుపుతాడు!

'మానవ జీవితంలో ఉదయం నిద్రలేచి, మళ్లీ రాత్రికి నిద్రించేదాకా ఎన్నో ఆందోళనలు, ఎన్నో వేదనలు. వీటి మధ్య ఆనందం లేకపోలేదు! ఈ ఆనందసత్తాను మేలుకొలపటానికే లలితకళల సృష్టి! సౌందర్యదృష్టి! జీవిని దుఃఖం నుండి ఆనందం వైపుకు మేలుకొలపటానికే లలితకళల సృష్టి. జీవిని దుఃఖం నుంచి ఆనందం వైపుకు త్రిప్పలేని కళ కేవలం కళ మాత్రమే!'.

రసదృష్టి లేనిదే కళల నిర్మాణం లేదు. రసదృష్టి అంటే ఏమిటో ఆయన ఒక ఉత్తరంలో ఇట్లా వివరిస్తాడు :

'నేత్ర దృష్టి భౌతిక రూపాన్ని చూస్తుంది. తాత్విక దృష్టి ఆత్మిక రూపాన్ని తిలకిస్తుంది. కాని, రసదృష్టి – ఆత్మిక రూపకాంతితో మెరుస్తున్న భౌతిక రూపాన్ని దర్శించగలుగుతుంది. రస దృష్టి వాస్తవానికీ కల్పనకూ మధ్య – మంటికీ మింటికీ మధ్య, భౌతికానికి ఆత్మికానికీ మధ్య ఒక సంధి అనవచ్చు'.

సాహిత్యపరులకూ, కళాజీవులకూ మాత్రమే కాదు ఈ రసదృష్టి అవసరం. సామాన్య మానవుడికి కూడా రసస్పందన ఉండటం అవసరమే.

'రసదృష్టి అనేది ఏవో కొన్ని సమయాలలో ఏ కొందరికో కలిగే అసహజమైన ఆవేశం కాదు. అది ప్రతి అంతస్థులోని వ్యక్తియొక్క నిత్య జీవితంలో చాలా అవసరం. ఈ రసదృష్టి లేనప్పుడు – నిత్యజీవితం తన ఆకర్షణను పోగొట్టుకొని అదొక మోయలేని బరువుగా ఉండిపోతుంది'.

మరీ నిస్సారంగా మారిపోతున్నది యంత్రవతు అయిన సామాన్యుని జీవితం. రసదృష్టితో, రసాత్మకంగా జీవించడం అలవాటు చేసుకొన్నప్పుడు – జీవితం మరింత సుందరమూ, అనుభవయోగ్యమూ అవుతుందనడం అతిశయోక్తి కాదు!

ఆ సాధనకు ఉపకరించేవి సంజీవదేవ్ ఉత్తరాలలో కనిపించే అనేక రసచర్చలు!

**అధ్యాత్మిక దృక్పథం**

'సనాతన ఆస్తికులు నన్ను నాస్తికుడని విమర్శిస్తారు. అధునాతన నాస్తికులు నన్ను ఆస్తికుడని విమర్శిస్తారు' – అంటాడు దేవ్!

ఆయన దేశ విదేశాల తత్త్వ శాస్త్రాలను అధ్యయనం చేశాడు. తాత్త్విక విషయాలపైన అనేక రచనలు చేశాడు. తన ఉత్తరాల్లోనూ చాలా చోట్ల ఈ విషయం పైన తన అభిప్రాయాలను వెల్లడి చేస్తాడు. మతాన్ని గురించీ, మతతత్త్వాన్ని గురించీ తన ఉద్దేశాలను సుస్పష్టంగా వివరిస్తాడు.

'మనం ఆనందంతో జీవించడం, ఇతర్లను ఆనందంతో జీవించనీయడమే సర్వమతాల సారం'.

'జీవితంలో ఎలాంటి వ్యతిరేక పరిస్థితులలో కూడా నిరాశ చెందకుండా సదా ఆనందంతో నిండి ఉండటమే సకల వేదాంతాల సారం'.

'ఏ ఉపాసన చేసినా, మానవత్వాన్ని పోగొట్టుకోలేని ఉపాసన అవసరం'.

ఇవి దేవ్ వెల్లడించిన అభిప్రాయాలు. ఆలోచించి చూస్తే – భగవద్గీతలోని సారాంశం కూడా ఇదే కదా – అనిపిస్తుంది. కర్మయోగానికి ప్రతీకగా నిలచిన దేవ్ తాత్త్విక భూమిక అర్థం అవుతుంది.

ఆయన ఒక విధంగా ఆస్తికుడూ, నాస్తికుడూ కూడ!

'ప్రతి మతంలోనూ జ్ఞానకాండ, కర్మకాండ – అని రెండు దశలలో సాధనలుంటవి. నాకు కర్మకాండ నచ్చదు. జ్ఞానకాండ ఇష్టం!' – అంటాడు మౌనధ్యాన సాధకుడూ, నిర్గుణోపాసకుడూ అయిన తాత్త్వికుడు సంజీవదేవ్!

ఆయన ప్రధానంగా హేతువాది. ప్రతి విషయాన్నీ తర్కసహితంగా తరచిచూచే మనస్తత్వం ఆయనది!

అయితే – హేతువు లేకుండా జీవించడం ఎంత తెలివితక్కువ తనమో – కేవలం హేతువుతోనే జీవించగలమని అనుకోవటం కూడా అంత పొరపాటు అవుతుంది. మెదడులోని హేతువు, హృదయంలోని విశ్వాసమూ కలిసినప్పుడే మానవ జీవితం ప్రకాశవంతం అవుతుంది.

ఇది సంజీవదేవ్ చేసిన హేతుబద్ధమైన ఆలోచన. తన ఉత్తరాల్లో ఈ విషయాన్ని చాలాసార్లు ప్రస్తావిస్తాడు.

'జీవితంలో ఆలోచన అవసరమే కాని, ఆలోచనతో మాత్రమే జీవిస్తే - జీవించినట్లుండక మరణించినట్లుంటుంది. మేధకూ, జీవితానికీ ఉన్న సంబంధం కంటే హృదయానికీ, జీవితానికీ ఉన్న సంబంధం సన్నిహితమైంది. ఆలోచన లేని జీవితం అంధజీవితమైతే, అనుభూతిలేని జీవితం - అవుతుంది మృతజీవితం. మొదటి దానిలో హేతువు నశిస్తే, రెండవదానిలో ప్రాణమే నశిస్తుంది. మనకు హేతువూ, ప్రాణం - రెండూ కావాలి'. ఇటువంటి పంక్తులు చదివినప్పుడు సంజీవదేవ్ ఉత్తరాల నిండా గంభీరమైన బరువైన, కేవలం మేధావి వర్గానికే పనికివచ్చే అంశాలు ఉంటాయని అనిపించవచ్చు. కాని, అది నిజం కాదు!

సహజంగా హాస్యప్రియుడు ఆయన! సంభాషణలోనూ రాతల్లోనూ కూడా ఒక చమత్కార రేఖ భాసిస్తూ ఉంటుంది. ఆ చమత్కారిక విడీ విడని నవ్వల్లే - సరస సుందరంగా ఉంటుంది. కను కొలుకుల్లో ఒక ఆనంద వీచిక తారట్లాడినట్లు ఉంటుంది .

## శైలి

రచనా విధానంలో, వాక్య నిర్మాణ రీతిలో - సంజీవదేవ్‌కు అచ్చంగా తనదే అయిన ఒక విలక్షణ శైలి ఉంది. రెండు మూడు వాక్యాలు చదవగానే ఇది దేవ్ రచన - అని తెలిసిపోయే విధంగా ఆయనదైన ప్రత్యేక శైలి ఉంటుంది.

ఒక విషయాన్ని నిరూపించాలనుకొంటే - ఆ అంశాన్ని రెండు విభిన్న ప్రకృతుల మధ్య ఇరికించటమూ - ఒక దానితో మరొకటి సరిపోల్చటమూ - మళ్లా దానిని వ్యతిరేకించి నిగ్గు తేల్చటమూ - ఆయన ఎక్కువగా అనుసరించే రచనా శిల్పం. ఒక్కొక్కసారి అది ఒక ఆలోచనను ముందుకూ వెనుకకూ లాగుతున్నట్లు అనిపించి కాస్త తికమక పెడుతుంది! నిగ్గు తేలిన తరువాత, తికమక తీరిన తరువాత - తేలికగా ఊపిరి పీల్చుకొన్నట్లు అవుతుంది!

మామూలుగా దేవ్ రచనల మాదిరే - ఉత్తరాలలోనూ ఆయన భాష సరళంగానూ, గంభీరంగానూ ఉంటుంది. లయాత్మకమైన గేయ రచన చదువుతున్నట్లు కవితాత్మకంగా సాగుతుంది వచన రచన.

ఆయన దగ్గరనుంచి అందుకొన్న ఉత్తరం చదువుతుంటే - సుదూర ప్రదేశంలో కొండలు కోనలు మీదుగా తేలుకుంటూ వచ్చిన సునాద రాగం వలె ఉంటుంది. స్నేహ క్షీరం అద్దిన కలంతో చిత్రించిన అక్షర చిత్రం వలె ఉంటుంది.

## మానవతాదృష్టి

మేధోజీవి అయిన సంజీవదేవ్ మానవతావాది. మనిషి అన్నా, మనిషితనం అన్నా ఆయనకు అపారమైన ఆదరం. ఆ మానవతాస్పర్శ – ఆయన రాసే ఉత్తరాలలో – పూసలలో దారం వలె కనిపిస్తూ ఉంటుంది.

'నా జీవిత లక్ష్యం మానవుణ్ణి ప్రేమించడం నేర్చుకోవడమే!' అనగలిగిన మనిషికి ఎంతటి ఉదాత్త జీవన తత్త్వం అలవడి ఉంటుంది!

సమరాంకురమైన, సంఘర్షణాత్మకమైన – మానవ సమాజ జీవన స్థితిగతుల పట్ల ఆయనకు కలిగిన ఆవేదనను వివరిస్తాడు – మిత్రుడికి రాసే ఉత్తరంలో –

'లోకం అంతా అల్లకల్లోలంగా ఉంది. ఎటు చూచినా అశాంతి, మారణ హోమం – మొదలైనవి విచ్చలవిడిగా విలయతాండవం చేస్తున్నాయి. మానవుణ్ణి మానవుడు మిత్రుడిగా గాక, శత్రువుగా చూచుకోవటానికే ఎక్కువగా అలవాటు పడినట్లున్నాడు. దేశం, రాజ్యం, జాతి – అనేవి మానవుణ్ణి మానవుడి నుంచి వేరు చేసి – రక్తపాతానికి తోడ్పడుతూ ఉండటం – ఎంతో పశుత్వానికి చిహ్నం!'

దేవ్ ఈ మాటలు ఒకరికి ఉత్తరంలో రాసి చాలా కాలమే అయింది. ఈనాడు మనిషిలోని మనిషితనం మరీ లోపించి – ఈ విలువైన మాటలు మరీ మరీ చెప్పుకోవలసిన అవసరం ఏర్పడుతున్నది.

'నేటి వైజ్ఞానిక యుగంలో, వైజ్ఞానిక దృక్పథం పెరుగుతూ హృదయసత్తా తరుగుతుంది. ప్రేమ మీది ప్రేమ క్షీణిస్తూ, ద్వేషం మీది ప్రీతి వికసిస్తూంది. సత్యం మీద అనురాగం నశిస్తూ, హత్యల మీద అనురాగం ఎక్కువవుతూంది. ఎదుటివారి మేలు మీది అభిలాష సన్నబడుతూ, ఎదుటివారి కీడు మీది అభిలాష బలీయమవుతూంది. ఈ విధంగా, మనుషుల మానసాల మీద చీకటి వినాశ నృత్యం చేస్తూంది. భవిష్యత్తు ఎట్లా ఉంటుందో తెలియటంలేదు!'

చిరకాలిక సత్యాలైపోయిన ఈ మాటలు ఆయన ఉత్తరాలలోనివే.

'నేను పాండిత్యానికి విలువనివ్వను. కళా ప్రతిభలకు విలువ ఇవ్వను. తెలివితేటలకు విలువ ఇవ్వను. హృదయ స్పందనకు విలువ ఇస్తాను. హృదయ స్పందన అంటే – జాలి, దయ, కరుణ, సానుభూతి!'

ఇవి సంజీవదేవ్ మాటలు. ఇంతకుమించిన వేదాంతం ఏమి ఉంటుంది?

ఇంత హృదయజీవి కనుకే, ఆయన రాసే ఉత్తరాల నిండా ప్రేమామృతం ధారలు కట్టి పారుతున్నట్లు భావన కలుగుతుంది. అందుకే ఆయన ఉత్తరాల పలకరింపులన్నీ అందుకొన్న వారికి పన్నీటి చిలకరింపులై తోస్తాయి.

**జీవనశిల్పం**

జీవితాన్ని సత్య, శివ, సుందరంగా తీర్చి దిద్దుకొనే యత్నంలో నిరంతర సాధకుడు సంజీవదేవ్.

విలక్షణమైన జీవన శిల్పాన్ని అలవరచుకొన్నాడతడు. జీవితం నుంచే సకల కళలూ, సమస్త శాస్త్రాలూ ఉద్భవిస్తాయి కనుక, కళలన్నిటి కంటే జీవన కళ మిన్న – అనే విషయాన్ని పదే పదే నొక్కి చెపుతాడు సంజీవదేవ్.

ఏమిటి ఈ జీవనకళ. ఆయనే అనేక మార్లు వివరించి చెపుతాడు తన ఉత్తరాల్లో :

'బ్రతికి ఉండటమే జీవించటము కాదు. అందంతో, ఆనందంతోనూ జీవించటమే జీవనకళ. అది లేనినాడు మిగతా సమస్త కళలూ నటన మాత్రమే అవుతాయి !'

'జీవన శిల్పికి కవితలల్లటం చేతకాకపోవచ్చు, చిత్రాలు రచించటం తెలియకపోవచ్చు. కాని, చక్కగా జీవించటం మాత్రం తెలుసు!'

సంజీవదేవ్ ప్రతిపాదించే ఈ జీవన కళ ఏమిటో మనకు ఆయన జీవితంలోనే సాక్షాత్కార మవుతుంది.

అది ఒక మౌనగీతంలా, అదృశ్య చిత్రంలా, ఆయన బ్రతుకులో భాగమైపోయింది. ఆ జీవన కళ – ఆయన నివసిస్తున్న ప్రశాంత వాతావరణంలో, ఆయన నిరాడంబర జీవన శైలిలో మనకు కనిపిస్తుంది. ప్రవృత్తిని ఒక చేత, నివృత్తిని మరొకచేత పట్టుకొని ఆయన పయనిస్తున్న నిత్య చేతనామయ జీవన మార్గంలో కనిపిస్తుంది.

I live in light
In me lives delight

అని చెప్పుకోగలిగిన ఆనందోపాసకుడూ ఆత్మసాధకుడూ సంజీవదేవ్

'కావ్య రచన చేయటం గొప్ప విషయం, సందేహం లేదు! కాని, తమ జీవితాన్నే కావ్యంగా జీవించే వ్యక్తులు ధన్యులు!' అంటాడు మరొక ఉత్తరంలో ఆయన.

సందేహం లేదు! అంతకు మించిన ధన్యుడు ఆయన. తాను కావ్యంలా జీవించడమేనా? తన కొక చిన్న కమ్మ వ్రాసినా చాలు – బదులు పలుకులోనే తెలియచేస్తాడు.

కమ్మగా జీవించడం ఎట్లానో!
కావ్యంగా బ్రతకడం ఎట్లానో!

(రచయిత్రి – సి. వేదవతి, హైదరాబాదు నివాసి.)

# వక్తగా సంజీవదేవ్

-పారుపల్లి కవికుమార్

రచించటం, వచించటం మానవుని సాంస్కృతిక జీవితంలోని ప్రధాన లక్షణాలలోనివి. కొందరు రచించటంలో దక్షులు అయితే మరికొందరు వచించటంలో, ఇంకొందరు రెంటిలో దక్షులు. ఒకరు రచయిత అనిపించుకొంటే రెండవవారు వక్త అనిపించుకొంటారు. ఒకటి లేఖ్యం, రెండవది వాచ్యం.

సంజీవదేవ్ రచయితగా, వక్తగా కూడా సమాన ప్రతిభాశాలి. ఒకర్థంలో ఉపన్యసించటం అనేది రచించటంకంటే ఎక్కువ కఠినమైన పని. ఒక చారిత్రక విషయాన్ని రచిస్తున్నప్పుడు ఒక కాల నిర్ణయంలో సందేహం వచ్చినపుడు రచనను ఆపి దానికి సంబంధించిన గ్రంథం ద్వారా ఆ సందేహాన్ని తీర్చుకొనే అవకాశం ఉంటుంది. కాని అదే పని ఉపన్యాసంలో జరగటం కుదరదు. అందువల్ల వక్తకు విషయజ్ఞత, జ్ఞాపకశక్తి మొదలైనవి ప్రధానాలు.

అయితే, ఉపన్యాసాలు కూడా రెండు విధాలుగా ఉంటాయి. ఒకటి వ్రాసుకొని చదివే ఉపన్యాసాలు, రెండు ఆశువుగా వేదిక మీద మాట్లాడేవి. మొదటివీ శాస్త్రీయ సంబంధమైన, పాండితీపూర్ణమైన వైదుష్యపు ఉపన్యాసాలు, రెండోవి విషయ సౌలభ్యంగల, వాక్ చాతుర్యంగల, సరళ వివరణతో కూడిన జనాకర్షణమైన ఉపన్యాసాలు.

సంజీవదేవ్ వక్తృత్వ జీవితంలో రెండు రకాల ఉపన్యాసాలు కూడ సమాన సారళ్యంతో చేస్తాడు. వ్రాసి చదవటం కంటే ఆయనకు ఆశువుగా పలికే ఉపన్యాసాలే ఎక్కువ ఇష్టం. వీటిలో స్వేచ్ఛ ఎక్కువ ఉంటుంది. పోకడ రోచకంగా ఉంటుంది. సామాన్యమైన లౌకిక ఉపన్యాసాలను

మాత్రమే కాక విశిష్ట ప్రసంగాలను కూడ ఆయన ధారాళంగా ఆశుధారంగా ప్రసంగిస్తాడు.

తనకు తెలిసిన విషయాలను - సాహిత్యం, రూపకళలు, దార్శనిక విషయాలు, మనో వైజ్ఞానికాలు, మానవతా విషయాలు మొదలైనవెన్నో చాలా - వైదుష్యంతో గంభీర భాషలో, లలిత ధోరణిలో చమత్కారంగా ఉపన్యసించటంలో ఆయన సిద్ధహస్తుడు, ఆయన ప్రసంగాల్లో తార్కిక విశ్లేషణ, తాత్విక గంభీరత, హాస్యాభివ్యక్తీ అన్నీ కలిసి మనోరంజకంగా, ఉపదేశాత్మకంగా భాసిస్తాయి.

మరీ దీర్ఘోపన్యాసాలన్నా, మరీ హ్రస్వోన్యాసాలన్నా ఆయనకు అభిరుచి ఉండేది కాదు. పదిహేను నిమిషాలకు తక్కువ కాని, గంటకు ఎక్కువ కాని ప్రసంగాలు చేయటం ఆయనకు ఇష్టం. సభాధ్యక్షతను వహించటానికంటే వక్తగా ఉండటంలో ఆయన ఎక్కువ ఆనందించేవాడు. ఎక్కడైనా తప్పనిసరి అయి సభాధ్యక్షత వహించాల్సొస్తే నవ్వుతూ అంటాడు ప్రతిభాశాలులను వక్తలుగా ఏర్పరచి వట్టి వాళ్లను అధ్యక్షులుగా కూచో పెడతారు, అధ్యక్ష పాత్రను నిర్వహించటంలో కంటే వక్త పాత్రను నిర్వహించటం తనకు ఎక్కువ అభిలషణీయం అని అనేవారు ఆయన.

సాంప్రదాయకంగా వస్తూన్న సభా మర్యాదలను కొన్నిటిని పాటించేవాడు కాదు సంజీవదేవ్ వేదిక మీద. వేదిక మీద పదిమంది ఆసీనులైఉంటే, అధ్యక్షా అనే దానితో మొదలుపెట్టి మిగతా వారందరి పేర్లను సంబోధిస్తారు ఎక్కువమంది వక్తలు. ఆయన మాత్రం అదంతా లేకుండా 'సభకు నమస్కారం' అని తన ప్రసంగాన్ని ప్రారంభించేవాడు. ప్రధమంలోనే ప్రసంగ విషయాన్ని ఎత్తుకోక ఒక ఐదారు నిమిషాలు ప్రసంగేతర విషయాలను స్పృశించి తరువాత అసలు విషయానికి వస్తాడు ఆయన. ఆయన పూర్వం ఎక్కువగా కళలను గురించి మాట్లాడేవాడు, తరువాత సాహిత్యం మీద, ఆపైన కొంతకాలం తార్కిక, తాత్త్విక, మనోవైజ్ఞానిక ప్రసంగాలు చేయటం ఎక్కువ చేశాడు.

సంజీవదేవ్ వివిధ విషయాల మీద ఉపన్యసించటం వినే ఆనందం నా జీవితంలో కలిగింది. నాకు జ్ఞాపకం ఉన్నంతవరకు ఆయన చేసిన ఒక మనోవైజ్ఞానిక ప్రసంగాన్ని గురించి కొన్ని మాటలు వినిపించ ప్రయత్నిస్తాను.

"సభకు నమస్కారం, వేదిక మీది పెద్దలు కాక క్రింద కూర్చున్న శ్రోతలలో కూడ కొందరు ప్రాజ్ఞులైన పెద్దలున్నారు, అటువంటి ప్రాజ్ఞులైన శ్రోతల సమక్షంలో నిల్చొని ఇటువంటి జటిల విషయం మీద ఈ ఆనందమయ శరత్ సంధ్యలో ప్రసంగించే సదవకాశం లభించినందుకు మీ అందరకూ కృతజ్ఞతలు. సరళ విషయాన్ని గురించి జటిల భాషలో ప్రసంగించవచ్చు, అదే మాదిరి

సరళ విషయాన్ని గురించి సరళ భాషలో ప్రసంగించవచ్చు. నేను రెండవ విధానాన్నే త్రొక్కుతాను. నాకు తెలుసు వక్త పనికంటే శ్రోతలపని ఎక్కువ కష్టమైందని, అయినా అటువంటి కష్టాన్ని లేకుండా చేయాలనే నా ప్రయత్నం''.

''మనిషికి శరీరం ఉంటుంది. అది తనకూ ఇతర్లకూ కూడ కనిపిస్తుంది. మనిషికి మనసు ఉంటుంది. అది తనకూ కనిపించదు, ఇతర్లకూ కనిపించదు, అంటే మానవజీవి దృశ్యాదృశ్యాల సమ్మేళనం. శరీర ప్రభావం మనసుమీద పడుతుంది. మనసు ప్రభావం శరీరంమీద పడుతుంది''.

ఈ విధంగా ఆయన మనోవిజ్ఞానం లాంటి జటిల విషయాన్ని సరళరూపంలో శ్రోతల మానసాలకెక్కించేవాడు. ఆయన కంఠం అతి కోమలంగా కాని, అతి కఠోరంగాకాని ఉండక మధ్య స్థాయిలో ఉంటుంది. అది మధుర స్వరమూకాదు, తిక్తస్వరమూ కాదు. తాను ఉపన్యసిస్తున్నంత సేపు శరీరంలో ఏ భాగాన్ని కూడా ఏమాత్రం కదిలించడు. అంటే ఆయన ఉపన్యాసాలు వాచికాలే కాని ఆంగికాలు కావు. కనుకనే తాను బజారు ఉపన్యాసాలకు కాని, ప్రచార ఉపన్యాసాలకు కాని తగడు. తన ప్రసంగం పూర్తి అయ్యేంతవరకు శ్రోతలచేత కరతాళధ్వనులు చేసే అవకాశాన్ని తక్కువ సృష్టించుకుంటాడు. ఉపన్యాసం మధ్యలో మంచినీరు త్రాగటం కూడా చేయడు. నిమిషానికి అరవై మాటలు మాట్లాడడు, నిమిషానికి మూడు మాటలు మాట్లాడడు.

నేనొకసారి సంజీవదేవ్‌ను అడగటం జరిగింది. మీరు చెప్పాల్సిన దాన్నంతా ముందుగా మానసంలో తయారుచేసుకొని వేదిక మీదకు ఎక్కుతారా లేక శూన్యమానసంతో వచ్చి మైక్ ముందు నిల్చుంటే మాటల ధార దానంత అదే ప్రవహిస్తుందా అని, అందుకాయన చిరునవ్వు నవ్వి అన్నాడు, మొదటిది అసలు జరగదని చెప్పలేను కాని రెండవ విధానమే ఎక్కువ జరుగుతుంటుందని చెప్పగలను. రెండో విధానంలో శ్రమ తక్కువ, ప్రవాహం హాయిగా ప్రవహిస్తుంది. తన ప్రసంగాలలో తెలుగు పద్యాల్లో, సంస్కృత శ్లోకాల్లో, ఇంగ్లీషు కొటేషనులో చదవటం వీలున్నంత వరకు ఆయన చేయడు, అత్యవసరం అయితే ఆ విధంగా చేయటానికి వెనుకాడడు. తన నోటికొచ్చిన కొటేషనులన్నిటినీ వేదిక మీద ప్రదర్శించి శ్రోతలను ఆకర్షించటం ఆయన పనికాదు.

వక్త యొక్క సాఫల్యం స్వయంగా వక్త మీద మాత్రమే కాక శ్రోతల మీద కూడా కొంత ఆధారపడి ఉంటుందనే సత్యం ఆయనకు తెలిసినంతగా మరెవరికీ తెలియదనటం అతిశయోక్తి అవుతుంది. అయినా అది ఆయనకు కూడా తగినంతగా తెలుసుననటం స్వభావోక్తి అవుతుంది. అందుకే ఉపన్యాస సమయంలో తన మాటలను వినిపించినంత చాకచక్యంతో శ్రోతల మౌన ప్రతిక్రియలను వింటాడు కూడ. విని వారి నాడి ననుసరించి తన ప్రసంగాన్ని కొంతగా

సర్దుకుంటుంటాడు కూడ. ఉపన్యాసాన్ని వచించటంలో ఆయన దిట్ట. కొందరికి వేదిక ఎక్కటమే తెలుసుకాని దిగటం తెలియదు. శ్రోతలు తమ అభిరుచిని తెలుపుతున్నా కూడా వారు లెక్కజేయక ఉపన్యాసాన్ని సాగిస్తూనే ఉంటారు. కాని సంజీవదేవ్‌కు తెలుసు తన ఉపన్యాసాన్ని ఏ తరుణంలో ముగించాలనే రహస్యం. ఇంకొంచెం పేపు ప్రసంగాన్ని పొడగిస్తే చాలా బాగుండునని శ్రోతలు తలచే ముహూర్తాన ఆయన టప్పున ముగిస్తాడు. తన ముగింపు వాక్యాలు ఈ విధంగా ఉంటాయి :

"మీరు ఇప్పటి వరకూ శ్రద్ధగా కూచొని నా వాక్యాలను అంతకంటే శ్రద్ధగా విన్నందుకు ధన్యవాదాలు. ఇంతటితో ఆగక నా ప్రసంగాన్ని పొడిగించి మీచేత వినకుండా చేయటం నా అభిమతం కాదు, అటువంటి అసువిధను మీలో సృష్టించకుండా ఉండటానికే నా ఈ ముగింపు. ఇది ఉపన్యాసపు ముగింపేకాని ఉపన్యాసంలోని విషయపు ముగింపు కాదు. నిజం చెప్పాలంటే ఏ విషయానికైనా మొదలు లేనట్లే ముగింపు కూడా ఉండదు. ఉండేదల్లా ఆది అంతాలకు మధ్య ఉండే మధ్యభాగమే".

ఈ విధమైన కొన్ని తమాషా వివరణలు చెప్పి ముగిస్తాడు. వెంటనే శ్రోతల నుంచి చప్పట్లు తప్పెట్లవలె వినిపిస్తాయి. నేనెరిగినంత వరకు దగ్గరలో కాని దూరంలో కాని ఏ సభలోను ఆయన ఉపన్యాసం ఏదీ కూడా అపజయాన్ని పొందలేదు.

అన్ని కళలకంటే ఉపన్యాస కళ గొప్పది అని నేను అనను కాని సంజీవదేవ్‌మాత్రం ఉపన్యాసాన్ని ఒక గొప్ప కళగా ప్రదర్శిస్తాడు. తాను గొప్ప ఉపన్యాసకుడుగా నటించడు. శ్రోతలకు నచ్చేట్లు చేస్తాడు. అయితే ఒకటి గుర్తుంచుకోవాలి, ఆయన వక్తయే కాని మహావక్తకాదు.

సంజీవదేవ్‌కు మాతృభాషకు తోడు మరికొన్ని భాషలు తెలుసు. తనకు తెలిసిన ప్రతి భాషలో రచించగలడేమో కాని వచించలేడు. ఆయన మూడు భాషల్లో మాత్రమే వచించగలడు, అంటే ఉపన్యసించగలడు – తెలుగు, ఇంగ్లీషు, హిందీ. ఆయన ఇంగ్లీషు ఉపన్యాసం ఎంతో మృదువుగా అభివ్యక్తిశీలంగా ఉంటుంది.

ఆయన ఏ భాషలో ఉపన్యసించినా ఆ ఉపన్యాసం ఒక గద్య కావ్యంగా నడుస్తుంది, చింతా స్రవంతితో ప్రవహిస్తుంది, సృజనాత్మకంగా, సమీక్షాత్మకంగా రూపొందుతుంది. భావాల కోసం మాటలను వెదుక్కోవటం ఉండదు. మాటల కూర్పుకోసం వాక్య విన్యాసం నిమిత్తం తడుముకోవటం ఉండదు. ఆయన అంటుంటాడు కూర్చొని రచన చేయటంలో కంటే నిల్చొని ఉపన్యసించటంలో తనకు ఎక్కువ ఆనందం తడుతుందని, రచించేటపుడు ఆ రచనను చదివే

పాఠకులు తన ఎదుట ఉండరు, కాని ఉపన్యసించేటపుడు తన ఉపన్యాసాన్ని వినే శ్రోతలు తన ఎదుట ఉండక తప్పదు. విజ్ఞులైన శ్రోతల ఉనికి తనకెంతో ప్రేరణనిస్తుందట. తన ఉపన్యాస సమయాల్లో తాను స్వయంగా నవ్వడు కాని ఇతర్లను నవ్విస్తాడు. అదే విధంగా తాను కన్నీరు కార్చకనే ఇతర్ల చేత కంట తడి పెట్టిస్తాడు.

మరీ ఎక్కువ మంది శ్రోతలున్న సభల్లో ప్రసంగించటానికి ఆయన అంతగా ఉత్సాహ పడడు. మైక్ లేకుండా వినపడటానికి వీలున్న సభలు ఆయనకు ఎక్కువ ఇష్టం. తాను ప్రసంగిస్తుండగా ఎదురుగా కూచున్న శ్రోతలు తమలో తాము మాట్లాడుకోవటం ఆయనకు బొత్తిగా గిట్టదు. అటువంటి ఘట్టాలను సహించలేక ఒకోసారి ఆయన బయట పడి దగ్గరగా ఉన్న శ్రోతల్ని గద్దించటం కూడా జరుగుతుంది. 'ఇది సభ' అనే మాటలతో –

నేనొకసారి సంజీవదేవ్‌ను అడిగేను 'మీరు ఉపన్యసిస్తూన్నప్పుడు మీ నోరు మాత్రమే పనిచేస్తుందా, మీ చెవులు కూడా పనిచేస్తాయా, అంటే మీ ఉపన్యాసాన్ని మీరు వింటారా?' అని, అందుకాయన అన్నారు 'రచయితగా ఉన్న సమయంలో పాఠకుని పాత్రను నిర్వహించటం తక్కువగా ఉంటుంది కాని వక్తగా ఉన్న సమయంలో శ్రోత పాత్రను నిర్వహించటం ఎక్కువగా ఉండక తప్పదు. నేను ఉచ్ఛరించేదేదో నా చెవికి వినిపించక తప్పదు, రచన చేసే సమయంలో రచించేదంతా చదవటంలోకి రాదు, కాని ప్రసంగించేదంతా మాత్రం వినటంలోకి రాక తప్పదు. వక్త వక్తపాత్రనే కాక శ్రోతపాత్రను కూడా నిర్వహిస్తాడు'.

వక్తగా సంజీవదేవ్ అంటే వ్యక్తిగా సంజీవదేవ్ అని అర్థమే. ఆయన వక్తృత్వంలో ఆయన వ్యక్తిత్వం అంతా అభివ్యక్తమవుతుంది స్పష్టంగా. వ్యక్తిగా వ్యవహరిస్తున్నప్పుడు ఆయనలోని వక్త ప్రత్యక్షం కాడు కాని వక్తగా, వ్యవహరిస్తున్నప్పుడు ఆయనలోని వ్యక్తి ప్రత్యక్షమవుతాడు.

ఆంధ్రలోనే కాక భారతదేశపు ఇతర ప్రాంతాల్లో కూడా ఆయన తన ఉపన్యాసాలను వినిపించాడు. ఇంగ్లీషు, హిందీలో కూడా ఉపన్యసించే శక్తి ఉన్నందున ఇతర ప్రాంతాలవారు కూడా ఆయనకు శ్రోతలయే ఆనందాన్ని పొందేరు. భాషలు భిన్నమైనా భావాలు మానవావళి కందరకు ఎక్కువగా అభిన్నంగానే ఉంటాయి కనుక శ్రోతలకు ఆ భావాలు వేరుగా గోచరించవు.

ఇతర్లకు తన ఉపన్యాసాలను వినిపించటంలో ఎంత ఆనందం ఉంటుందో ఇతర్ల ఉపన్యాసాలను తాను వినటంలో కూడ ఆయనకు అంత ఆనందం ఉంటుంది. ఆయన స్వభావమే అంత. ఇతర్ల చేత ప్రశంసించబడటంలో పొందే ఆనందాన్నే ఆయన ఇతర్లను ప్రశంసించటంలో పొందుతాడు.

'మీరు ఉపన్యసించే సమయంలో ఏదైనా చెప్పటంలో సరైన మాటను మరిచిపోయి తిరిగిదాన్ని అందుకోటానికి ప్రయత్నించే తరుణాలుంటాయా?' అని నేను అడిగినప్పుడు ఆయన అన్నాడు. 'ఎంత ఆరోగ్యవంతునిలోనైనా కొంచెం అయినా రోగం ఉండకపోదు. అదేవిధంగా ఎంత బలమైన జ్ఞాపకశక్తి ఉన్న వ్యక్తిలోనైనా మరుపు అనే బలహీనత ఉండకుండా ఉండుట. నిజం చెప్పాలంటే, ఆ మరపు అనే బలహీనతయే జ్ఞాపకశక్తికి పరోక్షమైన బలమేమో'.

సంజీవదేవ్‌లోని అనేకాలైన మిగతా ప్రతిభలకు తోడు వక్త అయి ఉండే ప్రతిభకూడా ఆయనలో ఉండటం ఆయన సాంస్కృతిక జీవితానికి ఒక ఆకర్షణను కలిగించింది. ఆయన వక్త మాత్రమే అయి ఉంటే చాలేది కాదు, వక్త కూడా అయి ఉండటం ఎంతో ఫలించింది.

వక్త సంజీవదేవ్‌లోని వక్తృత్వం ఒక పరిమళం.

(రచయిత - శ్రీ పారుపల్లి కవికుమార్
విశాఖపట్నంలోని డ్రెడ్జింగ్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా లిమిటెడ్‌లో
అసిస్టెంట్ మేనేజర్ (మెటీరియల్స్) గా పనిచేస్తున్నారు)

# సంజీవదేవ్ అంటే ?

చలసాని ప్రసాదరావు

'వెన్నెల అంటే ఏమిటీ?' అనే ప్రశ్నకు జవాబు ఉంటుందిగానీ.... దాన్ని మాటల్లో వివరించటం కష్టం. సంజీవదేవ్ రచయిత కాదు, చిత్రకారుడు కాదు, విమర్శకుడు కాదు, కవీ కాదు.

అయినా ఆయన ఇవన్నీ కూడానూ. కొందరికాయన చక్కని వాక్చిత్రాలు రాసే రచయిత.

మరికొందరికి నేత్రపర్వమైన రంగుల సమ్మేళనతో కొండలూ, గుట్టలూ, లోయలూ, వాగులూ, ప్రవాహాలూ, జలపాతాలూ కళ్లముందుంచే చిత్రకారుడు.

ఇంకొందరికి ఆయన పొందికైన మాటలతో అందమైన కవితలల్లే కవి.

కళాకారులకూ, కళాస్వాదులకూ ఆయన కళామర్మం విప్పిచెప్పే లోతైన అవగాహన గల కళా విమర్శకుడు.

మరి, ఇవన్నీ ఎలా జరిగాయి, జరుగుతున్నాయి?

సంజీవదేవ్ ముందు భావుకుడు, తరువాత తాత్త్వికుడు.

భావుకుడు, తాత్త్వికుడుగా పరిణమించటం అత్యంత సహజ విషయం. కానీ, తాత్త్వికుడు భావుకుడు కూడా ఆయి ఉండకపోతే ఆ తత్త్వచింతనకు అర్థమే లేదు.

సంజీవదేవ్ ఈ రెండింటి సమగ్ర సమ్మేళనం.

ఆయన తాత్త్వికత నేల విడిచిన సాము కాదు. నేల మీదనే, నేలను గురించే, ఈ నేలమీద ఉన్న వాటిని గురించే ఆయన అన్వేషణ కొనసాగింది.

ఈ భువిపై సజీవ, నిర్జీవ, చలనాత్మక, చలనరహిత అంశాలు అనేకం ఉన్నాయి.

వాటిని చూడటం వేరు. చూసినదానిలో ఇతరులు చూడలేని దానిని గుర్తించి, దానిని గురించి కూడా ఆలోచించటం వేరు.

చూసిన దానిని గురించే, కనుపించే దానిని గురించే ఆలోచించే అలవాటు కూడా అరుద యిపోతున్న ఉరుకులు, పరుగుల సమాజం మనది.

కనుకనే సంజీవదేవ్ ఒకే ఒక సంజీవదేవ్‌గా పరిణితి చెందారు. సంజీవదేవ్ గానే నిలిచిపోయారు.

ఆయన అందమైన విషయాలేగాదు, బరువైన విషయాలూ చెపుతారు. అయితే వాటిలోని బరువును పరిహరించి చదివే వారు సునాయాసంగా స్వీకరించగల విధంగా చెపుతారు.

ఆ బరువులోని అసలు రహస్యం ఏమిటో గ్రహించిన వారికే అది సాధ్యం. కనుకనే ఆయన సంజీవదేవ్.

అసలీ సాహిత్యం, కళలు, చర్చలు, విమర్శలు, పరామర్శలు – ఇవన్నీ ఎందుకు?

ఎందుకంటే, మనిషిని మనిషిగా మలచింది అవే గనుక. అవిలేని జీవితం నిస్సారం గనుక.

కానీ, వాటిని అందుకుని, జీవితాన్ని తేజోవంతంగా కాకున్నా, కనీసం మానసిక స్థాయినయినా ఉజ్వలంగా మలుచుకునే అవకాశం అందరికీ ఉండదు.

కనుక, కనీసం వాటి సారాన్నయినా పిండి అలాంటి వారికి అందచేసి, వారిని తీర్చి దిద్దాలనేది పరామర్శకుల ప్రయత్నం.

అందరూ అనుకుంటున్నట్లు సంజీవదేవ్ విమర్శకుడు కాదు, పరామర్శకుడే.

విమర్శవేరు, పరామర్శ వేరు. విమర్శ చాలా సందర్భాల్లో ఎంతో కొంత కటువుగా ఉండక తప్పదు.

సంజీవదేవ్‌కు అది చేతనయినా, కాకున్నా అలా ఉండటం మాత్రం ఇష్టం ఉండదు.

కనుకనే ఆయన పరామర్శకుడు. ఆ పరామర్శలో మంచినీ, ఆస్వాదయోగ్య అంశాల్నీ ఎత్తిచూపటం ఆయన పద్ధతి. విమర్శనీయాంశాల్ని ఆయన విస్మరించడుగానీ, ఆ హాలాహలాన్ని చిరునవ్వుతో మింగేసి, మంచి మాట మాత్రమే చెపుతాడు, కాస్త అమాయకంగా.

అందుకే ఆయన సంజీవదేవ్. నాకు ఆ సుగుణం, ఆ అతిమంచితనం అంతగా నచ్చదు. అందుకు నా కారణాలు నాకున్నాయి.

అయినా సంజీవదేవ్ నాకు నచ్చుతున్నారు.

నేనాయనను పూర్తిగా మెచ్చకపోయినా ఆయన మాత్రం నాకు మూడు దశాబ్దాలుగా సన్నిహితుడు, ఆత్మీయుడు.

ఎందుకనంటే ఆయన సంజీవదేవ్ కనుక. వెన్నెల వెన్నెలలా ఉంటేనే గదా దాని అందమయినా, ప్రత్యేకత అయినా. మాట్లాడే వెన్నెల సంజీవదేవ్.

(రచయిత – **శ్రీ చలసాని ప్రసాదరావు**, హాస్య వ్యంగ్య రచయిత, కళా విమర్శకులు 'ఈనాడు' సంపాదకమండలి సభ్యులుగా, విపుల, చతుర పత్రికల ఎడిటర్‌గా పనిచేశారు )

# అంతరంగావిష్కారం

అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి

సంజీవదేవ్ తనను తానే సృష్టించుకొన్నాడు. తయారించుకొన్నాడు. రుచి, రంగు, వాసనలను సంతరించుకొన్నాడు. వైలక్షణ్యాన్ని నిరూపించుకొన్నాడు. సంస్థాగతమైన విశ్వ విద్యాలయాల జోలికిపోక, ప్రకృతి ఒడినేబడిగా చేసుకొని, ఆ నిర్దిష్ట పథంలోనే తన జీవన గతిని కల్పించుకొన్నాడు. 'నేను నిరుటి సంవత్సరంలో కంటే ఈ సంవత్సరంలో మరొక సంవత్సరం పెద్దవాణ్ణి అయ్యాను. పదిహేనో సంవత్సరం వచ్చింది. మనుషులను, మాటలను, మాయలను, మర్మాలను ఇంకొంచెం లోతుగా అర్థం చేసుకోగలుగుతున్నాను. సెక్సు జగత్తులోని మాధుర్యం ఊహల్లో రూపొందుతూంది. ఊహారూపాలు శరీరం మీద ప్రతిబింబాలు వేస్తున్నాయి. 'ఆ పిల్లల్లో పన్నెండు, పదమూడేళ్ల అమ్మాయి నానోజీ కూతురుగూడా ఉంది. (తుమ్మపూడి ఊరి బయట బుడబుక్కల తండా ఒకటి దిగింది – రచయిత). ఆ అమ్మాయి రంగులోను, రూపంలోను, మాటల్లోను, నడకలోనూ, ఎంతో అందంగా ఉంది. ఈ అమ్మాయి ఆ కాలీకాలని ఉడుము తోకను తుంచి కరకర నమలసాగింది. నా శరీరం ఒక్కసారి కంపించింది. ఆమెలో నిత్యమూ కనిపిస్తున్న సౌందర్యం అంతా ఒక్కసారి నా దృష్టిలో కురూపంగా మారిపోయింది. అది మొదలు ఆమె కనిపిస్తే ఏదో భయంగా తట్టేది..'

అటు ఇంగ్లీషులో క్లిష్ట విషయాల గ్రంథాలను చదువుతూనే మధ్య మధ్య తెలుగు మాస పత్రికలలోని కథలను, నాటికలను చదివి, ఆనందిస్తూ ఉండేవాణ్ణి. ఆ కథలు ప్రేమకూ ప్రణయానికి ఎక్కువ సంబంధించి ఉండేవి. అవి చదువుతుంటే ఇంగ్లీషు గ్రంథాలలో దొరకని ఏదో ఉత్తేజం గల ఆనందం దొరుకుతుండేది. ఒక వైపు తత్త్వ శాస్త్రాలు, రెండోవైపు ప్రణయ

గాధలు చదవడంలో ఒకదానిలో లేనిది మరొకదానిలో దొరికేది రెండవ దానిలో ఒట్టి రసోద్దేశం, .... ఒకదానిలో ఒక ఆలోచన, తర్కం, మేధకు పదును... ఏది ముఖ్యమో, అర్థమయ్యేది కాదు .... రెండూ ముఖ్యమే అని నమ్మసాగాను.

వరడ్స్‌వర్త్ రాసిన –

Whose dwellıng is setting Suns

And the round ocean and the living air

And the blue sky, and in the mind of man

A motion and a spirit, that impels

All thinking things all objects of all thoughts

And rolls through all things

లాంటి నిసర్గ కవితల ఊపులను అందుకొన్నాను.

పిట్టగోడ మీద కూర్చొని విశాలనీలాకాశంలో దూరాన తెల్లగా ప్రకాశిస్తున్న హిమ శిఖరాలను వీక్షించేవాడిని... ఆనందం ఇవ్వని సమయములో నా అంతర్జగత్తును చూచుకొని ఆనందించేవాణ్ణి. అంతర్జగత్తు నన్నెప్పుడూ మోసగించలేదు, ఆనందమివ్వకుండా

ఈ విధంగా ఆయన అనిర్ధిష్ట పథంలో తన జీవితానికి అర్థం కల్పించుకొన్నాడు. ఇలా అర్థం కల్పించుకొన్న సంజీవదేవ్‌ను నేను మొదట 1957 లో, ఆయన అప్పటి వి.యస్. ఆర్. కళాశాలలో, 'కళ' పై ఉపన్యాసం ఇవ్వడానికి వచ్చినప్పుడు, కలిశాను. 'సంజీవదేవ్ పేరు అందంగా ఉందంటాడు బుచ్చిబాబు. పేరులో ఏమి పెన్నిధి ఉంది, గులాబి పువ్వును ఏ పేరున పిలిచినా అది గులాబీ వాసనలనే గుబాళిస్తుంది అంటాడు మహాకవి షేక్స్‌పియర్. పేరుకు అందం ఎలా వస్తుంది ? ఆ పేరు గల వ్యక్తిని బట్టి, గాంధీ, నెహ్రూ, కెనడీ, గౌతముడు, టాల్‌స్టాయ్– ఏ పేరు అందంగా లేదు? అన్ని పేర్లు అందంగానే ఉన్నాయి. అందుకని, నా దృష్టిలో 'సంజీవదేవ్' పేరు కంటే, ఆ పేరు ధరించిన 'వ్యక్తి' నాకు సుందరంగా కనిపిస్తాడు. 'వ్యక్తి' అంటే ఆయనకు భౌతిక రూపమిచ్చిన రక్తమాంసాదుల సమాహారం కాదు. వాటిని పొదిగిన సమవాయ రూపమూ కాదు. ఆ అందం చూసే కంటిని బట్టి ఉంటుంది. నేను ఆయనలో చూసిన అందం ఆయన సమగ్ర మూర్తిమత్వం. ఆయన అంతరంగ సౌందర్యం. ఆ అంతరంగం లయ, తూకం, ఛందస్సు. ఐతరేయబ్రాహ్మణం ఈ విశ్వమంతా ఛందోమయ

మంటుంది. అలాగే ఆయన అంతరంగమున్నూ. ఆ సౌందర్యానికి ఆ రోజుల్లో నేను వశవర్తునుడ నయ్యాను. అదే నన్ను ఆయనతో పరిచయానికి పురికొల్పింది.

ఆయన ఆ రోజు రస సిద్ధాంతాన్ని ముచ్చటిస్తూ 'క్రోచే' ను ప్రస్తావించినట్టు గుర్తు. ఆ ప్రస్తావనలో క్రోచే కళా సిద్ధాంతాన్ని సరిగా చెప్పలేకపోవడమో, దోషపూరితంగా చెప్పడమో జరిగింది. నాకంత బాగా గుర్తులేదు. అప్పుడు అదే సభలో ఆ కళాశాలలోనే అధ్యాపకుడుగా ఉన్న శ్రీ జి.వి. కృష్ణారావు, ఆయనను సవరించడం జరిగింది. వెంటనే సంజీవదేవ్ లేచి, కృష్ణారావుకు కృతజ్ఞతలు తెలిపి, తన తప్పిదాన్ని బాహాటంగా వినమ్రతతో అంగీకరించారు. దానితో నా దృష్టిలో ఆయన అనంతంగా ఎదిగిపోయారు. నా హృదయం ఆనాడు ఎందుకో చెమర్చింది. ఆ అనుభవం తాలూకు 'ఛాయ' నేటికీ నా అంతరంగంలో ముద్రితమ్మై ఉంది.

ఆయన అంతరంగ సౌందర్యానికి ఇదొక మచ్చుతునక అయితే, ఆయన నిర్వ్యాజ వస్తుగత దృష్టికీ, అసూయా రాహిత్యానికీ అద్దం పట్టే మరో మచ్చు సంఘటనను మీ ముందుంచవలసిన ఆవశ్యకత ఉంది.

ఒక మిత్రుడు (ఆ మిత్రుడు ఈ వ్యాస రచయితే) ఆయనకు తాను రాసిన 'అస్తిత్వవాదం' వ్యాసం ఆయన అభిప్రాయం కోసం పంపాడు. ఆ ఆఫ్ ప్రింటు వ్యాసాన్ని చదివి ఆ మిత్రునికి ఆయన ఇలా లేఖ రాశాడు 'మీ సుదీర్ఘ వ్యాసం' అస్తిత్వవాదం' అందింది.. మీకు మొదటిగానే ఒకమాట చెప్పవలసి ఉంది. అస్తిత్వవాదం మీద చాలా కాలం క్రిందట నేను గూడ ఒక వ్యాసం రాయడం జరిగింది. నా వ్యాసం చాలా మంచి వ్యాసం అనుకొనే భ్రమలో ఉండేవాడిని చాలా కాలంగా. కాని ఇప్పటి మీ వ్యాసం చూసిన తరువాత నా భ్రమ భ్రమ మాత్రమే అని తేలి పోయింది. సంజీవదేవ్ అస్తిత్వవాదం కంటే ...... గారి అస్తిత్వవాదం ఎక్కువ మేలు రకమ్మైంది అని నాకు విశ్వాసం ఏర్పడింది. ఈ మాటలు అతి వినయంతో అనేవి కావు, యదార్ధ హృదయంతో అనేవి మాత్రమే, మీరు మీ రచనలో సమీక్షాత్మకంగా మునిగినంత లోతుకు నేను మునగలేదు.. చాలు నేటికి...

మీ సంజీవదేవ్ ..
6/7/1982

ఆ మిత్రుడు ఆయనకు తిరిగి రాసిన లేఖలో ఇలా ఉంది.. మీరు చాలా తేలికగా, హాయిగా ఎంతో మానసిక అనాయాసంతో రాయగలిగారు. అరమరికలు లేని, ప్రత్యాదేశితం కాని స్వచ్ఛమైన మనస్సు మీది. అయితే మీ ఉత్తరం బరువుతో ఉక్కిరిబిక్కిరై విరోధాభాసకు గురైన

మనస్సు నాది.. మీరు నా వ్యాసం గురించి చెప్పింది గణిత సూత్రాను ప్రయుక్త సత్యం కావచ్చు. ఈ ప్రపంచంలో ఉన్నది గణితసత్యం (Mathematical Truth) ఒక్కటే కాదు.. గణిత సత్యం కంటే ఆదరణీయాలైన విలువలు ఉన్నాయి. గణిత సత్యాన్ని ఒల్లనంటున్న నా మనసు మీ మనసు పెద్దరికాన్ని గుర్తిస్తున్నది. గుర్తించి ధన్యవాదాలు అర్పిస్తున్నది. పూవు కంటే స్నిగ్ధమైన మీ అంతరంగ హృదయ సౌందర్యం ముందు ఒక గణిత సత్యం ఏపాటి ?

ఇట్లు,

మీ 15/7/1982

ఆంధ్ర విశ్వవిద్యాలయం వారు డాక్టరేటు పురస్కారాన్ని అందించినప్పుడు ఆయన మిత్రుడు రాసిన ఉత్తరంలో -

'....ఒకప్పుడు వద్దనడమూ (ఆంధ్ర విశ్వకళాపరిషత్ ఇవ్వచూపిన కళాప్రపూర్ణ బిరుదాన్ని తిరస్కరించారు – రచయిత) ఇప్పుడు కద్దనడమూ (డాక్టరేట్ బిరుదాన్ని అంగీకరించడమూ – రచయిత) రెండూ ఔచితి భంగాలు కావు. నాటి మీ తిరస్కారమూ, నేటి విశ్వవిద్యాలయాల పురస్కారమూ – రెండూ సమస్థితినే అభివ్యక్తీకరిస్తున్నాయి.

'... నేడు 'మన' విశ్వవిద్యాలయం మీకు అభిషేకం చేయడం అంటే అది దాని "crystal prison" ను ఉత్తరించి సత్యసందర్శనం చేసుకొని పునీతం కావడం. మీరు 'పసుపు ముద్దగా' విశ్వవిద్యాలయం తనను తానభిషేకంచుకొంటుందని మీరు వినీత మనస్కులై అనిన అనవచ్చుగాక!

అతనికి పూర్వాపరాలు, సంస్థలు (Institutions ) లేవు గనుక జాపాల్ సార్త్రే 1964 లో నోబెల్ బహుమతిని తిరస్కరించాడు..అర్థాన్ని మనమే సృష్టించుకొన్నా, మన సృష్టిని మనం గౌరవించుకోవాలి గదా. ఇది మానసిక బలహీనతే కావచ్చు. ఇటువంటి బలహీనతలు ఎంత అందంగా ఎంత మధురంగా ఉంటాయి.

ఇట్లు

మీలో ఒకరినైన నేను

16/10/1982

సంజీవదేవ్ కేవలం మనిషే కాదు, మనీషి. ఈ విషయాన్ని స్థూలంగా ఆవిష్కరించడమే పై ఉత్తరాల ప్రదర్శన. అంతేకాదు ఆయన రూపశిల్పి. రస నిష్పాదకుడు. తాత్త్వికుడు, కవి, వ్యాసకర్త.

'నేను వ్యాసకర్తనేగాని కవిని గాదంటా' డాయన. ఆయన ద్విచక్రధారి. 'నా జీవితమే ఒక కథ. మరి అలాంటప్పుడు నేను కథలు ఎలా రాస్తాను? అందుకే వ్యాసాలు రాస్తున్నాను' అంటాడాయన ఒకచోట. ఇందులో చాలా వైచిత్రి ఉంది.

ఈ శతాబ్దంలో నవలా రచనలో నూతన ఒరవడిని దిద్దబెట్టిన ఫ్రాంట్జ్ కాఫ్కా పిల్లల్ని కనడం చేతకాక నవలలను కన్నాడు. సంజీవదేవ్ జీవితం 'కథ' కనక, ఆయన కథల్ని కనలేక వ్యాసాలను కన్నాడు. ఆయన జీవితం, కథ గనుక, కథ కాల్పనికం గనుక, కాల్పనికం అబద్ధం గనుక అటువంటి జీవితం నుంచి జాలువారే వ్యాసాలు గూడా ఆ రంగూ, రుచీ, వాసనలనే సంతరించుకొంటాయి. అందుకే ఎర్నెస్ట్ హెమింగ్వే అంటాడు . 'మంచి రచయితలంతా బాగా అబద్దాలాడతారు. ఇది వారికి అసహజం కాదు, కొత్తాకాదు, అసలు వారి వృత్తే అంత, కాకపోతే వారు ఒక అబద్ధాన్ని కల్పన చేస్తారు. Art is illusion –కళ భ్రమ, తరచు వాళ్లు ఆనుకోకుండానే అచేతనంగానే అబద్ధాలు చెబుతారు. ఆ తరువాత వాటిని గాఢ 'చింత' తో జ్ఞాపకం చేసుకొంటూ ఉంటారు. అందుకే ఏ సృజనాత్మక రచయితా నూటికి నూరుపాళ్లు నిజం రాయడు. అలా రాస్తే అది రచన శాస్త్రం అవుతుంది. ఇదే చిత్రకారుడికీ వర్తిస్తుంది. అతడు తన కుంచెను కాన్వాసు మీద ఆడించేటప్పుడు ఈ సూత్రాన్నే పాటిస్తాడు. వాస్తవాన్ని చిత్రించాలని అతడనుకొంటే అది – 'ఒకటి ఒకటి సదృశ సిద్ధాంతం' (One to one correspondence theory) అవుతుంది. అంటే కాకి బొమ్మను వేసేటప్పుడు, మూలంలో కాకికి ఒక ముక్కు ఉంది. అందుకని చిత్రంలో కాకికి ముక్కు వేస్తాడు. మూలంలో కాకికి రెండు కాళ్లున్నాయి. చిత్రంలో కాకికి రెండు కాళ్లు గీస్తాడు. ఈ విధంగా కళ్లు, తోక వగైరా అన్నీ గీస్తాడు. ఇలా మూలంలో కాకికి ఉన్న ప్రతిభాగాన్ని అవయవాన్ని బొమ్మలో గీస్తాడు. ఈ విధంగా కాన్వాసు మీద గీసిన కాకి అసలు కాకికి సదృశంగా ఉంటుందే కాని కళా ఖండం కాబోదు. అది వాస్తవానికి దగ్గరగా ఉంటుందేగాని కళాఖండంగాదు. అది కాకి అనే భ్రమను చూసే వాడిలో కల్పించాలే తప్ప, అది నిజం కాకి కారాదు. అందుకే 'కళను భ్రాంతి' (Art is illusion ) అంటారు.

చిత్రకారుడిగా సంజీవదేవ్ అంతే, ఆయన కుంచెను కాగితం పై ఊగించి ఎండు వారిన అంటే ఆకులు రాలిన వృక్షాలను, మోడులను, ఎండిన గడ్డిని, జీర్ణ సెలయేటి ధారలను, వర్షించని నిశ్చల మేఘాలను భ్రమింపజేస్తాడు. అది జీవనసారాన్నో, నిస్సారతనో ప్రేక్షకునిలో లేపుతుంది. బహుశా ఇదే దృశ్యాన్ని మనం వాస్తవ ప్రపంచంలో చూస్తే అలా అనిపించదు. ఆయన ప్రకృతిలోని దృశ్య సంపదకు తన భావనా వీధిలోని కాల్పనిక సంపదను జోడించి, చిత్రించి, మనలో ఎండువారిన జీవన భావనల నుంచి ఎండి నిస్సారమై ముడుతలు వారిన భావ పరంపరాభ్రమను కల్పిస్తాడు. ఈ భ్రమ కల్పనా చాతుర్యమే చిత్రకారునికీ, రచయితకూ గీటురాయి.

ఇలాంటి భ్రమలోనే చిత్రకారుని, రచయిత, ప్రేక్షక, పాఠకుల ఆత్మ* (*ఆత్మ అంటే వేదాంతుల 'Soul' కాదు.) (self) లకు స్వేచ్ఛ లభిస్తుంది. ఈ స్వేచ్ఛ ద్వారానే ఆత్మాభి వ్యక్తీకరణం (self expression) జరుగుతుంది. ఆత్మాభివ్యక్తీకరణమే కళ. సంజీవదేవ్ రచనలలో కంటే చిత్రాలలోనే ఇలాంటి ఆత్మాభివ్యక్తీకరణం ఉంది. ఆయన జీవితం కథ కనుక, ఆయన కథలను రాయలేదు కనుక, రాసినవి వ్యాసాలు కనక, వ్యాసాలలో ఇలాంటి కాల్పనికతకు చోటు లేదు కనుక, ఆయన వ్యాసాలు కేవలం మానవ సంబంధాల దృగ్విషయాలనే చెబుతాయి వాటిల్లో రసజ్ఞుడు కూరుకుపోయే అవకాశం లేదు.

సంజీవదేవ్ చిత్రించిన కొన్ని వర్ణచిత్రాలలోని 'హిమతుషారచ్ఛాదిత తృణపత్రాలను నులివెచ్చదనంతో కన్నుగీటే ఉదయారుణ కిరణాల తాజాతనం మన హృదయాలను కవ్విస్తుంది.

టాల్ స్టాయ్ ప్రకృతి ఒంపుసొంపులను తన కలంలో ఎలా బంధించాడో, సంజీవదేవ్ వాటిని అలా తన కుంచెలో బంధించారు. టాల్‌స్టాయ్ ప్రకృతి వర్ణన మచ్చుకు ఇలా ఉంటుంది.

'గుర్రపుబగ్గీ కిటికీలోంచి చూసిన ప్రతిదీ – అస్తమిస్తున్న సూర్యుని అరుణకాంతిలో మిలమిల మెరుస్తున్న ఇళ్లకప్పులు, ప్రహరీల ఒంపుసొంపులు, భవంతుల దృష్టి వీక్షణాలు, ఆలుగడ్డల పంటచేలు – అప్పుడే కళాకారుని కుంచె తడి ఆరని వార్నిష్ వేసిన సుందర ప్రకృతి దృశ్యంలా ఉంది.

చందమామ కళతప్పి, ఆకాశంలో శ్వేతమేఘంలా ఉంది. ఒక్క తార గూడ కనిపించడం లేదు. అంతకు ముందు వెండిలా మెరిసిన బురద గడ్డిమొక్క బంగారు కాంతులనీనుతోంది. నిలవ నీటి గుంటలన్నీ జేగురు రంగు దాల్చాయి. నీలంగడ్డి పీత హరితంలోకి మారింది. గద్ద లేచి గడ్డి వామి మీద వాలింది. తల అటూ ఇటూ తిప్పుతూ అసంతృప్తితో, చిత్తడి నేల వంక చూస్తూ, కాకులు పొలాలు మీద ఎగురుతున్నాయి.

... దున్నిన చేలో వంగిన కలుపు మొక్క ఇంకా బ్రతికే ఉంది. నల్లగా మట్టిగొట్టుకు పోయింది. అయినా బ్రతికే ఉంది. మధ్యలో మాత్రం ఎర్రగా ఉంది. ఏ కాకిగా ఉన్న ఆ మొక్క ఏదో విధంగా 'జీవన సర్జకశక్తి' ని ప్రదర్శిస్తోంది.

నిశితశీతల నిరుద్వేగనేత్రంతో ప్రకృతిని దర్శించి అతి మేధావంతమైన కలంతో, నిర్దిష్ట పదాలలోకి కూర్చినప్పుడు అతడికి ఎంతో ఆనందం కలిగింది. ఆత్మ శాంతించింది.

సంజీవదేవ్ జలవర్ణ చిత్రాలను చూస్తే మనకు ఏమనిపిస్తుంది ? టాల్‌స్టాయ్ కలం స్థానంలో సంజీవదేవ్ కుంచెను ప్రక్షేపిస్తే సరిపోతుంది. ఆయన చిత్రాలలో మనకు ప్రకృతి వర్ణ

చిత్రణా సామర్థ్యం. 'జీవనరాగం' విశిష్టంగా కనిపిస్తాయి. ఆయన మాటలలోనే చెప్పాలంటే, తను (టర్నరు కానిస్టేబుల్) కుంచెలతో ప్రకృతికి పూసిన రంగు ఇంకా కాంతినిస్తూనే ఉంది. శరత్కాలంలో ఆకులు రాలిన వెదురుచెట్టు సూర్యోదయపు అరుణాకాశానికి అడ్డంగా నిలిచి ఉండడం చూస్తే ఎంత అరసికున్కైనా, హృదయంలోనైనా రసానందపు పులకలు వేయక మానవు (రసరేఖలు).

అలాగే ఆయన అల్లిన ప్రకృతి పద చిత్రాలు .

వాగు ఒడ్డున ఏకాంతంగా ఊగుతూంది పూచిన రెల్లు
పొద పైన మేఘమాలలు లేని శరత్కాలపు నీలాకాశం
క్రింద బురదలు విరిగిన నీల జలాల స్రవంతి, పైన నీలం
క్రింద నీలం, మధ్య రెల్లుపూల తెల్లదనం (రసరేఖలు పుట 122)

ఈక్రింది పదచిత్రం మరణ సంకేత నర్తనాన్ని ఆవిష్కరిస్తుంది.

చీకటి గది. గదిలో తూర్పు దిశగా దక్షిణపు మూల
ఒక ప్రక్కన పగిలిన కుండ బోర్లించబడి, దాని మీద
మట్టి ప్రమిదలో సన్నని దీపం వెలుగుతూ ఆరిపోతూ
ఉంది. గదిలోని ప్రతి వస్తువు మీద వెలుగు నీడల
క్రీడ. వెలుగు భాగం తక్కువ. నీడ భాగం ఎక్కువ
దీపం దగ్గరగా పొత్తి గుడ్డల కుక్కి మంచంలో సన్ని
పాతం కమ్మిన బాలింత. ఆమె ఎడమ చేతి నాడి మరో
వ్యక్తి కుడి చేతిలో ఉంది. దీపం రెండు సార్లు రెపరెప
లాడి ఆరిపోయింది. కుడిచేతిలోని ఎడమ చేయి
క్రిందికి జారిపోయింది. బయట కాకులు అరవసాగాయి. (రసరేఖలు పుట 123)

ఆయన తడమని, ఆయనలో ఇమడని సృజనాత్మక ప్రక్రియ లేదు. రూప రచన చేశారు. పద రచన వేశారు. ఆడకపోయినా, పాడకపోయినా, వాటి లయ తూకాలను రంగరించుకొన్నారు.

అసలే వీటన్నింటికి మూలమైన కళాతత్వాన్ని అవగాహన చేసుకొన్నారు. దాని అభివ్యక్తిని అర్థం చేసుకొన్నారు. అది పదంకాని, పాటకాని, రూపకళగానీ, సాహితీ కళగాని – అన్నీ రసతత్వం అభివ్యక్తరూపాలే. ఆ రసతత్వాన్ని పట్టుకొన్నవాడు, ఏ కళారూపానికీ అంధుడు కాలేడు. కొంతమందిలో కొన్ని కొన్ని పరిస్థితులలో అంతర్గత పీడనం అధికమై బద్దలు కొట్టుకు బయటికి వస్తుంది. చేతన, అచేతనల మధ్య పొరకు తూట్లు పడతాయి. అటువంటి వారు మహా కళాకారులవుతారు. ప్రయత్నపూర్వకంగానైనా దానికి అభివ్యక్తి కల్పించినవాడు కనీసం కళాకారుడైనా అవుతాడు.

(రచయిత – అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి,
ఎడిటర్, 'మిసిమి' మాసపత్రిక, హైదరాబాదు.)

# సన్నిహితులతో సంజీవదేవ్

– రావెల సాంబశివరావు

సంజీవదేవ్‌కు ఎందరో మిత్రులు, మరెందరో పరిచితులు. ఆయనతో ఏర్పడిన తరళ పరిచయాలు ఘనీభవించకుండా వుండవు.

గొప్పవారిని ఎంత గొప్పగా ఆదరిస్తారో సామాన్యులను కూడా అంత గొప్పగా అభిమానించే అద్వితీయ మానవతామూర్తి డాక్టర్ సంజీవదేవ్.

కొత్త పరిచితులతో సాన్నిహిత్యాన్ని పంచుకుంటూనే పాతపరిచితులతో ఆత్మీయత తరగకుండా చూచుకోవడం ఆయనకు వెన్నతో పెట్టిన విద్య.

ఆయన భావనలో 'బాగా జీవించటం అంటే భోగంతో కాని, యోగంతోకాని జీవించటం కాదు. త్యాగంతో నిండిన రాగంతో జీవించడం అని. రాగం అంటే రంగు, రాగం అంటే నాదం, రాగం అంటే అనురాగం. రాగంలేని జీవితం రోగంతో నిండిన బ్రతుకే'. అందుకే మైత్రికి జీవితంలో ప్రాముఖ్యత నిచ్చే మధురజీవి నార్ల చిరంజీవికి ఇలా రాస్తారు. 'నా జీవిత లక్ష్యం మానవుణ్ణి ప్రేమించటం నేర్చుకోవటమే. పండితుడయేది పామరుడయేది, కురూపయేది సురూపయేది, రసికుడయేది అరసికుడయేది, నీతిమంతుడయేది అవినీతికి ప్రొఫెసర్ అయేది మానవుడయితే చాలు – నా అభిమానాన్ని పొందవలసిందే'.

ఎవరిని చూసినా ఏవో మోయలేని బరువులతో ముఖం చిట్లించుకొని నవ్వలేక నవ్వుతూ మానసాన్నంతా ఏవో బాధలతో నింపుకొని ఉసూరుమని తిరుగుతున్నట్లు కన్పిస్తున్నదని గమనించి జగమెరిగిన నైరూప్య చిత్రకళా కోవిదుడు ఎస్.వి. రామారావు గారితో ఇలా అంటారు.

'మానవుడు ఆనందజీవి. ఆనందం లేకపోయిన తరువాత ఎంత సంపదవున్నా, విద్య వున్నా కీర్తివున్నా అవన్నీ ఎండమావులే'.

కనుకనే సంజీవదేవ్ తాము ఆనందంగా జీవించటమే గాకుండా తమతో పరిచయమున్న వారందర్ని ఆనంద పథగాములుగా కార్యోన్ముఖుల్ని చేస్తారు.

నాకు రాసిన తొలిజాబులో వారిలా అంటారు .

'ఈ భూలోకంలో మాకు కొత్తవాళ్లంటూ ఎవరూ లేరు. అంతా పరిచితులే, ఎవరూ అపరిచితులు కారు, అంతా మిత్రులే, శత్రువులెవరూ లేరు'.

మరి అటువంటి సంజీవదేవ్ పరిచితుల పేటిక తెరచి అందులోని వ్యక్తుల చిత్రమైన భావాలను, విచిత్రమైన స్వభావాలను, సహజవర్తనలనూ, అసహజ ప్రవర్తనలనూ పాఠకుల ముందుంచటం సాధ్యపడే విషయం కాదు. పోనీ సాంస్కృతిక జీవుల వరకు విషయాన్ని కుదించుదామన్నా కుదిరేపని కాదు. వారి పరిచయ పరుశువేది తగిలితే సామాన్యజీవి కూడ సాంస్కృతిక జీవిగా మారిపోగలదు.

ఆనందాన్ని ఒక వ్యక్తి తనకు తానుగా ఒంటరిగా అనుభవించటంలో ఒక విధమైన రసానుభూతి లభిస్తుంది. దానిని సన్నిహితులతో, ఆత్మీయులతో పంచుకొని అనుభవించటంలో మరో విధమైన రసానుభూతి సమకూరుతుంది. ఈ రెండు విధాలైన రసానుభూతుల రుచి మరిగినవారు సంజీవదేవ్.

'కేవలం ఆనందజీవులు కాని, కేవలం విషాద జీవులుకాని ఉండరు. ఖేదం, మోదం రెంటి సమ్మేళనమే జీవన అనుమేళన' అంటారు ఈ రసరేఖ నివాసి.

'జీవితం సహజంగానే గొప్పది, ఇక ఆ జీవితంలో సంస్కృతి కనుక వుంటే ఆ జీవితం ఇంకా ఎక్కువ గొప్పది'. అంటూ తాము సంస్కృతీమయ జీవితాన్ని గడుపుతూ ఓ సాంస్కృతిక విప్లవాన్ని తమ పరిధిలో తాము ఆవిష్కరింపజేసారు తమ పరిచితుల ద్వారా.

అందరికీ జీవితాన్ని ఆనందమయం చేసుకునే మార్గాన్ని, దుఃఖాన్ని దాటే దారిని చూపేందుకు తమవంతు కర్తవ్యాన్ని తాము నిర్వహించారు.

అందరివలె ఆయనను కూడ ఎన్నో బాధలు వ్యథలు, వేదనలు, ఆవేదనలు, తాపాలు సంతాపాలు, అనుతాపాలు చుట్టుముట్టకపోవు. అయితే ఆయన నేర్పుగా, ఓర్పుగా వాటి నుండి విముక్తుడవుతూ ఆనంద పథంలోకి చిరునవ్వులు చిందిస్తూ ముందుకు వస్తారు. మనసుతో యిలా మాట్లాడుకుంటారు.

'ఈ వ్యవహార జగత్తులోని ఈర్ష్యలనూ ద్వేషాలనూ, కుళ్లనూ క్రౌర్యాలనూ మరిచి మానవులు తామంతా ఏక కుటుంబం వారమని నమ్మి పరస్పరానురాగంతో కొంతసేపైనా ప్రేమించుకోగలిగితే వ్యక్తులకు ఎంత ఆనందమో, లోకానికి ఎంత కళ్యాణమో!'.

ఒక వ్యక్తిలోని పాండిత్యం, కళా ప్రతిభ, తెలివితేటల కంటే హృదయ స్పందనకు ఎక్కువ విలువనిస్తారు సంజీవదేవ్. హిందూధర్మం, క్రైస్తవ ధర్మం, ఇస్లాంధర్మం మొదలైన, అనేక ధర్మాల్లోకల్లా హృదయ ధర్మమే సర్వోత్కృష్టమైనదిగా భావిస్తారాయన.

'సాదాగా జీవించటం ఉన్నతంగా ఆలోచించటం నా అభ్యాసం నా ఆదర్శం' అంటా రాయన. అది నచ్చిన వారెందరో ఆయన అభిమానులుగా నిలిచిపోయారు

ఏకాంతంగా, మౌనగీతికలా, అదృశ్యచిత్రంలా ఆనందోపాసనలో మునిగిపోయే మౌనిపాత్ర మాత్రమే కాదు సంజీవదేవ్‌ది ఇటు వైయక్తికంగానూ అటు సమూహం ద్వారానూ వికసించి వికసింపజేసే తత్వం ఆయనిది.

ఆయన దృష్టిలో ప్రేమ హృదయాల స్పందనకు కులతత్వాలు అడ్డు రావు. దేశ కాల భేదాలు మొదలే లేవు. లింగ భేదం లేనే లేదు. అదంతా ఒక అనురాగమయ, ఆనందమయ లయ.

ఆ లయలో ఈ విశ్వం అంతా మైమరచి తాండవం చేస్తుంది.

సైన్సు వృద్ధిపొందిన ఈ నవీన యుగంలో కులాలు లేకుండా మానవులంతా విశ్వ మానవులుగా వుండాల్సిన రోజుల్లో కులాభిమానాలు పెరిగిపోవటం ఎంతో శోచనీయంగా వుందంటూరాయన. ఆయన మైత్రికి కులం హద్దు కాదు, మతం ముద్దు కాదు, సర్వమానవ సౌభ్రాతృత్వం ఆయన మైత్రికి మూలస్థంభం.

వ్యక్తి సాధ్యమైనంతవరకు వ్యవహార జగత్తునుంచి బయటపడి ఆలోచనా జగత్తులో, అనుభూతి జగత్తులో, ఆనంద జగత్తులో నివసించితేనే హృదయానికి శాంతి, ఆత్మకు కాంతి అని విశ్వసిస్తారాయన. అటువంటి శాంతిని, కాంతిని పరిచితులకు పంచటం అయిన దినచర్యలో ప్రముఖ స్థానాన్ని ఆక్రమించుకుంటుంది.

'ఆరని ఆనంద జ్వాల మన జన్మహక్కు' అంటూ జీవితంలో ఎటువంటి వ్యతిరేక పరిస్థితుల్లో కూడా నిరాశ చెందకుండా ఆనందంగా ఉండగలిగే స్థితిని అందుకోటానికి కావలసిన మానసిక సాధనను మాటిమాటికీ మిత్రులకు గుర్తుచేస్తుంటారు సంజీవదేవ్. జీవితంలోని

వేదనలను ఆనందజ్యోతికి నివేదనలుగా మార్చి దుఃఖానికి దూరంగా జీవిస్తూ ఇతరులను జీవింపజేసే ప్రయత్నమే ఆయన జీవనమార్గం.

లెన్సు ద్వారా సెన్సుకు స్థాయీ రూపాన్ని కలుగజేసే ప్రయత్నంలో ఆయనకు కొందరు సన్నిహితులయినారు. రంగులరాగాలను అందుకోవటంలోనూ అందించటంలోనూ ఆయనకు కొందరు మిత్రులైనారు. శబ్దచిత్రాలను పంచటంలో కొందరు స్నేహితులు సమకూరారు.

రసభరితమై, ఆహ్లాదమయమై, తేదోవిరాజితమై విలసిల్లే ఆయన జీవన విధానానికి ముచ్చటపడి, మురిసి ఆయన చుట్టూ మూగినవారున్నారు.

మనిషిలో నిద్రాణమై వున్న ఆనంద సత్తాను మేల్కొలిపే సౌందర్యదృష్టి గల జీవిగనుక సంజీవదేవ్‌కు ఎందరో హితులు, మరెందరో సన్నిహితులు.

సంజీవదేవ్ సాంస్కృతిక జీవితంపైన వారి పెదతండ్రి చినవెంకట కృష్ణయ్యగారి ప్రభావం హెచ్చుగా వుంది.

శాంతినికేతన్ లోని రవీంద్రుని గురించి, కలకత్తాలోని జగదీశచంద్రబోసు గురించి, పుదుచ్చేరిలోని అరవింద ఘోషుని గురించి విపులంగా వివరించి చెప్పింది ఈ పెదతండ్రే. హిమాలయాలను గురించి, అక్కడ నివసించే యోగుల గురించి బాలకుడైన సంజీవదేవ్ మనసుకు నాటేట్లు చెప్పిందీ ఈ పెదతండ్రే.

చిన వెంకట కృష్ణయ్యగారికి అనిబిసెంటు మీద ఎంతో గౌరవం. జిడ్డు కృష్ణమూర్తి పట్ల మరెంతో అనురక్తి. సంజీవదేవ్‌కు ఆ వారసత్వాన్ని అందించారాయన.

మరో పెదతండ్రిగారి స్వంత గ్రంథాలయంలోని పుస్తకం మహర్షి దేవేంద్రనాథ్ ఠాగూర్ స్వీయచరిత్ర సంజీవదేవ్ జీవితం మీద శాశ్వత ముద్ర వేసింది.

దేవేంద్రుని మార్మికవాదం సంజీవదేవ్ లేత హృదయాన్ని తన్మయత్వంలో నింపేది. దేవేంద్రుని హిమాలయ పర్యటనల చిత్రాలు ఎంతో పరవశాన్ని కలుగజేసేవి.

సంజీవదేవ్ సాంస్కృతిక జీవితానికి పరోక్షంగా ప్రేరణనిచ్చిన మరో కుటుంబ సభ్యురాలు వారి సోదరి భారతీదేవి. రవి కవిని సంజీవదేవ్‌కు మొదటిగా పరిచయం చేసిన వ్యక్తి హెడ్‌మాష్టరు వెంకట రావు గారు. టిబెట్ ప్రాంతపు హిమాలయ పర్యటనలో అచ్చటి అద్భుతశక్తి సంపన్నులైన లామాల దివ్యానుభవాలతో సంజీవదేవ్‌కు చక్కటి చిక్కటి పరిచయం ఏర్పడింది.

ఇక కళాకారుల స్నేహసంపద విషయాని కొస్తే ముందుగా మనకు రవీంద్రనాథ్ ఠాకూర్ మేనకోడలి తనయుడు, విఖ్యాత ప్రౌఢ భారతీయ చిత్రకారుడు, కవి, పండితుడు, సమీక్షకుడు, వక్త అయిన అశిత్ కుమార్ హల్దార్ కనుల ముందుంటారు. ఆయన కుమార్తె నెందుకు చేపట్టలేదో తెలియదుగాని 'మానస ముకుర్' అనే ఆయన కవితా కన్నియను మాత్రం సంజీవదేవ్ స్వీకరించారు.

మానవత్వపు మేలిముసుగుల వెనుక ఒక విధమైన అస్పష్టత, రహస్యమయ సుదూర స్వప్న సౌందర్యాలను అందించే విశ్వనాథ్ ముఖర్జీ –

నీలాలూ హరితాలతో రంగుల స్వప్నాలను సృష్టించి మనకు వర్ణమాధురిని రుచి చూపించే యన్.యస్. కృష్ణమూర్తి–

తమ గేయాలకు చిత్ర రూపాన్నివ్వగల సృజనశీలి శ్యామల కృష్ణ ఘోష్ –

జగమెరిగిన విఖ్యాత నైరూప్య చిత్రకారుడు యస్వీ. రామారావు –

పేరొందిన కళాకారులూ, కళామర్మజ్ఞులు ముల్కరాజ్ ఆనంద్, నీహార్ రంజన్ రాయ్ ప్రొఫెసర్ శంభోచౌదరి, లేడీ రాణీముఖర్జీ –

లలిత కళా ఎకాడమీ సభ్యులు సర్వశ్రీ కుమారిల స్వామి, రాజయ్య, వేలూరి రాధా కృష్ణ, జగదీశమిత్తల్, కొండపల్లి శేషగిరిరావు, మొక్కపాటి కృష్ణమూర్తి, పైడిరాజు, పి.టి. రెడ్డి, గుర్రం మల్లయ్య, శ్రీమతి కరుణారావు, సి.యస్.ఎన్. పట్నాయక్ వంటి ప్రసిద్ధికెక్కిన కళాకారులతో బాటు వర్ధమాన కళాకారులెందరో పరిచితుల జాబితాలోకెక్కి సంజీవదేవ్ చెలిమిని పంచుకొన్నారు.

ఇక రచయితల విషయానికొస్తే రాహుల్ సాంకృత్యాయన్ నుండి రావూరి భరద్వాజ వరకు ఆయనకు ఎందరో మిత్రులు. గుడిపాటి వెంకటచలం, దేవులపల్లి కృష్ణశాస్త్రి, డాక్టర్ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, గోపీచంద్, బుచ్చిబాబు, జి. వి. కృష్ణారావు, నార్ల వేంకటేశ్వర రావు, పండిత గొర్రెపాటి వెంకట సుబ్బయ్య, ఆచంట జానకీ రామ్, కాళోజీ, బాలబంధు. బి.వీ. రంధి సోమరాజు, బీనాదేవి, అచ్యుతవల్లి, తాళ్లూరి నాగేశ్వరరావు, కాపాలక్ష్మి, నార్ల చిరంజీవి, డాక్టర్ శ్రీధర్‌బాబు, డాక్టర్ కొత్త రవీంద్రబాబు, డాక్టర్ పి. దక్షిణామూర్తి, శ్రీమతి ఎస్.ఎస్. లక్ష్మి, వడ్డెర చండీదాస్ మున్నగు పేరెన్నికగన్న వారే గాక వర్ధిష్ణువులు కూడ వారి ఆత్మీయతకు పాత్రులైనారు.

ఆత్మీయతలను పెంచుకుంటూ, అనురాగాలను పంచుకుంటూ కొన్నేళ్లపాటు కొనసాగిన సంక్రాంతి మిత్రుల సంబరాలలో గొర్రెపాటి వెంకటసుబ్బయ్య, వేగుంట కనకరామ బ్రహ్మం, తుమ్మల వేణుగోపాలరావు దంపతులు, వెలమాటి శ్రీమన్నారాయణ, లింగం వీరభద్రయ్య చౌదరి, కాళోజీ, గూడవల్లి నరసింహారావు, బి.వి. నరసింహారావు, డాక్టర్ కాసరనేని సదాశివరావు, నార్ల చిరంజీవి, సంజీవదేవ్ వంటి పెద్దలు, మరెందరో పిన్నలు చురుకుగా పాల్గొనేవారు.

అన్న, బావ, మామ, తాత, బాబాయి, బాబు, అక్క, కోడలు ఇలా వరసలు పెట్టి పిలుచుకుంటూ ఆ తెలుగువారి పండగకు కొత్త రంగులు పులిమేవారు.

సంజీవదేవ్ బావల, వదినల పక్షం వహిస్తూ అన్నదమ్ముల్నీ, అక్క చెల్లెళ్లనీ కొంచెంగా ఆటలు పట్టించే తీరు సున్నితమైన హాస్యంతో బహురసవత్తరంగా నడుస్తుంది.

ఆయన మిత్రకోటిలో ఎందరో నవనీతహృదయులు, సజ్జనులు, స్నేహశీలురు, బుద్ధి జీవులు, ఆర్ద్రహృదయులు, కళాభిమానులు, కళాకారులు, కళా విమర్శకులు, ఆశాజీవులు, ఆశయప్రియులు, విద్యావంతులు, పాలనాదక్షులు, వృద్ధులు, యువకులు, డాక్టర్లు, రోగులు, ఉపాధ్యాయులు, విద్యార్థులు, పండితులు, పామరులు, రాజకీయ నాయకులు, భౌతికవాదులు, ఆధ్యాత్మిక వాదులు, హేతువాదులు, మానవతా వాదులు, ఉద్యోగులు, నిరుద్యోగులు... ఇలా ఎన్నో రంగాలకు చెందినవారు మనకు దర్శనమిస్తారు.

సాధారణంగా సంజీవదేవ్ మిత్రుల మనస్తత్వాన్ని గుర్తెరిగి వారి రుచులకు అభిరుచులకు అనుకూలమైన వాతావరణాన్ని వారి సంభాషణల్లో, జాబులు జవాబుల్లో సమకూరుస్తుంటారు.

ఐతే ఒక్కోసారి ఆధ్యాత్మిక వాదులకు హేతువాదాన్ని, హేతువాదులకు రసతత్వాన్ని, రసవాదులకు రాజకీయాలను, రాజకీయవేత్తలకు కవిత్వ తత్వాన్ని వివరించటం కూడా కద్దు.

పై రెండు విధాలైన ప్రక్రియలలో కూడ ఆయన మధ్యేమార్గాన్ని అవలంబిస్తూ నొప్పింపక, తానొవ్వక ఒప్పించే ప్రయత్నం చేస్తుంటారు. ఒప్పుకోని వాళ్లంటే వదిలేస్తారుగాని, తెగిందాకా లాగరు. అందుకే ఆయన మైత్రీ బంధాలు తెగిపోవు.

ఆయన స్నేహ సంపద దినదిన ప్రవర్ధమానం కావటానికి వారి సతీమణి సులోచనగారి సౌజన్యము, సౌశీల్యము, సహకారము ఆయనకు ఎంతగానో తోడ్పడింది.

'జన్మించటం ఒక గొప్ప విశేషం. జీవించటం అంతకంటే గొప్ప విశేషం. ఇక జీవితంలో యోగ్య మిత్రులను పొందటం అన్నిటికంటే గొప్ప విశేషం' గా భావించి –

'ఆనందమే మానవుని మాట
ఆనందమే మానవుని పాట
ఆనందమే మానవుని ఆట
ఆనందమే మానవుని బాట' గా

నిర్దేశించి మానవాళికి ఆనందపు వారసత్వాన్ని ప్రసాదించిన సంజీవదేవ్‌కు విశ్వశ్రేయమే ధ్యేయం.

(రచయిత – శ్రీ రావెల సాంబశివరావు గుంటూరులోని
నాగార్జున యూనివర్సిటీకి రిజిస్ట్రార్‌గా ఉన్నారు.)

# మనిషి నుండి మనీషిగా

- ఎస్.ఎస్. లక్ష్మి

వ్యక్తిలో స్వతంత్ర వ్యక్తిత్వం పాదుకొన్నప్పుడు, అతనిలో అంతర్ముఖత్వం ప్రబలినప్పుడు, అంతరంగిక, భౌతిక ప్రపంచాలలో అతని అన్వేషణ సహేతుక మార్గాన నడచినప్పుడు, సాధించిన శాస్త్రీయ ప్రగతిని తన అవసరాలకు మాత్రమే గాక తన ఆలోచనాధారకు, ఆత్మపరిశీలనకు ఆలంబనగా చేసుకొన్నప్పుడు మనిషి నిస్సందేహంగా మారగలడు. మారి పరిపూర్ణ వ్యక్తిగా రూపొందగలడు.

ఇందుకు ఉదాహరణే డాక్టర్ సంజీవదేవ్.

మనం నిత్యం అనేక రకాలైన స్వభావం కలిగిన వ్యక్తుల్ని చూస్తుంటాం. కానీ, వారిలో సంజీవదేవ్‌ని పోలినవారు చాల అరుదు. ఈ పోలిక కూడ కొన్ని విషయాలకే వర్తిస్తుంది. పూర్తిగా సంజీవదేవ్ వంటి వ్యక్తి సంజీవదేవ్ ఒక్కరు మాత్రమే. ఆధునికత, అనుభూతి, సాంద్రత, లలితమైన భావుకత, లోతైన తాత్విక చింతన, అంకుంఠిత దీక్ష, సంకల్పబలం, స్వయంకృషి ఇవన్నీ మేళవించిన సమగ్రమైన వ్యక్తిత్వం సంజీవదేవ్‌ది.

కాని సంజీవదేవ్ అంటే ఏమిటి అనే ప్రశ్నకు సమాధానం చెప్పవలసి వస్తే కొన్ని మాటల రూపంలోను, వ్యాస రూపంలోను చెప్పటం తేలికైన విషయం కాదు. ఆయన గురించి ఇతరులకు అర్థమయ్యేలా చెప్పాలంటే మరి ఇంకెలా చెప్పాలి ? ఆయనంటే ఏమిటో అంచనావేసి ఆ అంచనా పరిధిలో ఆయన వ్యక్తిత్వాన్ని ఇమిడ్చి చెప్పాలా? అలా చెప్పాలంటే చెప్పేవారు వేసే అంచనా సరియైనదో కానిదో ఎలా తెలుస్తుంది? ఆయనను తెలుసుకునే శక్తి చెప్పేవారికి ఉండాలా?

ఉండాలి కనీసం కొంతమేరకైనా ఆయన స్వరూప స్వభావాలను విశ్లేషించి విడమర్చే శక్తి ఉండక తప్పదు.

జీవితంలో ఔన్నత్య శిఖరాలను అధిరోహించిన వ్యక్తి గురించి రాసేటప్పుడు ఆ రాసేవాడు అంతటి గొప్పవారు అంటు ఉండక్కర్లేదు. కనీసం ఆ అధిరోహణలో మొదటి మెట్టుపై ఉంటే చాలు. శిఖరాగ్రభాగాన నిలచిన ఆ మూర్తిని కొంతమేరకైనా బొమ్మకట్టి చూపవచ్చునేమో.

అనాదినుంచి మనిషి జీవన పరిస్థితులలో ఉన్నతమైన మార్పులకై అనేక సంగ్రామాలు జరిగాయి. జరుగుతున్నాయి. జరగబోతాయి కూడా. కాని, మానవుని అంతరంగ ప్రపంచంలో జరిగే సంగ్రామం నాటికీ, నేటికీ, ఏనాటికీ ఒక్కటే. అది పరిపూర్ణమైన మానవతను సాధించటం. మనిషిగా పుట్టి మనీషిగా ఎదిగేందుకై తనలో తాను సాగించే ఆ సమరం ఏనాటికీ కొనసాగుతూనే ఉంటుంది. ఆ క్రమంలో నాటి నుండి నేటి వరకు ఎందరో మనీషులుగా, మహానుభావులుగా పరిఢవిల్లి మానవజీవితంలో కాంతిపుంజాన్ని విరజిమ్మారు ఆ వెలుగుల్లో జీవితాన్ని సంస్కరించుకొన్నవారు, ఉన్నత మార్గానికి మలుపుకొని కనీసం మనుషులుగా మిగిలి తమ జన్మకు, ఉనికికి అర్థాన్ని పరమార్థాన్ని అన్వేషించేవారు ఎందరో? 'మతములన్నియు మాసిపోవును జ్ఞానమొక్కటే నిలచి వెలుగును' అన్నాడు మహాకవి.

అంటే, ఈనాడు మానవుడు వేటినైతే విలువలని నమ్మి తన జీవితాన్ని నరకప్రాయం చేసుకుంటున్నాడో అవన్నీ ఏనాటికైనా నశించి జ్ఞానమొక్కటే దీపంలా ప్రకాశిస్తూ తన కాంతుల్ని దశదశలా విరజిమ్ముతుందని, జ్ఞానాన్వేషణలో మునిగి మానవతకై పరితపించే మహాకవి హృదయం నుండి ఒలికిన ఈ ఒక్కవాక్క బలమే మనిషి జీవితాన్ని ఉన్నత పథాలవైపు మళ్లించగల శక్తి కలది.

కాని, అసలు జ్ఞానమంటే ఏమిటి? వేద వేదాంగాల్ని అవపోశన పట్టి, సకల శాస్త్రాలను కూలంకషంగా బట్టీయం వేసి విశ్వవిద్యాలయాల పరిధిలో పుస్తక భాండాగారాలలో తలమునకలై జ్ఞానార్జనతో కాలాన్ని మధించేవారంతా జ్ఞానవంతులేనా? వీరు ఆర్జించేదే జ్ఞానమా? జ్ఞానమంటే ఇదేనా?

ఒక వ్యక్తి సకలశాస్త్ర పారంగతుడూ, సకల కళాకోవిదుడు అయినంత మాత్రాన గొప్పవాడనటం సమంజసమేనా? సకల విద్యలను నేర్చిన వ్యక్తి గొప్పవాడు అయుండవచ్చుగానీ, మహానుభావుడు మాత్రం కాలేడు.

కవి, చిత్రకారుడు, వక్త, సాహితీ నిర్మాత అయిన సంజీవదేవ్ నిస్సందేహంగా గొప్పవాడే.

అయితే మహానుభావుడు కూడ. కవిత్వాన్ని, చిత్రలేఖనాన్ని, వక్తృత్వాన్ని కొంత ప్రయత్నం మీద ఏ వ్యక్తయినా సాధించవచ్చు. వాటి గొప్పదనం, విలువ ఆ మేరకే పరిమితం. కానీ ఒక మనిషి మనీషిగా ఎదిగేందుకై కేవలం ప్రయత్నం మాత్రమే చాలదు. మానుషత్వాన్ని జయించే క్రమంలో ఒక మనిషి జీవిత కాలం చాలకపోవచ్చు. జీవితం పరిసమాప్తి అయినప్పటికీ తాను సాధించదలచుకొన్నది సాధించలేకపోనూ వచ్చు. మహా పురుషులెందరో తమ చరమ దశలో తాము కోరుకున్న గమ్యానికి చేరువైనవారే. సంజీవదేవ్ అలా కాదు.

పరిస్థితులలో, జీవితంలో నిత్యం పోరాడుతూ జీవిత చరమాంకంలో గమ్యాన్ని చేరిన వారు కొందరైతే, కొందరు చాలా చిన్న వయసులోనే తమపై తాము అధిపత్యాన్ని సాధించిన వారూ ఉన్నారు. తమతో తాము పోరాటం సలిపి ఐహిక బాధలనుండి, బంధనాల నుండి విముక్తిని పొంది తమ జీవితాలకు ఒక అర్థాన్ని, పరమార్థాన్ని కల్పించుకొని తమకంటూ, తమదంటూ ఒక జీవిత లక్ష్యాన్ని ఏర్పరుచుకొనేవారు వీరే. ఈ కోవకు చెందిన వ్యక్తే సంజీవదేవ్.

సంజీవదేవ్ పేరే కాదు, ఆయన స్వభావం, జీవితం కూడ సుందరమైనవే. ఎదుటివారితో ఆయన ప్రవర్తించే తీరు ఎంతో మార్దవంగా ఉంటుంది. ఆయన మాటల్లో సున్నితమైన హాస్యం తొంగిచూస్తుంటుంది. ఎదుటివారి అంతరంగపులోతుల్ని, వారి సంస్కారంలో గల స్థాయి బేధాల్ని, అభిరుచులను, అలవాట్లను ఇట్టే పసిగట్టి వారిని నొప్పించక సామరస్యంతో వ్యవహరిస్తూ ఒక మనోవైజ్ఞానికునిలా గోచరిస్తారు. మానవసంబంధాల పట్ల ఆయనకు అంతులేని మమకారం. ఆత్మీయతను పంచటంలో, పెంచుకోవటంలో ఆయనకు ఆయనే సాటి. ఇందుకు భౌతికమైన అంతరాలు ఆయనకు అడ్డురావు. సౌహార్ధ్రత , సౌజన్యానికి నిజమైన అర్థాలను మనం ఆయన సమక్షంలో తెలుసుకోవచ్చు. ఈ పదాలకు గల అర్థం ఆయన ప్రవర్తన ద్వారా మన అవగాహనకు అందుతుంటే, ఈ పదాలపట్ల ఆయనకు గల అనురక్తి మనకు ఆశ్చర్యం గొలుపుతుంటుంది.

'స్నేహమూ, సౌహార్ద్రతా, ఎంత శ్రావ్యమైన పదాలు, పదాలు మాత్రమే శ్రావ్యంగా కొన్ని ఉండి, విషయం మాత్రం కటువుగా ఉంటుంది. కాని స్నేహమూ, సౌహార్ద్రతా అనే వాటిలోని పదాలు ఎంత ఉత్తమంగా వున్నాయో విషయాలు కూడా అంత ఉత్తమమైనవే. ఇద్దరు పరాయి వ్యక్తులను పరిచితులుగా చేసి వారి మధ్య పరస్పర ఆత్మీయతను వృద్ధిపరిచేది స్నేహం. నిజమైన స్నేహం మానవజాతిలో వృద్ధి చెందితే ప్రపంచంలో యుద్ధాలుండాల్సిన అవసరాలే ఉండవు. స్నేహం, ఎటువంటి స్నేహం ఉండాలి? సౌహార్ద్రతతో నిండిన స్నేహం ఉండాలి. సౌహార్ద్రత అంటే మంచి హృదయం అని అర్థం. కనుక మంచి హృదయంతో నిండిన స్నేహం ఉండాలి. సౌహార్ద్రంలేని స్నేహం వ్యాపార సంబంధం వంటిది, స్నేహంలేని సౌహార్ద్రత ఉహాగానం వంటిది.

వ్యక్తిలో ప్రతిభకు, పాండిత్యానికంటే మనిషికి, మానవతకు విలువనీయటం ఆయనలో గల విశిష్టగుణం. ఎంతటి మేధాసంపన్నుడైనా, ప్రతిభావంతుడైనా మనిషి తన ధర్మాన్ని మరువనప్పుడే అతని మనుగడకు ఒక అర్థం, పరమార్థం ఉంటాయని ఈయన దృఢ విశ్వాసం. మేధస్సుకంటే, హృదయగత సంస్కారానికే ఈయన విలువనిస్తారు. అందుకే ఈయన సాన్నిధ్యంలో సామాన్యుల నుండి, అసామాన్యుల వరకు సమానమైన గౌరవాన్ని, ఆదరణను పొందగలుగుతారు. మానవీయగుణాలతో స్పందించే మనుష్యులంటే ఈయనకు ఎనలేని మక్కువ.

ప్రతి మనిషిలో నిద్రాణమై ఉన్న తేజోమయగుణాలను తన సున్నితమైన ప్రవర్తనతో, సునిశితమైన దృష్టితో జాగృతం చేస్తారు. ఆ క్రమంలో తనలోని విశిష్టతను అణుమాత్రం కూడ బయటకు వ్యక్తం కానీయరు. సాటి వారూ తనతో సమానమేనన్న భావన కలిగించటం ద్వారా వారిలో ఆత్మవిశ్వాసాన్ని పెంచి, అంతరంగం అట్టడుగున దాగిన అనంత చైతన్యోత్సాహాన్ని రగిలించి వారిలో గల మానసిక శక్తుల్ని మేల్కొలుపుతారు.

సంజీవదేవ్ జీవితంలో కూడ మనిషికుండే ఈతి బాధలు, భౌతిక తాపత్రయాలు, అవసరాలు అన్నీ ఉన్నాయి. ఇవన్నీ ఏ మనిషికైనా మామూలే. వీటిని మించి జీవితంలో ఏ వ్యక్తి అయినా ఏం సాధించగలిగాడన్న దాన్ని బట్టే మనం ఆ వ్యక్తి గొప్పదనాన్ని అంచనా వేస్తాం. ఈ గొప్పదనం వ్యక్తుల్లో ఏదో ఒక రంగానికే పరిమితమై ఉంటుంది. వీరిని ప్రతిభా వంతులంటాము. ప్రతిభకు పరిమితులకు అందక ఔన్నత్యంతో ఆకాశం అంత ఎత్తు ఎదిగిన వ్యక్తిని, మనిషి నుండి మనీషిగా ప్రభవించిన వ్యక్తిని మనం మహానుభావుడంటాం. ఇటువంటి మహానుభావులెందరి గురించో మనం విన్నాం. చదువుకొన్నాం.

అయితే మనతో పాటే జీవిస్తూ, తన గొప్పతనాన్ని ఏ మాత్రం బయటకు రానీయక, మనతో కలిసి మన ఆలోచనల్ని, ఆనందాల్ని, బాధల్ని, పంచుకుంటూ వయో భేదం, జాతి వివక్షత లేకుండా సమాన గౌరవాన్ని, ఆదరణను పంచి ఇచ్చే సంజీవదేవ్ మనలోనే ఉన్నారు. మనలో జీవిస్తున్నారు.

భౌతిక తాపత్రయాలకు విలువనీయకుండా హద్దుమీరిన స్వార్థాన్ని పెరగనీయకుండా, ఎదుటివారికి హానిచేసే ఆశల్ని, ఆకాంక్షలను అదిమిపట్టి, అనవసరపు ఆర్భాటాలకు, పోటీలకు పోకుండా, హృదయగతమైన అలజడిని, అశాంతిని వ్యక్తం కానీయకుండా, అందనిదాన్ని ఆశించి, అందిన దాని నుండి అసంతృప్తిని పెంచుకొంటూ అర్థంపర్థం లేని విచారాన్ని, వ్యాకులతను పెంచుకోకుండా, ఎదుటివారికి శ్రేయాన్ని, ప్రేయాన్ని కలిగించే గుణాలను మానసిక సాధన

ద్వారా పెంపొందించుకొంటూ, భిన్న, విభిన్న వ్యక్తులతో, పరిస్థితులతో సదవగాహనతో, సానుకూలతతో వ్యవహరిస్తూ, భౌతిక అంతరంగిక ప్రపంచాలతో ఒక సమన్వయ దృష్టిని, సమరసాన్ని సాధించిన సంజీవదేవ్ తన చుట్టూ ఉన్న సమాజానికి తన ప్రవర్తన ద్వారా, తన జీవితం ద్వారా అందించే సందేశం కంటే మనిషికి చేయగలిగిన మేలు మరొకటుందా?

(రచయిత్రి - ఎన్.ఎన్. లక్ష్మి, 'ఆహ్వానం' పత్రిక సంపాదకురాలు, గుడివాడ.)